

# విజ్ఞాపనము.

ఆద్యంతరహితంబును సర్వకాలావచ్ఛిన్నమును శాశ్వతమును షడ్గుణైశ్వర్య సంపన్నమును సర్వజ్ఞత్వమునగు పరమాత్మ యదృశ్యమయ్యు, ప్రకృతివిలాసమును ప్రపంచమునకుం గనుపింపంజేసి మానవులకు వివేకమును గరపుచుండినను, మనకు సంశయములే పెక్కులుపుట్టి విభ్రాంతులను జేయుచున్నవి చూడు, చెట్లు తీగెలు ఆయా ఋతువులందు మొలుచుట చిగుళ్లెత్తుట పూవులుపుట్టుట, సుగంధము, ఆకులురాలుట మేఘములు కూడుట వర్షించుట యిత్యాదులూహ్యములు సముద్రమునకు చుట్టును గట్టులులేవు అన్నినదుల ప్రవాహపునీరంతయు ఆసముద్రములోనే కలియుచున్నది సముద్రము పొరలి యూళ్లమీదపడెనా యేప్రభుత్వముగాని ఆపజాలదు. అటులు నిరంతరస్వేచ్ఛ యుండియు ఆరత్నాకరమేల కదలకయున్నది ఈశ్వరాజ్ఞాబద్ధమయికాదా, ఇదివింతలోవింత కాకున్న మరేమిచెప్పి ప్రజలను యొప్పింతురు? భూమికంటెను ఖగోళమందుండు మండలములెన్నియోరెట్లు పెద్దవికదా అవియన్నియు మననెత్తిమీదపడిన మనగతియేమి? ఆకర్షణోచ్చాటన శక్తులవలన నిలిచియున్నవా? ఆశక్తియెక్కడిది? ఎవరిచ్చిరి? స్వభావమా? స్త్రీగర్భమున శిశువుజనించుట స్వభావముకాని పురుషసంసర్గములేనిదే స్త్రీకిశిశువుజనించెననివిని కనియున్నామా? ఇట్టి వెన్నియేనియుంగలవు గర్భములోనిపిండ మవయవరూపముగ నేర్పడుటయు. ఆరూపమునకు ప్రాణముకలుగుటయు నెట్లని యడిగిన నే శారీరకశాస్త్రజ్ఞుడు స్వభావమను యుక్తిచే సమర్థింపగలడు. మనకు తెలియని వెన్నియో స్వాభావికము లున్నవికావా? ఉన్నవనియు నొప్పుకొందురుకాదా? అట్లే, మనకు తెలియకనే సర్వశక్తియుతుండగు భగవంతు డున్నాడనిన నేల పెదవి విరువవలయును? అయిన స్వాభావికముపై సర్వమునకు నాధారపడియుండు వివేకవంతులు మనభరతఖండమున శంకరాచార్యుల కనంతరము

జన్మించియుండలేను ఖండాంతరుల సంపర్కమువలన యిపుడిపుడా నాస్తిక మారుతము భారత దేశమునవీచి యింద్రియములనన్నింటి వశీకరించుచున్నది దీనిఫలితములుగ మన దేశమున ధర్మము నశించినది. సత్యముదూరమైనది. దయ గగన కుసుమమైనది. ఆశ్రమధర్మములు అంతరించినవి కులవృత్తులు కూలిపోయినవి. రూపములు మారినవి. రంగులుమారినవి. మనసులుమారినవి. అంతయు మారినవి. మారుచున్నవి. మారిపోవుట కింక తావులు లేవు యిట్టి స్థితిలో దేవునకు—భక్తికి.

తావులేదు ! తావులేదు ! ! ఆవలగతియేమి ? అందరును దైవమునకు దూరముకావలసినదే, సర్వము నాశము కావలసినదే, అడవులలోని క్రూరమృగములు. జంతువులు పైనుండు బృహద్గోళములు మనపై బడిపోయి మనలను అడుగంట నాశముచేయవా ఇట్టి విపరీతము లెపుడును జరుగలేదు. రాబోవు కాలమునను జరుగదు, ప్రపంచములో నీగోడవ లేమియు తెలియని కొంతజనసంఖ్యకలదు. వీరుద్ధరింపబడుటకై యే విగ్రహారాధన మేర్పడినది. పురాణముల మూలమున, దేవాలయములవలన వీరిని కొంత సంస్కరింపవచ్చును. సంస్కార మొందిరికూడను, ఎన్నియో పురాణములు. భక్త విజయము భక్తులచరిత్రలు వీనికి సాక్ష్యములుగనున్నవి. ఈరహస్యము లన్యులకు తెలియకపోయిన నూరకుండుట న్యాయము, ఇటులుండ మహమ్మదీయ క్రైస్తవమతమువారలు, విగ్రహారాధన మీద ఖండనగ్రంథములును విమర్శలును పరిహాసములును ప్రారంభించిరి. తర్వాత మహమ్మదీయులు విరమించి మతవిషయములం దన్యోన్యముగ లేకున్నను ద్వేషబీజములను చల్లలేదు ఆధునిక మహమ్మదీయులలో, ఉమర్ ఆలీషా వంటిపండితులు, ఖొరాను మంత్రములకును మనవేద మంత్రములకును భావార్థముల సమన్వయముచేయుచు నిరుమతములవారి కన్యోన్యమును గూర్చుచుండుట ప్రమోదావహముగ నున్నది. ఇక క్రీస్తు మతమువారో మిన్ను మన్ను తెలియక మన మతసాంప్రదాయములను పరిహసించుచు, కళాశాలలు, వైద్యాలయములు. యువతులు, వీరిసహాయమున తమమతమునువ్యాపింప జేయుచున్నారు. ఉన్నత తరగతివారికంటెను మనచే బహిష్కరింపబడి విద్యాశూన్యులై దాసులైయున్న పంచములను, యెరుకల కోయ బోయ యేనాదులను తమ మతమున కలుపుకొనుచు మనమతమును క్షీణింపచేయుచున్నారు. యిటులు సంవత్సరమునకు ముప్పదివేలమంది

హిందువులు క్రైస్తవు లగుచున్నారని పత్రికలు వాపోవుచున్నవి. పత్రికల గోడును పంచముల మొఱలను వినువారే లేరు. మనము పంచములకు మత విషయములందు సమాన స్వాతంత్ర్యము నీయనందున మనసంఘమే క్షీణించుచున్నది, మనమతములో సంఘములో లోపములుండవచ్చును, అన్యులా లోపములను సాదరముగ చూపవచ్చును.

దేశకాలపాత్రానుసారముగ మనము సంస్కరించుకొందుము. యిది యన్యులధర్మము యిటులుండ మనము మూర్ఖులమని పాపులమని మనమతము దైవమునకే వ్యతిరేకమని మనవేదములును పురాణములును కల్పితగ్రంథములని తప్పులతడకలని తమదంతయు సత్యమయములై సర్వేశ్వరుడు టపాపార్సలుద్వారా తమకంపెనీకి పంపి దేవుడు తమమతమును మాత్రము రిజస్టరీచేసికొనియెనని పల్కు మూర్ఖక్రైస్తవుల నే మనవలె నోయూహింపుడు. అన్నిమతములవారికిని దేవుడున్నాడని విశ్వసించుటయే ప్రమాణము. దేవుని వలనగాని దైవానుగ్రహ పాత్రులైన మహాత్ముల వలనగాని మతప్రామాణ్యములగు వేదములువచ్చెనని నమ్మి యాచరించుటయే ప్రమాణము. ఇటులుండగ దేవునకుక్రీస్తుప్రకొడుకై పుట్టుటయు క్రీస్తు మూలమున దేవుడు ప్రజలకు హితముపదేశించుటయు, దేవుడును దేవుని కొడుకగు యేసును, మానవుల తప్పులను క్షమించుటయు. శవములను పూడ్చినచోటనే వారియాత్మలుండుటయు, క్రీస్తుమతమున కలియువారికి మాత్రము దేవుడుమోక్షమిచ్చుటయు ప్రపంచమున ప్రమాణ శ్రేష్ఠములై యున్నవి కాని, మనమర్చించుదైవము, వేదములు పురాణములు, అవతారములు, మహర్షులు, మనమతము, యివంతయు సామాన్యప్రమాణములు కూడకాకపోయి క్రైస్తవులదృష్టిని చెరచినవి. వారిధ్యానములకు రిజర్వుడు దినములున్నట్లే వీరికిని పుణ్యదివసములున్నవి. వారిచర్చిలలోమాదా, విగ్రహములున్నటులే మనదేవళములందు విగ్రహములున్నవి వారికుత్సవములున్నవి. మనకునున్నవి. సంస్కృతమున పాండిత్యము సంపాదించి గ్రంథస్థములైన యమూల్యరహస్యరత్నములను వెలువరచుటకు మనకేకష్టసాధ్యములును అసాధ్యములునైయుండ ఆభాషావాసనయైన యెఱుగని వీరు మనగ్రంథజాలమును విమర్శింపపూనుట తెలివితక్కువకాదా. మనమతగ్రంథము లప్రమాణము లేయని యొప్పుకొన్నను. వారి ప్రథమ గ్రంథమగు బైబిలులో ప్రతివాక్యము విమర్శకునిలువక బైబిలు నీరైపోవును. అపుడు

వీరికి బైబిలు కూడ లేక వెఱ్ఱిబో యనవలసినదే, యిట్టివారు మనల నెదుర్కొనుచున్నారు. మన మతాచార్యులిపు డన్యమతముల జోలికిపోక తమ మతమునే తమమతమువారికే తెలుపుచు మేల్కొలుపుచున్నారు. యిక క్రైస్తవులో త్రాగుడువలన నొడలు తెలియక మన మతముపైకిదూకుచున్నారు సంఘవ్యవహారములో కూడ వేలుపెట్టికన్ను పొడుచుచున్నారు. వీరిపవిత్ర బీజక్షేత్రప్రభావములవలన వీరిలో నిదివరకెందరు భక్తులుపుట్టిరో యిపుడున్నవారిలో నెందరు మహాత్ములున్నారో వీరిగ్రంథములును వీరును తెలుపగలరా? ఇహపరసుఖముల నొసంగి యకారణబంధువై సకలావస్థలయందును రక్షించు పరమేశ్వరుని యునికియందే సందేహముగల వీరు మనలపాపులారాయని సంబోధించుటయు మనము తలయూచుటయు వింతగనున్నది. ఇటీవల నొక క్రైస్తవమూర్ఖ సోదరుడు, తాను రచించిన గ్రంథమునందు మనమతసాంఘిక విషయములను ఖండించు, విగ్రహార్చనను దూషించుచు యిటీవలి రామకృష్ణపరమహంస వివేకానంద స్వామి వీర్లను నోటి కసితీర దూషించియున్నాడు. వ్యాసవాల్మీకాది సర్వజ్ఞులైన పూర్వఋషులందరును వీరి నోటబడ ఆధునిక మహాత్ములు వీరిదృష్టికెంతమాత్రమువారని యూరకుంటిమి, మరియొక చమత్కారముకలదు, ఈ క్రీస్తుమతమువారు, మహమ్మదీయ మతముపైకి పోరు కారణమేమి? మహమ్మదీయులు మతమున చాలపట్టుదల కలవారు. వీరిమత ప్రచారమునణచి వేయుదురు. లేదా, రూపుమాపుదురు. కావున నే వారిజోలికిపోరు. మనము పశుప్రాయులమును, మతవిశ్వాసము లేనివారమును. పిరికిపందలమును గావున మనపైనురికెదరు. యికనైన మనము మేలుకొని మన యేసుమత సోదరులకు బుద్ధిచెప్పిన మనమతము బ్రతికియుండగలదు.

ఓ క్రైస్తవసోదరులారా! మీరు మాపై సదుద్దేశముంచి తెలిపిన లోపములను, మాయంతరాత్మ అంగీకరించునేని మేమే సవరించుకొనియెదము, మా మతసాంఘికముల రహస్యములు మీకర్మజ్ఞాన చక్షువులకగోచరములు కాన ఆక్షేపింపకుడు, మేము తప్పులతడకలని భావించు మీ బైబిలును మీరుదిద్దుకొనువరకు మామతగ్రంథములను జూడకుడు మీరు మామతమును ఖండించుచుండుటవలన మాకును మీకును ఉండవలసిన మైత్రికి విరోధముగ నాంతరిక ద్వేషము జనించి యిపుడిపుడే యా ద్వేషాగ్ని రాజుచున్నది, అదిప్రజ్వరిల్లెనా మనమందరమును పరిహాస



శ్రీరస్తు.

# శ్రీ కాశీరామేశ్వరాది క్షేత్ర ప్రదర్శిని.



హేపరమపితా! కరుణాసాగరా! సర్వనియంతా! రక్షింపుము. ఎవ్వని మహామహిమా విలాసముచే మహిలోఁగల, తిర్యద్వర్గములును, ఋతువులును, సూర్యచంద్రులును, నక్షత్రములును, పృథివ్యాదిపంచభూతములును, సాగరములును, నదులు, వృక్షములు, పర్వతములు, దృశ్యములు, నదృశ్యములుగనున్నవో, యెవ్వని సంకల్పమాత్రమున, సృష్టిస్థితిలయములు సంభవించునో, యేప్రభుని శిల్పనైపుణ్యమున, త్వఙ్మేదోమాంసాస్థిసమితి, కలిసి, శరీరమను మందిరమేర్పడియెనో, యేమైంద్రజాలికుని ప్రయోగకుశలతవలన యచేతనమైన శరీరమునకు ప్రాణముకలిగెనో, యే తేజోమయుని హాసమాత్రమున, సూర్యచంద్రాగ్ని విద్యుత్తులకు దీప్తి యిచ్చెనో, యేశాసనకర్తవలన ప్రాణిసముదయము తమతమ ఆగామి సంచితప్రారబ్ధము లనుభవించుటకై నానాయోనులయం దుత్పత్తియయ్యెనో, అట్టి మహామహునకు అట్టిఅనంతశక్తికి. అవ్యయునకు, అపరిచ్ఛిన్నునకు, సర్వేశ్వరునకు ప్రణతులర్పించుచు. యీగ్రంథమువలన ప్రజాకోటికుపయోగమగునేని, నాచేయీగ్రంథమును నిర్విఘ్నముగ వ్రాసిముగింపజేయుటకై పరిపరిప్రస్తుతించెదను "అన్యథాశరణంనాస్తి త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష జనార్దన".

శ్రీకరు కరుణాకటాక్షవీక్షణములకు లోనైన యీభరతఖండమున గల జలస్థలమయ ప్రదేశములన్నియు పవిత్రవంతములని ప్రాచీనమహర్షుల, సాధాభిప్రాయము, పరమేశ్వరుని సృష్టిలోని ప్రత్యణువును, మన పూర్వులు గౌరవించుచుండిరని చెప్పినచాలును. ప్రపంచవాసులకు పనికిరాని పదార్థమొక్కటియైన యీజగత్తున లేదు. కావున, అన్యోన్యసహాయము గల్గి యిహలోకయాత్ర సేయవలయుట అత్యావశ్యము. మానవులందఱ జ్ఞాన

సత్యదయాశౌచములు గలిగియుండుటకును. తద్వారాముక్తులగుటకును. ప్రతిమలు, స్నానములు, జపములు, తీర్థక్షేత్రయాత్రలు మొదలగునవి సాధనములుగ జనసామాన్యమును తర్పింపజేయుచున్నవి, మనభరతవర్షమున తీర్థములనియు, క్షేత్రములనియు, నేర్పరచియుండుట చిత్తస్థిరతకును మోక్షమునకునుగాక యిహమున కాలముగడపుటకు నలయువిజ్ఞానసామగ్రిగ గూడ నుపయోగించుచున్నది. అట్టి దివ్యక్షేత్రములు లక్షలుగాక కోట్ల కొలదియుగలవు. వీనిలో దక్షిణఖండమున కొన్నియు, యుత్తరఖండమున కొన్నియు దివ్యక్షేత్రములు వెలసియున్నవి. ముందుగ, దక్షిణభాగంపు స్థలముల వివరింపదలచి. దక్షిణసముద్ర తీరస్థ భాగములనుండి యుత్తరమున కేగుదము.

దక్షిణఖండము. ధనుష్కోటి (సేతు)

ఇది పూర్వపశ్చిమ సాగరసంగమస్థలము. తూర్పు సముద్రమునకు మహోదధియనియు, పడమటి సముద్రమునకు రత్నాకరమనియు నామములు. ఊరికి 3 మైళ్లదూరమున స్నానఘట్టమున్నది. యీయూర యాత్రికులు మూడురోజులుండవలెను. యాత్రికులకు సౌకర్యముగనుండుటకై నాటుకోటసెట్లు ధర్మాన్నసత్రము పెట్టియున్నారు. శ్రీరామమూర్తిసముద్రునిపై కోపించి. బాణమును ప్రయోగించిన చోటనియు జెప్పెదరు. యీయూరియం దధికసంఖ్యాకులు. జలచరములబట్టి విక్రయించి జీవించువారును. సిలోనునుండివచ్చు ఎగుమతి దిగుమతులవలన బ్రతుకువారునై యున్నారు. శిల్పనైపుణ్యమున నసమానుండగు మయునికుమారునిచేత. (అనగా యిప్పటియింజనీరువంటివాడు) రఘుకులావతంసుడగు రామచంద్రుడు. లంకకు సముద్రములో వారధినిగట్టించెనని శ్రీమద్రామాయణమువలన ప్రసిద్ధముకదా, ఆవారధి సాగరోత్తుంగ తరంగపాతములవలన శిథిలములైపోగా, స్మారకచిహ్నముగ పదియడుగులదూరమైన పునరుద్ధరింపవలెనని. పాండ్యదేశప్రభువు లెంతో ప్రయత్నించిరికాని సాధ్యముకాకపోయెను. ఆవల సిలోను (లంక) ప్రభుత్వమువారును. చెన్నపురి గవర్నరు సర్; ఆర్థర్ లాలీగారును (౧౯౦౮ సం.) ఆలోచించి. శ్రీరాముడు కట్టించినవారధినే మూలాధారముగగొని. 6776 అడుగులపొడవు సేతువునిర్మించి. ఆసేతువుపై ధూమశకటము నడచుటకు వీలునుగలిగించి లంకనుండి వచ్చు వస్తువుల నోడలసాహాయ్యమున యీధనుష్కోటి సేతువునుండు రైలుపై కెక్కించుటకు వీలుకలుగ జేసిరి. సముద్రభాగమునుండు యీసాగరిక...

నిలుచుండువారికి యాశ్చర్యములు జనింపకుండదు. యిక్కడి ప్రజలు సత్యవంతులు, యీయూర [illegible] టంకములనిచ్చు కార్యాలయమును మరియు పెక్కుమిల్లులును గలవు. ప్లేగుజాడ్యమపుడపుడు తలసూపు చుండును.

2 రామేశ్వరము.

శ్రీరామమూర్తి లంకాపురిమున రావణునిజంపిన బ్రహ్మహత్యా దోషనివారణమునకై శ్రీరాము డిక్కడ లింగప్రతిష్ఠచేసి యర్చించెనుగావున దీనికి రామేశ్వరనామముకలిగెనని స్థలమాహాత్మ్యమువలన తెలిసెడిని.

యీ దేవాలయమునకు మూడుప్రాకారములు కలవు. మొదటి ప్రాకారము. 1000 అడుగులపొడవును 657 అడుగుల వెడల్పును, గల్గి, రెండవప్రాకారము. 500 అడుగులనిడివియు. 300 అడుగులవెడల్పును గల్గి యుండి మూడవప్రాకారము గర్భగృహమును చుట్టివచ్చునదిగ నుండును. 120 అడుగులయెత్తుగల గోపురము నూతనముగ నిర్మింపబడియున్నది. యింకను పెక్కులు నిర్మింతురేమో, యీదేవాలయ నిర్మాణమం దంతగ విచిత్రములగు శిల్పములు లేకుండినను నిర్మాణవిధముమాత్రము కష్టసాధ్యమే. ప్రథమప్రాకారములో బిందుమాధవస్వామి (విష్ణువు) యాలయము కలదు. యీగుడిలో మండపములు బహుళములు గలవు. అందు, సొగటాలమంటపమనునది. 40 అడుగుల నిడివిగల్గి నానావిధచిత్రాలంకార యుక్తమైరమ్యముగనుండును. యీమండపమున ప్రతిశుక్రవారమునాడును పర్వతవర్ధనీదేవిని బంగారుపల్లకిలోని యుత్సవమొనరింతురు. బంగారుమలాము గల వాహనములనేకములున్నవి. కాశీతీర్థముగొనివచ్చు భక్తులు, రామలింగస్వామివారికి నిత్యము నభిషేకము సేయుచుందురు. పర్వతవర్ధనీమండపములో, రామనాథపురము రాజగు భాస్కరసేతుపతిగారి శిలావిగ్రముకలదు. యీమహారాజు, రామలింగక్షేత్రమున పెక్కుకైంకర్యములుసేయించెనని ప్రతీతి, యీదేవాలయములోనే తీర్థములనేకములు కలవు. అన్నియుకూపరూపములుగ నుండును. అందుముఖ్య తీర్థములిరువదిరెండు. నూపతీర్థములు 28 యనియు చెప్పుదురు, రామేశ్వరమున కీశాన్యభాగమున 3 మైళ్లలో, గంధమాదనపర్వతము కలదు. క్షేత్రయాత్రాకార్యములగు. క్షేత్రప్రదక్షిణము. తీర్థశ్రాద్ధము. తర్పణము మొదలైనవి సేయుచుటకు పురోహితులుకలరు. 5 రూపాయలకు మొదలు శక్తికిలోపము లేకుండ, యీయవచ్చును. దేవాలయకట్టుము లీక్రిందివిధముగ నుండును.

| | | | |
|---|---|---|---|
| కోటితీర్థ ఘటాభిషేకమునకు. | కట్నము. | 1/4 | అణా |
| కొబ్బెరకాయ నైవేద్యమునకు. | ,, | 1 | అణా |
| అష్టోత్తర శతనామార్చనము. | ,, | 5 | అణాలు |
| సహస్ర నామార్చనమునకు. | ,, | 1 | రూపాయి |
| పాయసము నైవేద్యమిచ్చిన. | ,, | 1 | రూపాయి |
| గారెలు పాయసము నైవేద్యమిచ్చిన. | ,, | 2 | రూపాయలు |
| కాశీగంగాభిషేకమున కొకతీర్థపాత్రకు. | ,, | | 1-12-0 |
| ఉభయాభిషేకము నివేదనము సహా | ,, | | 5-8-0 |
| బంగరు పల్లికీఉత్సవమునకు. | ,, | | 17-8-0 |
| పంచామృతాభిషేకమునకు | ,, | | 19-12-0 |
| పంచమూర్తుల అభిషేకోత్సవములకు. | ,, | | 150-0-0 |
| శంఖాభిషేకమునకు. | ,, | | 150-0-0 |
| మహాభిషేకమునకు. | ,, | | 500-0-0 |

యాత్రికులు. బ్రహ్మహత్యాది మహాపాతక నివారణార్థము ప్రథమమున, నాగప్రతిష్ఠచేసి, పిదపగు హేశ్వర, అగస్త్యేశ్వర లింగములను దర్శించి. గంధమాదన పర్వతమును దర్శించి, పిదప పర్వతవర్ధని రామలింగలను సేవించుట యాచారముగనున్నది. తంజాపురిరాజులచే యాత్రికుల సౌకర్యములకై కట్టింపబడిన సత్రములు 6 ను నాటుకోటసెట్టివారి యొక్కయు యితరులయొక్కయు ధర్మశాలలు యెక్కుడుగకలవు. యీక్షేత్ర మందు కలరా. ప్లేగుబాధ్యము. లపుడపుడు కలుచుండును.

శ్లో॥ పాతుంపాతకినో జనానశరణాన్ పాతుం తమ స్సాగరం
యాతుం యాతు పురీమరీన్ రణముఖే జేతుందశాస్యాదికాన్
సేతుం భూతనయాం ముదం విహారిణీ మేతుం యశశ్శాశ్వతం
దాతుం శర్మచ రాఘువేణ రచితంసేయం నమస్కుర్మహే॥

3. రామనాథము.

ఇదియొక జమీన్ పట్టణముమజిల్లాపట్టణమునై యున్నది. యీసంస్థానాధిపతులు. విద్యాదానధర్మ విక్రమములం దసమానులనిప్రఖ్యాతి. యీ ప్రభువులకు నామాంతమున సేతుపతియను బిరుదనామముకలదు. యీ నగరమును చూచుటకు వేడుకకలిగి, అనేకదేవమందిరములును రాజమందిరములును [illegible] అనుడున్నతదివ్యహర్మ్యములు గలదు. రామనాథముగం [illegible]

షాణక్షేత్రము కలదు. రాకపోకలకు వసతులున్నవి. సముద్రమునకు సుమారు 100 అడుగులయొద్దున నవగ్రహములు గలదు. యాత్రార్థులీ నవపాషాణక్షేత్రమును సేవించియే రామేశ్వరమున కరుగుదురు. రామనాదమునకు నైరుతిమూల 7 మైళ్లదూరమున ఉత్తరకోశమంగైయను క్షేత్రమున్నది. 8 మైళ్లదూరమున దర్భశయనమున్నది. రాముడీ దర్భశయనమునుండియే సముద్రునిప్రార్థించెను. యిక్కడ కేతెంచుటకును వలయు సౌకర్యములున్నవి. యివి రామనాథపురము జిల్లాలోనుండినవి. మరియు పెక్కుక్షేత్రములు కలవు.

యింక రామనాథపురం జిల్లాకుసమీపమునయుండు తిరునల్వేలిమండల యాత్రాస్థలములు ప్రదర్శితములు. యీపట్టణమున ప్రవహించునది తామ్రపర్ణి దీనితీరమున దేవళము లధికముగ కలదు.

శ్లో॥ తాపంవిలుంపతి నృణామిహ తామ్రపర్ణీ।
త్వాభ్యాం వహా భవదపానల జృంభితోద్ధం॥
పాథోనిధేస్త్రీ జగతిప్రథితో వరోధో।
రోధోల సత్పరమహర్ష మహార్థియాధః॥

4 తిరునల్వేలినుండి తిరుచ్చెందూరునకు పోవుమార్గములో శివసుబ్రహ్మణ్యదేవాలయమున్నది. నల్లరాళ్లతో మిగులనైపుణ్యముగ గట్టియున్నారు. దీనికిదక్షిణముగ కొన్నిమైళ్లదూరములో నొక్కమండపము దక్షిణదేశశిల్పనైపుణ్యముట్టిపడు పటులు నిర్మింపబడియున్నది. యిదితూత్తుకుడికి 20 మైళ్లదూరములో నుండును.

5 తెన్ తరైప్పరై.

ఈక్షేత్రము శివసుబ్రహ్మణ్యస్థలమునకు 10 మైళ్లదూరము నందుండు వైష్ణవక్షేత్రము.

6. శ్రీవైకుంఠము.

తెన్ తరైప్పరైనుండి నాలుమైళ్లదూరమున శ్రీవైకుంఠములను విష్ణుక్షేత్రము. విశేషప్రభావముతో విరాజిల్లుచున్నది.

7 ఆళ్వారుతిరునగిరి.

పైక్షేత్రమునకు 2 మైళ్లదూరమున ఆళ్వారుతిరునగరి యను విష్ణుదేవాలయమున్నది. స్వామినామము. ఆదినాథన్, ఆళ్వారులలో నొక్కడగు నమ్మాళ్వారు జన్మించిన దివ్యదేశము.

8. వానమామలై,

ఇది తిరునల్వేలి స్టేషనుకు దక్షిణముగ 20 మైళ్లదూరమున దేవ నాయకక్ అనుపేరుతో విష్ణువు నెలకొనియున్న దివ్యదేశము. దీనికి తోతాద్రియని పేరుకలదు. యిక్కడ వైష్ణవమతాచార్యులగు, జియ్యర్ గారున్నారు. యిక్కడిస్వామికి నిత్యమును తైలాభిషేకము జరుగును. నూనెబావికలదు, యిక్కడకు పశ్చిమమున 8 మైళ్లదూరమున.

9 తిరుక్కరంగుడి.

యను శివక్షేత్రమును విష్ణుక్షేత్రమును వెలసియున్నవి.

10 శంకరనాయినార్ గుడి.

ఈక్షేత్రము తిరునల్వేలికి వాయవ్య భాగమున 32 మైళ్లకావల యీక్షేత్రమున్నది. యీయూరు పెద్దతాలూకా పట్టణము యిచ్చట హరిహరు లొక్కటేయని శైవాధిక్య వైష్ణవాధిక్యతులకై పోరాడు మూర్ఖులకుచపేటము లిచ్చునటు లొక్క విగ్రహమున నే హరిహర రూపమున్నది, పార్వతీదేవియొక్కప్పుడు హరిహరుల స్వరూపములను తెలసికొన గోరి ధ్యానింపగ యీవిధమున ప్రత్యక్షమై శివకేశవులు మాకభేదమని సెలవిచ్చిరట యిక్కడికి పడమట 8 మైళ్లదూరమున.

11 తారకాపురి,

యను స్థలమున్నది. యిది శివక్షేత్రము. దేవతలిట చేసిన తపమునకు మెచ్చి వారిమధ్యయీశ్వరుడు ప్రత్యక్షమయ్యెనటకావున యీదేవుడు మధ్యేశ్వరుడను నామముతో విరాజిల్లు చున్నాడు. యిక్కడకు 6 మైళ్లదూర ముత్తరముగ.

12 కరువనల్లూరు,

అను శివక్షేత్రమున్నది. దీనికి 8 మైళ్లదూరమున.

13 తేణమలై.

యను శైవక్షేత్రముకలదు. యిక్కడకు పడమట 10 మైళ్లదూరమున

14 దేవదానము.

అను శివక్షేత్రమును. సమీపమున వృషభపాదములున్ను చెక్కబడియున్నది.

15 కలక్కాడు.

ఇది తిరునల్వేలి జిల్లా. నాగనేరితాలూకాకు 14 మైళ్లకావలనుండు శివక్షేత్రము. యిక్కడ ఒక్క రాతిస్తంభమును 32 భాగములుగ విభజింపబడి చూచుట కచ్చెరువును గల్గించును.

16 తిరుకోటీశ్వరము.

ఇక్కడ అగస్త్యమహర్షి పూజించుటకై యనుకత్రో వెన్ని పర్యాయములు లింగ మొనర్చినను. విరియబడుచుండ అగస్త్యుడు చింతించెను. దేవుడు ప్రత్యక్షుమై నిష్కళంకమనస్కుడవైనను పూజింపుమని యగస్త్యుచే ప్రతిష్ఠుడయ్యెను.

17 తిరుమూలనగరము.

అగస్త్యుడు. రంభ, సిద్ధులు యోగులు. అనుగ్రహ మొందిన శివ క్షేత్రము.

18 శంకర నారాయణగుడి.

భృగుమహర్షి విష్ణువును వదలి శివుని స్తుతింపగ. శివుడు ప్రత్యక్షుమై విష్ణువు కూడనాయంశమేకావున విరుద్ధభావమును వదలి పెట్టుమని హితము సెప్పి శివకేశవులేకరూపముగ ప్రత్యక్షమైనమహిమాక్షేత్రము. మూలస్థానములో వల్మీకము మాత్ర మున్నది.

19 కరువైనల్లూరు.

కులశేఖరపాండ్య డీచోటు అడవిగనున్నపుడు వేటాడనచ్చెను. అతని యేనుగొక్కటి యీచోటనుండు పొదను ప్రదక్షిణముగవచ్చి ప్రమదగణములో కలిసె నదిచూచి పాండ్యరాజీపొదను శుద్ధముచేయింప యాశ్వరుడు దర్శన మిచ్చెను.

20 వావినంగుడి.

ఇది శివస్థలము, సుబ్రహ్మణ్యస్వామికి గల 6 పట్టణములలో నిది యొకటి.

21 తిరుచెందూరు (చందనాచలం)

దేవతల యాపన్నివారణార్థము శూరపద్మాదుతారకాసుర మొదలగు రాక్షసులను చంపి విజయమును చేకొనిన సుబ్రహ్మణ్యసుక్షేత్రమిది. కొన్ని తీర్థములును గలవు. అరవలచే మిగుల గౌరవింపబడు దివ్యదేశము. యిం దు శైవసన్యాసులు పెక్కురుకలరు.

22 విజయ మహానగరము.

ప్రణవ స్వరూపము నెరుగక బ్రహ్మాదిదేవత లవస్థనొందగా నార నుగ్రహింపబడిన శివక్షేత్రము. స్వామి పేరు మనోన్మనేశ్వరుడు. గొంగనరిశజుండగు రాజమార్తాండుడను పుణ్యపురుషుడు శివభక్తులకు, అన్నపానాదులకు మహిలికలిగించి యున్నాడు.

23 తిరుక్కారుంగుడి.

భస్మాసురుని వంచన వలన చంపిన హరిబ్రహ్మ హత్యాపీడితుడై యీక్షేత్రమందు నెలకొనిన యీశ్వరు నర్చించి. పాపవిముక్తినొందెను యీక్షేత్రములో యీశ్వరుని యెదుట విష్ణువునిలుచుండి శివుని యర్చించ నటులు నిర్మితముగ నున్నది దైవరూపములు.

24 కళక్కాడు.

సూర్యోదయముగు సరికి పతిప్రాణములు కోలుపోవలసి వచ్చునని సూర్యోదయము కాకుండ యద్దుపెట్టిన పతివ్రతకు వెరచి దేవతలిక్కడ పరమేశ్వరుని ప్రార్థించి శుభములువడసిరి.

25 ఓమనూరు.

అర్ధనారీశ్వర క్షేత్రము. హరితనది. తామ్రపర్ణినది.

26 అంబాసముద్రము.

తిరునల్వేలిజిల్లాలో చేరిన తాలూకా ముఖ్యపట్టణము; దీనికి కచ్ఛపేశ్వర మనియు పేరుకలదు. శివశర్మయను బ్రాహ్మణున కిచ్చుట యీశ్వరుడు ధర్శన మిచ్చెను. యిక్కడికి 12 మైళ్లదూరమున పడమట.

27 శివశైలము.

అను శైవమహా క్షేత్రమున్నది.

28 మన్నారుగుడి.

ఇది అంబాసముద్రమునకు మూడుమైళ్లలోనున్నది ప్రఖ్యాత విష్ణుక్షేత్రము యీదేవళమునకు 5 ప్రాకారములును 1000 కాళ్ల మంటపమును గల్గి. భారత శిల్పుల కాచార్య పీఠము నిచ్చు చిత్రాలంకారములతో రమ్యమై యున్నది. యిక్కడకు 2 మైళ్లదూరమున.

29 బ్రహ్మదేశము

ఉన్నది. విష్ణుక్షేత్రము క్రిందకూర్చుండియు పైఅంతస్తులోశయనించియు విష్ణువుదర్శనమిచ్చుచున్నాడు. దశావతారములును రంగ నాథుడును కలరు.

30 పాపనాశము.

ఇయ్యది శివస్థలము. ఒకవణిజుడు. బాల్యముననే గృహత్యాగియై సంచారముసేయుచు తనవలెనే యిల్లు వీడిన తల్లితోబుట్టువులకు మిండడై కొంత కాలమునకు నిశ్చయ మెరిగి పశ్చాత్తప్తుడై యీశ్వరు నారాధించి పాపవిముక్తుడై నదీస్థలముననే యట తామ్రపర్ణియు పాపనాశనియు నదులు

యిక్కడ జలపాతమునుండి విద్యుచ్ఛక్తినితీయుదురు, గుడ్డల మిల్లును నూలు తీయు యంత్రాలయములును కలవు.

31 కుత్తాలం.

ఇక్కడ మహాశివక్షేత్రము కలదు. పర్వతపంక్తియునందుండి వచ్చు జలపాతములును. ప్రకృతిగంభీరతను దెలుపుచుండును. యాత్రికులీసోనల లోస్నానమాచరించి బాహ్యేంద్రియ శుద్ధులగుదురు. వేసవికాలములందు శ్వేతముఖులక్కడ నివాసము చేయుదురు. యాత్రికులకు వలయుసౌకర్యములన్నియు కలదు. యిక్కడికి 6 మైళ్లదూరమున అటలీపరిపాలనాధి కారిమందిరమున్నది. దీనిసమీపమున నదిలో. కలుగుగుహలైన చేపలను పెంచుదురు.

32 తెంకాశి. (దక్షిణకాశి)

తిరునల్వేలి జిల్లాలోని తాలూకాపట్టణమిది. తిరువాన్కూరు సంస్థానపుయెల్లకు ప్రక్కపట్టణము. యీయూరిలోని భక్తులు కాశికిపోవుటకు వీలులేకపోగా. ఆశ్రితవత్సలుడగు శివుడు యిక్కడ స్నానముసేయువారికి కాశీక్షేత్రమున గల్గుఫలమనుమతించెను. కావుననే దీనికి దక్షిణకాశియను పేరుకల్గెను. చెన్నపురినుండి 487 మైళ్లదూరమందున్నది.

33 తిరుకుత్తాలం (త్రికూటాచలం)

ఇయ్యది ప్రఖ్యాత శివక్షేత్రము సర్వ కలుషాపహరము. ప్రథమమున యీస్థలము విష్ణు క్షేత్రముగనుండెనట, అగస్త్య మహర్షి విభూతి రుద్రాక్ష మాలికాధారియై యీదారిరాగా అటగల వైష్ణవ పాషండులు, మహర్షి సత్తముని దూషించిరట అంతట నాముని వైష్ణవచిహ్నములతో దేవాలయమును సొచ్చి కేశవుపాదములు స్పృశింప. శివుడయ్యెనట.

34 తిరుమెయ్యం, (సత్యగిరి)

ఇది హరిక్షేత్రము. పుదుక్కోట సంస్థానములోచేరినది, సత్యదేవతకు దర్శన మిచ్చిన స్థలము, పుదుకోట్కకు, 12 మైళ్లు.

35 తిరుక్కోట్టియూరు. (గోష్ఠీపురం)

విష్ణుక్షేత్రమిది, శివగంగ జమీందారీలోనిది.

36 తిరుమాలిరుంశోలై. (వృషభగిరి)

మొదట యిదిసుబ్రహ్మణ్యస్థలమనియు. తర్వాత విష్ణుస్థలముగమారినదనియు చెప్పుదురు. రెండు మతములవారికిని ఆరాధనీయమైయున్నది.

37 38, 39. 40, తిరుమోసూర్, తిరుక్కూడల్ తెన్మధురై, తిరు

త్తణో గలూరు. యీక్షేత్రములు నాల్గును కేశవస్థలములు.

41 శ్రీ విల్లిపుత్తూరు.

ఈ దివ్యక్షేత్ర మాఘునికు తెల్లరు నెరింగిన విష్ణుక్షేత్రము. మధుర మండలమున కలదు. శ్రీవిల్లిపుత్తూరు పట్టణస్థలము.

42 శ్రీ వైకుంఠము.

ప్రఖ్యాత విష్ణుక్షేత్రము. ఆళ్వారుల పొగడ్తగన్నది, తాంమ్రపర్ణి నదీతీరస్థమైనది, శివక్షేత్రమును కలదు.

43 తిరుత్తొలైవిల్లిమంగలం.

ఇది కేశవాలయము. తాంమ్రపర్ణి నదీ తీరస్థము.

44 తిరువర గుణమంగై.

ఇయ్యదియు తాంమ్రపర్ణీ తీరస్థ హరిక్షేత్రము.

45 తిరుప్పుళింగుడి.

తాంమ్రపర్ణీ పరిసరక్షేత్రము కేశవస్థలము. యిటు లేసమాపస్థములై తాంమ్ర పర్ణినదీ పరసరములైన పెక్కువిష్ణుక్షేత్రములు కలవు, యాత్రికు లకు. దూరముగనుండి ప్రయాణమున కిబ్బందియైన జనపదములు.

46 తూత్తుక్కుడి.

ఇయ్యది దక్షిణ సముద్రతీరమందుండు ఓడరేవుపట్టణము. తాంమ్ర పర్ణీముఖద్వారము. సముద్రముఖములోతు లేనిదిగాన 45 మైళ్ల దూరమున లోతునీళ్లలోనే నావలుండును, సబ్ కలెక్టరు, సబ్ మేజస్ట్రేటు. డిప్టీసూప రెంటు ఆఫ్ పోలీసు. సాల్టు డిపార్టుమెంటు అధికారులు మొదలగు యుద్యో గులీపట్టణమందున్నారు. కొలంబునకు పోవు ఓడలు ప్రతిదినము సాయం కాలము 5 గంటలకు బయలుదేరి పోవును అక్కడీనుండి ప్రతిదిన మొద యము 8 గంటలకు యిక్కడి కొకయోడ వచ్చుచుండును. ఓడలు నిలిచి యుండుతావున హార్బరుకట్టబడియున్నది. బి. ఐ. యస్. యన్. స్టీమరులు: బొంబాయి కలకత్తాలకు పోవునపుడును వచ్చునపుడును వారమున కొక పర్యాయము మించట, ఆగిపోవుచుండును. చుట్టుప్రక్క గ్రామములందు ప్రత్తి విస్తారము. నూలుతీయు యాంత్రములును కలవు, ఏప్రెల్, మే, జూన్. నెల లో ముత్యములు తీయుదురు. సీమకు కొనిపోవుదురు.

47 కోయిల్ పట్టి.

ఇక్కడ పెక్కు నేత యంత్రశాలలున్నవి. యిక్కడికి మూడుమైళ్ల దూరము యెట్టియాపురమను సంస్థానమును 11 మైళ్లదూరమున కలవు.

మలై యనుచోట జాష్ఠుల విహారములును, నల్లరాళ్లను నానావిధాలంకరణములతో చెక్కించి, నిర్మించిన దేవాలయములును కలవు.

48 కన్యాకుమారి.

ఇదితిరువన్వేలికి నేరుదక్షిణముగ 53 మైళ్లదూరమునుండి హిందూదేశమునకు దక్షిణదిక్కున కెల్లనైయున్నది, యిక్కడికనేకులు యాత్రీకులు వత్తురు.

49 కొడైక్కానల్.

దీనినె కొడైక్కానాల్ అందురు. యిది మధురజిల్లాలోని యొకప్రకృతి గంభీరమైన జనపదము. యీాయూరికి. అమ్మయ్య నాయకనూరు రైల్వేస్టేషనులో దిగిపోవలయును పోవుటకు సౌకర్యముగ. బండ్లు మోటారు బస్సులు దొరకును. సామానులు మొదలగు వానితోపోవుట. అసాధ్యము. జలపాతముకలదు. మానసమందిరమును గలిగియున్నది. ఆరోగ్యార్థులకు ఆశ్రయమైనది. యిక్కడ 60 అంగుళములవానయు. వేసవియందు. 42—76, డిగ్రీలవరకు చల్లదనమునుకలదు. అనేకకార్పాసయంత్రాలయములున్నవి. పరిసరగ్రామములందు. బంగాళాదుంపలు. గడ్డగోసు. షేరి, ఆప్పిల్ యేలకులు. కాఫీవిత్తులు. అరటి. గోధుమవెల్లుల్లి. మొదలగు. కాయకూరలు ఫలములు. ఫలించుచు భరతఖండ సుక్షేత్ర ప్రభావమును గడగట్టి సాటుచుండును చెన్నపురికి 320 మైళ్లదూరము.

50 డిండికల్.

ఇది మధురమండలములోని తాలూకాపట్టణము. మహమ్మదీయపాలన. కాలమున ఆంగ్లేయులును మహమ్మదీయులును. యీాపట్టణముపై కన్నులుంచి. కదన మొనరింపచేసిన వీరక్షేత్రము. యిటనుండి మైరోపాఖుండమున కెగుమతియగు పొగచుట్టలకు లెక్కలేదు. యిక్కడి కొండలపైపండు అరటిపండ్లు చాల నయముగ దొరకును, చెన్నపురికి 306½ మైలుదూరములో నున్నది.

51 సేతుమాధవము.

ఇయ్యది విష్ణుస్థలము. మధురకు సమీాపమందున్నది.

52 త్రిక్రటార్జునము (తిరుప్పూడైమరుదూరు)

ఇక్కడ. దేవేంద్రుడు వృత్రాసురుని తెగటార్చిన బ్రహ్మహత్యాదోష నివారణార్థమై. యర్చించిన శివక్షేత్రము. తామ్రపర్ణీతీరము.

53 తిరుచ్చేరన్ మాదేవి.

తాంమ్రపర్ణీతీరస్థ శైవ దేవాలయము.

54 రామేశ్వరము.

రోమశమహర్షి యీశ్వరానుగ్రహమును పొందిన క్షేత్రము. తాంమ్రపర్ణి నదీసమీపము.

55 దూర్వాసనల్లూరు. (కాళత్తినగరం)

తామ్రపర్ణీతీరమున శ్రీకాలహస్తీశ్వరుని దూర్వాసమహర్షి యర్చించి నిత్యముక్తుడైన శివక్షేత్రము.

56 తిరువళ్లియూరు.

సుబ్రహ్మణ్యస్వామి లవలిదేవిని ప్రేమించిన క్షేత్రము.

57 తిరుప్పణంగుడి.

శిబిచక్రవర్తి యింద్రుడు మొదలగు వారి ననుగ్రహించిన శివక్షేత్రము శివగంగనదీతీర్థం.

58 రాదాపురం.

వరగుణ పాండ్యేశ్వరుడను పేరితో శివుడువెలసిన క్షేత్రము శివగంగానది (వరగుణపాండ్యస్థాపితము.)

59 కులశేఖర పట్నము.

ఇది శివక్షేత్రము. యీక్షేత్రమునకు సమీపమున మామిడిచెట్లు లేకుండి. యీస్థలమందు మాత్రము దేవాలయావరణమున నొక్క చూతవృక్షముండి. యీకాల మాకాలమునకు 360 దినములును. చిగుళ్లు, మొగ్గలు పూవులు పిందెలు. కాయలు. పండ్లు, సతత ముండుట విశేషము. పాండ్యరాజ్యమునకు లోబడిన దేశమగుట కులశేఖరుడు పున రుద్ధరించెను.

60 శ్రీంగమంగలం.

శైలేశ్వరుని విలాసనిలయము, తామ్రపర్ణీ తీరస్థము.

61 సోమేశ్వరము (ఆత్తూరు)

స్వాయంభువు, గురుపత్నీ దోషనివారణార్థము, చంద్రుడు తపమొనర్చిన స్థలము. తామ్రపర్ణీతీరము.

62 బ్రహ్మేశ్వరము.

రుద్రరహాత. దక్షమఖమున కేగిన పాపప్రాయశ్చిత్తార్థము. బ్రహ్మపూజించిన తామ్రపర్ణీ తీరదివ్యస్థలము.

63 నవలింగపురం.

ఇయ్యదినవలింగములును నవతీర్థములును గలిగి. తామ్రపర్ణీతటిని

వెలయు శైన దివ్యదేశము.

64 శ్రీ కాంతీశ్వరము. (ఆళ్వారు తిరునగరి)

ఇది ప్రఖ్యాత వైష్ణవక్షేత్రము. యీ క్షేత్రమున శివాలయమును కలదు. యీ యూరునకు మూడుప్రక్కల తామ్రపర్ణినది ప్రవహించును. శివక్షేత్రమునుకలదు.

65. తిరుప్పత్తూరు.

ఇట శివవిష్ణ్వాలయములు కలవు. ఆర. డాంగికి 27 మైళ్లదూరము.

66. పళనిమలై (మలై-కొండ)

ఈపట్టణము దక్షిణదేశమం దున్నతస్థితియందుండిన రాజ్యములలో నొక్కటియగు చేరరాజ్యములో చేరినది యిది దిండికల్లున 36 మైళ్లదూరమునను కోయంబుత్తూరుజిల్లాకుచేరిన దారానగరమునకు 22 మైళ్లకావలనున్న ప్రఖ్యాత శివక్షేత్రము. పర్వతావాసుడై సుబ్రహ్మణ్యేశ్వరుడున్నాడు. యితనికి దండపాణియనియు బిరుదనామము. యీ పర్వతము సుమారు 500 వందల అడుగుల యెత్తుగల్గి 999 సోపానములు నిర్మింపబడి యున్నది. మాసోత్సవములును విశేషించి మీనమాసమున అతి వైభవముగను ఉత్సవాదులు జరుగును. వేలకొలది యాత్రికులు విజయముచేయుదురు. అందెక్కువగ మళయాళీలువత్తురు. రైలుమార్గముండుటకు తన ప్రయాణము సుగమము. యీపట్టణమునుండి ఆముదపువిత్తులు ఉల్లి,ప్రత్తి, వేరుసెనగ, పొగాకుచుట్టలు, నైసుచేసినచర్మము, వెదురు కట్టెలు, మ్రాని కోతపలకలు, మెట్టధాన్యములు, యెగుమతియగుచున్నది, తంగేడుపట్ట, మోటుతోలు దిగుమతియగును. పలువిధములుగ జనసమూహామునకు రాకపోకలుండుటవలన కలరా ప్లేగు మశూచి మొదలగు భయంకర వ్యాధులు పోవువారికి వచ్చువారికిని తోడైయుండును.

67. మధుర.

అతి దక్షిణరాజ్యములగు. పాండ్య-చోళ కేరళ రాజ్యములలో. ఉత్కృష్టమై. దక్షిణహిందూస్థానమున యిపుడున్న ప్రఖ్యాత పట్టణములు. పల్లెలుగను, వనములుగను ఉన్న కాలమందే నాగరక ప్రసిద్ధినివడసినదై. రెండు శతాబ్దములకాల మాంద్రవీరుల దిగంత విశ్రాంత కీర్తికాంతాసింహాసనమై. యీనాటికిని యిట్టిపట్టణ మరుదని చారిత్రకుల చేతను, యాత్రికులవలనను పొగడ్తగన్నదై వెలయు మధురాపుర మతి దర్శనీయ క్షేత్రము. యేమాత్రము ప్రపంచ జ్ఞానమున్న మనుజునికైన మధురయను పురము

జ్ఞాపకము వచ్చినపుడు తనువు పులకరింపకమానదు. యీనగరగౌరవము నకు కారణములు కొన్నికలవు. యిది చెన్నరాజధానిలో చెన్నపురికి తర్వాత. పెద్ద పట్టణమిదియే. 150 వేల చిల్లరజనులు వాసము చేయుచున్నారు. రామనాథపురము. శివగంగ, మొదలగు డెబ్బదియిద్దరు పాళెగాండ్రను గల్గియుండి. దిండిగల్లు వంటి అధిక వర్తకస్థలములగు తాలూకాలుగల్గి, రామేశ్వరము వంటి మహామహిమాన్విత క్షేత్రమును తనరాజ్యపు యెల్లలో యొప్పియుండెనని చెప్పిన, కారణములు చాలవా? భక్తలోకరక్షకులగు. మీనాక్షీ సుందరేశ్వరులు నెలకొనియుండుటయే యీపురము, పురవర మగుటకు. గొప్ప కారణము. వర్తకము మిక్కుటముగ జరుగును. మీనాక్షీసుందరేశ్వరాలయము. స్టేషనుకు అర్ధమైలుదూరమున 282 గజములనిడివియు, 248 గజములవెడల్పును తొమ్మిది గోపురములును గల్గి విలసిల్లు చున్నది. యిందొక గోపురము 152 అడుగుల పొడుగున్నది. యింక, అష్ట లక్ష్మీమండపమును. గణపతి, సుబ్రహ్మణ్య. మీనాక్షీ. సుందరేశ్వరుల దేవళములును. వానివిగ్రహములు. చంద్రమతీహరిశ్చంద్రుల ప్రతిమలును. పంచపాండవులబొమ్మలును. 100 కాళ్లమండపమున సభాపతి మొదలగు విగ్రహములు నుండుటయేగాక. వీరవసంత రాయమండపము, వసంతమంటపము. వెయ్యి కాళ్లమంటపము మొదలగు మంటపములుకలవు. యిందలి వసంత మంటపము మాత్రము. తిరుమల నాయనికాలమున నిర్మితము. యీమండప స్తంభములలో విశ్వనాధనాయుడు మొదలు తిరుమలనాయనివరకును. 10 తరములవారి ప్రతిమలు చెక్కబడి, కుసుమమాలాలంకృతములైయున్నవి. 1000 కాళ్ల మండపమున మధురాసంస్థాన ప్రధానామాత్యుని శిలావిగ్రహమున్నది. దక్షిణహిందూస్థానపు శిల్ప దురంధరులచే నీ దేవళము నిర్మింపబడినది. వాహన మండపమున. వెండి బంగారు రేకుల వాహనములు పెక్కులు కల్గి. నిత్యోత్సవములతో విరాజిల్లుచున్నది. యిక్కడికి $1\frac{1}{2}$ మైలు దూరములో తిరుమలనాయనికాలమున త్రవ్విన తెప్ప గుంటవిశాలమయి, యాకాసారమద్యమం దొకద్వీపముపోల్కి రసాలవనమును దేవళమును గల్గియున్నది. మకరమాసమందీ గుంటలో తెప్పోత్సవ మతివైభవయుక్తముగజరుగును యీ తెప్పగుంట 1 దిక్కునకు 300 గజములవంతున 4 దిక్కులకును 1200 గజములలోచౌకముగ త్రవ్వబడియున్నది. తిరుమలనాయునిమహాల్ లేక అంతఃపురము. అనిచెప్పబడు కట్టడముచూచుటకు సుందరమై 90 అడుగులనిడుపును 40 అడుగుల వెడల్పునుగల లోపలి

భాగమును, సున్నము యిటుకలతో 40 అడుగుల పొడవును 15 అడుగుల వెడల్పుగల రాతిస్థంభముల కట్టియుండుటయేగాక, మానవ యినుము. మీద సహాయ మీమందిర నిర్మాణమున కవసరముగ లేకయున్నది. జలక్రీడా సరోవరము. మొదలగునవి మీమందిర భాగముననే కలవు. యిపుడిచ్చోట ప్రభుత్వము వారి కార్యాలయములు పెక్కులున్నవి, యీ మందిరమును చూచినవారు ప్రాచీన భారతీయ శాస్త్రత్వమును నిర్మాణకుశలతను స్మరించి, చిత్రావిస్మయములకు లోనుగాక యుండరు. మధురకు ఉత్తరముగ వైఘానది దాటగనే సుమారు రెండు మైలు దూరమున సెనుగులము అను కట్టడమున్నది, తనకు లోబడిన పాలెగాండ్రను సామంతులును. అంతరంగిక కార్యాలోచన కై వచ్చు నెడల. తిరుమలనాయుడీ సముఖమను హర్మ్యమున వారికి దర్శన మిచ్చి సంభాషించునట, యిపుడది, మండలాధికారుల విడిది యైనది. నగరమున కీశాన్య భాగమున 5 మైళ్లలో యేనుగు రాయి కలదు. యీరాయి యేనుగు రూపముతో 2 మైళ్లనిడివియు. $\frac{1}{4}$ మైలు వెడల్పును 250 అడుగుల పొడవును గల్గి యొక కొండయగా నమర్చబడియున్నది. పర్వకాలములందు మధురలోని సౌరాష్ట్రులీ శిలావారణమును అర్చన సేయుదురు. దేవాలయావరణములోనే అన్ని దుకాణములును కలవు. పట్టణ సమీపముననే వైఘానది ప్రవహించును. మధుర స్టేషను. భోగిబండ్లకూడలి (జంక్షన్) స్టేషనుకు సమీపముననే మంగమ్మ సత్రమని యొక ధర్మశాలకలదు. యీధర్మశాలలోని గదులను కోరు యాత్రికులు. ప్రతిదినమును కట్నమీయవలెను. దొంగల తొందర లెక్కువ. కావున సత్రసుఖముకోరువారు జాగ్రతగ నుండవలెను. *

68. అళగుసింగరి.

ఇది మధురకు 10 మైళ్లలో పర్వతముపై నెలకొనియున్న విష్ణుక్షేత్రము. కోవెలకెదుట పెద్ద తెప్పగుంటకలదు. దీనిజల మతిశీతలము. యీ పర్వతనివాసియగు పెరుమాళ్లకు మేషమాసమున బ్రహ్మోత్సవమగును. అపుడు భగవంతుడు మధురకు వేంచేయును. యీపర్వతప్రదేశము సృష్టి వైచిత్ర్యమును దెలుపుచు గంభీరప్రదర్శనము కలదిగనుండును

* మధురవిషయములు పెక్కు చరిత్రాంశములున్నవి. వానిని నాచే రచింపబడిన పాండ్యచరిత్రయను సమగ్ర సంగ్రహ గ్రంథమున చూ[illegible]

మధురా మండలమున సైతము స్మృతిపథమును దాటిని శైవ వైష్ణవ దివ్యక్షేత్రము లెన్నియో కలవు. ఇక పాండ్యదేశమునువదలి మధురనుండి మలయాళదేశమున కేగిన అట కొన్ని యుభయమత క్షేత్రములను దర్శింప వచ్చును. యీ దేశమునకు పరశురామ క్షేత్రమని పేరు.

69. తిరువంజిక్కళం.

ఇది యిరుకాలక్కడై యను స్టేషనుకు పడమట 4 మైళ్ల దూరమందున్నది. మాతృవధచేసిన పరశురామునికి దోషము నివారణమైన శివ క్షేత్రము.

70 సువిందరం.

బ్రహ్మకు దేవాలయము లేని కొరంత తీరుటకై శివుని ప్రార్థింపగ యీశ్వరు డనుగ్రహించి. విష్ణువుతో కూడి బ్రహ్మకు దేవళము గలుగునటు లొనర్చి ఆ క్షేత్రమున బ్రహ్మనామమే ప్రఖ్యాతమగునటులు చేసెను. యిపు డీచోట త్రిమూర్తుల కొలువలుండియు బ్రహ్మయే ప్రసిద్ధుడైయున్నాడు.

71 కన్యాకుమరి.

పరశురాముడు పితృవాక్య పరిపాలనమునకై మాతను వధించిన యపకీర్తిని బాపుకొనుటకై యిక్కడ శివుని ప్రార్థించి ఆ ప్రతిష్ఠను బాపుకొని గొడ్డలిని యీశ్వరానుగ్రహమును పొంది. తండ్రిని చంపిన కార్తవీర్యుని తరువుగల రాజులను సంహరించి యీభూమిని కశ్యపునకు దానమిచ్చి అమ్మర్షి యొక్క నీతిని పొంది పరశురామమూర్తి యీదేశమును స్వీకరించి అందీశ్వర ప్రతిష్టచేసెను. ఆస్థలమే యీస్థలము.

72 తిరుక్కాట్కరై.

పశ్చిమాభిముఖుడైన విష్ణుమూర్తి యిట నెలకొని భక్తబృందమును పాలించుచున్నాడు.

73 తిరువణ్బరిచారం.

ఇదియు పశ్చిమముఖుడైయున్న విష్ణునివాస దివ్యస్థలము.

74 తిరునావాయ్.

దక్షిణముఖముగ నెలకొనియుండు హరిక్షేత్రము.

75 తిరుమూళిక్కళం.

హారీతమహర్షి కృతార్థు నొనర్చిన నారాయణక్షేత్రము.

76. తిరుచ్చెంగున్నూరు.

పశ్చిమముఖముగ వెలసి భస్మాసురు ననుగ్రహించిన శివస్థలము.

77 కుట్టనాడు. (తిరుప్పులియూరు.)

సప్తర్షులర్చించిన. వాసుదేవదివ్యభూమి.

78 తిరువనంతపురం. (అనంతశయనం.)

ఇదియే తిరువాన్కూరనబరగు సంస్థానము. రాజు. మళయాళి, యీమళయాళీలలో, మేనల్లుడే. ఆస్తికి అధికారి, యీరాజుగొప్ప ధర్మిష్ఠి.

అనంత పద్మనాభస్వామి, ఆదిశేషునిపై తూర్పుతలపెట్టి శివునితలపై నొకచేయిచాచి, నాభియందుచతుర్ముఖునికల్గి శయనించియున్నాడు. నృసింహ. కృష్ణమూర్తులుకలవు. ఒంటిస్తంభమంటపముకలదు. దేవాలయమున నిరతాన్నదానము జరుగును. యీరాజ్యమున విశేషభాగము. అటలీయరణ్యమయములై క్రూరమృగావాసములై యుండి దర్శనీయమై యుండును, చిత్రలేఖనా. నిపుణుడేగాక. చిత్రలేఖనమున భారతభూమికి శిరోభూషణమై యొప్పు, రాజారవివర్మ యీరాజకుటుంబీకుడే కన్యాకుమరికి వాయవ్యభాగమున 55 మైళ్లకావల సముద్రతీరస్థ విష్ణుక్షేత్రమిది.

79 జనార్దనం.

అనంత శయనమున కుత్తరముగ, సుమారు 25 మైళ్లదూరమందుండి దక్షిణగయయని ప్రసిద్ధికెక్కినది. తిరువాన్కూరునుండి సముద్రములో ఓడలపై యిటకు వచ్చుటసుఖమును. ఆనందమును అగును. యీసన్నిది కెదుట క్షీరాబ్ధిశయనుడైనట్లుండు రూపముతో వెలసిన విష్ణ్వాలయము కలదు దీనికి వెనుకప్రక్క నొకశివాలయమున్నది. యిక్కడికి యుత్తరమున సుమారు 100 మైళ్లదూరముననుండు కొచ్చిసంస్థానమున కోడలపైయరిగి యటనుండిసాగరతీరముననే 220 మైళ్లకావలనుండు షోరనూరు కల్లికోటల కురైలుదారిని రావచ్చును.

80 కోయంబుత్తూరు.

ఇది మండలప్రధానపురము. సకల భాగ్యభోగములతో నుండును. కాని అపుడపుడు ప్లేగురోగము పుట్టుచుండును వ్యవసాయకళాశాల కలదు.

81 పేరూరు.

ఇదికోయంబుత్తూరునకు పశ్చిమమున 3 మైళ్లదూరమున నున్న శివక్షేత్రము. గుఱ్ఱపుబండ్లుదొరకును. ధర్మశాలలు, అన్నవుపాహార విక్రయశాలలు కలవు, యీదేవాలయములో కనకసభయను భాగము నానావిధ చిత్రాలంకరణ యుక్తముగనున్నది. దేవాలయవిధ్వంసకుడగు టిప్పుసుల్తాన్ యీదేవళ పులిచిత్రమునుచూచి సంతోషించి, దీనిని పగులగొట్టలేదట,

కాంచీయనునది ప్రక్కనున్నది.

82 మరుదమలై.

ఇదికోయం బుత్తూరునకు పడమట 7 మైళ్లదూరమందుండు శివక్షేత్రము. పర్వతముపై స్వామి వసించియున్నాడు. కొండపై సత్రములున్నవి. జలముతప్ప తక్కినసామగ్రులు క్రిందినుండి రావలసినవే, పర్వత సోపానములు. బాగుగకట్టియున్నారు, కొండయెత్తు 3 మైళ్లు, పెద్ద గోరంటిచెట్టు కొండపైనుండును.

83 వెల్లిమలై. (రజతపర్వతం.)

ఇయ్యది కోయంబుత్తూరునకు 25 మైళ్లదూరమున పడమర పర్వతముపై నెలకొనియుండు దివ్యక్షేత్రము. కొండ 5 మైళ్లయెత్తు. తిరుపతికి వలెనే, మోగాళ్లమండపము. మోకాళ్లమంటపము. యిత్యాది. యేడువిడిదలుకలవు. కట్టెలునుసీళ్లుతప్ప మిగిలినసామానులన్నియు క్రిందినుండితీసికొనిపోవలసినదే. యిక్కడికి కట్టెబండ్లమీదరాకపోకలు, యిపుడుగుఱ్ఱపుబండ్లు కూడచిక్కును. వేసవికాలములలో యిక్కడికిరావలెను. వర్షాకాలములో కసవుమొలిచి దారికనుపడదు. యేడవకొండకడ గొడుగువలె పెద్దబండకలదు. యాత్రీకులీ బండక్రిందనే వంటచేసికొని భుజించి. శ్రమనివారించుకొందురు. యిట, పృథివీ, అప్పు, తేజో. వాయు. ఆకాశములను పంచలింగములు కలదు, చూచుటకు చాలవేడుకగనుండును. యిక్కడ దివ్యౌషధులు విశేషముగకలదు. సిద్ధులనేకులు వాసమున్నారు పర్వతముపై నిలుచుండిన, వింతవింతమృగములును, పలురంగులపక్షులును, నెమళ్లును. కనుపడును. శార్దూలాది, భీకరమృగములును వలయునన్నికలవు. ప్రకృతిరమణీయము శివమలైయను సమీపశివక్షేత్రమున అనేకాద్భుతశక్తులు యిప్పటికినిస్వామి. భక్తులకుచూపుచున్నాడట.

84 తిరుమురుగన్ పూండి.

ఇది. అవినాశిక్షేత్రమునకు 3 మైళ్లలోనున్న శివదేశము. కేవలము కుగ్రామము, యిటదొంగల రాటుయెక్కువ.

85 అవినాశి.

తిరుప్పూరుస్టేషనుకు 8 మైళ్లయందుండు శివక్షేత్రము. బస్తీగ్రామము ధర్మశాలలు మొదలగునవి కలవు.

86 తిరుప్పూరు.

ఇటప్రఖ్యాతక్షేత్రములు లేకపోయినను సకలవిధముల దిన దినాభి

వృద్ధినందుచున్న తాలూకాపట్టణము.

87 వెణ్ణైమలై. (నవనీతపర్వతం.)

ఇదికరువూరునకు సమీపమందుండు శివక్షేత్రము. వెన్నవలె తెల్లగనుండుచు, యేకాలమందైనను చల్లగనుండు పర్వతముపై శివుడు నెలకొనియున్నాడు.

88 తిరువెంజమాక్కూడల్.

ఇది కరువూరునకు 12 మైళ్లదూరమందుండు శివక్షేత్రము.

89 భవాని.

కోయంబుత్తూరు జిల్లాలోని యొకతాలూకాపట్టణము, ఇందుమంచి వర్తకముకలదు. యిక్కడ కావేరిభవాని నదులుసంగమమగును. పర్వదినములందు విశేషముగ యాత్రికులీకూడలియందు స్నానమాచరించి సమీపమందలి యమృతలింగేశ్వరుని పూజింతురు. కావేరినదికి 26 కనులవారధియు భవానికి 9 కనులవారధియు కట్టియున్నారు. చూచుటకు సొంపుగనుండును, మొత్తముమీద కోయంబుత్తూరుజిల్లా, సర్వసస్యాఢ్యమై, వాణిజ్యశ్రీదమై, విద్యాపీఠమై, దేశభక్తియుక్తమై ద్రావిడమండల రత్నమనదగియున్నది. యీజిల్లాలో చేరినవియు సమీపముననున్నవియు, నగుకొన్నిస్థలముల ప్రసిద్ధదేవాలయములు లేకుండినను యితరవిశేషములు కలవు. వానితో, మేటుపాలయం, యిక్కడికి. చెన్నిపురినుండిమైయిలున్నది. యిక్కడి నుండియే నీలగిరికిపోవుదురు. పోతనూరు. యిది. చెన్నపురి. మళయాళము మంగళూరు, ఉదకమండలం, యీచోట్లకయో మార్గములు గలపట్టణము, పొల్లాచ్చి, యిది కోయంబుత్తూరికి 25 మైళ్లదూరముననుండి, విశేషపర్వతపంక్తితో యొప్పారిప్రకృతి తత్వము నుపదేశించును. రవీంద్రకవీంద్రునియట్టి, ఆంధ్రులీయూరికి వచ్చిన ప్రకృతిరహస్యమును గ్రహింపగలరు. యీపొల్లాచ్చికి 18 మైళ్లదూరమున. ఉడుమలైప్పేట్టై యనుగ్రామముసను పెక్కుగోత్రములుకనంబడు నందు. త్రిమూర్తికొండయందుండు దైవమూర్తులముగ్గురి నర్చించుటకై యాత్రికులు పోవుదురు. తారాపురం. యిది తిరుప్పూరు రైలుస్టేషనుకు 32 మైళ్లకావలనుండు తాలూకాపట్టణము, పైచెప్పియుండునవి యన్నియుపట్నములే, యిటఅమరావతి యనునది ప్రవహించుచున్నది. యీరోడ్డు, యిదియు నొకతాలూకాపట్నమే యిక్కడ పసుపు అరటి, విస్తారము. చెన్నపురికి 243 మైళ్లదూరమున నున్నది.

90 శెన్నిమలై.

ఈరోడ్డు సమీపమందుండు పెరుందురై రైలుస్టేషనకు కొన్నిమైళ్ల లోనుండు పర్వతముపై నెలకొనియుండు సుబ్రహ్మణ్యక్షేత్రము. చాల ప్రఖ్యాతి చెందినది.

91 సేలం.

ఇది చెన్నపురికి 207 మైళ్లదూరమందుండు జిల్లా ముఖ్యపట్టణము. ఈమండలమున కొండ లెక్కుడుగ కలిగియున్నందున శైలము మారి సేలము అయియుండునేమో, యిట శుకవనేశ్వరుడు. అళగిరి. మొదలగు దైవములు నెలకొనియున్నారు పరిసరముల పెక్కుక్షేత్రము లున్నవి.

92 రామస్వామిగుడి.

ఇది సేలమునకు 7 మైళ్లలోనుండు విష్ణుక్షేత్రము.

93 ధారాపురం.

సేలమునకు 9 మైళ్లదూరమున నానావిధ చిత్రశిల్ప నైపుణిని నిర్మితమైన శివక్షేత్రము.

94 తిరుచ్చంగోడు.

ఇది శంకరీదుర్గమునకే 5 మైళ్లలోనుండు శివక్షేత్రము కోవెల కొండపైనున్నది. రాతితో నాగములు 7 చెక్కియున్నారు. యిందొకటి అందముగ లేదు. మొదటిదిపోగా రెండవమా రిప్పటివారు చేసిన నాగమే బాగు లేదు, అర్ధనారీశ్వర స్వరూప మతిఆశ్చర్యముగ మూలస్థానమం దున్నది. యీగుడికి సమీపమున వంధ్యశిలయని యొక రాయికలదు, సంతానహీనలిట సేవసేయుదురు. యీశిలకు ప్రదక్షిణము వచ్చునపుడు ప్రక్క బ్రహ్మాండమగు లోతుకలదందు కాలుజారి కాలుప్రోలి కరుగుదురు. యినుపగుంజలు నాటి యీ యాపద నిపుడు నివారించిరి. యీకొండమీద. అత్యుష్ణము. బహుళజనపదము.

95 శంకరిదుర్గము.

తిరుచ్చంగోడునకు వచ్చు రైలుమార్గముందుండు రైలుస్టేషనుగల జనపదము. చెన్న శేశవుడుండు పర్వతము సుమారు 2000 అడుగుల యెత్తు గలది. యీకొండకు పోవుదారిలో టిప్పుసుల్తాన్ కట్టించిన కోటకలదు. ధాన్యభాండారము కలదు. యిందులో యిప్పటికిని ధాన్యము లగపడుచున్నవి. చెన్నపురి రైలుమార్గమునకు 230 మైళ్లదూరమందున్నది.

96 తిరుచ్చెంగున్నూరు.

ఇది శంకరిదుర్గం స్టేషనుకు వాయువ్యదిక్కున 6 మైళ్లదూరమందు. అర్ధనారీశ్వర దేవాలయ క్షేత్రము.

97 తిరుచ్చినాపల్లి. (త్రిశిరపురం.)

ఇయ్యది చెన్నపురికి 214 మైళ్ల దూరమందు ఆ జిల్లా ముఖ్య పట్టణము. మధుర రామనాథము. అనంతశయనము మొదలగు పట్టణముల పోల్కి యిదియు చారిత్రకనగరము ఇందు ముఖ్యముగ తాయుమానస్వామి కొండయెక్కిపోగ అక్కడ బహుళ శిల్పాలంకరణములతో నొప్పు దేవళమును. 100 కాళ్ల మండపమును చూడనచ్చును. యిక్కడ పాదద్వయమున్నది. దీనిని విభీషణుని పాదములని హిందువులును నాట్టుఅను మహదీయభక్తుని పాదములని మహమ్మదీయులును విశ్వసించెదరు. యీ చోటులుదాటి పైకిపోయిన ఉచ్చిపిళ్లారిగుడి యెగువనున్నది. ఉన్నతుడైన విఘ్నేశ్వరు డితడు యీ చోటునుండి నలుదిక్కులు బాగుగ కన్పడును. తిరుచినాపల్లి యంతయు తెలియును. సృష్టివైచిత్ర్యము స్పష్టమగును. యిప్పుడు నాటుకోటిశెట్లు కిలమైన స్థలముల నుద్ధరించిరి. యీ కొండకెదుట క్రింద పెద్ద తెప్పగుంటకలదు. యీ కోటలో చందాసాహేబు సమాధికలదు. జోసప్ కాలేజి కలదు. యీ యూరికి పశ్చిమముగ ప్రవహించు కావేరినది దాటుటకు 32 కనులుగలిగి 49 అడుగుల వారదిని కట్టియున్నారు.

98 శ్రీరంగము.

తిరుచ్చినాపల్లి కోటకు రెండుమైళ్లదూరమున కావేరీకొల్లడ నదుల మధ్య శ్రీరంగశాయి సప్తప్రాకారావృతమై వైకుంఠముపోల్కి చెలువారు శ్రీరంగపట్టణమున వెలసి భక్తార్తిహారుడై యున్నాడు. యీ సప్తప్రాకారములలో నొకటి రెంటిని ఆళ్వారులును. తక్కినవి చోళరాజులును కట్టించినటులు శాసనములున్నవి. పెద్ద మునిసిపాలిటి పట్టణమయ్యు నిది యేడు ప్రాకారములలో నడగి యున్నది. నాలుదిక్కులను గోపురములున్నవి. ప్రతిమాసమునను బ్రహ్మోత్సవములు జరుగుచుండును. బ్రహ్మోత్సవము జరుపు ఉభయంటూరు లనేకులుకలరు. ప్రభుత్వమువారి దేవళమునకు భాగముసంవత్సరము 1-కి శి 00 వేల రూపాయలు గ్రాంటునిచ్చెదరు. యిక్కడికి నిప్రసిద్ధిగ యీశాన్యరుహోటున 9 మైళ్లదూరమున అఖండకావేరి అనగ కొల్లరుతోము కావేరి చీలు. 80క్రోశము. యిక్కడినుండియే దక్షిణములుగచీలి కావేరి కొల్లడములను రాలయ ప్రవహించును. యాత్రార్థు లిట స్నానముచేయు ... వత్తురు. సమూర్తి

99 జంబుకేశ్వరము.

శ్రీరంగమునకు సుమారు ½ మైలు దూరముననుండు అప్‌లింగము. యీలింగము జలములో నోలలాడుచుండును. యీ దేవళమునకు 5 ప్రాకారములున్నవి. శ్రీరంగమువలెనే ప్రాకారములలోనే యూరున్నది. నాటుకోటసెట్లు చాలధనమును వెచ్చించి క్షీణించిన దేవాలయ భాగములను పునరుద్ధరించుచు కొన్ని మండపములను కట్టించియున్నారు.

100 తిరువాట్‌పోక్కు.

ఇది రత్నగిరి మాణిక్యములై యనుపర్వతములగల ప్రదేశము. శివక్షేత్రము. రత్నగిరీశ్వర నామలీల, కావేరితీరము.

101 కడంబర్ కోవిల్.

కావేరీతీరస్థ శివక్షేత్రము. కావేరినదీ పరిసరము.

102 కుళిత్తలై.

ఇది తిరుచినాపల్లి మండలములోని తాలూకాపురము చెన్నపురి నుండి 272 మైళ్లదూరమం దుండునది. యీయూర దేవళములు లేకపోయినను. తైపుష్యమునాటికి పరిసరగ్రామములందుండి దైవములు వాహనారూఢములై వేంచేసి కావేరీతీరమున ఆదినమంతయు నుండును.

103 పారాయిత్తురై.

కావేరీ స్రవంతీసమీపస్థ శివక్షేత్రము. (అఖండకావేరి.)

104 తిరుక్కుర్కుడిమలై.

సమయాచార్యత్రయముచే పొగడ్తగన్న హరిక్షేత్రము.

105 ఉఱైయూరు.

పంచవర్ణేశ్వర నామాంకిత శైవస్థలము.

106 ఎలమనూరు.

కావేరికి ఉపనదియగు కొల్లడం నదియొడ్డుండు బహుళజన పదము. ఉభయక్షేత్రములును పెక్కుకలవు. కొల్లడమానకట్ట చూచుటకు వింతగనుండును.

107 కరూరు.

ప్రఖ్యాతమై పురాణప్రసిద్ధమైన హరదివ్యం. తిరుచినాపల్లి జిల్లాలోని తాలూకాపట్టణము. చారిత్రకము. యిక్కడ కోవెలలోని పశుపతీశ్వర లింగము 5 అడుగులయెత్తుకలది మొదట నీభాగము భూగర్భమందున్నపుడు పశువులీ లింగముపై క్షీరమును వర్షించెనట. తర్వాత

దేవాలయము నిర్మాణమైనట్లు చెప్పెదరు.

108 తాందోణి పెరుమాళ్లుగుడి.

కరూరునకు $1\frac{1}{2}$ మైలుదూరమున కొండపైనున్నది. తొలిచిన కొండయే గుడియైనది. తిరుపతికిమారుగ నెక్కడివా రక్కడనే సీలాలిచ్చుటయు పెండ్లి వడుగు సేయుటయు కలదు. యితడు ప్రకృతి రమణీయస్థల స్థితుండగు నారాయణుడు తిరుచినాపల్లి మండలస్థములగు మరియు పెక్కు దివ్య క్షేత్రములు యాత్రికుల దృష్టికి దూరముగ నుండవచ్చును. యీమండలమును వీడి తంజావూరు మండలమునకు వచ్చెదము.

109 తంజావూరు.

ఇయ్యది ఆంధ్రులును మహారాష్ట్రులును పరిపాలనమొనర్చి శాశ్వత కైంకర్యము లొనర్పించేసిన యుత్కృష్టపట్టణము సంగీత విద్వాంసులీ మండలమాతకు ప్రియసుతులు.

యిప్పట్టణము చెన్నపురికి 217 మైళ్లదూరమందున్నది. తంజావూరు ద్రవిడమండలమే యైనను పెక్కులు ఆంధ్రులుకలరు చారిత్రక మండలమని యెరుగని అక్షరాస్యులుండరు ఇట బృహతీశ్వరస్వామి దేవాలయము చాల పెద్దది. ఇది పదునొకండవ శతాబ్దమున 1023-వ సంవత్సరమున ప్రారంభింపబడి 1064 సంవత్సరమువరకును. పనిజరిగి పూర్తియైనది. దీని నిర్మాత రాజరాజేంద్రచోళుడు, యీ దేవళము కట్టునపుడు కాంచీనగర రామవర్మ యను శిల్పశాస్త్రోపాధ్యాయుడు విచారణాధికారియై యుండెను. మొదటి ద్వారముదాటి లోనికేగిన 90 అడుగుల యెత్తుగల గోపురమును దాని దాటిపోయిన 60 అడుగుల మంచి పనితనముగల గోపురమును చూడవచ్చును. ఆవల మధ్యమండపమున్నది. సమీపమున పెద్దనందియు దీనికి ఉత్తరమున బృహతీనాయకి దేవళమున్నది. దానిదాటిన విమానము కనపడును. దేవీ మందిరమునకు సమీపముననే కోనెల పూలతోటకలదు. ద్వితీయగోపుర ద్వారసమీపమున అష్టకోటి మండలము లింగములును దక్షిణామూర్త్యాలయము గణపతి మంటపము కనబడును. 108 లింగముల మండపమును దాని గోడలపై 64 శివవిలాసములును గోచరించును. దీనికి పడమట వేపచెట్టుక్రింద నొక మహాత్ముని సమాధికలదు. మరియు సుబ్రహ్మణ్య సుందర మందిరమునుకలదు. 800 అడుగుల నిడుపును 415 అడుగుల వెడల్పునుగల యీ బృహతీశ్వరాలయములో 16 అడుగుల నిడుపును. 12 అడుగుల వెడల్పును. గల నందిమూర్తియున్నది. యీ నంది కెదుట చంద్రశేఖరస్వామి

యుండు విమానము వివిధ విచిత్రాలంకరణ యుక్తమైయున్నది. యీచోట ఒక ఆంగ్ల ప్రతిమకలదు. అప్పటికి మనవారు ఖండాంతరముల కరిగి పాశ్చాత్యులను చూచివచ్చినటులున్నది. బృహతీశ్వరుని గుడిగోపుర శిఖర శిల 25 చదరపు అడుగులును 80 టన్నుల బరువుగలి యొకరాయి, అతుకులు లేక స్థాపితమైయున్నది. యీగోపురపు నీడయే ఋతువునందును. యేప్రక్కను తగులకుండునటులు నిర్మితము. యీ గోపుర నిర్మాణమునకు మాత్రము 12 సంవత్సరములు పట్టెనట భారతమాత కడుపున నెట్టి మారుబ్రహ్మలు కలిగియుండిరో దీనినిబట్టి యూహింపవచ్చును. భరతఖండ ముండునంతవరకు యీ గోపుర నిర్మాణ చాకచక్యము. మన ప్రాచీననాగరికతను చాటకుండునా ? ఇదియునుగాక యీపురమున కోటయు నాకోట రాజమహలుకలదు యిది 90 అడుగుల యెత్తును 5 అంతస్తుల మేడయునై యున్నది. దీనికి పడమట దర్బారుహాలను సభామంటపమున్నది. యిందు శివాజీస్ఫటికశిలాప్రతిమకలదు. అంతఃపురములోనే సరస్వతీమహాలుకలదు. యీ గ్రంథభాండాగారములో 18 వేల సంస్కృతవ్రాత ప్రతులు కలవు. యిందులో 8 వేలతాళపత్ర గ్రంథములు కలవు, మరియొకప్రక్క మహారాష్ట్రదర్బారు మందిరమున్నది. యిటపూర్వముండిన సింహాసనమే మైనదోకాని. యిపుడు పెద్దబల్లయున్నది దీనికి దాపుననున్న ఆయుధాగారములో వెండిబంగారు పిడులుగల కత్తులును. కట్టారులు, బాకులు, శూలములు, తుపాకులు, శతఘ్నులు. పిస్తోళ్లు మిక్కిలిగకలదు. కోటకుపడమటి ద్వారముదాపున. 25 అడుగులనిడుపును. 2 అడుగులవెడల్పునుగల పాతఫిరంగీయొకటి కలదు తంజాపురిరాణులు తయారుచేయించిన ఘంటాగృహముకలదు. యీమండలమునకు, జీవనదులలో నొక్కటియు పరమ పావనియునగు కావేరీనది కోరికెలనిచ్చుచున్నది.

110 ఆలంపొళిల్.

తిరువైయారు మార్గమున తిరుకండియూరునకు 9 మైళ్లదూరమందుండు. ఆత్మనాథేశ్వరస్వామి యాలయముగల శివక్షేత్రము శైవాచార్యులపాగడ్త కెక్కినది. కావేరీనదీ పరిసరము.

111 తిరుప్పూందురుత్తి.

పుష్పవననాథేశ్వర నివాసశైవస్థలము. కావేరీనదీతీరస్థము తంజాపురినుండి, తిరువైయ్యూరు. తిరుక్కండియూరులకు పడమట 8 మైళ్ల దూరమందున్నది.

112 తిరుక్కండియూరు.

యిది తంజపురి కుత్తరమున 6 మైళ్లలో తిరువైయారునకు పోవు దారిలోనున్నది. కావేరీపరిసరము.

113 తిరుశోత్తృత్తురై.

ఇది జంతుపురికి యుత్తరమున తిరువారూరికి పోవుదారిలో తిరుక్కండియూరునకు 8 మైళ్లదూరమున కావేరీ నదీపరిసరమున నున్న శివ క్షేత్రము.

114 తిరువేదిగుడి.

ఇయ్యది తిరువారూరు తిరుక్కండిదారిలో 7 మైళ్ల దూరమున కావేరీనది యొడ్డున నుండు హరస్థలము.

115 తిల్లై.

పశుపతీశ్వర స్వామి నెలవు. తంజనగరమునకు 6 మైళ్ల దూరమందున్నది.

116 తిరుప్పుళ్లమంగై.

శివదివ్యదేశము అయ్యంపేటకు 2 మైళ్లయందున్నది. కావేరీతీరము.

117 అయ్యంపేట్టై.

ఇది ధూమశకట విశ్రమ్యాలయము. కావేరితరంగిణీ యుక్తపావన శివక్షేత్రము.

118 తిరుక్కళావూరు.

ఇది అయ్యంపేట పాపనాశము. రయిలుస్టేషనులకు 4 మైళ్ల దూరమున నున్నది.

119 పాలైతురై.

ఇది పాపనాశమున కుత్తరదిక్కున 1 మైలునందుండును.

120 నల్లూరు.

సుందరపెరుమాళ్లు కోవెల స్టేషనుకు దక్షిణమున 2 మైళ్లదూరమందుండు యీశ్వర దివ్యక్షేత్రము.

121 శత్తి ముత్తం.

ఇది కుంభకోణమునకు నైఋతిదిక్కున 4 మైళ్లలో నుండు శంకరక్షేత్రము.

122 పట్టీశ్వరం.

ఇదియు శక్తిముత్తమునకు సమీపమునున్న శివస్థలము.

123 తిరుప్పాలైయాఱై.

సోమేశ్వరుడును సోమకళాదాయకియు నెలకొనియుండు దివ్య శివస్థలము. పట్టీశ్వరమునకు 1 మైలునను న్నది.

124 ఆవూరు.

కుంభకోణమునకు నైఋతిదిక్కున 8 మైళ్ల కానలనుండు హరవిలాస దివ్యదేశము.

125 తిరువారూరు.

ఇది తంజపురిజిల్లాలోని యుత్కృష్ట దివ్య శివక్షేత్రము. స్వామి త్యాగరాయడు. ఒకపు డీక్షేత్రము వైష్ణవుల పూజాస్థలముగనుండి తర్వాత శైవులచేతికి వచ్చినది. యాత్రీకులకు వలయు సౌకర్యములున్నవి. శూద్రులకు రెండు సత్రములున్నవి. ఆ సత్రములోనే ప్రతిదినము 100 బ్రాహ్మణుల కన్నదానము చేయబడుచున్నది. చెన్నపురికి 254 మైళ్లును మాయవరమునకు 24 మైళ్లును దూరముకలదు.

126 తిరువలంశుఝి (ళి).

కుంభకోణమునకు 4 మైళ్లదూరమున కావేరీ స్రవంతీ తీరస్థమగు హరస్థలము.

127 కుంభకోణము.

ఇది తాలూకాపట్టణము. సుమారు 65 వేల జనసంఖ్యగల పెద్దపట్నమనవచ్చును. యీ మునిసిపాలిటీ పట్టనమున అనేక దేవాలయము లుండినను. సారంగపాణి, చక్రపాణి, రామస్వామి, కుంభేశ్వరుల దివ్య మందిరములున్నతములై విఖ్యాతములైయున్నవి. సారంగపాణి కోవెల గోపురము 147 అడుగుల యెత్తు గల్గియున్నది. దానివెనుక చిన్నగోపురములు 5 ఉన్నవి. యిట ఉన్నత రథద్వయముకలదు. సమీపంబుననుండు కుంభేశ్వర దేవళము సుమారు 330 అడుగుల నిడుపును 15 అడుగుల వెడల్పునుగల్గిన ప్రాకారమును దాటిపోయిన 128 అడుగుల యెత్తైన గోపుర మగపడును. దీనిని దాటిపోయిన 83 అడుగుల నిడుపును, 55 అడుగుల వెడల్పు గల మండపముండును. యీ దేవళమున వెండివాహనములును 5 రథములును కలవు. సమీపస్థమగు రామస్వామిదేవళము చిన్నదయ్యు లోపలిభాగము నానావిధ చిత్రాలంకారములతో విలక్షణమైయుండును. కావేరీతీరమున చక్రపాణిగుడి కలదు. యిన్నింటికిని మించినది. మహామఖ జలాశయము. యిది

20 యేకరముల విస్తీర్ణముగల గుంట 12 సంవత్సరముల కొకపరి. గురువు సింహామునకలయు పౌర్ణవమికి మహామఖోత్సవము జరుగును. యీ గుంట చుట్టును. పెక్కు దేవళములుకలవు. శ్రీమచ్ఛంకరాచార్య పీఠమును. కళాశాలయు. ఉన్నతవిద్యాలయములును. యిత్తడి కంచు పట్టు చేతిపనులును, కలిగి అత్యున్నతస్థితియందుండు యీ కుంభకోణము. చెన్నపురికి 283 మైళ్ల దూరముననున్నది. కావేరితీరస్థము.

128 తిరునాగేశ్వరము.

చంపకారణ్యేశ్వరస్వామి నెలకొనియుండు శివభూమి. కుంభకోణమునకు పడమట 4 మైళ్ల దూరమందుండును.

129 తిరువిడమరుదూరు. (మధ్యార్జునము.)

ఇది ప్రఖ్యాత శివక్షేత్రము. యీ దేవాలయము శిల్పనైపుణ్యము చాలవరకు మధ్యమపద్ధతిగ నుండును. రైలుస్టేషను కలదు. త్రిభువనము. తెన్నురంగాడుదురై సీలక్కుడి యీ క్షేత్రములు. మధ్యార్జునమునకు చుట్టు 23 మైళ్లదూరమున కావేరీతీరమున నుండును.

130 కోనేరి రాయపురము. (తిరునల్లం.)

ఇది మధ్యార్జునమునకు 6 మైళ్ల దూరమున తూర్పున నుండును.

131 తిరుకోళప్పం.

నరసింగపేట్టై స్టేషనుకు 2 మైళ్ల కావలనుండు శివక్షేత్రము.

132 తిరువాడుదురై.

ఇయ్యది పైస్టేషనుకు $1\frac{1}{2}$ మైలుదూరమందుండు శివదివ్యభూమి. యిట శైవాచార్య పీఠమగు పండారసన్నిధియుండి బహుధనవంతమై. శిష్య బాహుళ్యమైయున్నది.

133 కుత్తాలం. (తిరుత్తురుత్తి.)

ఇది మాయవరమునకు నిఋతిమూల 6 మైళ్లలో కావేరీనదీ పరిసరమున నెలకొనియుండు శివక్షేత్రము.

134 మాయవరము.

తంజపురిజిల్లాలోని ప్రసిద్ధక్షేత్రములలో యిదియొకటి పెద్ద మునిసిపల్ జానపదము. కావేరీతీరస్థము. తులామాస స్నానమునకై యీ యూరికి వేలకొలది జనులు వత్తురు. యాత్రికులకు సకల సౌకర్యములును కలవుయిది చెన్నపురికి 175 మయిళ్లదూరముననున్నది. యీ యూరికి 1 మయిలు

దూరమున కొరనాడని యూరుకలదు. యిక్కడనేయు చీరలు భరత ఖండ మంతయు తీయుచున్నారు.

135 తిరువిళనగర్.

మాయావరమునకు పడమట 4 మయిళ్లదూరమున నుండి శైవాచార్యుల వలన ప్రాగ్దత్తకన్నది.

136 తిరుప్పరియలూరు.

ఇది మాయవరమునుండి 3 మయిళ్లలోనుండు శివక్షేత్రము.

137 తిరుచ్చెంబొన్పళ్లి.

మాయవరమునకు పడమర 6 మయిళ్ల కావలనున్న శివస్థలము. కావేరీనదీ పరిసరము.

138 తిరువలంపురం.

సమయాచార్యులు ముమ్వురిచేతను నుతింపబడి కావేరి నది గట్టున నుండు హరస్థలము. శీర్గాళికి 8 మయిళ్లదూరమున నుండును. ప్రసిద్ధ ప్రాచీనక్షేత్రము.

139 తిరువాక్కూరు.

ఇది మాయవరమునకు పడమట 10 మయిళ్ల దూరమున నున్న శివస్థలము. స్వామి స్వయంభువు.

140 తిరుక్కడవూరు.

ఇది శీర్కాళికి 14 మయిళ్లలో నుండు ప్రసిద్ధ శివక్షేత్రము.

141 తిరువేట్టక్కుడి.

ఇది కారైక్కాలున కుత్తరమున 3 మయిళ్లదూరమున నుండు. శివలీలా విలాస వాసభూమి.

142 కారైక్కాల్.

ఇందు శివవిష్ణ్వాలయము లున్నను. దుర్గాదేవి ప్రసిద్ధురాలు కారైక్కాలమ్మై అను నామము. యిట దుర్గాదేవికి బలియిచ్చు జంతువులకు లెక్కలేదు. పెద్దయూరు. చెన్నపురికి 201 మయిళ్లదూరమున నున్నది. స్టేషనుకు అర్ధమయిలు దూరములో గొప్ప శివాలయముకలదు.

143 తిరునళ్లారు.

కారైక్కాలునకు పశ్చిమమున 3 మయిళ్లదూరముననుండు ప్రాచీన శైవక్షేత్రము.

144 తిరుకోట్టారు.

తిరునల్లారు క్షేత్రమునకు పడమట 3 మయిళ్లలోనుండు శివక్షేత్రము. ఐరావతేశ్వరస్వామి ఐరావతమునకు అనుగ్రహమిచ్చిన క్షేత్రము.

145 అంబర్ పెరుంతిరుక్కోయిల్.

బ్రహ్మ అర్చించినందున బ్రహ్మపుర నాథేశ్వరుడని యీదేవుడు, దివ్యనామము వహించెను.

146 అంబర్ మాకాళం. (మహాకాళం.)

కాలకంఠేశ్వరుడు హరిహరాదులు పూజించినచోటు పైకోవెల యు నీచోటనే యుండు శివక్షేత్రములు.

147 పేరళం.

ఇట ప్రయత్ననాథేశ్వర సకల భువనేశ్వర దేవాలయములు కలవు. పేరళం స్టేషనుకు 1 మయిలు దూరమందుండును.

148 మదిముత్తం.

ఇక్కడ రామలక్ష్మణు లరణ్యగతులైనపుడు తండ్రికి తర్పణాదు లొనర్చి సుకృతులైన శివక్షేత్రము. పేరళమునకు నిఋతిదిక్కున 3 మయిళ్ల కావలనున్నది.

149 పాంబురం.

ఆదిశేషుడును తక్కిననాగులును పూజించిన శివక్షేత్రము పేరళము నకు 4 మయిళ్ల కావలనున్నది.

150 తిరుచిరుకుడి. (గుడి.)

అంగారక గరుడగంధర్వాదు లర్చించిన శివదివ్యభూమి మంగళేశ్వ రుడు పేరళమునకు 5 మయిళ్ల కావలనుండును.

151 తిరులీళ్ళిమిళలై.

మహావిష్ణువు. పూజించిన శివక్షేత్రము. పురాణమయినది. కుత్తాలం స్టేషనుకు 6 మయిళ్ల దూరముననున్నది.

152 వన్నియూరు.

వీరభద్రుని శాపమునకు గురియైన అగ్నిదేవు డర్చనచేసిన దివ్య శైవక్షేత్రము. పై క్షేత్రమునకు 1 మయిలుదూరమున నున్నది.

153 కొట్టిడై.

సద్గుణేశ్వరస్వామి. సద్గుణుడను రాజునకు మోక్షమిచ్చిన హరక్షే త్రము. నాచ్చియారుగుడికి 6 మయిళ్ల దూరమున నున్నది.

154 పేణుపెరుందుఱై.

శివశక్తి. బ్రహ్మ మొదలగువారు కైవారమొనర్చిన శివక్షేత్రము. కుంభకోణమునకు ఆగ్నేయమున 8 మయిళ్ల దూరమందున్నది.

155 నరైయూరు సిద్ధేశ్వరం.

సౌందరేశ్వర సిద్ధేశ్వరాలయములు. కుబేరాది దివ్యు లనుగ్రహింప బడిన దివ్యభూమి, కుంభకోణమునకు నిఋతిదిక్కున 5 మైళ్ల దూరమున నున్నది.

156 అరిశిర్కరై పుత్తూరు.

శైవభక్తునకు దారిద్ర్య నివారణకై యీశ్వరుడు దినమొక నిష్క మిచ్చిన దివ్యక్షేత్రము. కుంభకోణమునకు 4 మయిళ్ల దూరమం దున్నది.

157 శివపురం.

బ్రహ్మపూజించిన శంకరక్షేత్రము. కుంభకోణమునకు ఆగ్నేయము న 3 మయిళ్ల దూరముననున్న ప్రాచీనక్షేత్రము.

158 శాక్కోట్టై.

దివ్యుల మృతాండసుతైన యనంతర మర్చనలుగొన్న శివభూమి. కుంభకోణమునకు 2 మయిళ్ల కావలనున్నది.

159 వలంగిమాన్.

సగుణలింగేశ్వరుడు, సర్వాలంకృతాంబిక, విశ్వామిత్రుడును, సద ణుడను రాజును. వాసవ, మార్కండేయాదులును పూజించిన శివక్షేత్ర ము. కుంభకోణమునకు 6 మయిళ్ల దూరము. యిక్కడ పట్టుచీరలు ప్రసిద్ధి.

160 తిరువాంచయం.

ఒక నాగకన్య యర్చించి మైక్యమొందిన శివక్షేత్రము. వాంఛలిం గేశ్వరుడు.వృద్ధికరేశ్వరి.నన్నిలంస్టేషనుకు తూర్పున 6 మయిళ్ల కవలనున్నది.

161 నన్నిలం.

ఇది తంజావూరుజిల్లాలోని యొక తాలూకా నగరము. చెన్నపురికి 189 మయిళ్ల దూరమందున్నది. స్టేషనుకు 3 మయిళ్ల దూరమున పెద్దదేవళ మున్నది. ప్రకాశేశ్వరుడు. ప్రకాశేశ్వరి. సూర్యు డిక్కడ పూజించి స్వయం ప్రకాశుడయ్యెను.

162 తిరుకొండీశ్వరం.

పతీశ్వరుడు. శాంతనాయకి. కామధేను విట పూజించి యీ వియో వయ్యెను. నన్నిలంస్టేషనుకు $1\frac{1}{2}$ మయిలుదూరమున నున్నది.

163 తిరువిర్కుడి.

జలంధరుడు మృతినొంది మృత్యుంజ యైక్యమొందిన క్షేత్రము వెట్టారుస్టేషనుకు యీశాన్యమున 3 మయిళ్లు దూరమందున్నది.

164 తిరుప్పుగలూరు.

అగ్నీశ్వరుడు, వర్ధమానేశ్వరుడు. అగ్నిదేవు డీశ్వరుని పూజించి. యనుగ్రహమొందిన క్షేత్రము. నన్నిలం స్టేషనుకు తూర్పున 4 మయిళ్లలో నున్నది. ఈరెండు దేవళములును సమీపముననే యున్నది.

165 రామనదీశ్వరము.

శ్రీరామ, మృకండ మార్కండేయులు పూజించిన శివక్షేత్రము. కుంభకోణమున కీశాన్యమున 5 మయిళ్లు దూరమున నున్నది.

166 తిరుపయత్తూరు.

భైరవఋషి పూజించిన శివలీలా విలాసభూమి తిరువారూరి కుత్తరమున 10 మయిళ్లు కావలనున్నది.

167 శెంగాట్టాంగుడి. (గణపతీశ్వరము.)

గజముఖాసురుని బాధలకోర్వక తనకడ మొరబెట్టుకొనిన దేవతలను కాపాడుటకై గజాననుని సృష్టించి ఆతనిచే గజాసురునిజంపించిన శివ దివ్యభూమి. నన్నిలంస్టేషనుకు తూర్పున 5 మయిళ్లు కావలనున్నది.

* శిరుత్తొండ నాయనారను శివభక్తు డీశ్వరానుగ్రహమును పొంది సకుటుంబముగ కైలాసమేగిన మహాత్మునిదీక్షేత్రమే.

168 తిరుమరుగల్.

మాణిక్యేశ్వరుడు. భ్రమరకుండలేశ్వరి. మార్కండేయాది మహర్షులును పామరులగు మానవులును పూజలొనర్చి ముముక్షువులైన శైవ క్షేత్రము. నన్నిలంస్టేషనుకు తూర్పున 7 మయిళ్లు దూరమందున్నది.

169 శాత్తమంగై.

అవంతీశ్వరుడు. ప్రసూననేత్రాంబిక. అష్టావక్రుడు డర్చించిన శంభు విహార దివ్యస్థళము. నల్లారునకు నైఋతిదిక్కున 5 మయిళ్లు ధూరమందుండునది.

170 నాగపట్టణము.

---

* నాచే రచింపబడి ముద్రింపనున్న శివభక్త చరితావళిలో నితని చరిత్రము తెలియనగును.

శివశక్తి. బ్రహ్మ మొదలగువారు శైవారమొనర్చిన శివక్షేత్రము. కుంభకోణమునకు ఆగ్నేయమున 8 మయిళ్ల దూరమందున్నది.

155 నరైయూరు సిద్ధేశ్వరం.

సౌందరేశ్వర సిద్ధేశ్వరాలయములు. కుబేరాది దివ్యు లనుగ్రహింపబడిన దివ్యభూమి, కుంభకోణమునకు నిఋతిదిక్కున 5 మైళ్లి దూరమున నున్నది.

156 అరశిక్కరై పుత్తూరు.

శైవభక్తునకు దారిద్ర్య నివారణకై యీశ్వరుడు దినమొక నిష్కమిచ్చిన దివ్యక్షేత్రము. కుంభకోణమునకు 4 మయిళ్ల దూరమం దున్నది.

157 శివపురం.

బ్రహ్మపూజించిన శంకరక్షేత్రము. కుంభకోణమునకు ఆగ్నేయమున 3 మయిళ్ల దూరముననున్న ప్రాచీనక్షేత్రము.

158 శాక్కోట్టై.

దివ్యుల మృతాండసులైన యనంతర మర్చనలుగొన్న శివభూమి. కుంభకోణమునకు 2 మయిళ్ల కావలనున్నది.

159 వలంగిమాన్.

సగుణలింగేశ్వరుడు, సర్వాలంకృతాంబిక, విశ్వామిత్రుడును, సగుణుడను రాజును. వాసవ, మార్కండేయాదులును పూజించిన శివక్షేత్రము. కుంభకోణమునకు 6 మయిళ్ల దూరము. యిక్కడ పట్టుచీరలు ప్రసిద్ధి.

160 తిరువాంచయం.

ఒక నాగకన్య యర్చించి మైక్యమొందిన శివక్షేత్రము. వాంఛలింగేశ్వరుడు.వృద్ధిక రేశ్వరి.నన్నిలంస్టేషనుకు తూర్పున 6 మయిళ్ల కవలనున్నది.

161 నన్నిలం.

ఇది తంజావూరుజిల్లాలోని యొక తాలూకా నగరము. చెన్నపురికి 189 మయిళ్ల దూరమందున్నది. స్టేషనుకు 3 మయిళ్ల దూరమున పెద్దదేవళమున్నది. ప్రకాశేశ్వరుడు. ప్రకాశేశ్వరి. సూర్యు డిక్కడ పూజించి స్వయం ప్రకాశుడయ్యెను.

162 తిరుక్కొండీశ్వరం.

పతీశ్వరుడు. శాంతనాయకి. కామధేను విట పూజించి యీ వియోవయ్యెను. నన్నిలంస్టేషనుకు 1½ మయిలుదూరమున నున్నది.

163 తిరువిర్కుడి.

జలంధరుడు మృతినొంది మృత్యుంజ యైక్యమొందిన క్షేత్రము వె ట్టారుస్టేషనుకు యీశాన్యమున 3 మయిళ్ల దూరమందున్నది.

164 తిరుప్పుగలూరు.

అగ్నీశ్వరుడు, వర్ధమానేశ్వరుడు. అగ్నిదేవు డీశ్వరుని పూజించి. యనుగ్రహమొందిన క్షేత్రము. నన్నిలం స్టేషనుకు తూర్పున 4 మయిళ్లలో నున్నది. ఈరెండు దేవళములును సమీపముననే యున్నది.

165 రామనదీశ్వరము.

శ్రీరామ, మృకండ మార్కండేయులు పూజించిన శివక్షేత్రము. కుంభకోణమున కీశాన్యమున 5 మయిళ్ల దూరమున నున్నది.

166 తిరుపయత్తూరు.

భైరవఋషి పూజించిన శివలీలా విలాసభూమి తిరువారూరి కు త్త రమున 10 మయిళ్ల కావలనున్నది.

167 శెంగాట్టాంగుడి. (గణపతీశ్వరము.)

గజముఖాసురుని బాధలకోర్వక తనకడ మొరబెట్టుకొనిన దేవత లను కాపాడుటకై గజాననుని సృష్టించి ఆతనిచే గజాసురునిజంపించిన శివ దివ్యభూమి. నన్నిలంస్టేషనుకు తూర్పున 5 మయిళ్ల కావలనున్నది.

* శిరుత్తొండ నాయనారను శివభక్తు డీశ్వరానుగ్రహమును పొంది సకుటుంబముగ కైలాసమేగిన మహాత్మునిదీక్షేత్రమే.

168 తిరుమరుగల్.

మాణిక్యేశ్వరుడు. భ్రమరకుండలేశ్వరి. మార్కండేయాది మహ ర్షులును పామరులగు మానవులును పూజలొనర్చి ముముక్షువులైన శైవ క్షేత్రము. నన్నిలంస్టేషనుకు తూర్పున 7 మయిళ్ల దూరమందున్నది.

169 శాత్తమంగై.

అవంతీశ్వరుడు. ప్రసూననేత్రాంబిక. అష్టావక్రుకు దర్శించిన శంభు విహార దివ్యస్థళము. నల్లారువకు నైఋతిదిక్కున 5 మయిళ్ల ధూరమం దుండునది.

170 నాగపట్టణము.

---

* నాచే రచింపఁబడి ముద్రింపనున్న శివభక్త చరితావళిలో నితని చరిత్రము తెలియనగును.

ఇది తంజావూరుజిల్లాలోని తాలూకాపట్టణము. హెడ్డసిస్టెంటు కలెక్టరును తక్కిన రాజకీయ కార్యాలయములును సౌకర్యములును గల పెద్ద పట్టణము. యిక్కడ దక్షిణాయిండియా రైల్వే వర్కుషాపు కలదు. యిది సముద్రతీర పట్టణమగుట నిటనుండి పినాంగు, సింగపూరు, సిలోనులకు యెగుమతి దిగుమతుల వర్తకము బాగుగ జరుగుచున్నది. ఇది తంజావూరు నాగూరు రైల్వే సెక్షను నందున్నది. కాయారోహణేశ్వరుడను శివ విభూతి స్థలమును సౌందరరాజ కోవెలను విష్ణుక్షేత్రమును వెలసియున్నవి.

171 నాగూరు.

ఇది నాగపట్టణమునకు $4\frac{1}{2}$ మయిలు దూరమందున్నది. యిట శివ విష్ణ్వాలయములు పెక్కున్నను మహమ్మదీయులడగు మీరాసాహేబు సమాధియే ప్రఖ్యాతిగనున్నది యీ ముసల్మానుభక్తుడు సుమారు 300 సంవత్సరములకు పూర్వమువాడట. తంజావూరిరాజు లీమహాత్ముని గోరీపై 124 అడుగులయెత్తు గోపురమును గట్టించి మడిమాన్యము లేర్పాటుచేయించిరి. యీ మహాత్మునికి హిందూ మహమ్మదీయు లందు మ్రొక్కుబడుట చెల్లించువా రనేకులుకలరు. యీ గోరీలో మంచినీళ్లతో దీపమును పెట్టుచున్నారట. చెన్నపురికి 266 మయిళ్ల దూరమున నాగపట్టణమున్నది.

172 తిరుచ్చిక్కల్.

నవనీతనాథేశ్వరుడు. శ్రీకృష్ణుడు వెన్న దొంగలించిన పాపము పోగొట్టుకొనుటకై యిక్కడ యీశ్వరుని పూజించెను. యీశ్వరక్షేత్రము. నాగపట్టణమునకు పడమట 3 మయిళ్ల దూరముననున్నది.

173 కీవలూరు.

అక్షయలింగేశ్వరుడు. పెక్కురు దేవతలు పూజించి ధన్యులైన శివక్షేత్రము. తిరువారూరికి తూర్పున 7 మయిళ్ల దూరమున నున్నది.

174 తేవూరు

దేవగురునాథేశ్వరుడు. మధురభాషిణీదేవి. గ్రీష్మతిప్రభృతు లర్చించి సిద్ధులైన శివదివ్యభూమి. ఇది తూర్పు (కీల్) వేలూరుస్టేషనుకు తూర్పున 2 మయిళ్ల దూరమందున్నది.

175 అరియార్కపల్లి.

త్రికోణేశ్వరుడు. నేత్రానందేశ్వరి. మూర్ఖఋషి మొదలగువారు పూజించిన శివక్షేత్రము. తిరువారూరి కీశాన్యమున 6 మయిళ్ల దూరమందుండును.

176 తిరువారూరు.

ఇది జనపదము. యిందు గోపుర ప్రాకారాదులతోఁగూడిన గొప్ప దేవాలయములు శివవిష్ణ్వర్చామూర్తులుగల్గి బహువిధ శిల్పాలంకార యుక్తమై యుండును. కుంభకోణమునకు 8 మయిళ్లు కావలనున్నది.

177 తిరువిళమర్.

పతంజలి మనోహరేశ్వరుడు. (యాళిణు మెన్‌మొళి.) పతంజలి ముచికుందుడు. మొదలగు భక్తవీరులు పూజించి యనుగ్రహమొందిన శివ క్షేత్రము. మాయవరమునకు తూర్పున $4\frac{1}{2}$ మయిళ్ల దూరమందుండును.

178 తిరుక్కరవీరం.

కరవీరేశ్వరుడు. ప్రత్యక్ష సౌదామిన్యేశ్వరి. గౌతమఋషి మొదలగువారు సేవించిన శైవక్షేత్రము. తిరువారూరునకు పడమట 7 మయిళ్ల దూరమందుండును.

179 పెరువేళూరు.

అవిముక్తేశ్వరుడు. తటిద్రక్షకేశ్వరి. శివశక్తి పూజించి మహేశ్వరియైన శివక్షేత్రము. తిరువారూరునకు పడమట 8 మయిళ్ల దూరమందుండును.

180 తలైయాలంగాడు.

కామినీ రక్షణేశ్వరుడు. ఉత్తమనారీశ్వరి. కపిలఋషి పూజించిన చోటు. దారుకావనఋషులంపిన,మకరముపై శివుడు తాండవమాడిన దివ్యరంగస్థలము. కోరట్టాచ్చేరు స్టేషనుకుత్తరమున 13 మయిళ్ల దూరమందుండును.

181 కుడవాయిల్. (కుడవాశల్.)

కోనేశ్వరుడు. బృహన్నాయకీదేవి, తృణబిందుఋషి పూజింపగ శివుడు ప్రసన్నుడై యాతని దేహబాధను నివర్తింపజేసిన దివ్యలీలాభూమి. కురట్టాచ్చేరి కుత్తరమున 7 మయిళ్ల దూరమందుండును.

182 తిరుచ్చేరై.

సుజ్ఞానేశ్వరుడు. జ్ఞానవల్లీశ్వరి. ధౌమ్యఋషి ప్రభృతులు పూజించిన శివక్షేత్రము. కుంభకోణమున కాగ్నేయమున 9 మయిళ్లలోనున్నది.

183 నాలూరు (మయానం) స్మశానం.

పాలాశవనేశ్వరుడు. బృహన్మాత. ఆపస్తంబాది ఋషులర్చించిన శివదివ్యక్షేత్రము. కుడవాశలుకు 3 మయిళ్ల దూరమున నున్నది.

184 ఆండాంకోయిల్. (రక్షకదేవాలయము.)

స్వర్ణపురీశ్వరుడు. శివాంబిక. కాశ్యపఋష్యాదులు పూజించిన శివక్షేత్రము. సీడా మంగలంస్టేషను కాగ్నేయమున 11 మయిళ్లయందున్నది.

185 ఆలంగుడి.

కాశ్యారణ్యేశ్వరుడు. బాలవర్ధని, విశ్వామిత్రాదులు పూజించిన హరలీలా విలాసభూమి సీడా మంగలమునకు వాయవ్యమున 4 మయిళ్ల దూరముననున్నది.

186 హరిద్వారమంగలం.

పాతాళేశ్వరుడు. అలంకారనాయకి. హిరణ్యాక్షుని జంపిన హరి యున్మాదుడైన వేళ వారాహుని హరుడు శాంతింపజేసిన క్షేత్రము. శాలియమంగళం స్టేషను కుత్తరమున 7 మయిళ్ల దూరమున కలదు.

187 అవళివ నల్లూరు.

ప్రత్యక్ష నాయకేశ్వరుడు. సౌందర్యనాయకి వరాహమూర్తి పూజించిన శివక్షేత్రము. శాలియమంగళమున కీశాన్యమున 6 మయిళ్ల దూరమందున్నది.

188 పళం (ప) పంజురం. (పరుదినియమం.)

సౌభాగ్యేశ్వరుడు. మంగళనాయకి. దివాకరాదులు దివ్యముగ పూజించిన శివవిలాసభూమి శాలియమంగళమునకు నైఋతిదిక్కున 8 మైళ్ల దూరమందుండును.

189 వెణ్ణియురాచు.

సౌందర్యనాయకి. దత్తాత్రేయాది ఋషివర్యులు పూజించిన శివస్థలము. అమ్మాపేట స్టేషను కీశాన్యమున 3 మయిళ్ల కావలనున్నది.

190 పూవనూరు.

పుష్పవనేశ్వరుడు. కల్పకవల్లీదేవి. శుక, గర్గ, జరాసంధాదులు పూజించిన శైవక్షేత్రము సీడా మంగళంస్టేషనుకు నైఋతిమూల 7 మైళ్ల లోకలదు.

191 పామణి.

సర్పపురేశ్వరుడు. అమృతనాయకి. ఆదిశేషుడు నాతని చుట్టాలును సేవించిన శివక్షేత్రము. సీడామంగలమునకు 10 మయిళ్ల దూరమున నున్నది.

192 తిరుక్కళర్.

సుందరేశ్వరి. పరాశర గాలవమహర్షులు అర్చించిన పారంక్షేత్రము. తిరుత్తురై పూండిస్టేషనుకు పడమట 9 మయిళ్ల దూరమునయున్నది.

193 చిత్తాంబూరు.

స్వర్ణనాథేశ్వరుడు. అఖిలాండేశ్వరి. వ్యాసాగస్త్య మహర్షులు పూజించినస్థలము. బీదభక్తుని మెచ్చుకొని వాడెక్కడ పాదముపెట్టిన అక్కడ స్వర్ణటంకము లభించునటులు వరమిచ్చిన దివ్య శివలీలాభూమి తిరుత్తురై పూండి కుత్తరమున 8 మయిళ్ల దూరమునకలదు.

**194 ముత్తుపేట్టై.**

తంజావూరుజిల్లా తిరుత్తురై పూండి తాలూకాకు చేరిన గ్రామము. సముద్ర మిక్కడకు 7 మయిళ్లదూరము కొబ్బెరకాయ లిక్కడ విస్తారముగ కలదు. మందిరపురీశ్వరుడు. బృహదాంబిక. రామ. లక్ష్మణ. జాంబవత్సుగ్రీవ హనుమానులు పూజించిన శివక్షేత్రము. యిక్కడ షేక్దావాలియా గోరీయు మసీదును కలదు, చెన్నపురికి 228 మయిళ్ల దూరమునకలదు.

**195 పట్టుకోట.**

తంజపుర మండలములోని తాలూకాపట్నము. సముద్రమునకు 7 మయిళ్లదూరముగల ఆరోగ్యస్థానము యిట పెక్కు శైవైష్ణవాలయము లుండి యాత్రీకుల సౌకర్యముకొఱకు 25 ధర్మసత్రములుండి యితర ప్రభుత్వాలయములును. లక్ష్మీపుత్రులును దారులునగు నాటుకోట శెట్లునుగల నాగరకజనపదము. ప్రఖ్యాతిగల్గిన పట్టుమలరాయని కోటకలదు. అది యిపుడు శిలమైయున్నది. వేరుసెనగ. పనసపండ్లు. మిరపకాయలు. చింతపండు. మామిడిపండ్లు. అవారిగ పంటలుపండును. చెన్నపురికి 245 మైళ్ల దూరమునకలదు.

196 హిండింబవనము.

సద్గుణనాథేశ్వరుడు. మంగళనాయకి. హిండింబాసురుడు పూజించి బలిష్ఠుడైన శివక్షేత్రము. తిరుత్తురై పూండికి నైఋతిమూల 10 మయిళ్ల దూరమందున్నది.

197 కర్పకనార్కోయిల్.

కల్పకేశ్వరుడు. సౌందర్యనాయకి. కల్పకవినాయకుడు శివుని పూజించి మామిడిపండును పొందిన దివ్యక్షేత్రము. తిరుత్తురై పూండి కాగ్నే

యమున 10 మయిళ్ల దూరమున గలదు.

198 తండలై నీణెరి.

జ్ఞాననాయకి. మంధరాచలమును మోసిన కూర్మమూర్తి భూప్రదేశమున సాగరమును కలంప. దేవతలు భయకంపితులై శివుని ప్రార్థింప నీ శివుడా తామేటి మేటిగర్వము నడంచిన శివక్షేత్రము. తిరువారూరికి దక్షిణమున 15 మయిళ్ల దూరమునగలదు.

199 కోట్టూరు.

పల్లవేశ్వరుడు. మధురవచని. దేవతలును కుంజరఋషియు సేవించిన హరక్షేత్రము. నీడామంగలంస్టేషనుకు దక్షిణమున 10 మయిళ్ల దూరమునకలదు.

200 వెంపురై.

నాధేశ్వరుడు. నేత్రాంబిక. విద్యాధరులు పూజించిన శివక్షేత్రము. నీడా మంగళమునకు 18 మయిళ్ల దూరమున వెలసియున్నది.

201 కొళ్లంబూదూరు.

బిల్వవననాధేశ్వరుడు. సౌందర్యవతీదేవి. ఘటనది శాండిల్య ఋష్యాదులర్చించిన శివస్థలము. నీడామంగళమున కీశాన్యమున 6 మయిళ్ల దూరముండును.

202 పేరైయూరు.

సకలభువనేశ్వరుడు. మేఖలాంబ. వరుణుడు మొదలగువా రర్చించిన శివక్షేత్రము కుళి (ప్రి) క్కరై స్టేషనుకు దక్షిణమున 3 మయిళ్ల దూరముండును.

203 కొల్లిక్కాడు.

అగ్నీశ్వరుడు. మృదుపదాంబిక. సుతీక్ష్ణఋషి. సుమంతఋషి. పూజించిన క్షేత్రము. హరవిరహిత దక్షయాగధ్వంసము సేయ జన్మించిన వీరభద్రుడు పూజించిన శివదివ్యభూమి. ఆత్తంబాడి స్టేషనుకు 3 మయిళ్ల కావలనున్నది.

204 తెంగూరు.

రజతశైలనాధేశ్వరుడు. బృహన్నాయకి. హరిహరపుత్రులు పూజించి వరములువడసిన హరక్షేత్రము. తిరువారూరికి దక్షిణమున 10 మైళ్ల దూరమున నుండును.

205 నెల్లిక్కా.

ఆమలకేశ్వరుడు. మంగళనాయకి. దారుకావనఋషులు పూజించిన మృత్యుంజయక్షేత్రము. తిరువారూరికి దక్షిణమున 8 మయిళ్ల దూరమందున్నది.

206 నాట్టియత్తాంగుడి.

మాణిక్యవర్ణేశ్వరుడు. పర్వతనారీశ్వరి. ఏనుగు పులస్త్యుడు. ఇభకంటకుడు. మొదలగువారు పూజించిన క్షేత్రము. తిరువారూరికి దక్షిణమున 6 మయిళ్ల దూరమందుండును.

207 తిరునాట్టి యెత్తంగుడి.

రత్నపురీశ్వరుడు. మంగళనాయకి. మన్నారుగుడికి సమీపమున నున్న పెద్ద శైవదేవళము. చెన్నపురికి 203 మయిళ్ల దూరమున నున్నది.

208 మన్నారుగుడి.

తంజావూరు జిల్లాలోచేరిన మునిసిపల్ పట్టణము యిక్కడనుండు 9 దేవళములలో 4 విష్ణువునకును. 5 శివునకును చెందినవి. మీన మేష మాసములలో నత్యంత వైభవములతో నుత్సవాదులు జరుగును. తంజావూరి రాజులలో నొక్కండగు విజయరాఘవులు నాయనింగారిచే త్రవ్వింపబడిన తటాకము 1158 అడుగుల నిడివియు, 837 అడుగుల వెడల్పును గలిగి ఆ తటాకమధ్యమున నొక్క ఉపవనమును రాజమన్నారు శివాలయమునుగల్గి చూచుట కానందదాయకమై యలరారుచుండును. చెన్నపురికి 225 మయిళ్లదూరమున కలదు.

209 మంగనల్లూరు.

మాయవరమునకు మువ్వాతికమైలు దూరమందుండు విశేషమైన యీశ్వర క్షేత్రము. జనపదము.

210 వాదాపూరు.

దారుకావనంబున శివునిదర్శించుటకై ఋషులు తపముసేయ వారినిక్కంపుభక్తిని తెలిసికొనన నుద్దేశించి శివుడు సన్యాసియై దిగంబరుడై. కామోద్రేకగీతములు పాడుచుండు నాసమయమున ఋషిపత్నులు కామించి యాకపటయతిని జేరరా నతడు మాయమయ్యెను. యీసన్యాసి నిక్కంపుగతి తెలిసికొనలేని మహర్షులొక్క మదగజమును సృష్టించి సన్యాసింజంపంబంప శివుడా గజముపొట్టను చీల్చి అట్టె ఋషులకు కట్టెదుట గన్పట్టినట్టి రూపము చిత్రింపబడి మూలస్థానమున నున్నది. పెన్నూరు

యాత్రార్థులీ స్వామిని సేవింపవచ్చుచున్నారు. చెన్నపురికి 179¼ మైళ్ల దూరమందున్నది.

211 కారాయిల్.

సహస్రనేత్ర నాథేశ్వరుడు. కైలాసనాయకి. దేవేంద్రుడు, ముచికుందుడు, మొదలగువారు పూజలొనర్చిన శివక్షేత్రము తిరువారూరికి దక్షిణమున 8½ మయిళ్లదూర మందున్నది.

212 తిరుకన్నాపూరు.

మధ్యేశ్వరుడు. యోషిన్నాయకి హిండింబాసురుడు పూజలొనరించి వరములు పొందినచోటు, ఒకస్త్రీ చచ్చినదూడకై విలపింప, శివుడాకాంకాళమున జన్మించెను తిరువారూరు స్టేషనుకు 10 మయిళ్లకావలనున్నది.

213 వలివలం.

మనస్సహాయేశ్వరుడు. హంసబాలనాయకి. కారణఋషియు. నల్లపిట్టయు పూజించిన శివక్షేత్రము. శైవసమయాచార్య త్రయముచేతను పొగడ్తగన్న ప్రాచీనస్థలరాజము.

తిరువారూరి కాగ్నేయమున 6 మయిళ్లదూర మందున్నది.

214 కైచిన్నం. (హస్తచిహ్నము)

హస్తచిహ్నేశ్వరుడు. సవసజనితాంబ నాగబంధువను ఋషిచే పూజలందిన శివక్షేత్రము. తిరునెల్లిక్కాస్టేషనుకు తూర్పున 2 మయిళ్లదూరమందున్నది.

215 తిరునామూరు.

అమృతవాక్యేశ్వరి. వాయుదేవుడు, ముచికుందుడు పూజించిన శివక్షేత్రము. తిరువారూరి కాగ్నేయమున 15 మయిళ్లదూరమున కలదు.

216 వేదారణ్యం. (తిరుమరైక్కాడు)

వేదారణ్యేశ్వరుడు, సత్యవాక్యేశ్వరి. వేదచతుష్కము చేతను ముచికుందసార్వభౌముని చేతను శైవసమయాచార్య త్రయముచేతను నుతులుగొన్ని స్థలము నాగపట్నమునకు దక్షిణముగ30మయిళ్లదూరమునన్నది.

217 అగ్గిత్తియాన్ పల్లి.

అగస్త్యేశ్వరుడు. కామినీనాయకి, అగస్త్యమహర్షియు దేవతలును. పూజించిన హరక్షేత్రము వేదారణ్యమునకు దక్షిణముగ 1 మయిలుదూరమున నున్నది.

218 కోడిక్కరైకుళ(ఴ)గర్. (మైయార్ తడంగణ్ణి)

అమృతఘటేశ్వరుడు. వాయుభగవాను డింకను పూజించునటులే. అర్చనాసమయమున పెనుగాలివీచుచున్నది. అనేకదేవతలును ప్రమథగణములును పూజించిన శంభుక్షేత్రము. వేదారణ్యమునకు దక్షిణముగ 6 మయిళ్లదూరమందుండును.

219 ఆవుడయార్ కోవిల్. (పెరుంపురై)

ఆత్మనాథేశ్వరుడు. ఉమాదేవి, ఇదియొకప్రసిద్ధ శివక్షేత్రము. ఆత్మనాథేశ్వరాలయమునకు 3 ప్రాకారములును, స్వర్ణకలశాలంకృతగోపురత్రయమును గలదు. మొదటిగోపురము 200 అడుగులుగలది బయటిప్రాకారపు గోడయెత్తు 25 అడుగులుండును. దీనిలో అనేకాలయములును మండపములును తెప్పగుంటయుకలదు. గోపురద్వారములనుదాటి లోనికేగిన నానావిధ చిత్రాలంకార యుక్తమై 50 స్తంభములుగల పంచాక్షరమండపముండును. దీనిప్రక్క త్యాగరాజమండపముకలదు. యీమండప శిలలు అతుకు తెలియనంత సున్నితముగనుండును, ద్రావిడగ్రంధాక్షరయుక్త తాళీపత్రగ్రంథ సముదయ మీమండపముననే కలదు దీనికిపశ్చిమమున శ్వేతవినాయకుడు వెలసియున్నాడు. పిళ్లారిగుడికి వెనుక 200 అడుగులనిడుపును 150 అడుగుల వెడల్పునుగల్గి. పరిశుద్ధపావనోదక తటాకమున్నది. యీకాసారమున కీశాన్యముననుండు త్యాగరాయమండపము బహువిధ శిల్పనైపుణ్యముతో నొప్పారియిందొక్క రాతియందే గొలుసువలె చెక్కబడి వ్రేలాడుచున్నది. యీమండపమున కుత్తరపుగోడ నొకప్రాచీనవృక్షరాజము వేదికాయుక్తమై భక్తిభావోద్బోధకమై యున్నది. యిక్కడి పూజారులు ప్రాచీనశాఖీ బ్రాహ్మణులు, ఇదిచెన్నపురికి 273 మయిళ్లదూరమందున్నది.

220 అరందాంగి.

ఇది తంజాపురిజిల్లాలో నొకతాలూకాపట్టనము, ఆవుడయార్ కోవెలకుత్తరమున 8 మయిళ్లదూరమునగలదు యిక్కడజరీ, పట్టుగుడ్డలును, మహమ్మదీయులు ధరించుకైలేయను వస్త్రములును తయారుచేసి సింహళము మొదలగు ద్వీపముల కెగుమతియగుచున్నది. యీగ్రామసమీపము నశిథిలమైనకోట యొకటికలదు, వీరమహాకాళియను శక్త్యాలయమొందుండి, భక్తాభీష్టప్రదాయినియై, వెలయుచున్నది.

221 శీర్కాళి(ళి). (శియ్యాళి)

తంజాపూరిజిల్లాలోని తాలూకాపట్టణము. బహుళములగు శైవవైష్ణ

వాలయమునుగలవు. యాత్రీకుల సౌకర్యార్థము, సత్రములును హోటళ్లునుగలవు. పశువుల సంతలు జరుగుచుండును. చెన్నపురికి 165 మయిళ్ల దూరమందున్నది.

222 కావేరి పట్నం.

శియ్యాళికి కొన్నిమయిళ్లదూరములో కావేరిసాగరమున సంగమించుచోటుకలదు. ఇది సముద్రతీరస్థ గ్రామము. సముద్రమున కావేరిసంగమించుచోట సన్ననిపిల్లకాలువవలె ప్రవహించిసంగమించును. ప్రతికటకమాసముననువేలకొలది యాత్రీకులీసంగమ స్థలమున గ్రుంకులిడుటకు విజయము చేయుదురు.

223 తిరుమల్లైవాయల్. (అణికొండకోట్టై)

మల్లికావన నాథేశ్వరుడు. ఇంద్రసుధర్మాదులు పూజించిన శివక్షేత్రము. శియ్యాళికుత్తరమున 3 మయిళ్లదూరమున గలదు.

224 శాయికాడు. (ఛాయావనం)

ఛాయావనేశ్వరుడు, కోకిలాస్వరాంబిక, కావేరీనది. ఉపమన్యుబుషిపూజించిన శివదివ్యభూమి శియ్యాళికి దక్షిణమున 9 మయిళ్ల దూరమున కలదు.

225 కావేరి పూంబట్టినం.

పల్లవ వనపూర్ణేశ్వరుడు. సౌందర్యాంబిక, కావేరినది, పల్లవుడను రాజర్షి పూజించిముక్తుడైన శివక్షేత్రము, శియ్యాళి కాగ్నేయమున 10 మయిళ్ల దూరముననున్నది.

226 అన్నప్పన్ పేట్టై. (కలిక్కాముూరు.)

సుందరేశ్వరుడు, సుందరవనకుచాంబిక. పరాశరబుషి పూజించిన శివదివ్యవిలాసభూమి తిరుముల్లైవాయలుకు నైఋతిమూల 3 మయిళ్ల దూరమందున్నది.

227 వెణ్కాడు. (శ్వేతారణ్యం)

శ్వేతారణ్యేశ్వరుడు, బ్రహ్మవృద్ధినాయకి తారకాసురునితో సమరమొనర్చి దంతభగ్నమైన సామజ, మిటపూజించి పూర్ణదంతయుక్తమైన దివ్యశివక్షేత్రము శియ్యాళికాగ్నేయమున 7 మయిళ్లదూర మందున్నది.

228 తిరుక్కాట్టుపళ్లి.

ఆరణ్య సుందరేశ్వరుడు. అఖిలాండనాయకి. కావేరినది దేవేంద్రుడు

వృత్రావధానంతరము తద్బ్రహ్మహత్యా పీడితుడై రాజ్యభ్రష్టుడై యుండ దేవత లిక్కడ ఆరాధించి యింద్రుని స్వర్గాభిషిక్తుని జేయించిన శంభులీలా విలాస పుణ్యభూమి. శ్వేతారణ్యమునకు 1 మైలు దూరమునకలదు.

229 కురుకావ్వాయు.

ధవళేశ్వరుడు. కావ్యనేత్రాంబిక. సుందరమూర్తిస్వామి క్షుత్తును నివారించిన శివక్షేత్రము. శియ్యాళికి తూర్పున 4 మైళ్ళ దూరమందున్నది.

230 వైదీశ్వరన్ కోవిల్.

వైద్యనాథేశ్వరుడు. కాంతానాయకేశ్వరి. జటాయు. సంపాతులు పూజించిన శివక్షేత్రము. యింద్రు డిక్కడ అర్చించియే వజ్రాయుధమును పొందినది. యీ కోనేల మిగుల రమ్యముగ నిర్మింపబడినది. ప్రయాణీకు లకు సౌకర్యముగ బాడ్జును ధర్మశాలలును, ఉపాహార విపణులును గలవు. అయ్యంపేట స్టేషను కీశాన్యమున 13 మైళ్ళ దూరమునగలదు.

231 కురుమాణక్కుడి. (ముగుఖువకెక్ కోద్రై.)

సాహస్రనేత్రేశ్వరుడు. దేవేంద్రుడు పూజించిన శాంభవక్షేత్రము. ఆనంద తాండవపురి స్టేషను కీశాన్యమున 4 మైళ్ళ దూరమందున్నది.

232 కీళూరు.

వ్యోమకేశేశ్వరుడు. అభిరామాంబిక. సృజనశక్తి కల్గుటకై బ్రహ్మ యర్చించిన యభవభూమి. ఆనందతాండవ పురమునకు 10 మైళ్ళ దూర మున వెలసియున్నది.

233 తిరునిన్రవ్పూరు.

మహాలక్ష్మీశ్వరుడు. లోకనాయకి. మహాలక్ష్మి పూజలొనర్చిన శివక్షేత్రము. జలంధరాసుర భార్యయగు బృందను మోహించిన విష్ణువు జలంధరుని రూపముతో పతివ్రతయగు బృందను గలసిన పిదప బృంద కా వార్త తెలిసి. విదయై చితిపై యాత్మనిపాలుగాగ విష్ణువు బృందా వియోగ మునకుం జింతాకులుడై చితికడనుండ శంభుడు తులసీబీజము లిచ్చి చితిపై విత్తించి మరుజన్మమున విష్ణువును బృందను పొందజేసిన క్షేత్రము. శైవస మాయాచార్యత్రయముచే నుతులువడసిన క్షేత్రము. ఆనంద తాండవపురమునకు నైఋతిమూల 1 మైలు దూరమందున్నది.

234 పున్నూరు.

శివలోకనాథేశ్వరుడు. చొక్కనాథేశ్వరి. సౌందర్యేశ్వరుడు. బృహ న్నాయకి. ఇక్కడ 2 యీశ్వరాలయములు కలవు. వైద్యేశ్వరుని గుడికి

పడమట 2 మైళ్ల దూరమందున్నది.

235 నీడూరు.

దయా సోమనాథేశ్వరుడు. సహస్రభుజేశ్వరి త్వష్టను చంపిన పాప నివారణమునకై బిడౌజుడు పూజించిన శివక్షేత్రము. ఆనైతాండవపురము స్టేషనుకు నైఋతిదిక్కున 1 మైలు దూరమందున్నది.

236 అన్నియూరు.

ఆపత్సహాయేశ్వరుడు. బృహన్నాయకి వరుణదేవుడు పూజయొనర్చిన శివదివ్యక్షేత్రము. మాయవరంస్టేషనుకు 8 మైళ్ల దూరమునయున్నది.

237 వేళ్విక్కుడి.

కల్యాణసుందరేశ్వరుడు. పరిమళసుందరనాయకి. తనకై నిశ్చయించిన రాకుమారికి తలిదండ్రులు గతించిన పదంపడి దాని బంధుప్రియ వందున యీశ్వరుని తపముచే ప్రత్యక్షముజేసికొని పెండ్లియాడిన యొక రాజకుమారునిచే నర్చింపబడిన క్షేత్రము. కుత్తాలంస్టేషను కీశాన్యమున 1 మైలు కావలనున్నది.

238 ఎదిర్కొళ్పాడి.

ఐరావతేశ్వరుడు. కుసుమబాలాంబ. పై క్షేత్రము నర్చించిన రాకొమరుడు సతీయుతుడై స్వరాజ్యమున కేగుచుండ వాని మేమనస్కోర్కె యీశ్వరువేషము వేసికొని యీ దంపతుల నెదుర్కొని కొనిపోయిన శివస్థలము. ఐరావతమర్చించెను. వేళ్విక్కుడి కీశాన్యమున 2 మైళ్లలోనున్నది.

239 మణంజేరి.

కృపామర్థేశ్వరుడు సింహగర్జాంబిక. మన్మథుడు భక్తితో పూజలొనర్చిన శివక్షేత్రము. కుత్తాలంస్టేషను కీశాన్యదిక్కున 3 మైళ్ల దూరమందున్నది.

240 కురుక్కై. (కురుక్కై వీరట్టాణం.)

వీరస్థానేశ్వరుడు. జ్ఞానాంబిక. మార్కండేయమహర్షి పూజించిన స్థలము. నిర్జరప్రేరణమున మన్మథుడు తపముచేయు మహేశ్వరుని కుసుమాస్త్రములచే కలంప నాతండు మూడవకన్నెరచి మాడునిమాడ్చినచోటు. ఆనైతాండవపురమునకు పడమట 7 మైళ్ల దూరమందున్నది.

241 మైలైక్కాట్టూర్ (శి.)

పాపక్షమానాథేశ్వరుడు. ధనురాంబిక. దేవేంద్రుడొకనాడు మమః కాలమున కైలాసమున కేగుచుండ శివుడు భూతమై యెదురా నింద్రుడు

కులిశముచే నా భూతమును బాధువ పరిచేవచెడెను. అపు డింద్రునికి శివుడు ప్రత్యక్షముకాగా యింద్రుడు శివుని పూజించి వరములుపొందిన దివ్యక్షేత్రము. వైద్యేశ్వరునిగుడికి పడమట 4 మైళ్ల దూరముననున్నది.

242 వాఴ్ర (శ) పూవ్వారు.

మాణిక్యవణ్ణేశ్వరుడు. మోచాతుసుమేశ్వరి. విష్ణువు మాణిక్యములచే పూజించిన శివక్షేత్రము. వైద్యేశ్వరునిగుడికి పడమట 5 మైళ్లి దూరమందున్నది.

243 ఇలుప్పప్పట్టు.

నీలకంఠేశ్వరుడు. అమృతకరవల్లీ దేవి దేవల ప్రార్థనలకియ్యకొని శంకరుడు గరళమును మ్రింగగా భవాని. భర్తమింగిన విషమును గర్భములోనికి పోనీక తన కరముతోనాపినట్లు నిర్మాణించిన శివభూమి. వాఴ్రపూవ్వారుకు పడమట 2 మైళ్లలోపల నున్నది.

244 పందణైనల్లూరు. (కాంబనదోళియమ్మై.)

పశుపతీశ్వరుడు. వసిష్ఠు డాహ్వానించిన విశ్వామిత్రుడు కామధేనువును గోరి కామధేనువువలన ఉత్పత్తియైన భటులతో పోరి యోడిన విశ్వామిత్రుని కామధేను వీచోట శత్రువుతో స్నేహముచేసినది. తిరువిడ మరుదూరుస్టేషను కీశాన్యమున 7 మైళ్లి కావలనున్నది.

245 కంజనూరు.

అగ్నీశ్వరుడు. కల్పనాయకి. కావేరీనది. అగ్ని. బ్రహ్మ. మార్కండేయుడు. యింద్రుడు మొదలగువారు భక్తియుక్తులై పూజించిన శివక్షేత్రము. పందణైనల్లూరున కీశాన్యమున 2 మైళ్లి దూరమందున్నది.

246 కోటికా:

కోటికాయేశ్వరుడు. తన్వంబిక. కావేరీనది. త్రివాకేశ్వరుడు. త్రిపురసుందరి. ముక్కోటిఋషులు పూజించిన శివక్షేత్రము. తిరువిడ మరుదూరికి తూర్పున 1 మైలు కావలనున్నది.

247 మంగళక్కుడి.

ప్రాణవరదేశ్వరుడు. మంగళనాయకి. కావేరీనది. ఒక రాజర్షికి దిగ్విజయమును చేకూర్చిన శివక్షేత్రము. తిరువిడ మరుదూరన కీశాన్యమున 3 మైళ్లి దూరమున నుండును.

248 తిరువైయారు. (పంచనదీక్షేత్రము.)

పంచనదేశ్వరుడు. ధర్మసంవర్ధని. కావేరీనది. ధర్మదేవత కలిచే

హీనపాదమై యిక్కడి శివుని పూజించి ధర్మము భూలోకమున శాశ్వతముగ నుండునటులు వరములుగొన్న దివ్యక్షేత్రము. శైవ సమయాచార్యత్రయముచే నుతిగొన్నది తంజావూరి కుత్తరముగ 7 మైళ్లదూరమున కావేరీనది కుత్తరపుగట్టున నున్నది. పంచనదేశ్వరాలయము నానావిధ శిల్ప నైపుణ్యము గల్గియుండి దక్షిణకాశినా బరగుటకతన యిక్కడ మృతినొంద వలెనని పెక్కుడు కాపురమున్నారు. వీరిలో విప్రజను లధికముగ నున్నారు. 5 నదులున్నది.

249 తిరుప్పూనం.

ఆప్తనాధేశ్వరుడు. బృహతీశ్వరి. కావేరీనది. అష్టదిక్పాలకులును పూజింపగా వారికి శాశ్వతముగ దిగధీశ్వరత్వ మిచ్చిన శంకరక్షేత్రము. తిరువైయారునకు తూర్పున 2 మైళ్ళ దూరమందున్నది.

250 తిరునెయిత్తానం.

ఘృతస్నానేశ్వరుడు. బాలాంబిక. కావేరినది. సరస్వతీదేవి పూజించిన శివదివ్యక్షేత్రము. తిరువైయారునకు పడమట 1 మైలు దూరమున నున్నది.

251 పెరుంపులియూరు.

వ్యాఘ్రపురీశ్వరుడు. సౌందర్యనాయకి. కావేరీనది. వ్యాఘ్రపాదమహర్షి పూజించిన శివక్షేత్రము. తిరువైయారునకు పడమట 2 మైళ్లదూరమున కావలనున్నది.

252 మళ్లపాడి.

వజ్రస్తంభేశ్వరుడు. సుందరాంబిక. కొల్లడనది. వజ్రపాణి యర్చింప వాంఛలనొసంగిన శివక్షేత్రము. నెయిత్తానమునకు వాయవ్యమున 2 మైళ్ల దూరముననున్నది.

253 పళ్లపూరు.

ఉదీచ్యవన నాథేశ్వరుడు. అతిశయతపేశ్వరి కొల్లడనది సప్తకన్యలు పూజలొసగ్చిన శివక్షేత్రము. తిరువైయారు కుత్తరమున 10 మైళ్ల దూరముననున్నది.

254 తిరుకానూరు.

హరిచ్ఛరీశేశ్వరుడు. శివయోగనాయకి. కొల్లడనది. భవాని శివయోగమందున్నపుడు భవు డగ్ని తేజముతో ప్రత్యక్షమై కోర్కెలీడేర్చిన దివ్యస్థలము. పూడలూరుస్టేషను కుత్తరమున 7 మైళ్ల దూరముననున్నది.

255 తిరువమాల యందురై.

సత్యవాక్యేశ్వరుడు, సౌందర్యనాయకి. కొల్లడంనది. బ్రహ్మ. విష్ణువు. దేవేంద్రుడు. వాగీశ్వరుడనుఋషి. వీరుపూజించి యాప్సితములీడేర్చుకొనిన శివక్షేత్రము. తిరుక్కాటూరికి ఉత్తరమున 5 మైళ్లదూరమునగలదు.

256 మాందురై.

ఆమ్రవనేశ్వరుడు. సౌందర్యాధికృతేశ్వరి. చూతవృక్షమును కణ్వమహర్షియు పూజించిన శివక్షేత్రము తిరువానైక్కావు కీశాన్యమున 10 మైళ్లదూరమున కలదు.

257 చితంబరము. (చిత్రకూటం)

నటనసభాపతి. శివకామేశ్వరి. దక్షిణఆర్కాడు జిల్లాలోని తాలూకాపట్టణము. రైలుస్టేషనుకు సమీపమున అతిసుందరముగ కట్టబడిన యీ దేవాలయపుచుట్టుకొలత సుమారు 40 యేకరముల విస్తీర్ణముండును. నాలుదిక్కుల నాలుద్వార గోపురములును. మొదటి గోపురమును దాటిపోగా రెండవగోపురద్వారమున, 1000 కాళ్లమండపమును, స్వర్ణకూపమును. నందివిగ్రహమును కొన్నిచిల్లరగుళ్లును చూడవచ్చును. మూడవప్రాకారమున లక్ష్మీసన్నిధియు వాహనమండపములును, మూలస్థానమును, శివవిగ్రహమును పార్వతీదేవి కోవెలయు చిన్నమండపములు నుండును. నాల్గవప్రాకారములో నటరాజమండపమును. గోవిందరాజుల (విష్ణువు) దేవాలయమును. చూడవచ్చును. తొమ్మిది బంగారుశిఖరములు కలిగిన గోపురమున వెండితగుడుతో కప్పినతలుపులును గల విమానమున నాలుభుజములతో తాండవమాడు, నటరాజమూర్తిని దర్శింపవచ్చును. యిక్కడ యేకకాలముననే. శివకేశవులను దర్శనముసేయవీలగును. వైష్ణవాలయములందు శివునిప్రతిష్ఠింపరు అథవాప్రతిష్ఠయుండిన, రూపుమాపిరో, పూజానైవేద్యాదులు లేకనోపడియుండును. కరకరత్నమయ విగ్రహములు కలవు యిక్కడిఅర్చకులు. 3000 వేలమంది. కానియిపుడు 300 మంది మాత్రమేకలరు. వీరిలోగల యక్రమాచారములలో నత్యంతఘోరమైనది. 5 సంవత్సరముల బాలున కుపనయవివాహములు జరుగుటయే. శాంతం పాపం శాంతంపాపం. ఇక్కడ పచ్చయప్పమొదలారిగారి యున్నత విద్యాలయముకలదు చెన్నపురికి 151 మైలుదూరమున నున్నది.

258 దక్షిణార్కాడు.

పాటలేశ్వరుడు. మంగళాంబ. పినాకినీనది. వ్యాఘ్రపాద మహర్షి

పూజించినందువలన యీక్షేత్రమునకు పులియూరను సార్థకనామము కలిగినది. దేవాలయములో పాటలీవృక్షముకలదు. ఇదిదక్షిణార్కాడు జిల్లా ప్రధానసగరము. యీపురమునిసపాలిటి సరిహద్దులలో కొన్నిగ్రామములు చేరియున్నవి. కావున దీనికే. కడలూరు. తిరుప్పాపులియూరు. మంజకుప్పం మొదలగు పేర్లుకలవు. యిక్కడి పాటలీశ్వరాలయమును నాటుకోట సెట్లు శుద్ధముగను సుందరముగను క్షీణభాగములను పూరించియున్నారు. చూచుటకు చాల అందముగనుండును. చెన్నపురికి 127 మైళ్లదూరమున సముద్రతీరమున నున్నది.

259 అరుణాచలం. (అణ్ణామలై)

అరుణాచలేశ్వరుడు. అపీతకుచాంబ. బ్రహ్మ విష్ణువు లొకరికొకరు సృష్టికర్తృత్వమునుగూర్చి వివాదపడుచుండ యీశ్వరుడు తన తేజమును వారికింజూపి వారియహంకారము నణచిన శివక్షేత్రము. తేజోలింగము. స్వామి నెలకొనియుండుపర్వత ముదయ సమయమున నరుణకాంత్యుజ్వలమై యుండుటను బట్టియే దీనికరుణాచల మనిపేరు. యీకోనెలకు 9 మొదలు 11 అంతస్తులవరకుగల నాల్గుగోపురములును ప్రాకారములతోడను ప్రకాశించుచున్నది. దేవాలయములును మండపములును మంచిపనితనము గలిగి చూచుటకు సుందరమైయుండును. కార్తికమాస శుక్లపక్షమున 10 రోజులు బ్రహ్మోత్సవము జరుగును. కార్తిక శుద్ధపూర్ణిమనాటికి గోపురపు పెద్దగూటిలో దీపమును వెలిగింతురు. యీనాటికి యాత్రికులు లక్షల కొలదివచ్చి కర్పూరమును నేయియుపోసి దీపగుండమును నింపింతురు. వీనిసాహాయ్యమున ఆదీపము 2 3 రోజులదాక. వెలుగుచుండును, నాటుకోటసెట్లును. తంజాపూరిరాజులును ధర్మసత్రములు కట్టించియున్నారుగ ప్రయాణికులకు వలయుసౌకర్యములు కలవు ఇదియొక తాలూకాపట్టణముగ నుండి చెన్నపురికి 141 మైళ్లదూరమున విల్లుప్పురమునకు 40 మైళ్లదూరమున కలదు.

260 తిరుక్కోయిలూరు.

త్రివిక్రమేస్వామి. కమలాలయ పశ్చిమాభిముఖుడై యుండిమృకండ, బలిచక్రవర్తులకు ప్రత్యక్షమైన కేశవక్షేత్రము. దక్షిణార్కాడు జిల్లాలోని యూనియనుజనపదము (దక్షిణ) పినాకినీనదియొడ్డున రమ్యమైన స్థలమున నానావిధ చిత్రాలంకార శిల్పసామర్థ్యము నెలియగునట్లు కట్టించిన దేవాలయములు గల్గియున్నది. యేటియొడ్డునయున్న పెద్దదేవళమున

వినాయకుడున్నాడు. సమీపపర్వతముపై సాహసపడిన దేవ... కొండల లోకొన్ని గుహలునుగలిగి, తపోభూమియై ప్రకృతిచిత్రగౌరవ యాత్ర ముపోల్కినున్నది. చెన్నపురికి 118 మైళ్లదూరమున నున్నది.

261 పక్షితీర్థం.

వేదగిరీశ్వరుడు, త్రిపురసుందరి. అష్టవసువులు, నందీశ్వరుడు, ఇంద్రుడు. మొదలగు వారర్చించి కోర్కెలీడేర్చుకొన్న శివక్షేత్రము. శైవసమయాచార్యులు మువ్వురిచేతను నుతులుగొన్నది. పర్వతముపై దేవళము న్నది. యీపర్వతమంతయు సంజీవని వృక్షములు నిండియున్నవి. కాశీరామేశ్వరములనుండి ప్రతిదినమధ్యాహ్నము 2 పక్షులువచ్చి పండారము. అను పూజారిపెట్టు, చక్కెరపొంగలి, నెయ్యి, పాలు, తిని, త్రాగి, పోవుచుండును. దీనినిబట్టియే యీక్షేత్రమునకు పక్షితీర్థమని పేరువచ్చినది. యాత్రార్థులకిందువలయు అన్నిసత్రములు 20 కలవు. బైరాగులకు సదావర్తిని త్తురు. నాటుకోటసెట్టి 20 బ్రాహ్మణకుమారుల కన్నముపెట్టి వేదముల నుచెప్పించుచున్నారు. చెంగల్పట్టునకు నైఋతిమూల. 9 మైళ్లదూరమున నున్నది.

262 తిరుప్పోరూరు.

సుబ్రహ్మణ్యస్వామి. వలవీ దేవసేనలు, అనేకులు సిద్ధులు. దేవతలు పూజించి. సిద్ధసంకల్పులైన దివ్యక్షేత్రము, ప్రతికృత్తికకును. అందుకటక మాసమునవచ్చు కృత్తికయు మకరమాసపు కృత్తికయు విశేషము చెంగల్పట్టునకు పోవుమార్గములో నున్నది.

263 కాంచీపురం. విష్ణుకంచి.

కంపానదితీర్థం వరదరాజస్వామి. శ్రీభూదేవులు. మోక్షదాయక నగరము లేడింటిలో నొక్కటియై కాళిదాస కవీంద్రునిచే, నగరేషుకాంచీ, యనుపొగడ్తగన్నదై నూటయెనిమిది దివ్యతిరుపతులును నూట యెనిమిది శివాలయములును గలిగి వాక్ శ్రీలకిరవైన కాంచీనగరాధన్యము నెంత వర్ణించినను తీరదు. యిది చెంగల్పట్టు జిల్లాలోని యొకతాలూకాపట్టణము. యీజిల్లాలో యింతపెద్దమునిసిపాలిటీ పట్టనము వేరులేదు. పూర్వమునచోళ రాజుల ప్రధానపట్టనమై నానావిధశిల్పాలంకారయుక్తమైయుండి యంతకు పూర్వము బౌద్ధజైనుల కావాసభూమియైయుండి వన్నెకెక్కెను. యిప్పటికి జైనులును బౌద్ధులును చాలమంది కలరు. చిన్నకంచియనుచోట శ్రీ వరదరాజస్వామి యాలయముకలదు. అస్తగిరియను ఉన్నతభూమిపై వరదాసు

నెలకొనియున్నాడు. సన్నిధ్దరాళ్వార్లును, నాంచార్లుభక్తులు, వీరితో పరి వేష్టించియున్నాడు. శ్రీస్వామివారి విమానమండపమునకు 5 ప్రాకారము లుకలవు. పంచతీర్థ... లును చిల్లరసన్నిధులునుగలవు. సన్నిధివీధిలో భక్తు లును, దక్షిణ ...లో సంజీవరాయనును, నంబులును, ఉత్తరపువీధి లో కృష్ణమూర్తియు రథస్థానము. గంగైకొండాన్ మండపములో నొకసం జీవరాయ దేవళమునుకలదు. ఈ గుడికగు జమాఖర్చు లెక్కలు.

| | | |
|---|---|---|
| ప్రభుత్వమువా రిచ్చునది. సంవత్సరమునకు. | | 15170- 0-0 |
| శ్రోత్రియమునవలన రాబడి | ,, | 4019-15-1 |
| శ్రీవేంకటగిరిరాజా తోటరాబడి. | ,, | 200- 0-0 |

ఈ మొత్తమునుండి నిత్యగోష్ఠికి 50 మందికిని పంచపర్వములలో 70 మందికిని వీధియుత్సవములలో 60 మందికిని బ్రహ్మోత్సవ ములలో 500 మందికిని తళిగ లొసగబడుచున్నవి.

ఉభయముల కగు సెలవులకు.

| | |
|---|---|
| శ్రీ వేంకటగిరి రాజాగారు. గరుడసేవ కిచ్చునది. | 800-0-0 |
| ఆరణి జాగీర్దారు పున్నమకిచ్చునది. | 87-8-0 |
| రాజగుంట తెప్పోత్సవమునకు. | 175-0-0 |
| రాజగోపాలాచారిగారు చిత్రాపున్నమకు చలిపందరికి. | 140-0-0 |
| నవాజీపేట యుత్సవమునకు. | 52-8-0 |
| సీని. కృష్ణ. తాతాచార్యుద్వయ మొసర్చు వనోత్సవమునకు. | 70-0-0 |
| కనకమ్మధర్మా. వసంతోత్సవమునకు. | 70-0-0 |
| ముత్యాలుపేట బలిజులు, కార్తికకి. | 17-8-0 |
| భరణి శెట్లు. | 3-8-0 |
| రాజాపేట శెట్లు గజేంద్రమోక్షమునకు. | 35-0-0 |
| వెల్లాళ శెట్లు. దీపావళి యుత్సవమునకు. | 63-0-0 |
| దేవళపు అంగళ్లవలన. | 4-0-0 |
| పచ్చప్ప మొదలారిగారి తదీయారాధన ధర్మా. | 360-0-0 |
| రాజగోపాలాచ్చారి తదీయారాధన ధర్మా. | 150-0-0 |

ఇటు లుభయులుగ వచ్చునవి మాత్రమేగాక పక్షితీర్థం మహా దేవ శెట్టిగారు. యేనుగవాహనమునకు. 600-0-0

| | |
|---|---|
| నాల్గువీధులలోని శెట్లు అందరును చేరి యిచ్చునది. | 200-0-0 |
| 5 నాటి మోహినీవేషమునాటికి 18 తిరుపతుల రాబడి. | 900-0-0 |

యివిగాక మరి అనేకవిధముల యీ దేవళమునకు రాబడియున్నది. ఇక్కడనుండు నగలు సుమారు 106935 రూపాయలని మదింపుగలదు.

మొదటిప్రభువగు లార్డుక్లైవు చేయించి యిచ్చిన కంఠె. వెల. 3682-0-0
కలెక్టరు. మిస్టర్. ప్లేసుగారు చేయించియిచ్చిన నగలవెల. 3032-0-0
కలెక్టరు. మిస్టర్. క్రోగారు చేయించియిచ్చిన చంద్రహారం వెల.371-0-0
సమీపకాలమున వెంకటాద్రిస్వాములవారు యాచించి చేయించిన కిరీటములు 3-కి. 24000-0-0
యీ కోవెల దివ్యమైన 10 గిల్టువాహనములు. 34466-0-0

రూపాయల వెలగలవి యున్నవట. ఇది యిపుడు వడగలై తెగవారి సన్నిధియైయున్నది. పూర్వమున తెంగలై సన్నిధిగ నుండినదట. వడగలైవారు తాతాచార్యుల వారి విగ్రహమును స్థాపించి పూజించు చున్నందున యిరుతెగలవారికి మనస్తాపము లేర్పడినవి. యెవరోకొందరు మణవాళ మహాముని సన్నిధి విగ్రహమును బావిలోవేసిరట. అదిమొదలీ రెండు తెగలకును మనస్పర్థలుపెరిగి కోర్టులకెక్కి పాడై శ్రీరామానుజ దేశికాచార్యుల ప్రతిష్ఠకు భంగమును తెచ్చిపెట్టి యిపుడు స్వామి వేంచేపుతో వచ్చు వడగల. తెంగల. అధ్యాపకులు పోలీసుపారాతో ఊరేగుచు ఐకమత్యమును నాశముచేసికొని యుండుట చాలగర్హ్యముగనున్నది. యిది భక్తులకు దుఃఖమును కలిగించునదిగకూడ నున్నది. దైవసన్నిధిని అందరు సములైయుండ వీరికీ భిన్నభావములేల పుట్టెనో తెలియదు. దేవాలయాంతర్భాగములలో చాలినంత దీపములు లేక చీకటిగనుండి దొంగలభయమధికముగనున్నది. వృషభమాసమున యిక్కడ జరుగు బ్రహ్మోత్సవమునకు లక్షలకొలది జనులు వచ్చుటచే చోరభయమును ప్రాణాపదయు తప్పకయుండును.

## శి వ కం చి.

దీనికే పెద్దకంచియనియు పేరు. యిక్కడ వెలసియుండు యేకామ్రనాథుని దేవాలయము సుమారు 21 యెకరముల విస్తీర్ణముకలది. దీని గోపురము 188 అడుగుల యెత్తుగలదియై శ్రీకృష్ణదేవరాయనిచే 1509 సంవత్సరమున కట్టింపబడినది. యీ దేవాలయములో చిల్లర దేవళములును సన్నిధులును చాల కలవు. మూలస్థానమందలి లింగము పృథివీలింగ మగుటచే అభిషేకాదులు జరుగవు. అపారమైనధనమును వ్యయించి నాటుకోటసెట్లు సుందరముగ దేవాలయమును క్షీణించిన భాగములును పున

రుద్ధరించి యున్నారు. ధర్మసాశశాలను నెలకొల్పియున్నారు.

| | |
|---|---|
| యీ దేవళమునకు శ్రోత్రియవరుమానము. | 1100-0-0 |
| భూములు సర్కారు యెత్తుకొన్నదానికి ప్రత్యామ్నాయము. | 705-0-0 |

యీగుడికి యిపుడున్ననగలు 20000 వేల రూపాయలు కిమ్మతుగలవియు. 10000 వేల రూపాయలు విలువగల వాహనములును గలవు. 1845 సంవత్సరమున యీ దేవళమున దొంగలు సుమారు లక్ష రూపాయల నగలను తీసుకొని పోయి 10 సంవత్సరములక్రిందట 5 గురు అగపడి శిక్షపొందిరి. ఆర్గురు వాంతిభేదివలన చచ్చిరి.

ఉ భ య ము లు.

| | |
|---|---|
| ఆడిసర్గాపేట శెట్లవలన సంధ్యాకాల నివేదన పూజాదులకు. | 576-0-0 |
| ఉచ్చకాల పూజాదులకు ధర్మకర్తవలన. | 360-0-0 |
| సాయంకాల నైవేద్యమునకు రంగయ్యనాయుడు. మాణిక్య మొదలారిగార్లవలన. | 814-0-0 |
| అర్ధరాత్రిపూజకు వెంకటగిరిరాజా. పచ్చయప్ప మొదలియారుగార్ల నిధినుండి. | 300-0-0 |
| కార్తీక సోమవారమునకు. | 50-0-0 |
| ముత్తు మునియప్ప మొదలారివలన వనభోజనమునకు. | 150-0-0 |
| పత్తిపేట కన్నడీలవలన ఆరుద్రాదర్శనమునకు. | 40-0-0 |
| కదిరపుప్పురు గ్రామవాసులవలన తెప్పోత్సవమునకు. | 80-0-0 |
| అరుణప్పంజేరి గ్రామవాసులవలన తైపుష్యమికి. | 150-0-0 |
| కుంభమాసపు ఉయ్యాలకు రెడ్డితాంగల్ గ్రామవాసులవలన. | 300-0-0 |
| నవరాత్రి ఆయుధపూజకు. | 178-0-0 |
| ప్రళయకావేరీ రత్న మొదలారి వలన దవనోత్సవమునకు. | 25-0-0 |
| కుంభమాస బ్రహ్మోత్సవమునకు సాలెవాండ్రవలన ధ్వజారోహణమునకు. | 35-0-0 |
| 3-వ దిన ఉత్సవమునకు అడిసర్గాపేట వారివలన. | 300-0-0 |
| 4-వ దినోత్సవమునకు. వాసురెడ్డి వగైరావలన. | 118-0-0 |
| 5-వ దినమునకు గుమస్తాలవలన. | 10-8-0 |
| 8-వ దినోత్సవమునకు నూలు మళిగవారివలన. | 70-0-0 |
| 9-వ దినమునకు రాజాపేటవారివలన. | 21-0-0 |
| 10-వ దినము కల్యాణమునకు గాండ్లవారివలన. | 122-0-0 |

11-వ దినమునకు పల్లెవారివలన. 250-0-0
12-వ దినమునకు ఆడిసన్ పేట గుడ్డలమండి వారివలన. 70-0-0
మేషమాస వనోత్సవమునకు అమీనావలన. 20-0-9

వృషభమాసపు సర్వతీర్థ తెప్పోత్సవమునకు. చెన్నపురి కన్యకా పరమేశ్వరీ దేవస్థానము వారివలన. 46-0-0
ఆని తిరుమంజనమునకు అప్పాప్రపంజా [illegible] వలన. 20-0-0
ధర్మకర్త చెన్నపట్టణపు అంగటి బాలసుగవలన. 48-0-0
శ్రీ వేంకటగిరి రాజాగారివలన చిత్రాపౌర్ణమికి. 160-0-0
ఏనుగు వాహనమునకు. 50-0-0
అర్ధజాము నైవేద్యమునకు. 390-0-0
సత్రపుతోట అభిషేకమునకు గుజరాతివారివలన. 35-0-0
పచ్చప్ప మొదలారి సత్రమువలన. 420-0-0

రాబడికలదు. మూలస్థానము వెనుక నొయొక మామిడిచెట్టున్నది. యీచెట్టుపేరే దేవునికిని బరగుచున్నది. యిక్కడ 108 విష్ణుక్షేత్రములును 1008 శివాలయము లున్నవనియు స్థలపురాణము చెప్పుచుండునది నిక్కమే. శిథిలమై పోషకులు లేక పాడుపడిన దేవళము లనేకములు కలవు. కుమారగోష్ఠి. (సుబ్రహ్మణ్యస్వామి.) కచ్ఛపేశ్వరసామి. త్రివిక్రమేశ్వర స్వామి. (ఉలగళంద పెరుమాళ్లు.) కామాక్షిదేవి. మరకతవర్ణస్వామి. ప్రవాళవర్ణస్వామి. దేవళములు. యిపుడిపు డభివృద్ధి నొందుచున్నది. యీనగరము అరకోణము చెంగల్పట్టులకు మధ్యనున్నది.

264 మహాబలిపురం.

చెంగల్పట్టునకు తూర్పున 18 మైళ్లదూరములోనున్నది. యిక్కడ కిపుడు మోటారు బస్సులు కలవు. యిక్కడ ఒక్కరాతిలో చెక్కిన 5 గుళ్లు గలవు యీచోటుచూచుటకు రమ్యమై మనోత్సాహకరమైన అటవీప్రదేశ మందున్నది. అన్ని దేవళములును గలదు. ఒక్కదేవళములోనే పెక్కు దేవతావిగ్రహములును రాజమూర్తులును బలిచక్రవర్తిరూపమును బుద్ధ మహాత్ముని ప్రతిరూపమును గలదు. దీనింబట్టిచూడ నొకప్పుడు బౌద్ధశైవ వైష్ణవమతములు మైత్రినెరపు చుండెనని తోచుచున్నది. తప్ప యాత్రికులకిది దర్శనీయమును ప్రాచీన శిల్పనైపుణ్య ప్రదర్శనమునై యున్నది.

265 తిరువళ్లూరు.

చెంగల్పట్టు జిల్లాలోని యొకతాలూకా పట్టణము. చెన్నపురినుండి

అరకోణమునకు పోవుమార్గములోనున్నది. వీరరాఘవస్వామియు కనక వల్లి దేవియు నెలసియున్నారు. యీప్రాంతములోని ప్రసిద్ధవైష్ణవస్థలములలో నిదియొకటి.

266 శ్రీ పెరుంబూదూరు. (భూతపురి.)

ఆదికేశవపెరుమాళ్లు. యతిరాజవల్లి. ఉడయవరులు. ఇదితిరువళ్లూరికిదక్షిణముగ 8 మైళ్లదూరమందున్నది. తిరువళ్లూరునుండి గుఱ్ఱపుబండ్లు దొరకును. యిదితాలూకా పట్టణము. దేవళమతి చిత్రాలంకారయుక్తమై యున్నది. విశేషముగ వైష్ణవులున్నారు. యిదితెంగలవారిదేవళమయ్యుమం దుగ వడగల తాతాచార్యులకును. 2 వది. యతిరాజస్వాములకును 3 వది. జయ్యంగారికిని తీర్థప్రసాదము లిచ్చుటవాడుక. యాత్రార్థులకు సత్రములును. హోటళ్లును కలవు.

267 తిరుము (ళ్లి) షి.

ఆవడిస్టేషనునుండి పూనమల్లివరకు మోటారు బస్సులును తిరుముషివరకు గుఱ్ఱపుబండ్లును దొరకును. ప్రఖ్యాతమైన విష్ణుక్షేత్రము. తిరువళ్లూరు తాలూకాలో చేరినది. చెన్నపురి అరకోణమునకు మధ్య ఆవడిస్టేషను కలదు.

268 తిరువెత్తియూరు.

చెంగల్పట్టు జిల్లాసైదాపేట తాలూకాలో చేరిన యూనియనుగ్రామము. చెన్నపురి కుత్తరమున 5 మైళ్లదూరము ప్రసిద్ధమైన శివక్షేత్రము. పెక్కుభక్తుల సమాధులును కలవు చంద్రశేఖరస్వామి. త్రిపురసుందరి. త్యాగరాజస్వామి కలదు. మూలవిరాటు చంద్రశేఖరుడే యైనను. త్యాగరాజస్వామి పేరేప్రసిద్ధము. కుంభమాసమున బ్రహ్మోత్సవముజరుగును.

269 కాలడిపేట.

వరదరాజస్వామి. శ్రీభూదేవేరులు. తిరువత్తూరికి దక్షిణముగ నొక్కమైలుదూరమున ప్రత్యక్షమైయున్న విష్ణుక్షేత్రము.

270 మీాంజూరు.

వరదరాజస్వామి శ్రీభూదేవేరులు ఏకామ్రేశ్వరస్వామి. త్రిపురసుందరి. ఇదితిరువత్తియూరున కుత్తరమున 5 మైళ్లలో కలదు. శివవిష్ణ్వాలయములు. యిందు విష్ణువునకు వృషభమాసమున బ్రహ్మోత్సవముజరుగును. కంచి. కాలడిపేట. మీాంజూరు. యీ 3 స్థలము లందొకనాడే ధ్వజారోహణా వరోహణములు.

271 చెన్నపురి.

ఇది యీరాజధానికి ప్రధాననగరము. కోరోమండల్ సముద్రతీరమున 30 మైళ్లుచదరము గలిగినది. యిది చంద్రగిరి ఆంధ్రరాజగు శ్రీరంగరాయల పరిపాలనములోని యొకబెస్తపల్లెగనుండినది. 1639 సంవత్సరమున యీస్టిండియా కంపెనివారగు ఫ్రాన్సిస్ డే అనునాతడు శ్రీరంగరాయని యుత్తరువునుపొంది యొకవర్తకశాలను కట్టిరి అదియేయిప్పటి ఫోర్టు సెంటుజార్జి యనుకోటగ తిరిగినది. జార్జిటౌనులోని ఆర్మీనియన్ సెంటు మేరికోవెలకు. మెట్రిలైన్. అనుపేరబరగి రానురాను అదియే మెడ్రాసు, మదరాసు. అయినది. ఓడరేవుపట్టణము. రంగూను బర్మా కలకత్తాల కిట నుండి పొగయోడలు పోవుచున్నవి. బీచిరోడ్డులో పెద్దపెద్దహారి శ్రామకాలయములును. జనరల్ పోస్టాఫీసును. కస్టంహౌసు మొదలైనవి కలవు. ప్రధానన్యాయస్థానము. ఉన్నతన్యాయస్థానము. న్యాయశాస్త్ర బోధనాభ్యసనపాఠశాల. పచ్చయప్పకలాశాల. క్రైస్తవకలాశాల. వెస్లీకలాశాల, ఉన్నతవిద్యాలయములు, జంతుప్రదర్శనశాల. ప్రాచ్యలిఖితగ్రంథాలయము. రాజధానికలాశాల, రాజధానిపాలకుడు. శాసన, కార్యనిర్వాహక సభలును, మత్స్యప్రదర్శనశాలయుకలవు. మరియు పెక్కుకార్యాలయములును, చిత్రలేఖనాభ్యసన వైద్యవిద్యాభ్యసన పాఠశాలలును కలవు. జనరల్ వైద్యశాలయు, యితరస్త్రీ వైద్యశాలలను కలవు. చెంగల్పట్టు విళుప్పురం తిరుచినాపల్లి మధుర మీదుగా తూత్తుకుడికిని ధనుష్కోటికినిపోవు యినుపదారికి చెన్నపురి యెగ్మూరు స్టేషనే ప్రధానస్థానము, బెజవాడ, వాల్తేరుల మీదుగకలకత్తాకు పోవుటకును. రేచూరుమార్గముగ బొంబాయికి పోవుటకును, బెంగళూరునకు పోవుటకును. చెన్నపురి సెంట్రలుస్టేషనేకూడలిస్థానము. జనరల్ ఆసుపత్రికిని సెంట్రలుస్టేషనుకును సమీపముననే యాత్రికులకు వసతిగృహము, రాజాసర్ రామస్వామిమొదలారిగారి సత్రమున్నది. యీసత్రమున కెదుట మూర్మార్కెట్టును, రిప్పనుభవనమును, విక్టోరియాపురమందిరము నున్నది. అనేకనాట్యశాలలును. బయాస్కోపు ప్రదర్శనశాలలును గలవు.

272 తిరువల్లిక్కేణి.

చెన్నపురి సెంట్రలుస్టేషనుకు దక్షిణమున 3 మైళ్లదూరమున శ్రీ పార్థసారథిస్వామి కోవెలకలదు. యీదేవళములో కోదండరామస్వామి, నరసింహస్వామి. సపత్నీకులై వెలసియున్నారు. చెన్నపురిలోని విష్ణుక్షేత్ర

ములలోనిదియే ప్రసిద్ధమైనది. అమూల్యరత్నాభరణ వాహనవైభవాదు లును. నిత్యోత్సవబ్రహ్మోత్సవాదులు జరుగుచుండును. యిక్కడిపుష్క రిణిలో మీనములు లేవు. పేరు మీన తీర్థము.

273 మైలాపూరు.

కపాలేశ్వరుడు. కల్పకవల్లి తిరువల్లిక్కేణికి దక్షిణముగ 1 మైలుకా వలనుండు శివక్షేత్రము యిది చెన్నపురిలో గొప్పది. బ్రహ్మోత్సవాదులు జరుగుచున్నవి. యిక్కడ సంస్కృత కలాశాలయు మూగ గ్రుడ్డివారికి విద్యాలయమును. శ్రీరామకృష్ణ పరమహంసగారి మఠమును, కలదు యి క్కడినుండి దివ్యజ్ఞానసమాజాధ్యక్షురాలగు అనిబెసంటమ్మగారి యాశ్రమ ము. 2 మైళ్లకావల దక్షిణముగనున్నది.

274 తిరువాలంగాడు.

నటరాజస్వామి. త్రిపురసుందరి. ఇది ప్రాచీన శివక్షేత్రము మహామ హిమకలది. చెన్నపురినుండి అరకోణమునకు పోవుమార్గములో 36 మైళ్ల దూరముననుండును రైలు స్టేషనుకలదు.

275 తిరుత్తని.

సుబ్రహ్మణ్యస్వామి. లవలీ, దేవసేనలు. సుబ్రహ్మణ్యస్వామి. కొం డపై వేంచేసియున్నాడు, కృత్తికనాడుచుట్టు పట్టులజను లక్కడ చేసెదరు. కటకమాసమునవచ్చు కృత్తికకు తెప్పోత్సవము జరుగును. కార్వేటి నగ రప్రభువులు. ధర్మకర్తలు. చెన్నపురికి 51 మైళ్లలో అరకోణమున కావలి స్టేషను, చిత్తూరిజిల్లాలో నొక తాలూకాపట్టణము.

276 చోళింగపురం.

నరసింహస్వామి. అమృతవల్లి పర్వతముపైస్వామివారి యాలయ ముకలదు. సమీపముననే సంజీవరాయడను ఆంజనేయునిదేవళమునుగలదు. వ్యాధిగ్రస్తులును. గ్రహపీడితులునిటకువచ్చి సేవసేయుచుందురు. పర్వతప రిసరముచూచుటకు రమ్యమైయుండును చెన్నపురికి. 56 మైళ్లదూరమున వాలాజారోడ్డునకుపోవు మార్గమునస్టేషను కలదు. స్టేషనుకును ఊరికిని 8 మైళ్ల దూరముండును.

277 శ్రీకాళహస్తి

శ్రీకాళహస్తీశ్వరుడు, జ్ఞానప్రసూనాంబ. స్వర్ణముఖరీనది. శ్రీసాలె పురుగు. కాళము, పాము. హస్తి, యేనుగు. యీమూటికిని ముక్తినొసంగి నశివక్షేత్రము. ఇది చిత్తూరుజిల్లాలోని జమీందారీ పట్టణము. పట్టణ పరి

సరముల పర్వతసానువులు ప్రకృతి గంభీరమును సూచించును. దేవళమతిర మ్యముగ క్షీణభాగములను నాటుకోటసెట్లు చేకట్టింపబడియున్నది. కన్నప్ప భక్తుని కొండయుదుర్గాంబికా పర్వతమును గలదు. రేణిగుంటనుండి గూడూరు మార్గములోనున్నది. యిటమూలస్థానమునస్వామిసమీపమందుండు పెద్దయిత్తడి స్తంభపు సెమ్మెలోనున్న దీపము కదలుచుండును. కావునయీక్షేత్రపాలకునికి వాయులింగమని పేరు. స్వర్ణముఖరీనదియొడ్డున దేవళమున్నది.

278 తిరుపతి.

చిత్తూరుజిల్లాలోని యొక పుణ్యక్షేత్రము. భరతఖండమున కాశీ రామేశ్వరములతో సమముగ తులతూగు దివ్యక్షేత్ర మిదియే. దీనికి శే షాచలమనియు వృషభాద్రియనియు పెక్కు నామములతో విరాజిల్లు చు న్నది. చెన్నపురికి 80 మైళ్లదూరమున రేణిగుంటనుండి 6 మైళ్ల దూరమం దున్న స్టేషను. క్రిందనుండుయూరికి దిగువతిరుపతియనియు. గోవిందరాజ పురమనియు పేర్లుకలదు. దిగువతిరుపతిలోని గోవిందరాజులగుడి శిల్పనై పుణి మెరయ నిర్మితమైన పెద్దదేవళము యీ దేవునికి కర్పూరహారతీయ నెంచినవారు 1 రూపాయ కట్నమర్పింపవలెను. గోవిందరాజులు. వెంక టేశ్వరుని తమ్ముడని వాడుక కావున ముందుగ వేంకటేశ్వరుని తమ్ముడని వాడుకకావున ముందుగ వేంకటేశ్వరుని దర్శించియే యిక్కడికి యాత్రికు లు దర్శనమునకు వచ్చుట వాడుకయైనది.

రా మ స్వా మి స న్ని ధి.

ఇదియు దిగువతిరుపతిలోనే యున్నది. గోవిందరాజుల గుడికన్న చిన్నదియై శిల్పమున మిన్నయైయున్నది. యిక్కడ నిత్యనైవేద్యమునకు 11 పళ్ల బియ్యమును. శనివారమునాటికి 18 పళ్ల బియ్యమును సెలవగు ను. గుడిలోపల చిన్నగుంటయు వనమును కలదు.

గం గ మ్మ జా త ర.

ఈమె గ్రామదేవత. చైత్రమాసమున 10 రోజులు ఉత్సవము జరు గును. అపు డన్నిజాతులవారును. పగటివేషములు వేసికొని. కల్లు సారా యమ్ముత్రాగి దారిపోవువారిని బూతుబండ లాడుచుందురు. యీ పదిరో జులల్లో కోళ్లు, పొట్టేళ్లు, దున్నపోతులు బలియగుటచింత్యము.

తి రు మ ల.

వెంకటేశ్వరుడు. దిగువ తిరుపతికి 1 మైలు దూరమున నుండు పర్వ

తముపై వేంకటేశ్వరుఁడు వెలసియున్నాఁడు. యీ పర్వతోన్నత శిఖరము సుమారు 2000 అడుగుల యెత్తుండును. కొండ వెడల్పు 100 చదురపు మైళ్లుండును. క్రీస్తుపుట్టుటకు 3 వందల సంవత్సరములకు పూర్వము కట్టినట్లు శాసనమున్నది. యీ దేవళమునకు గల 3 ప్రాకారములలో మొదటిది బ్రహ్మయు. రెండవది పరీక్షిత్తును మూడవది జనమేజయుఁడును కట్టగా తర్వాత 6 వందల సంవత్సరములకు విక్రమాదిత్యుఁడు పునరుద్ధరించి నటులును. తర్వాత చోళులును. ఆపిదప తొండమాన్ చక్రవర్తి వలన సంపూర్ణత్వముపొంది ప్రభావము నలుగడల వ్యాపించినది. యీకొండ నెక్కుటకు ఆరుకొండలు (మిట్టపల్లములు) దాటిపోయిన యేడవ కొండపైనుండు వేంకటేశ్వరుని లక్షలకొలది యాత్రికులు శ్రమకోర్చి వచ్చి సేవించుచున్నారు. దేవళము చాల అందముగను. 137 అడుగుల నిడుపును 87 అడుగుల వెడల్పునుగల మొదటిప్రాకారమును గల్గియున్నది. గర్భగృహ గోపురము బంగారుమలాము చేయబడియున్నది.

### స్వామిని సేవించువిధము.

దిగువతిరుపతికి సుమారు 1 మైలు దూరమునుండు ఆళ్వారు తీర్థములో సంకల్ప పూర్వక స్నానమొనర్చి 50 గజముల దూరముండు కపిలతీర్థమున నటులేయొనర్చి సమీపమందుండు తీర్థమును శిరమున ప్రోక్షించుకొని సమీపస్థుడగు ఉడయవరులను దర్శించి గోవింద నామస్మరణతో కొండ నెక్కవలయును. క్రిందినుండి గాలిగోపురమున కొకమైలుండును బారికష్టము. శ్రీకృష్ణదేవరాయనిచే కట్టింపబడిన యీ గోపురము శిథిలమైయున్నది తర్వాత రెండు గోపురములు దనుక దారి కొంత సులభముగనే యుండి మోకాలిమెట్టను వర కతికష్టమై మిట్టపల్లములతో నుండి అతిభరమనిపించి ఆతర్వాత దారి లలితముగనే యుండును. దారియంతయు వింతరంగుల పూలచెట్లు చల్లని నీడనిచ్చు పెద్దపెద్ద మానులుగల్గి చూచుటకు రమ్యమై శ్రమ లెక్కింపనీయక యుండును దారిలలో విశ్రాంతి శాలలును. చలిపందిరులును నుండును. గుడి ధ్వజస్తంభములు కనులకగపడుటతోడనే భక్తులు వేంకటరమణా గోవిందా. యేడుకొండలవాడాగోవిందాయని నోటినిండార భజనసేయుచు మెల్లగదరిజేరి స్వామిపుష్కరిణిలో సంకల్పపూర్వకముగ స్నానమాడి ప్రార్థనమున్నవారు తలనీలాలిత్తురు. దీనికి కట్నముకలదు. స్వామిపుష్కరిణి నూరుగజములనిడుపును యేబదిగజముల వెడల్పునుగల్గియున్నది సకాలవర్షములేక యొక

ప్పుడు యీ తీర్థములోని నీర మీడ్చుకొనగా దీనిలో తొమ్మిది చిన్న గుంట లుండినవట యీపుష్కరణి తీర్థమున నందరు స్నానముసేయుటవలన జల ము మురికిగనుండును. యీ పుష్కరిణికి సమీపమున వరాహస్వామి కో వెలయు తీర్థమునుకలదు. ముందుగ వరాహమూర్తిని దర్శించి వెంకటరమ ణుని సేవింపపోవుదురు. ముందుగ గోధుమపిండి. కలకండ. నిమ్మపండ్లు. 2 రూపాయలు తీసికొనిపోయి మహంతుకు సమర్పించిన నత డొక్క భ టునితోడిచ్చి స్వామిదర్శనము సేయించును. కర్పూరహారతికి 1 రూపాయి కట్నము. వెంకటరమణునికి అభిషేక నైవేద్య వాహనోత్సవాదులవలన యెక్కువ రాబడి కలదు.

క ట్న ము ల వి వ ర ము.

ప్రతిదిన ముదయము 7 గంటలకు చక్కెర వెన్న దేవునికిని నివేద నముసేయుదురు. బ్రహ్మోత్సవకాలములో భక్తు లధిక సంఖ్యాకులు వచ్చి చక్కెరపొంగలి. పులియోగిరము. దధ్యోదనము. మనోహరం మొదలై నవి చేయించి నివేదనమిత్తురు.

| | | |
|---|---|---|
| పైవానిలో దేనిని చేయించినను. | కట్నము రూపాయలు. | 6-0-0 |
| 1 గంగాళము తళిగనివేదనకు. | ,, | 6-0-0 |
| ఇతర ఫలాహారములు చేయుటకు. | ,, | 28-0-0 |
| అమృతారణోత్సవము చేయుటకు. | ,, | 65-0-0 |
| శుక్రవారాభిషేక పులకాపులకు. | ,, | 50-0-0 |
| పూలంగిసేవకు. | ,, | 60-0-0 |
| తోమాలసేవకు. | ,, | 12-0-0 |
| సహస్రనామార్చనకు. | ,, | 5-0-0 |
| శయనోత్సవమునకు. | ,, | 12-0-0 |

ఇదిగాక వాహనములపై దేవుని యుత్సవము సేయించుటకు వేరు కట్నములుకలవు. అట్టి యుభయకర్తలకు ప్రతి మర్యాదలునుకలదు. ఎవ రేని 100 రూపాయలు సెలవుచేసి స్వామి యుభయము చేసినచో వారికి పరివట్టము. తులసిమాల. అలంకారమర్యాధలును 100 రూపాయలు మొ దలు 5 వందలవరకు వ్యయమొనర్చిన పట్టుపూవుతో తులసిమాల మర్యా దయు 500 రూపాయలు మొదలు 1000 రూపాయలవరకు వ్యయమొనర్చి రేని సెలవు మర్యాదయు చేయుటకలదు. సాధారణకానుకలును 2 రూపా

యలును సమర్పించువారికి తులసిమాల. దోశె. వడ. శ్రీపాదరేణువు. తీర్థ మర్యాదలును చేయుదురు. గుడికివెలుపల నొకయెత్తైనచోట మహంతు గారి మఠమును, ధనాగారమును, మహాత్ములును బైరాగులును విశ్రమించు మంటప మఠాదులును పూర్వ మహంతుల సమాధులును గలవు. యిట నుండు అన్నసత్రములో జాతిమతవ్యత్యాసములేక అందరును భోజనము చేయుగురు. మహంతుగారి మఠమునకు సమీపమున వెయ్యికాళ్ల మండపమును యితర కట్టడములుండును. మైసూరు. కొచ్చి. కాళహస్తి. వెంకటగిరి. మహారాజులు కట్టించిన ధర్మశాలలును నీనిదాపున దుకాణములును గలవు. ఆషాఢ శ్రావణ మాసములయందీ కొండపై విషగాలి వీచుచున్నను. ప్రాణాపాయము తటస్థించుచున్నను యాత్రికులు రాకపోవరు. ఆశ్వీజ మాసమున దసరాపండుగిలో బ్రహ్మోత్సవము జరుగును. యిక్కడ మూడున్నరకోటి తీర్థములున్నవని క్షేత్రపురాణము చెప్పుచున్నను. యిపుడు కనపడునవి 30 కన్న యధికములేదు. వీనిలో విశేషములైనవి స్వామి పుష్కరిణి పాపనాశము. యీ పాపనాశతీర్థము సన్నిధికి 3 మైళ్ల దూరమందుండు జలపాతము. జనులు తీర్థముపడుచోట నిలుచుండిన సుకృతులకు తెల్లగను దుష్కృతులకు కల్మషముగను ఆజలముపడునట, మూడవది గోగర్భము యిది సన్నిధికి తూర్పున పాతికమైలు దూరమందుండు గోగర్భము. యిదియొక దొనవలెనుండును. మధ్యవేసియుండు కొయ్యను పట్టుకొని యిటుమునిగి అటు తేలవలెను. సమీపమున సత్యధర్మ నిరతులగు పాండవుల దేవళమున్నది. వ్యాజ్యములలో ప్రమాణము చేయువారిలో కొందరిక్కడకు వచ్చి 7 రూపాయలు కిట్నమిచ్చి యొట్టుపెట్టుదురు. యిక్కడనే యొక గుహాయున్నది. యీ గుహాలో దూరిన 7 మైళ్లలోనుండు చంద్రగిరికి పోవును. యీ గుహాయందే పరాంకుశ దాసులవారు కొద్దిరోజు లుండిరని చెప్పెదరు. అనేకమహాత్ము లిక్కడయుండి కందమూల ఫలాదుల భక్షించి కాలము గడపుచున్నారు.

---

 ఈ వెంకటాచల క్షేత్రమాహాత్మ్యాది వివరములు. స్థలపురాణము వచనకావ్యముగా ప్రతిమలతోటి ముద్రించియున్నది. గాన ఈదిగు వకనపఱచియుండు పైవిలాసదార్లకు వ్రాసి తెప్పించుకొనవచ్చును. 1-0-0

పమ్మి - త్యాగరాయ శెట్టి అండు సన్స్.

ప్రాతచాకలపేట, మదరాసు.

279. తుంబురుకోనతీర్థం.

ఇది సన్నిధికి తూర్పున 4 మైళ్ల దూరమున నొక్క యరణ్యప్రదేశ మందుండు జలపాతము. పాతికమైలు యెత్తునుండి నీరు పడుచున్నది. ఇట పెక్కురు మహాత్ములు తపము చేయు గుహ లనేకములుకలవు. యోగ మభ్యసించువారికిని యోగులకును వసతియైన భూమి. యిట రాత్రిళ్లు చిరుతలు. పెద్దపులులు. మొదలగు భయంకర క్రూరమృగ సంచార మధికము.

280 తిరుచ్చానూరు. (అలిమేలు మంగాపురం.)

తిరుపతి వేంకటరమణుని సేవించిన యనంతర మిక్కడకువచ్చి యాత్రీకులీ క్షేత్రమునకువత్తురు. ఒకప్పుడు వేంకటరమణునితో జగడమాడి దేవి యిటకుచేరినదని పురాణప్రసిద్ధము. యీ పురము మొదట పల్లెయే యైనను. యిపు డధికముగ వైష్ణవులు వాసముండు జనపదమై సుమారు ౫ పందల కాపురములున్నవి. యీచోటు మహాపవిత్రమై మహాత్మ్యయుక్తమైనదట. అమ్మవారి కోవెల చాల సుందరముగనుండును. వంటసామగ్రులు విస్తారముగను నయముగను దొరకును. యిట ద్వైతమత సిద్ధాంత సభకలదు. ద్వైతమతస్థులకు శ్రుతిస్మృతి పురాణేతిహాస తర్కమీమాంస శాస్త్రాదులను పరీక్షించి బహుమతులిత్తురు. ప్రతియేట నిక్కడ సభ జరుగుచుండుట శుభసూచకము. అద్వైతుల కిట్టి పరిషత్తులు లేకుండుట విషాదకరము.

281 అహోబిలము.

కర్నూల్ జిల్లాలోని యొక క్షేత్రము. యిది యాత్రీకులకు కష్టసాధ్యమై అరణ్య ప్రదేశమందుండు నృసింహస్వామిక్షేత్రము. వైష్ణవ జియ్యరు మఠమున్నది. యిటీవల కొందరు వైష్ణవభక్తులు యీ క్షేత్రము నుద్ధరింప పూనుకొనుట. పుణ్యమూలము.

282 మహానంది.

కర్నూల్ జిల్లా నంద్యాలకు సుమారు 10 మైళ్ల దూరమందున్న పుణ్యతీర్థము. అటవీమధ్యమందుండి. యొకరిద్దరు చేరుటకు సాధ్యముకాని చోరభయము కలిగియున్నది. నందిముఖమునుండి యొక చిన్న గుంటలోనికి జలము వచ్చుచున్నది. యీ గుంటనుండు నీరము ప్రాకారమునకు వెలుపలనుండు రెండుగుంటలకు పోవుచుండుటచే లోతు లేక తీర్థము శుభ్రముగనున్నది. స్థలము ప్రకృతి రమణీయముగ నుండును.

283 శ్రీశైలము.

మల్లికార్జునస్వామి. భ్రమరాంబిక. నందీశ్వరుడు పర్వతరూపియై స్వామిని మోచియున్నటులు క్షేత్రపురాణము. ఆంధ్రులకెల్లరకును విశేషించి లింగాయత మతస్థులకు ముఖ్య యాత్రాక్షేత్రము. ఉత్తరమున బదరికాశ్రమమువలె దక్షిణమున యీక్షేత్ర మత్యంతరమణీయమై శాంతి యుతమై యున్నది. క్రీస్తు పుట్టుటకు పూర్వ మిక్కడ బుద్ధమతాను యాయులుండిరట నంద్యాలస్టేషను కీశాన్యమున 60 మైళ్లు దూరమందుండి దారియంతయు నరణ్యమయమై క్రూరమృగ సంకులమైయుండుటచే జనులు గుంపులుగూడియే యిక్కడకువత్తురు. శివరాత్రినాడుతప్ప తక్కిన సమయములందిటకు యాత్రీకులు వచ్చుట అసాధ్యము.

284 హంపీవిరూపాక్షి.

ఇదియే వాలిసుగ్రీవుల రాజ్యము. యిక్కడ మాల్యవంతము హేమకూటము. ఋష్యమూకము. మతంగము. కిష్కింధయను పంచపర్వతములుకలవు. శ్రీరామమూర్తి రామావధార్థమై యరుగుచు వర్షాకాలము నిట గడపెనని రామాయణప్రసిద్ధము. సుగ్రీవ ప్రతిష్ఠితమై శ్రీరామాలయము కలదు ఉన్నతములైన వానరమూర్తు లిక్కడ స్వేచ్ఛగ చరించుచున్నవి. బళ్లారిజిల్లా హాస్పేటస్టేషను కీశాన్యముగ 8 మైళ్లలో కలదు. తుంగభద్రానది యిక్కడ ప్రవహించుచున్నది.

285 పంపాసరోవరము.

ఇది హంపీక్షేత్రమునకు సమీపమునను పెద్దచెరువు. యీ సరస్సులోని కమలములను కలువలను హంసలను తక్కిన శుకపికశారికా మయూరాది శృంగార విహంగములనుకని శ్రీరామచంద్రుడు సీతాదేవి అవయవ మధుర ధ్వన్యాదులనుగూర్చి విరహాతురుడైనట్లు శ్రీమద్రామాయణమున వాల్మీకిమహర్షి చే వర్ణింపబడియున్నది. యిక్కడప్రకృతి చిత్తాకర్షకముని వేరుగ చెప్ప నక్కరలేదు.

286 మంగళగిరి.

పానకాల నరసింహస్వామియను పేరుతో తిప్పపై నెలకొనియున్న విష్ణుక్షేత్రము. యాత్రీకులు సేవింపబోయి యొకపాత్రలో పానకముకలిపి స్వామినోటిలోపోసిన ఆపాత్రలో సగమువరకే స్వామి పానముచేయును. తక్కినది ప్రసాదమగును. బెజవాడనుండి గుంటూరికి పోవుదారిలో గల రైలుస్టేషను.

287 నెల్లూరు.

ఇది పెద్ద జిల్లాపట్నము. శ్రీరంగనాయకుల పెద్ద దేవళము. పినాకినీనది (పెన్న) యొడ్డుననున్నది. ముక్కోటియేకాదశికి చాలమంది భక్తులువచ్చి దర్శింతురు. ఇదిగాక అనేకములగు చిల్లరగుళ్లుకలవు. యిక్కడికి 15 మైళ్ల దూరమున ఆంధ్రభారత కృతికర్తలలో నొక్కడును. కవిబ్రహ్మయనగు తిక్కనసోమయాజి జన్మభూమియగు పాటూరుకలదు. రేబాల లక్ష్మీ నరసారెడ్డిగారి పురమందిరమును భాండాగారమును కలదు. గ్రీష్మకాల మతిగ్రీష్మము తక్కినఋతువులు సమము.

288 జొన్నవాడ.

నెల్లూరికి 5 మైళ్ల దూరమున గల గ్రామము. యీ కోవెల నెల్లూరి రంగనాయకుల దేవళ మంతపెద్దది కాకపోయినను చాల సుందరముగ నుండి యాత్రికుల నాకర్షించు కామాక్షిదేవి నిలయము మహామహిమాన్వితము.

289 వేదగిరి.

నెల్లూరికి పడమట పెన్నయొడ్డునగల చిన్నకొండపైనున్న నృసింహస్వామి క్షేత్రము. దీనిని నృసింహుల కొండయందురు. కొండపై యేడు కోనేర్లుకలవు. నృసింహజయంతి విశేషము.

290 మాల్యాద్రి.

ఇట కొండపై వెలసియుండు నరసింహస్వామికి నిత్యారాధన జరుగక ప్రతి శనివారముమాత్రము జరుగును.

291 కోటితీర్థము.

దీనికే కోటిలింగాలనియు పేరు. కోటిలింగేశ్వరుడందురా కోటిలింగముల కొక్కటి తక్కువనున్నవట. ఆయొక్క లింగమునుండిన కాశీక్షేత్ర గౌరవము తగ్గిపోవునని యొక్కటి తక్కువచేసిరి. దారి అడవిమార్గము. కట్టెబండ్లపై పోవలెను. శివరాత్రి ముఖ్యదివసము.

292 సంగము.

గూడూరుతాలూకాలో చేరిన చిన్నపల్లెకడ బొగ్గేరు. బీరపేరు. యీ చిన్ననదులు రెంటను పెన్నలో కలియునుగాన దీని కీపేరుకలిగినది. యిక్కడ సంగమేశ్వరుని దేవళమున్నది. మేషసంక్రమణమునాడు బ్రహ్మోత్సవము కడపటిదినము. యీ యుత్సవములతో నొక్క బీదబ్రాహ్మణుడు యాచించి నిత్యము సహస్ర బ్రాహ్మణ సంతర్పణము సేయుచుండుట ఆశ్చర్యము.

293 పెంచలుకోన.

రాపూరుతాలూకాలో నరణ్యమున నొక పర్వతాగ్రముపై నెలకొనియుండు నృసింహక్షేత్రము. గొప్ప పుణ్యస్థలము. యిక్కడికి పోవుదారి కఠినమైన రాళ్లు ముండ్లు గలిగిన అడవిప్రదేశము. నృసింహజయంతికి వేల కొలది యాత్రికులువత్తురు. గుహ లనేకములుండి విరాగుల కావాసమై యుండవచ్చును.

294 బెజవాడ.

కృష్ణాజిల్లా ప్రధానపట్టణము. కృష్ణాస్రవంతినీ పావన సలిలసేచనమున విగతపాపులైన భక్తశిరోమణులు పెక్కురుకలరు. యీయేటి కాన కట్టలును కాలువలును చాలగల్గి యీ మండవాసులును వసురాజులునుగ జేయుచున్నది. హైదరాబాదు. మచిలీపట్టణము. గుంతకల్లు. మొదలగు రైళ్లకు కూడు (జంక్షను) యీ పట్నమునకు ప్రక్కనగల పర్వతపంక్తికి యింద్రకీల పర్వతమని పేరు. పూర్వమున అర్జునుడు తప మొనర్చిన చోటు కొండపై కనకదుర్గాంబాలయమును యీశ్వరాలయమునుకలదు. దేవళము చిన్నదైనను ముచ్చటగనున్నది. యీశ్వరగుడి అందముగనుండును. స్టేషను సమీపమున ధర్మశాలయున్నది. గవర్నరుపేటలో మునిసిపలువారి సత్రమొకటికలదు.

295 రాజమహేంద్రవరము.

గోదావరిజిల్లా ప్రధాననగరము. పండితులకును కవిరాజులకును కొదువలేనియూరిది. ఆంధ్రభారతకృతి భర్తయగు రాజరాజనరేంద్రుడీనగరమును పాలించునపుడే నన్నయభట్టారకునిచే కృతినందెను. సప్తపురములు మోక్షదాయకములెటులో యటులే పవిత్రములైన సప్తనదులలో గోదావరియొక్కటి. యీగోదావరి తనపావనజలకణముల వలన నెందరినో బాహ్యాభ్యంతర పరిశుద్ధులుగ నొనర్చెను. భాగీరథీజల మతిరుచ్యము నారోగ్యమునైనది. ఆంధ్రమాత కెట్టి తోడ్పాటుకావలసినను యీనగరమే ముందంజవేయును, గోదావరియొడ్డుననొక యీశ్వరాలయము కలదు. ఊరికి 2 మైళ్లకావల సారంగధరుని మెట్టకలదు. యిక్కడనే చిత్రాంగి ప్రేరణమున నరేంద్రుడు కొడుకు కాలుసేతులు నరికించెనందురు. బోధనాభ్యాసన కళాశాలయు, గ్రంథమాలలు. గ్రంథ భాండాగారములు. పురమందిరముకలదు. గౌతమీగ్రంథాలయ మాంధ్రదేశ కేంద్రగ్రంథాలయమగును.

296 ధవళేశ్వరము.

రాజమహేంద్రవరమునకు సుమారు 5 మైళ్లదూరమునందు గ్రామము. ప్రసిద్ధమైన శివక్షేత్రము. గోదావరి పడవలలో యీచోటికిపోవలెను. ప్రకృతిగంభీరము.

297 భద్రాచలము.

గోదావరిజిల్లాలోని తాలూకాపట్టణము. పర్వతముపై శ్రీరామమూర్తి వెలసియున్నాడు. అనేకమండపగోపురములు కలవు. గోల్కొండ నవాబుగారికడ తహసీలుదారుగ నుండిన గోపన్నరామదాసై భద్రాద్రిదేవళమెంతటియున్నత స్థితికిం దెచ్చినదియు. రామదాసు నవాబుచేపడిన హింసలును, ఆపదోద్ధారకుడగు శ్రీరామచంద్రుడు రామదాసునుద్ధరించుటయు లోనగుకథలను. నాటకములుగను. కాలక్షేపరూపముగను యెరుగని యాంధ్రుండుండడు, భద్రాచలమున చైత్రమాసమున బ్రహ్మోత్సవము జరుగును. అపుడు వేలకొలది యాత్రీకులు చేరుదురు. బెజవాడనుండికొంతదూరము రైలుమీదను తర్వాత అరణ్యమార్గముగను పోదగుదారియుండినను అదికష్టసాధ్యము,కావున గోదావరిలోనే పడవలోపోవుటసర్వసౌఖ్యప్రదము.

298 సింహాచలము.

కొండపైనుండు నృసింహస్వామి క్షేత్రము. కృష్ణదేవరాయని కాలమున నున్నతస్థితియందుండి యిపుడును వెలసియున్నది. స్టేషనుకు 4 మైళ్లదూరమందున్నది.

299 మంగళాదేవి.

పశ్చిమ సముద్రతీరమందుండు మంగళూరికి 1 మైలుదూరమందున్నమహాశక్తి యాలయము కర్ణాటకశిల్పమిం దగపడును. పొగాకు. కాఫీవిత్తులు. బియ్యము. చేపలు యివి యెగుమతి యగునట్టి పెద్దపట్టణము. చెన్నపురికి 550 మైళ్లదూర మందున్నది.

300 గోకర్ణము.

మహాబలేశ్వరుడు. బృహన్నాయకి. లంక నాశమొందకుండుటకై తపమొనర్చి లింగమునుపొంది పోవునపుడు సురలచే ప్రేరితుడైన వినాయకుడెదురువచ్చి రావణుడు బహిర్భూమికి పోవునపుడు తా నాలింగమును తీసిభూమిపై నుంచెను. యీశ్వరుడు లింగమిచ్చునపుడు లింగమును క్రిందనుంచిన మరల రాదనిరావణునకు చెప్పియుండెను, లింగము భూమికంటుకొని రావణుడెంత పెరికిననురాక గోవుచెవివలె సాగెను. రావణుడక్కడ

నే యాలింగమును స్థాపించి పూజించెను. కాశివిశ్వేశ్వర లింగమువలె యీ లింగమును భూపట్టమునకు అనుగునసేయుండి పశ్చిమకాశియని పేరొంచెను. యిదియొక తాలూకాపట్టణము సమీపముననే సాగరమున్నది. కొబ్బెరచెట్లును తక్కిన చెట్లును చూచుటకందముగ నుండును అన్నసత్రము నితర వసతులును కలదు.

301 ఉడుపి.

ఉడుపికి 80 మైళ్లదూరమున శ్రీసుబ్రహ్మణ్యక్షేత్రమున్నది. యాత్రికులకువలయు సౌకర్యములు కలవు. నెమలిపైనుండునట్టులు విలాసము. కొండనుతొలిచిన గుహలో స్వామి వెలసి యున్నాడు. పూర్వమెగుహయందొకసర్పముండి దుశ్చారిత్రులను దేవళముదరికి రానీకతరుముచుండెనట, యిపుడు, స్వామిని సేవింపబోవు వితంతువు లొకగినోకరు కట్టుకొనియేచ్చెదరట యిటయెక్కువగ కన్నడము మాటాడువారున్నారు.

302 మేలుకోట. (తిరునారాయణపురము.)

ఇదిదక్షిణ హిందూస్థానమున ప్రఖ్యాతిమైయుండు వైష్ణవక్షేత్రము. వజ్రకిరీట మీస్వామికి మీనమాస పుష్యమీనక్షత్ర బ్రహ్మోత్సవసమయమున మైసూరు మహారాజుగారి బొక్కసమునుండి తెచ్చి యలంకారము చేసి మరల సంస్థానపు బొక్కసమునకు కొనిపోవుదురు. ధర్మకర్తలు శ్రీరాజాగారే. యీదేవళమునజరుగు బ్రహ్మోత్సవమున కడపట 3 దినములును పంచములు ధారాళముగ దేవళమున ప్రవేశించి. సేవించిధన్యులగుదురు. యిందులకై కరుణామూర్తియగు శ్రీరామానుజా చార్యులకే నిమ్నజాతులు కృతజ్ఞులైయుండవలెను. తక్కిన దేవాలయాధికారులు నైతిమీ నిమ్నజాతులయెడ కృపయుంతు లేని మెలగును యీదేవళమునను మైసూరు గవర్నమెంటువారు సంవత్సరమునకు 23 వేలరూపాయలు వ్యయమిచ్చెదరు. యిప్పటికో వెలసిబ్బంది 215 మందికలరు. 50 అధ్యాపకులును పట్టామాన్యములనుజేసిస్వామికిచ్చి తామనుభవించువారు 2 నాలదమంది యుండి వారెల్లరు స్వస్తివాచకోద్యోగులై యున్నారు. యిక్కడియుత్సవ వైభవ కైంకర్యాదులు. చాలశ్రద్ధగను. విమర్శగను జరుపబడుచున్నవి. ఉన్నతజనపదముగనుండి యాత్రార్థులకన్ని వసతులును గలిగియున్నవి.

303 తొండనూరు.

ఇక్కడజైనులను మతవాదమున నోడించి శ్రీరామానుజాచార్యుడు రాతిగానుగలోపడద్రోసి చంపించెనట. విష్ణువర్ధనుడు కట్టించిన

పిశాచమును ఉడయువరులుతోలిరట యీచిహ్నములును నరసింహస్వామి దేవళమును క్షీణమైన యితర దేవాలయములును కలవు. నాల్గుప్రక్కల కొండలే కట్టగాగల పెద్దచెరువు చూచుటకు వినోదముగనున్నది. దొంగల భయమధికముగ కలదు. మేలుకోటకు 18 మైళ్లదూరము.

304 శ్రీరంగపట్నము.

బెంగుళూరికి వాయవ్యభాగమున 75 మైళ్లదూరమున కావేరినది కిరుపాయలమధ్య సుందరముగనుండు చిన్ననగరము. కావేరినదియొడ్డున పాడైనకోటకలదు యీకోటలోనే సుందరమైన రంగనాయకుల కోవెలయు నృసింహక్షేత్రమునుచే కట్టింపబడి తిరుగుచుండు గోపురముగల టిప్పుసుల్తాను మసీదునుకలదు. యీకట్టడమెల్లరును జూడందగినది. నగరమునకు దక్షిణముగ హైదరాలి, వాని బేగం. టిప్పుసుల్తాన్ వీరిగోరీలత్యంత సుందరముగనుండును. నల్లని స్ఫటికశిలలవలన నీగోరీలునిర్మింపబడి చందనపుపలకలు. దంతములు. వీటితలుపులును గల్గి మిక్కిలి రొక్కము వ్యయముచేసి నిర్మింపబడినది. దీనికి సమీపమున నడవుల్ దాభాగు. అను నందవనసుందరాంతఃపురమున్నది వీనిని అందరును చూడతగినది. దొంగలభయమెక్కువ.

305 జింజెర్ గెడ్డా.

ఇది యెడత్తురై యను వూటికి సమీపమందున్నది. యిక్కడ కావేరి నదీజలము. పల్లమునపడును. యిదిరాళ్లపై దూకుటచే రాళ్లప్రతిబింబ మీనీటిని పసుపురంగుగలదిగ జేయుటయేగాక నీటిని పొగకలదానిగ జేయును. సీతాదేవియొకపు డిక్కడజలక మాడినందున పసుపురంగును వేడియుగల్గిన నీరయ్యెనని చెప్పుదురు. యేదియెటులుండినను. యీజలపతన మవశ్యము దర్శనీయము. ఆగట్టుచేరుటకు కట్టలేకుండుట చాలకష్టము.

306 మిథున సాలిగ్రామము.

జింజెర్ గెడ్డాకు 8 మైళ్లదూరమువనుండు నీయూరన్నృసింహక్షేత్రము జైనులదేవళమును కలవు. యిక్కడిరాజునకు గల్గిన కుష్టవ్యాధిని నివర్తించి శ్రీరామానుజుడు. జ్ఞాపకచిహ్నముగ తనపాదరక్షలిచ్చెనని యొనట. ఆతనిపాదతీర్థమును కలదట అక్కడిలుబ్ధవైష్ణవులా తీర్థమునకు తలుపుతాళములుంచుకొని యాత్రీకుల కాతీర్థమును వెలకమ్ముచుండుట శోచనీయము. యిక్కడ పేరాసగాండ్రగు బ్రాహ్మణులు కొందరుకలరు. మొత్తము మీద జనులుత్తములు. జైనులెక్కువగ నున్నారు.

307 మైసూరు.

హిందూ దేశపు స్వదేశ సంస్థానములలోనిది రెండవది. ఈసంస్థానము కావేరినది యేగాక చిల్లరనదులు కొన్ని చేరియుండినందున సర్వసస్యాఢ్యమై సంవత్సరాదాయము దాదాపు 2½ కోటిరూపాయలను కలిగియున్నది. యిక్కడి రాజాంతఃపురములును రాజమందిరమును. చూచుటకు, రమ్యమై ఆధునిక శిల్పముల కాకరమైయున్నది. దసరాపండుగలతి వేడుకతో జరుగును. చాముండీశ్వరాలయము కొండపైనుండి దసరాలో బ్రహ్మోత్సవము జరుగుచున్నది. శ్రీరంగపట్టణమునకు రైలుమార్గమున 8 మైళ్లు దూరమందున్నది యాత్రికులనేకులు దసరా వేడుకలు చూచుటకువత్తురు. యీమైసూరు సంస్థానము సంగీతవిద్వాంసులపాలిటి కల్పవృక్షమై విశేషించి వైణిక శిరోరత్నములనదగు. వీణశేషన్న. బిడారుకృష్ణప్పగార్ల కాశ్రయమైయున్నది. యిప్పటికిని జంత్రగాత్రసాహాయ్యులైన సంగీతవిద్వాంసులీ సంస్థానమున తమప్రవీణతను చూపినయెడల వారికిగౌరవ మధికమగును.

308 బెంగుళూరు.

మైసూరు గవర్నమెంటుకును యిండియా గవర్నమెంటుకును భాగముగల్గి 20 మైళ్ల చదరముగల పెద్ద పట్టణము. యిక్కడి మైసూరు రాజాగారి సుందర మందిరమును యిండియా ప్రభుత్వ కార్యాలయములును చాల పెద్దవియై చూడ సుందరముగ నుండును. ఉష్ణకాలమున ప్రజల కారోగ్యముగ నుండును, కావుననే నీలగిరికిపోని ధనికు లిక్కడ వేసవికాలమును గడపుదురు. విచిత్ర నందనోద్యానములును. జంతు ప్రదర్శన శాలయు నవశ్యము చూడతగినవి. యాత్రికులకు అన్నపానాదులకు ధర్మసత్రములును. హోటళ్లును చాలకలవు. సాయంకాలము 5½ గంటలమొదలు తెల్లవారువరకును విద్యుచ్ఛక్తి దీపములు పట్నమును పట్టపగటివలె జేయును. యిక్కడ కళాశాలలును హైస్కూలునుకలవు యిక్కాలమందుండు బెంగ్లూరు పట్టణమును వర్ణించుటకు సాధ్యముకాని దటుండ మాపనికాదు కావున ప్రత్యక్షముగ చూచితీరవలెనని చెప్పెదను. యిక్కడికి 60 మైళ్ల దూరమున బంగారునుతీయు కోలారు గనియున్నది. బంగరును యెగుమతిచేయుటకై మన ప్రభుత్వమువారు గనులవరకును రైలుమార్గమును కల్పించియున్నారు. యీ గనులు మైసూరు ప్రభుత్వము వారికి చెందినవిగాన మనప్రభుత్వమువా రతనికి కొంత సుంకమునిచ్చి మొత్తమును తీసుకొనుచున్నారు.

309 శృంగేరి.

మైసూరు సంస్థానమునకు జెందిన కోడూరుజిల్లాలో తుంగభద్ర యను రెండునదులును సంధించుచోటుననుండు ప్రాచీనాశ్రమము. శ్రీమచ్ఛంకరాచార్య స్వాములవారు (ఆదిశంకరులు.) కాశ్మీరదేశమున సంపాదించి తెచ్చిన శ్రీ శారదాంబా విగ్రహము నిక్కడ నొక్క పర్వతముపై ప్రతిష్ఠించి యర్చించెను. అద్వైతమతాచార్యులగు శ్రీమచ్ఛంకరాచార్యుల మొదటి సింహాసన మిచ్చటనేయగును. యీ శృంగేరిప్రాంతమును యీ పీఠమునకు శ్రీ మైసూరుమహారాజాగారు సర్వయినాముగ నిచ్చియుండుట యేగాక మా సమొక్కటికి 100 సవరములు శాశ్వత యినామిచ్చుచున్నారు. శిష్యకోటి యొసంగుకానుకలును గలవు. కావున నీపీఠమున కపారమైన స్వాస్థ్యము కల్గియున్నది. శ్రీ పీఠాధిపతుల జాపితా నాకు దొరకిన ప్రతిని తెల్పెదను.

1. శ్రీ శంకరాచార్యులు. క్రీ - పూ. 26 మొ. 12 సం. వర.
2. శ్రీ సురేశ్వరాచార్యులు. క్రీ - పూ. 28 మొ. 773 వరకు.
3. శ్రీ నిత్యబోధఘనాచార్యులు. క్రీ - త. 758 మొ. 848 వరకు.
4. శ్రీ జ్ఞానఘనాచార్యులు. క్రీ - త. 846 మొ. 910 వరకు.
5. శ్రీ జ్ఞానోత్తమశివాచార్యులు. క్రీ - త. 905 మొ. 953 వరకు.
6. శ్రీ జ్ఞానగిరియాచార్యులు. క్రీ - త. 949 మొ. 1038 వరకు.
7. శ్రీ సింహగిరీశ్వరాచార్యులు. క్రీ - త. 1036 మొ. 1098 వరకు.
8. శ్రీ యీశ్వరతీర్థాచార్యులు. క్రీ - త. 1097 మొ. 1146 వరకు.
9. శ్రీ నృసింహతీర్థులు. క్రీ - త. 1145 మొ. 1228 వరకు.
10. శ్రీ విద్యాశంకరతీర్థులు. క్రీ - త. 1228 మొ. 1333 వరకు.
11. శ్రీ భారతీకృష్ణతీర్థులు. క్రీ - త. 1328 మొ. 1380 వరకు.
12. శ్రీ విద్యారణ్యస్వాములు. క్రీ - త. 1331 మొ. 1386 వరకు.
13. శ్రీ చంద్రశేఖర భారతి. క్రీ - త. 1368 మొ. 1389 వరకు.
14. శ్రీ నృసింహభారతి. క్రీ - త. 1387 మొ. 1408 వరకు.
15. శ్రీ పురుషోత్తమభారతి. క్రీ - త. 1406 మొ. 1448 వరకు.
16. శ్రీ శంకరానందులు. క్రీ - త. 1428 మొ. 1454 వరకు.
17. శ్రీ చంద్రశేఖర భారతి. క్రీ - త. 1449 మొ. 1464 వరకు.
18. శ్రీ ద్వితీయనృసింహ భారతి. క్రీ - త. 1464 మొ. 1479 వరకు.
19. శ్రీ పురుషోత్తమ భారతి. ద్వి. క్రీ - త. 1472 మొ. 1517 వరకు.

20. శ్రీ రామచంద్రభారతి. క్రీ-శ. 1508 మొ. 1560 వరకు.
21. శ్రీ నృసింహభారతి. తృ. క్రీ-శ. 1557 మొ. 1573 వరకు.
22. శ్రీ నృసింహభారతి. క్రీ-శ. 1563 మొ. 1576 వరకు.
23. శ్రీ నృసింహభారతి. (అభినవ.) క్రీ-శ. 1576 మొ. 1599 వరకు.
24. శ్రీ నృసింహభారతి. క్రీ-శ. 1576 మొ. 1599 వరకు.
25. శ్రీఅభినవ సచ్చిదానందభారతి. క్రీ-శ. 1622 మొ. 1663 వరకు.
26. శ్రీ నృసింహభారతి. ద్వి. క్రీ-శ. 1663 మొ. 1705 వరకు.
27. శ్రీ సచ్చిదానందభారతి. క్రీ-శ. 1705 మొ. 1741 వరకు.
28. శ్రీఅభినవసచ్చిదానందభారతి.ద్వి. క్రీ-శ. 1741 మొ. 1767 వరకు.
29. శ్రీఅభినవ నృసింహభారతి.ద్వి. క్రీ-శ. 1767 మొ. 1770 వరకు.
30. శ్రీ సచ్చిదానంద భారతి. తృ. క్రీ-శ. 1814 మొ. 1817 వరకు.
31. శ్రీ అభినవసచ్చిదానందభారతి. క్రీ-శ. 1817 మొ. 1879 వరకు.
32. నృసింహభారతి. 1912 వరకు.
33. శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతి.
34. శ్రీ చంద్రశేఖరభారతి.

శృంగేరికి పోవ నపేక్షించువారు బెంగుళూరును హుబ్లికి పోవు రైలుమార్గముగ కడూరు స్టేషనుదాటి అక్కడికి 55 మైళ్ళ దూరమునను న్న బీరూరుజంక్షనుదాటి. అక్కడికి. 35 మైళ్ళ దూరమునను౦డు సిమోగానుదాటి అక్కడికి నైఋతిదిక్కున 19 మైళ్ళ దూరమునను౦డు తుంగా నదియొడ్డున నున్నది. దక్షిణహిందూస్థానమున నేగాక భరతఖండమంతటను వ్యాప్తమై ఆచార్యమందుండు ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతప్రతిష్ఠాపకులగు మధ్వశంకర రామానుజాచార్యులు దక్షిణఖండముననే జనించి నందులకు మనమెంతయు సంతసింపవలసియున్నది. మతత్రయమున నేను. మొదట వ్యాప్తిజెందినది యద్వైతమతమును. ఆసల విశిష్టాద్వైత మతమును. మూడవది ద్వైతమతమునైయున్నది. ఈ మున్పూర్వ చరిత్రములను విపులముగ వ్రాసియుండినను అతి సంగ్రహముగ ఆచార్యత్రయ చారిత్రమును శైవ వైష్ణవ సమయాచార్యుల వృత్తాంతమును సూచీమాత్రముగ లిఖించుచున్నాడను.

## శ్రీశంకరాచార్యులు.

శ్రీమదాది శంకరులు జన్మించిన కాలమునుగూర్చి యింతవరకును నిశ్చయము కాలేదు. మలయాళదేశమున కాలడియను అగ్రహారమున ఆత్రే

యగోత్రమున శివగురువను నంబూద్రిబ్రాహ్మణునకును మహాదేవియను నామెకునుజన్మించెను. కుమారుడు జన్మించిన మూడవయేటనే తండ్రిపర మపదించెను. తల్లి యేకంటిని రెప్పపోలె కుమారుని బెంచి యేడవయేటను వడుగుచేయించి విద్యాభ్యాసము సేయించెను. పదిరెండేడులు పూర్తియగునరికి సకలవిద్యాపారంగతుడై సంసారసాగరమున మునుగక సన్యాసమును స్వీకరించెను. కుమారుని సన్యాసము తల్లికిష్టము లేకపోయినను. ధీమంతుండగుకొడుకు తల్లికివిజ్ఞాన రహస్యముల నుపదేశించి మాతనుతృప్తిపర చెను ఈబాలసన్యాసి వేదాది సత్యశాస్త్రములయందు తలంపుగల్గి బాగుగమననముచేసికొని యందలి యాథార్థతత్వమగు అద్వైతమును బోధించుచు ఆసేతుశీతాచల పర్యంతము పర్యటనమొనర్చి, జైనబౌద్ధ శాక్తేయాది వేదవిరుద్ధమతముల వేళ్లతోగూడ నూడదీసివైచి. కాశ్మీరమునకేగి, వ్యాఖ్యాన సింహాసనాచార్యపీఠము నధిష్ఠించుటయేగాక అందందుగల పండిత మండలితో తర్కించి జయధ్వజమునునాటి వేదములను భాగించిన శ్రీమద్వేదవ్యాసులు రచించిన బ్రహ్మసూత్రముల కద్వైతపరముగ భాష్యము వ్రాసెను. భగవద్గీతకును. దశోపనిషత్తులకును నృసింహతాపినికిని శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమునకును. భాష్యములను వ్రాసిరి, స్వయముగ, ఆనందలహరి. హరిమీడే, శివభుజంగము, విష్ణుభుజంగము. వివేకచూడామణి. ఆత్మబోధము. కనకతార. అమరుకశతము. మొదలగునవిరచించెను. కేవలము మతావేశవివశులై యన్యోన్యదూషణము లాడుకొను శైవవైష్ణవపాషండులవలెగాక సర్వసమతకలవాడై కేవలము భారతీయవతారమే యనునటులు ప్రతిపక్షులు సైతమునుతింప వన్నెకెక్కెను. అద్వైతమతవ్యాపనమునకై పీఠములేర్పరచి. పద్మపాదుడు, హస్తామలకుడు, సురేశ్వరుడు, ఆనందగిరి. మొదలగువారి నాచార్యులనుగా నియమించి. ఆకాలమున అపారవిద్యానిధులు వెలసియున్న కాశ్మీరదేశమునకేగి. అక్కడిపండితుల తర్కమాడిజయింపగా. నాపండిత సామాజికులు. సరతీదేవికై నియమించిన యున్నతస్థానమున నాసీనుంగావించిరి. యానాటివరకును విద్యావిషయమై యరిగిన వారిలో శ్రీమచ్ఛంకరులే ప్రథములు పరమాత్మసర్వవ్యాపకత్వమున ద్వైతమూలమున నుపదేశించిన జగద్గురుడు తనముప్పదిరెండవయేటనే పరమాత్మైక్యము నొందెను.

## శ్రీ రామానుజాచార్యులు.

జైనబౌద్ధ శాక్తేయాదిమతములు పూర్ణముగ నాశముకాక శంక

రాద్వైతము సామాన్యమానవుల కనుష్ఠేయముగాక యున్నసమయమున 9-వ శతాబ్దమున శ్రీపెరుంబూదూరు ఆసూరి కేశవాచార్యులకును. భూదేవికిని శ్రీరామానుజుడు జన్మించి కాంచీపురమున విద్య నభ్యసించి గృహస్థుడై యనేక మతములను ఖండించి. అన్యమతావలంబనమునుండి తొలగించి. వైష్ణవత్వమిప్పించి తిరుపతి శైవక్షేత్రముగనుండ దానిని విష్ణుక్షేత్రముగ మార్చి శ్రీరంగమునకరిగి. దేవాలయ పూజావిధానము నేర్పరిచెను. ఆకాలమున కరికాలచోడుడును. వానితర్వాత క్రిమికంఠచోడుడును. శైవ మతావలంబులై శివుడే పరతత్వమని తమరాజ్యములోని వైష్ణవుల నిర్బంధముచేయగా రామానుజు లీవార్తవిని మైసూరురాజ్యములోని శ్రీరంగపట్నమేగి. అక్కడిరాజైన జైనునివ్యాధిని తొలగించి వానికి వైష్ణవత్వమిచ్చి మేలుకోటలోనికి విష్ణ్వాలయమున ధారాళముగ పంచములు ప్రవేశించుట కనుగ్రహించి యిక్కడనే 12 సంవత్సరములు వసించెను. వీరు గృహాశ్రమ మవలంబించియు భార్యచెప్పినమాట విననందున సన్యసించి. పెరియనంబి. యాదవప్రకాశులు. తిరుక్కచ్చినంబి. మొదలైనవారు వ్రాసియుంచిన వేదాంతములోని విశిష్టాద్వైతమును గ్రహించి ప్రస్థానత్రయమునకును విశిష్టాద్వైతపరముగ భాష్యమువ్రాసి శంకరులవలెనే కాశ్మీరమునకేగి శ్రీభాష్యకారులను బిరుదముతో సరస్వతీపీఠ మలంకరించి. వేదాంతదీపము. వేదాంతసారము. వేదాంతసంగ్రహము. గద్యత్రయము. నిత్యగ్రంథము మొదలైన స్వతంత్రగ్రంథములు రచించి. విశిష్టాద్వైతము వ్యాప్తినొందుటకై 74 గురు ఆచార్యులను నియమించి పరమపదించెను.

## శ్రీ ఆనందతీర్థులు.

ద్వైత మత స్థాపకాచార్యులగు ఆనందతీర్థులుగారు. క్రీ. శ. 1119. సరియగు విళంబివత్స రాషాఢ బహుళ ర నాడు మధ్య కేశభట్టుగారికి పుత్రుడై పుట్టి యుపనయనాది సంస్కారములొందిరి. వీరి తండ్రిగారు వీరికి పెండ్లిచేయవలెనని ప్రయత్నింపగ నీతడు సన్యాసియై అచ్యుతప్రకాశ స్వామియను యతికి శిష్యుడై వేదవేదాంగము లభ్యసించుటయేగాక. కాశ్యాదిక్షేత్రములను దర్శించి బదరికాశ్రమమునకరిగి. అక్కడ వేదవ్యాసుల యాజ్ఞ ననుసరించి ప్రస్థానత్రయమునకు భాష్యమువ్రాసి ద్వైత మతోపదేశము చేయుచు. తిరిగి యింటికివచ్చునపుడు. త్రోవలో నెనిమిది సాలగ్రామములును. గోపీచందనధారియగు శ్రీకృష్ణవిగ్రము నగుపడగ దానిందీసి కొనివచ్చి స్వగ్రామమగు యుడిపికి సమీపమందు స్థాపించి. సాలగ్రామ

కెనిమిదిపీఠముల నేర్పాటుచేసి శంకర రామానుజులవలెనే మతవ్యాపక మొనరింప పీఠాధికారుల కాజ్ఞయిచ్చి మరల బదరికాశ్రమమేగి వ్యాసుని సమీపముననే తపముచేయుచున్నాడని కొందరందురు. ఋగ్భాష్యము. భారతతాత్పర్య నిర్ణయం. భాగవత తాత్పర్యనిర్ణయం. కృష్ణామృత మహార్ణవం. తంత్రసారం. అను వేదాంతం. మొదలగు 37 పెద్దపుస్తకములను వ్రాసిరట. ముఖ్యప్రాణదేవరు అని వాయుదేవుడు. శ్రీరామకాలమున హనుమంతుండుగను. శ్రీ కృష్ణునికాలమున భీముడుగను. కలియుగమున మధ్వాచార్యులుగను జన్మించిరని ఆ మతమువారు చెప్పుకొందురు. యీ మతమువారికి హనుమంతుడే యుపాసనాదైవముగ నున్నాడు.ఈ మతాచార్యులు మూవురుగాక. శైవవైష్ణవ మతప్రవర్తులు. మరికొందరుగలరు. వారి చరిత్రములుగూడ కొంత సంగ్రహముగ వివరించు టావశ్యమని భావించి యీ క్రింద వ్రాయబడును.వీరందఱును దక్షిణ హిందూస్థానవాసులును. విశేషించి. దేవాలయములను ప్రతిష్ఠించినవారును. నుతించినవారును. మంగళాశాసనములు చేసినవారునునై యున్నారు.

## శ్రీవిద్యారణ్యులు.

ఆనెగొంది సంస్థానాధిపతులగు హరిహరరాయలు. బుక్కరాయల ప్రధానామాత్యుడుగను, విజయనగర నిర్మాణప్రేరేపకుడును వీరికి గురువును అగు. విద్యారణ్యుడు. తుంగభద్రానదీ తీరముననుండు పంపానగరస్థుడగు మాయనయను ఆంధ్రబ్రాహ్మణునకు జన్మించెను, సకలకలారహస్యముల నెరింగెను, వివాహమాడెనుగాని చిన్నపుడే భార్యావియోగమొంది, శృంగగిరి పీఠాధిపతియై ఆనెగొందిరాజులకు గురువగుటమాత్రమే గాక జగద్గురుడయ్యెను, ఆదిశంకరులతర్వాత విద్యారణ్యునివంటి పండితుడామధ్యలో జన్మింపలేదనియే జనశ్రుతి, యీతనికాలమున నద్వైతములో మాయావాద మెక్కువయ్యెను. యితడు 108 ఉపనిషద్భాష్యమును. పరాశరమాధవీయము. కాలమాధవీయము. మాధవనిదానము. శంకరవిజయము. విద్యారణ్యము సర్వదర్శన సంగ్రహము. కాలజ్ఞానము. మొదలగు ఉత్తమగ్రంథములను రచించి విద్యారణ్య బిరుదాంకుడై విరాజిల్లెను.

## అప్పయ్య దీక్షితులు. శివభక్తులు.

పదునైదవ శతాబ్దాంతమున కాంచీనగర సమీపగ్రామమున వీరుదయించి. శ్రుతి. స్మృతి. పురాణేతిహాసముల సాంగముగ సవిమర్శముగ నభ్యసించిరి వీరికిద్దరుభార్యలుకలరు.వీరు పెనుగొండ సంస్థానము నాశ్రయిం

చిరి. కొలదిసంవత్సరముల కావల, దేశయాత్ర సేయు నుద్దేశముతో రామేశ్వరాదిక్షేత్రములను దర్శించి. చిదంబరమునకువచ్చి, అటనుండి కాశీకిపో నుద్దేశింపగ, అక్కడివారి ప్రార్థనల నాలకించి తమజీవితమును చిదంబరము ననేగడపిరి. వైష్ణవమతఖండన శైవమతమండనములం దతిసమర్థుడై శివో చ్చారణచంద్రిక, కువలయానందవ్యాఖ్య, శివతత్త్వవివేకము. శివమణిదీపిక, అధరపానము, మొదలగు గ్రంథములను రచించి. మహావిద్వచ్ఛిఖామణియని బిరుదమంది యిరువురు భార్యలందును పదునెకండు గురుపుత్రులును బడసి తనతొంబదియవయేట శివపదవిని జెందిరి.

## నీలకంఠ శివాచార్యులు.

గోకర్ణక్షేత్రమున జననమందిన ఆంధ్రబ్రాహ్మణుడు. శ్రీమదాది శంకరులకు సమకాలికుడట శైవాగమాది శాస్త్రములం దపారప్రజ్ఞావంతుడై యుత్తరమీమాంసకు శైవపరముగ భాష్యమువ్రాసెను. దీనిని నీలకంఠభాష్యమందురు. యీ భాష్యమునకు హరదత్తాచార్యులు. సమర్థనము. అను పేరుతో వ్యాఖ్యానము రచియించెను.

## హరదత్తాచార్యులు.

కంజనూరులో మధుసూదనాచార్యులకు పుత్రుడు. మొదట వైష్ణవుడుగనుండి. శైవాగమముల పఠించి శైవుడయ్యెను. యెఱ్ఱగ కాల్చిన యినుపగద్దెపై గూర్చుండి శివపరతత్త్వమును బోధించెనట సమర్థనము. చతుర్వేద తాత్పర్య సంగ్రహములను వ్రాసెనట.

## నంబియాండార్ నంబి చరిత్రము.

చోళదేశమున తిరునారైయూరను చోట తంబళ్ల వంశమున జన్మించి చదువుకొనుచుండెను. తండ్రి యొకనాడు పన్యగ్రామమున కేగి మధ్యాహ్న పూజాసమయమునకు రాకుండెను. యీ బాలునితల్లి అన్నమిచ్చి విఘ్నేశ్వరునకు నైవేద్యముపెట్టి రమ్మనెను. బాలు డటులే దేవళమున కన్నము నుగొని చని పూజించి స్వామిని అన్నమును భుజించుమనటులు వేడుకొని నిష్ఫలుడై తలను గోడకుకొట్టుకొన వినాయకుడు ప్రత్యక్షమై వాని క్రూరకార్యము నివారించెను. యీ బాలభక్తుడు. చేతులుమోడ్చి స్వామి నాకు బడికిపోవు వేళ మించిపోయినది. మా యుపాధ్యాయులు దండింతురు. మీరే నాకు పాఠమునుజెప్పుడు అన విఘ్నేశ్వరుడు. వానిని విద్యాన్వితుని గావించెను. చోళరాజిది తెలిసి వచ్చి. సమయాచార్యత్రయమునొక్క చరిత్రమును వ్రాయ ప్రార్థింప నీబాలుడు. రాజుకోర్కె నీడేర్చెను.

## శేక్కిళార్ స్వామి చరిత్రము.

కాంచీమండలమున కున్నఅత్తూర్ అను గ్రామమున వెలమవంశమున జన్మించి మిగుల విద్యావంతుడై శైవాగముల జదివి చోళరాజుకడ మంత్రియయ్యెను. ఆ సమయమున జైనులు. శివచరిత్రమును వ్రాసి రాజునకు వినిపించిరి. మంత్రి వారిచరిత్రము మంచిదికాదని శిరుతొండనయనారు చరిత్రమును. పెరియపురాణమను ద్రావిడ శైవపురాణమును చితంబరేశుడగు నటన సభాపతి యనుగ్రహమునుపొంది తానే వ్రాసెను. శైవసన్యాసియై శివపదమును జెందెను.

## తిరునావుక్కరశుస్వామి చరిత్రము.

ఇతడు తిరువామూరిలో వెలమకులమున జనించి విద్యానిధియయ్యెను. యితనిసోదరి కలావతిం సకల కలాకలాపయై యను రూపవరుడు దొరకమికి చింతించి. తండ్రిచేయనున్న సంబంధము తృప్తికరము కానందున విరాగియై కన్యకామఠమున జేరి శివాలయ దాస్యముసేయుచు బ్రహ్మచారిణిగ కాలమును గడుపుచుండెను. ఇతడు ధర్మాత్ముడై సత్రములను మఠములను కట్టించుచుండెను. అపుడు అర్హన్మతము వ్యాప్తిగ నున్నందున నామతమున జేరి ధర్మసేనుడను నూతన నామమునుపొంది. అర్హన్మతాధ్యక్షుడై యుండెను. కొన్నాళ్లకు ధర్మసేనునకు వ్యాధికల్గి. తమ మతము వారి వైద్యులవలన నివర్తికానందున చెల్లెలున్నచోటికి వచ్చెను. కలావతి తన యన్నకు శైవమత మవలంబించిన వ్యాధి కుదురునని హితముపదేశించి నాత డట్లొనర్చి సుఖుడయ్యెను. క్షపణకుల కిది తెలిసి యా దేశపురాజు తమ మతావలంబియైనందున తిరునావుక్కరశు వృత్తాంతమును రాజుతో దెలుప నతడు ప్రహ్లాదుని వానితండ్రి యొనరించిన బాముల నోర్చియుండెను. తుదకారాజు స్వామిని. బండకట్టి సముద్రమునత్రోయించెను. ఆరాయినే తెప్పగాగొని సముద్రమీదుకొని తిరునావుక్కరశుస్వామి. తిరుప్పాపులియూరు చేరి పాటలేశ్వరుని ప్రస్తుతించి తిరుజ్ఞానసంబంధస్వామి వారి వలన. అప్పర్: అను బిరుదమునుపొందెను. అప్పాదినాయనారను శివభక్తుని కొడుకును పాముకొఱుకగ వానివిషము నివర్తింపజేసి. అనేక శివక్షేత్రములను దర్శించి. ప్రజలకు శైవ ధర్మోపదేశము చేయుచు. బ్రహ్మచారిగ తిరునావుక్కరశుస్వామి తన యెనుబది యొకటవయేడున శివైక్యమును జెందెను.

## సుందరమూర్తిస్వామి చరిత్రము.

తిరునామూరిలో బ్రాహ్మణవంశమున జననమంది సకల శాస్త్రములను జదివెను. తండ్రి కళ్యాణముచేయనున్న సమయమున నీశ్వరుడు వృద్ధబ్రాహ్మణరూపియై యా వివాహమువలదని నిషేధించెను. అంత సుందరమూర్తి దేశాటనముసేయుచు తిరువారూరిలో మాలపడుచును పెండ్లియాడి కొలదిరోజులుండి యా యూరువిడిచి తిరుగుచు. యిటుకను బంగారముచేయుట. ఒకయూరిలో దాచియుంచిన సొమ్మును మరియొకయూరికి రప్పించుట మొదలగు సిద్ధకృత్యము లొనరించుచు తిరువత్తూరు కేతెంచి మాదిగపిల్లను మోహించి దానిం బెండ్లియాడెను. జాత్యంతర వివాహదోషమున సుందరమూర్తికి కనులుపోగా. చేతికఱ్ఱనూతగగొని కాంచీనగరమరిగి యేకామ్రనాథుని బ్రార్థింప నొకకన్ను చూపుకలిగెను. తిరువారూరికిపోయి. అక్కడిస్వామిని బ్రార్థింప మరియొక కంటిచూపు సహాయమయ్యెను. మొసలిచంపిన యొక బాలునికి బ్రాణమిచ్చి యనేక దివ్యదేశములకేగి శైవతత్వమునుబోధించి శివలోకప్రాప్తిజెందెను.

## జ్ఞానసంబంధమూర్తిస్వామి చరిత్రము.

ఈయన శీర్కాళియందు బ్రాహ్మణవంశమున జన్మించెను. యితని తండ్రి పుత్రునియింటవిడిచి స్నానము చేయుటకు నదికేగెను. కుమారుడు ఏడ్వగ పార్వతీదేవి తన చనుపాలిచ్చి జ్ఞానసంబంధమూర్తిగ నొనరించె. తదుపరి దివ్యదేశములకేగి వృత్తములతో నుతింపగ. స్వర్ణతాళమును ముత్యపు శిబికయు. ముత్యాలగొడుగును. స్వర్ణచిహ్నము మొదలగు బిరుదములతో పర్యటనముసేయుచు. నొక్కెడ విషపీడితుడైనవాని కారోగ్యమొసంగి. పాండ్యదేశపురాణి కోర్కె ననుసరించి అన్యమతస్థుడైన రాజునకుగలిగిన గూనును నివర్తింపజేసి. జైనబౌద్ధమతవాదులతో వాదమాడి యోడించి అందరను శైవులుగనొనర్చి. తిరుపతిలో నొక్కరుడు సర్పదష్టుడై యగ్నిచే దహింపబడిన వాని బూడెదను కుప్పగజేసి పూర్వమువలె మనుష్యునిగ సృజించినవానికి బ్రాణమిచ్చెను. యిత్యాది మహామహిమాన్వితకార్యము లొనర్చి. గృహస్థుడైన కొలదిరోజులకు. బంధువులు. మిత్రులు. శిష్యులు. మొదలగువారితో దేవళమున బ్రవేశించి అందరును చూచుచుండ. మూలస్థానమున వెలువడిన దివ్యతేజములో లీనమైపోయి చూపరులకు అచ్చెరువు గల్గించెను. యితని సంపూర్ణనామము తిరుజ్ఞానసంబంధమూర్తి నాయనారందురు.

## మాణిక్యవాచకస్వామి చరిత్రము.

మధురానగరమునకు సమీపమున వైఘానదియొడ్డునగల యొక గ్రామమునజనియించి. పదునారేండ్లలోపల సకల విద్యాపారంగతుడై యుండుటను పాండ్యరాజు విని తనకు మంత్రిగనియమించుకొనియెను. ప్రజాభీష్టము ననుసరించి రాజ్యపాలనమునకు రాజును ప్రోత్సహించియటులేసేయుచురాగా. సంస్థానమునకు తురంగమము లెక్కువకావలసి. యుత్తమాశ్వములంగొనితేర రాజు మంత్రిని నియమించెను. పరివారముతో యెక్కువ ద్రొక్కముతో మంత్రి యశ్వములనుగొనుటకు పోవుచుండు దారిలో పరమేశ్వరుడు వృద్ధబ్రాహ్మణవేషముతో శిష్యులకు శివతత్త్వమును బోధించుచుండుటనువిని మంత్రి తనధనముపోలె. గుఱ్ఱములను కొనుటకై తెచ్చిన మొత్తమును వెచ్చించి శివాలయములను గట్టించి వట్టిచేతులతో యూరికి వచ్చెను. రాజు తురంగములెక్కడయని యడుగ మంత్రి భగవానుని ప్రార్థించెను. అపుడు శివుడు నక్కలను గుఱ్ఱములుగచేసి. తానుదోలుకొనివచ్చి రాజునకప్పజెప్పి పోయిననాటిరాత్రియే గుఱ్ఱములు నక్కలైయూరంతయు పాడుచేసిన రాజుకోపించి మంత్రిని కసరగ. నాతడు మరలదైవమును ప్రార్థించెను. శివాజ్ఞవలన వైఘానది యపారప్రవాహమువచ్చి పాండ్యరాజ్యమును పాడుచేసి రాజునకు బుద్ధిసెప్పెను. అపుడు మంత్రిదైవమును ప్రార్థింపనొక్కొక్క వృత్తమును మాణిక్యమువలె ప్రకాశింప మాణిక్యవాచకుడనిపేరుకల్గెను. తర్వాత సన్న్యాసియై దివ్యదేశములను సేవించి సిద్ధుడై పరమత ఖండనము స్వమతమండనములో శివైక్యమందెను.

## తాయుమానస్వామి చరిత్రము.

చోళదేశమున వెలమ వంశమున జనించి సకలవిద్యల నెఱిగి సద్గుణసచ్చరిత్రాత్మకమైన ప్రవర్తనములచే సామాజిలు గౌరవించి పూజించునటులు నడచుచు. దుఃఖప్రపూరితమగు సంసారతాపత్రయములకు లోబడకు

---

☞ ఈ శివభక్తుల చరిత్రములంతయు, (అరువదిమువ్వురు నాయనారుల చరిత్రము) అను 'భక్తలీలామృతమునందు' ముద్రించి యున్నవి. గాన ఈదిగువ కనుపఱచియుండు పైవిలాసదార్లకు వ్రాసి తెప్పించుకొనవచ్చును. క్రయం రూ. 1-0-0

### తిరుమళ్ళిశై యాళ్వారులు.

ప్రథమాళ్వారులు జన్మించినకాలముననే యితడు జన్మించి సాంగాధ్యాయనుడైన శైవుడుగనుండి. ఆవల వైష్ణవుడై భక్తిసారుడను పేరుతో పెక్కు వైష్ణవ దివ్యదేశములకేగి వృత్తములను స్తోత్రములను చెప్పెను. ప్రబంధ నిర్మాతలో నితడు నాలవవాడు.

### నమ్మాళ్వారులు.

దక్షిణ దేశమున ప్రసిద్ధమైన వెలమ వంశమున బుట్టి. వకుళభూషణుడను అభిధానముతో ప్రబంధకర్తయై యంతమున విష్ణువుతోగూడ వైకుంఠమేగెనట.

### మధురకవి యాళ్వారులు.

ద్వాపరయుగమున పురశ్చూడ బ్రాహ్మణవంశమున జన్మించి.దివ్యదేశములను దర్శనముచేసి యనేక ప్రబంధములను నిర్మించుటయేగాక నమ్మాళ్వారుల యభిప్రాయమును బలపరుచుచుండెనట.

### కులశేఖరాళ్వారులు.

కౌస్తుభమణ్యాంశమున కేరళదేశమున జన్మించి. శ్రీరంగాది దివ్యభూములను సంచారముచేసి. సంస్కృతద్రావిడములందు కవిత్వము చెప్పుచు ఉభయకవియనబరగి ప్రబంధకర్తలలో నొక్కడయ్యె.

### పెరియాళ్వారులు.

శ్రీవిల్లిపుత్తూరులో బ్రాహ్మణవంశమున గరుడాంశమున పుట్టి విద్యావిహీనుడయ్యె. గుంటలుత్రవ్వి వనములువేయించి అందలి పుష్పములను కోసి మాలలుకట్టి విష్ణువున కర్పించుచుండెను. పాండ్యరాజొకప్పుడొక్కసంచినిండ రూపాయలుకట్టించి యెత్తున వ్రేలాడునటులొనర్చి. పండితులను రావించి యేమతము సత్యమనియేర్పడునో, ఆమతస్థులచేతి కీధనమందునని తెలిపెను. జైన బౌద్ధ శాక్తేయ శైవ మతవాదులు.తమతమమతములే సత్యములని తర్కించిరిగాని ధనమందినదికాదు. అపుడు విష్ణుప్రేరణమున నీయాళ్వారువచ్చి విశిష్టాద్వైతమే సత్యమతమని వాదించి సిద్ధాంతీకరింపగ ఆముల్లె పెరియాళ్వారుచేతికిచ్చెను. యితనినే విష్ణుచిత్తుడందురు. ప్రబంధకర్త.

### ఆండాళు.

ఈస్త్రీ విష్ణుచిత్తుడు నాటించిన తులసిచెట్టులో లక్ష్మీదేవి యంశమున బుట్టి ముందుగ పూవులను దా ముడుచుకొని పిదప మాలలుకట్టి వి

ష్ణుచిత్తునిచే స్వామికి చేర్పించుచుండెను. ఒకనాడు స్వామి కల్పించిన పుష్పములలో వెండ్రుకలుండ అర్చకులును తక్కిన భక్తులును చింతించిరి. నాటిరేయి విష్ణువు వారిస్వప్నమున గనబడి. తనభక్తురాలు ముడిచినపూలే తన కిష్టమని వారికిజెప్పెను. పిదప ఆమెను శ్రీ రంగనాయకస్వామి కల్యాణము చేయించెను. యీయమకే గోదాదేవియనియు చూడికుడుత్తమ్మనియు పేరు. తిరుప్పావై ప్రబంధకర్త.

## తొండరిప్పొడియాళ్వారులు.

ఇతడు వైజయంత్యంశమున జన్మించి గృహస్థుడై పిదప విరాగియై భక్తాంఘ్రిరేణువను పేరుతో దివ్యదేశదర్శనము సేయుచు మోక్షమందెను. యితడే విప్రనారాయణుడు.

## తిరుప్పాణాళ్వారులు.

ఇతడు శ్రీవత్సాంశమున జన్మించిన తక్కువజాతివాడు. వీణావాదనమం దతిసమర్థుడై భగవత్కీర్తనలు పాడుచుండెను. వీనిభక్తికిమెచ్చి విష్ణువు తన భక్తుల నొక్కనిగ జేకొని కైవల్యమొసగెను.

## తిరుమంగయాళ్వారు.

వీరు సారంగాంశమున జన్మించి అస్త్రప్రయోగకుశలియై దారులుకొట్టి జీవించుచుండ నొక్కనాడు విష్ణువు వేటకుపోయి వచ్చుచుండ దారిలో యీ దొంగచూచి స్వామి. యొంటరియైనపుడు నగలన్నియు దోచుకొని కాలిమెట్టెమాత్రము రానందున స్వామి పాదాంగుళిని నోటితోకరచి యుంగరము దీసికొనియెను తన్ను స్పృశించినంతమాత్రమున పవిత్రుడయ్యెనని భగవానుడు. తనభక్తులలో చేర్చుకొనెను. తర్వాత తాను దొంగలించిన సొమ్ముతో శ్రీరంగము గోపురప్రాకారాదులను కట్టించి తిరుమంగయాళ్వారు. విష్ణులోకమును జేరెను.

## నా థ ము ను లు.

వీరనారాయణపురమున జన్మించి కలాన్వితుడై కల్యాణమాడి నాలాయిరప్రబంధమును. జదివి గూఢార్థములను వెల్లడించి తన 340.వ సంవత్సరమున పరమపదముజేరెను. ఆళ్వారుల యున్నతిని వ్యాప్తికిందెచ్చి వారిలో నితడే ప్రథముడు.

## యామునాచార్యులు.

వీరనారాయణపురమున గల వైష్ణవబ్రాహ్మణ కుటుంబమునపుట్టి. పెరిగి విద్యావంతుడై ఆయూరి రాజపురోహితుని వాదమున నోడించెను.

రాజు మెచ్చుకొని తన రాజ్యములో అర్ధభాగమిచ్చెను. ఆ రాజ్యభాగము ను పాలింపుచు. విశిష్టాద్వైతమతమును వ్యాప్తమొనరించి. పెక్కురు మహాత్ములను శిష్యులనుగ సంపాదించి. తన 120 దియవయేట మోక్షమును పొందెను. ఇతనిచే రచింపఁబడిన గ్రంథరాజములు ఆత్మసిద్ధి. సంవిచ్ఛిద్ధి. ఈశ్వరసిద్ధి. ఆగమప్రామాణ్యాం పురుషవిలక్షణాం. చతుశ్లోకి. గీతార్థ సంగ్రహం. స్తోత్రరత్నం. మొదలగునవి.

మణవాళ మహామునులు.

కలియుగాది 4472-వ సాధారణ సంవత్సర కన్యామాస శుక్లపక్ష చతుర్దశి గురువారమునా డుదయమందిరి. శిక్కిల్ కెడరాయనుగ్రామ మితని స్వగ్రామము. సంస్కృత ద్రావిడములు తుదముట్ట జదివి. 32 లక్షణముల నెరిగి యుండెను. మహమ్మదీయాగ్రహమునకు పాల్పడియర్చకులు చెంచికోకయందు దాచియుంచిన శ్రీరంగనాయకులవిగ్రమును. శ్రీరంగ్గమునకు గొనిపోయి పునఃప్రతిష్ఠాపనముచేసెను. రామానుజా నుగ్రహమునుపొంది యతిరాజవింశతిని రచించెను. అపుడితనికి ముఖ్యస్నేహితులైన తిరువాయిమొఴిపిళ్లయను నతడు. తిరుమొఴివ్యాఖ్యానము. శ్రీవచన భూషణవ్యాఖ్యానము. వ్యాప్త్యను సంధానము మొదలగు గ్రంథరాజములను రచించిమోక్షమందెను. తర్వాత పెద్దజీయరను మనవాళమహామునిగారు అనేకదివ్యదేశములను దర్శించి. అనేకులకు వైష్ణవత్వమిప్పించియు; కొన్ని వైష్ణవాచార్య పీఠములను స్థాపించినదియు గాక. రహస్యత్రయ వ్యాఖ్యానము. తత్వత్రయవ్యాఖ్యానము. ఆచార్యహృదయ వ్యాఖ్యానము. పెరియాళ్వారు తిరుమొఴివ్యాఖ్యానము. అంత్యాదిశేత వృత్తవ్యాఖ్యానము. జ్ఞానసారవ్యాఖ్యానము. ప్రమేయసార వ్యాఖ్యానము, సప్తవృత్తి వ్యాఖ్యానము, గీతా తాత్పర్యదీపము. తత్వత్రయప్రమాణము, త్రింశత్సహ వృత్తప్రమాణ విశదీకరణము. ఉపదేశరత్నమాల, తిరువాయిమొఴిఆర్తిప్రబంధమును. తనికవి. తనిశ్లోకములు. మొదలగు గ్రంథము ఉత్కృష్టములు. చిల్లరగ్రంథములు మరియు పెక్కుటుకలవు. ప్రతివాదభయంకరులగు శిష్య సేనమాద్రుగురసాయమున శ్రీరామానుజాచార్యులకు ప్రతినిధిగయవతరించి వారిభావుక భావములను వెల్లడిచేసి, తన 73 వ యేట. పరమపదించిరి. వైష్ణవ తెంగల సంఘమువారిలోని కదాచార్యస్థానము నధిష్ఠించెను. దక్షిణదేశమున వైష్ణవమతమును 12 గురు ఆళ్వారులును 12 గురుఆచార్యులును అవతరించి విద్యానిధులై వ్యాప్తికిం

వెచ్చిరి. వీరిలో, ద్రావిడమున పెక్కుగ్రంథములు రచించి సర్వస్వతంత్రుడను బిరుదమందిన వేదాంతదేశికు నగ్రస్థవాచ్యుడు.

వేదాంత దేశికులు.

ఈ మహాత్ముడు 16-వ శతాబ్దమున కాంచీనగరమున జన్మించి శ్రుతిస్మృతి పురాణేతిహాసముల సమగ్రముగ జదివి పండితేంద్రుడై. అనేకదివ్యక్షేత్రముల కరిగి. నుతులు సల్పి. విశిష్టాద్వైతములో కొన్ని సంప్రాదాయములకు. వడగలై సంప్రదాయములని పేరుపెట్టెను. యిపుడీ రెండు సంప్రదాయమును వైష్ణవ్యములోని దైనను భోజనము సేయునపుడు కూడ. దృష్టిదోషమూరోపించుకొనుచున్నారు. వ్యాసరచిత వేదాంతగ్రంథములకు భాష్యములు వ్రాసెను. సంకల్ప సూర్యోదయము అను వేదాంతనాటకమును అనేకములగు తార్కికగ్రంథములనురచించిరి. ఇదిగాక. పరమపద దర్శనము వైరాగ్యపంచకము. మొదలైన యుత్తమ గ్రంథములను రచించి. తర్వాత తనభార్యను పుట్టినింటికంపి తాను సన్యసించి తనకు నూరవసంవత్సరమున పరమపదించెను. వీరువ్రాసిన 120 గ్రంథములలో. 32 స్తోత్రములును. 3 కావ్యములును. 28 అనుష్ఠానశాస్త్రములును. 32 రహస్యములును. 24 సాంప్రదాయ ప్రబంధములును. భగవద్విషయ గ్రంథమొకటియు. రచించెను. ఇతనికి కాంచీపురమునుండు వరదాచారియను శిష్యుడు కలడు. యితని సంకల్పసూర్యోదయమునకు వేంకటాచార్యులను కవి. టీకరచించెను. యీ దేశికులకన్నను ముందున పుట్టిన వైష్ణవులలో వడగల సాంప్రదాయములను వెలిబెట్టినవారు లేరు.

మరియు ననేకులు వైష్ణవ శైవభక్తులును మతవ్యాపకులును వక్తలును గ్రంథకర్తలును కలరు. ద్రావిడదేశపు శైవులలో నాయనార్లను భక్తులు 63 ముగ్గురును. జియ్యంగార్లను వైష్ణవులు 74 నల్గురును. వారి పీఠములు 74 ను గలవు. ఆంధ్రులలో చెన్నబసవయ్య. పిడుపర్తి సోమనాథుడు. శ్రీనాథుడు. కూచిమంచి - తిమ్మనకవి. ప్రభృతులు. శివపురాణములను. శైవక్షేత్ర భక్తుల చరిత్రములను. వ్రాసి వ్యాప్తినొందించిరి.

పూర్వఖండము సమాప్తము.



హే కరుణామూర్తీ! జగద్గురూ! సర్వనియంతా! నాప్రార్థన నాలించి నాకెట్టి మనోవికల్పమును కలిగింపక. ఇతర శరీరాయాసములను కలిగింపక. నేత్రేంద్రియముల కెక్కువ ప్రకాశదృష్టి నొసగి. నాకు కాశీరామే

శ్వర దిగ్దర్శనిలోని దక్షిణఖండమును వ్రాయుటకు వలయు. శక్తినొసంగి నాచే వ్రాయించినందులకు మాత్రమే నీయెడ నెల్లపుడును కృతజ్ఞుడనై యుండ నాజన్మప్రభృతి యింతదనుక అన్నపానీయాదులనిచ్చి యెట్టి యాపదలను పొరయనీయక నను కాపాడినందులకు. యెన్ని జన్మముల దనుక నేను నీ కృపాదృష్టికి ఋణస్థుడనై యుండవలెనో. మందమతియైన నే నెఱుగజాలుదునా. నామనఃపూర్వకముగ నొసంగు అనంతప్రమాణములొసంగెదను గైకొనుము. నీ అపారసాహాయ్యమునకే నేమియు ప్రత్యుపకారము సేయజాలుదును. నేనేకాను యీ ప్రపంచమంతయు నీవలనయు పకృతి పొందునవియై యుండియు. ప్రతిసేయ లేనపుడు. నాతరమా నీ కృపాదృష్టి యిటులే నాపై ప్రసరింపజేసి యీ గ్రంథభాగమగు యుత్తరఖండమును గూడ పూర్తిజేయింపుము. జలస్థలాది దివ్యదేశములందుండి నీ మూర్తిని దర్శింపనేతెంచు సుకృతులకు దుష్కృతులు పొరయకుండ రక్షించునటులే జలస్థల చరిత్రమును వ్రాయు నాపై నీ యనుగ్రహుంచుము. హే పరమపితా సర్వేశా, సర్వాంతర్యామీ, పాహిమాం పాహిమాం మాం పాహి.



# ఉత్తరఖండము ప్రారంభము.

## 1 పండరీపురము.

ఇది బొంబాయి రాజధానిలోని సోలాపూరు జిల్లాకు చెందిన ప్రసిద్ధ క్షేత్రము. ఇది. కృష్ణానది కుపనదియగు భీమానది యొడ్డుననున్న శ్రీకృష్ణ క్షేత్రము, పెక్కుక్షేత్రములందు శ్రీకృష్ణవిగ్రహము కృష్ణవర్ణముగనుండి నను యీక్షేత్రమున నటులుగాక పాండుర (తెల్లని) వర్ణముతోనున్నందున పండరీపురమని పేరువచ్చినది. ప్రథమమున యిక్కడస్వామిని ప్రతిష్ఠచేసినవాడు పుండరీకుడను భక్తశిఖామణి. యీస్వామికి విఠోబా, విఠల యను పేర్లునుగలవు. వీటో—యిటుకపై నిలుచుండిన, బా—అయ్యా అనగాయిటుకపై శ్రీకృష్ణమూర్తి నిలుచుండియున్నాడని అర్థము. వి—జ్ఞానము. ట—లేనివారికి. ల—భక్తిజ్ఞానముల నిచ్చుక్షేత్రమని అర్థము. ఈ రెండు పదములును మహారాష్ట్రవాక్యములు. పుండరీక భక్తునిప్రతిష్ఠ కావున దీనికి పుండరీకపురమని మొదట పిలువబడి, తర్వాత పండరీపురమని వాడుకలోనికి వచ్చినది. భగవానుడు ఆనందమయ ముఖముతో రెండుచేతులును రెండు

తొడలపై నుంచుకొని యిటుకరాతిపై నిలుచుండియున్నాడు. భీమానదియొడ్డునసున్న యీక్షేత్రము. 350 అంగుల నిడుపును. 170 అంగుల వెడల్పును గలిగియుండును. ఇక్కడ పెక్కు పండాలు (అర్చకులు)ఉన్నను జాతిమత భేదములులేక యెల్లరును గర్భాలయమందుండు మూలవిరాటును స్పృశించి కౌగలించి ప్రార్థించుట కధికారము కలిగియుండుట మిగుల సంతోషదాయకము. దక్షిణదేశమందలి పన్నులవలెగాక దేవుని చూడగోరువారీయవలసినది అర్ధణావే. ప్రాకారములయందు నామదేవ. జ్ఞానదేవాది భక్తుల మూర్తులున్నవి యీదేవళమున గోచోటికిపోయినను. విఠలా. విఠలా. పాండురంగవిఠలా. పుండరీకవిఠలా. యనుభక్తిపారవశ్యమున వెలువడు. ఉచ్చైశ్స్వనములు, కర్ణపేయములుగను హృదయంగమములుగను వినంబడును, యీపురమున అనేకభక్తుల మఠములును సమాధులునుగలవు నల్లరాళ్లయిండ్లుగల యీప్రాచీన పట్టణమందలి ప్రజలుచాలవరకు భక్తులుగనేయున్నారు. యిక్కడ సొరకాయలతంబురులును చితారులునుచేసి విక్రయించువారి వీధి యొకటికలదు. బొంబాయి అనాథబాలబాలికా రక్షణాలయముకలదు. బాలవితంతువులు కామాతురలై గర్భములనుధరించి. గర్భభిన్నముసేయుటకు పాపభీతలై క్షేత్రయాత్రా నెపమున నిక్కడ ప్రసవించి దిగవిడచిపోవుదురు. ఆబిడ్డలనీసమాజమువారు పోషించి విద్యాబుద్ధులు నెప్పి జీవనోపాధిని గలుగజేసి. సంఘసంస్కర్తలుగ జేయుచుండుట భారతాభ్యుదయసూచకము, బాలవితంతవులకు క్రమశిక్షణముకాని పునర్వివాహములుగాని లేకుండుటవలన భారతదేశమునకు కళంకదాయకములైన యిట్టికార్యములు చేయుచున్నారనక తప్పదు. భగవానుడు త్వరగ. యీదుశ్చేష్టనుపోగొట్టి మేలును ప్రసాదించునుగాక.

2 ద్రోణాద్రి. (ధోండు.)

పూర్వము రామరావణ యుద్ధములో రామాదులు మూర్ఛితులైనపుడు హనుమంతుడీ ద్రోణాద్రిని దీసికొనివచ్చి యిందుండు ఓషధుల చికిత్సవలన శ్రీరామాదులు మూర్ఛతేరిరని రామాయణప్రసిద్ధము. యిది యొక రమణీయపర్వతము. ఇందనేక యోషధీ వర్గములుగలవు. హనుమద్దేవాలయముగలదు పెక్కురు యాత్రికు లిక్కడ సేవించిపోదురు.

3 అలహాబాదు. (ప్రయాగ.)

అలహాబాదు సంయుక్తరాజధాని ప్రధాననగరము. యిక్కడిమహరు (చౌకు) చాల సుందరమై 5-6 అంతస్తుల మేడలుగలిగి విశాలమైన వీధు.

లతో నొప్పారుచుండును. యీ చౌకులో అన్నివిధములైన దుకాణములును పాతమార్కెట్టును కలదు. యీ మార్కెట్టులో వస్త్రములు. కూరగాయలు పండ్లదినుసులు. నవధాన్యములు సహా దొరకును కొన్ని మేడలపై వారకాంతలు సోపాలు కుర్చీలపై చక్కగ అలంకరించుకొని కూర్చుండి హుక్కాత్రాగుచు. యువకాకర్షణమునకై దృష్టులను వలలొడ్డియుందురు. సాయంసమయములం దీవీధులలో గుంపు లెక్కువగ నుండును. ఇక్కడ కర్మాగారము లెక్కువగ లేకపోయినను వర్తకము చాలకలదు. నగరమునకు హిందువుల వాసస్థలములకు దూరముగ ఆంగ్లేయుల కావాసముగు బంగళాలుకలవు. కానింగ్. ఆల్బర్టు. ఎలిజిక్. లిస్టో. స్టేన్లి. మేయో. లాయల్. మొదలగు వీధులు విశాలములై పాంథులకు విశ్రాంతినిచ్చు విశాలవృక్షములు గల్గి శ్వేతముఖుల మనికిపట్టులుగనున్నది. ఇక్కడ యొకవిధమైన యెఱ్ఱరాతిగోడలతో కట్టిన ప్రధాన న్యాయస్థానము చూచుటకు సుందరముగను కట్టడములోపలి మధ్యభాగము స్ఫటికశిలలతో నిర్మింపబడియున్నది. కలకత్తా న్యాయస్థానము నైత మింతసుందరముగ నుండ లేదనవచ్చును. యిటనుండు అలహాబాదుకాలేజి. చాల సుందరముగను యెఱ్ఱనిరాళ్లతోను కట్టబడి హిందూదేశములోని అన్నిభాగములలో కన్న యెక్కువపద్ధతులు గలదియైయుండును. ఈ కట్టడమునకు ధనసాహాయ్య మొనరించిన జయపూరు ప్రభృతిమహారాజుల నామధేయములు జ్ఞాపకార్థము కలాశాలా సభామండపమున స్ఫటికశిలలపై వ్రాయించియున్నారు. లోపల నొక్కభాగమున నానావిధ ధర్మశాస్త్రములు నితర గ్రంథములును సకలభాషలలో నుండునవి. పెద్ద గ్రంథాలయము కలదు. అభ్యాసమునకు వలయు శాస్త్రీయపరికరములును పెక్కులుకలవు. ఇవిగాక యీఅలహాబాదులో ఖుస్రూబాగు. మేవొహాలు. బేగంబాగు. ఆల్బర్టుపార్కు. మొదలగు విశాల నందనవనములు చూడతగినవి. [illegible]యుగాక కంటోన్మెంటులోని మాల్ బర్స్ పార్కు విక్టోరియా [illegible] పార్కు. మొదలగు శ్రేష్ఠమైన వనములునుగలవు. 1910-వ సంవత్సరమువఱకు పరిపాలించిన. గవర్నరు జనరలు. మింటో ప్రభువుగారికి గొప్ప జ్ఞాపకచిహ్న స్తంభము మింటోపార్కును నిర్మించియున్నారు. యీ స్తంభము నాల్గు ప్రక్కలను కీర్తిశేషులైన శ్రీశ్రీ విక్టోరియామహారాణిగారియొక్కయు యెడ్వర్డు చక్రవర్తిగారియొక్కయు వాక్యరత్నములు. ధర్మపరిపాలనా శాసనములు చెక్కబడియుండుట చూచుట ముఖ్యము. ఇప్పుడుండు నగరమున

దక్షిణమునుండి యమునయు ఉత్తరమునుండి గంగయువచ్చి నగరమునకు తూర్పుగ 3-4 మైళ్లదూరములో సంగమించుచున్నది. యిందు గంగానది ప్రధానమైనది. ఈగంగానది కపిలమహర్షి కోపానలమున భస్మమైన అరువది వేలసాగరులకు స్వర్గలాభము కలుగుటకై భగీరథుని ప్రార్థనమున ఆకాశమం దుండినగంగ భూమికివచ్చుటచే భాగీరథియనియు తర్వాత జహ్నుముని తప మునకు భంగముచేయుటవలన అతడుకోపించి ఆగంగనుత్రాగగ. దేశీయుల ప్రార్థనమనుసరించి తన చెవులగుండ గంగనువిడిచినందువలన జాహ్నవియనియు గంగకు నామములువచ్చినవి. ఈగంగ హిమాలయమునందుండి గంగోత్త్రి యనుచోట ప్రణవాకారముగనుండు మంచుగడ్డ గుహనుండి బయలువెడలి 13800 అడుగుల యెత్తునుండి క్రిందికిదిగి వచ్చి తర్వాత హరిద్వారము దాపున 1024 అడుగుల యెత్తునుండి భూమికివచ్చి తర్వాత కాశీనగరమున 350 అడుగుల యెత్తున ప్రవహించి పిదప కలకత్తాసమీపమున బ్రహ్మపు త్రానదితో కలిసి సాగరమునుచేరును. పెక్కు శాఖానదులీ మహానదిలో కలిసినను. యమున. గుమతి. కోశెలా. గండకి. నదులే పెద్దవి. యిట్టి పెక్కు పనదులు చేరుటచేతనే హేరాళముగ ధాన్యాదులు ఫలించుటకై యీ నీ టిని సమీపస్థదేశములగు. హరిద్వారము. గార్వాల్. కానుపూరు. అలహా బాదు. కాశీ. లక్నో. ఫైజాబాదు. పాటలీపుత్రం. అయోధ్యా. కలకత్తా మొదలగు నగరములందు కాల్వలు దీసి ప్రవహింపజేయుచు. ప్రసిద్ధములై వెలయుచున్నవి. ఈగంగానది కోట్లకొలదిజనులను ధాన్యమూలమున రక్షిం చుటయేగాక స్నానపానములకు ప్రధానములై ఆరోగ్యభాగ్యము లొసగు స్వాభావిక భిషఙ్మణియైయున్నది. ఈ ప్రయాగ మాహాత్మ్యమొక పెద్ద గ్రంథముగనున్నది. పూర్వము ముచికుందఋషి తన పదుగురుశిష్యులతో గూడ యీ గంగా యమునా సంగమస్థానమున చక్రవర్తియు. మంత్రులును గా జన్మింపవలెనని యెనిమిదిశ్లోకములు వ్రాసి. దోసెలమ్ము ముసలిదాని కొసగి. తామా నదీగర్భంకి ప్రాణములువదిలి తర్వాత. ఢిల్లీలో అక్బరు పాదుషాజన్మమున ఋషియు, శిష్యులు మంత్రులుగను జన్మించి తమకుం గల పూర్వజ్ఞానమున శ్లోకములవిషయము స్ఫురణకువచ్చి మంత్రులు దో సెల ముసలిదానికడకువచ్చి ఆశ్లోకములందీసికొని పోయి పాదుషాకు చదివి వినిపించిరట. పాదుషా ఆ శ్లోకములును దానికథయువిని సంతసించి యీ ప్రయాగకు. అల్లాబాదు. అల్లా-భగవంతుని, బాదు-పట్టణము. అని పేరు పెట్టి. జాతిమతభేదములు లేక బ్రాహ్మణులకు మడిమాన్యములిప్పించె.

ఆనగర మన్యులవాతబడకుండ రక్షింప నమకట్టి. 1575-వ సంవత్సరమున నొకకోటకట్టి చెనట. ఆకోట గోడ నానుకొని యమునప్రవహించుచున్నను. ఆగోడ చెక్కు-చెదరకున్నది. ఈ కోటలో మధ్యభాగమున 30 అడుగుల జంగా స్తంభమునాటి బుద్ధమత చక్రవర్తియగు అశోకుని చరిత్ర శాసనములు చెక్కింపబడియున్నవి. యీకోటలోనే వటవృక్షముండెనట అది యిప్పటికి సుమారు 1500 సంవత్సరములు దాటినదని చెప్పుచున్నారు. యిపుడా బృహద్వృక్షము కానరాదు. గుడ్డలుచుట్టిన రెండుశాఖలు మాత్ర మగపడుచున్నది. యిది కోటలోని భూగృహమునయున్నది. యీ గుహలో "త్రివేణీ మాధవంసాంబం భారద్వాజంచ వాసుకిం । వందేక్షయ వటం శేషం ప్రయాగం తీర్థనాయకః॥" అను శ్లోకములోని దేవతలును మరి పెక్కుమూర్తులును వసించియున్నారు. యీ మూర్తులకు నిత్యనైవేద్యాములు జరుగుచున్నవి. యీ కోటలోనే యుద్ధభటులు కొందరున్నను నగర మధ్యమున క్రొత్తకోట (న్యూఫోర్టు)లో చాల సైన్యముండును. సోమేశ్వరాలయము యమునానదికి దక్షిణపుగొడ్డున గలదు. పడవలోపోవలెను. ఇక్కడ కనోజిబ్రాహ్మణులు తీర్థపురోహితులుగ నుండినను. యిపుడు ఆంధ్రద్రావిడ మహారాష్ట్ర బ్రాహ్మణు లనేకులు పురోహితులుగ నున్నారు. ఈ స్థలమునకు కార్తీకశుద్ధ ద్వితీయనాడు యముడు తన చెల్లెలగు. యమునను జూడవచ్చునట నాటిరోజున యాత్రికులు వేలకొలది త్రివేణిలో స్నానముసేయవత్తురు. యిదియునుగాక ప్రతి మాఘమాసమునను మాఘమేళమనియు పదిరెండేడుల కొక్కతూరి కుంభమేళమని కుంభమాసమున జనులీ ప్రయాగలో గృంకుటకువత్తురు. అపు డొక్కమాసము రోజులు లక్షలకొలది భక్తులతో అలహాబాదు నిండిపోవును ఇక్కడికి యాత్రవచ్చు స్త్రీ పురుషులు వేణీదానము (క్షౌరము) చేయవలెను. అందుకై ప్రతిదిన మిక్కడనుండు మంగలులు సుమారు 2 వందలమందియుందురు. సంకల్పక్షవరాదులు జరిగిన తదనంతర మీ సంగమక్షేత్రమున శ్రాద్ధాదులాచరింపవలెను. గంగాయమునలు బహిరంగముగను. సరస్వతి గుప్తముగను యిట సంగమమగును. కావుననే దీనికి త్రివేణియను పేరువచ్చినది. ఇక్కడి బ్రాహ్మణులు మాంసభుక్కులై యుండిరట. అపుడు శ్రీమదాది శంకరు లిక్కడికిరాగా వారికీ బ్రాహ్మణులు పలలమును పచనముచేసి పెట్టగా ఆచార్యులవారు భుజించిరట. అదిమొదలీ బ్రాహ్మణులలో పదు గురుస్వామికి శిష్యులై వారివెంట తిరుగుచు యథేచ్ఛగ మాంసమత్స్యము

లను [illegible]ించుచుండిరట. అదిజూచి స్వామి వారొక్కచోట కొలిమిలో కరిగి నీరువలెనుండిన యినుమును త్రాగి శిష్యులనుగూడ త్రాగుండనిచెప్ప. తమకంతటిశక్తి లేదని శిష్యులు మనవిచేసిరట అపుడాచార్యులు క్రుద్ధుడై మూర్ఖులారా! సమత్వశక్తిలేనిమీరు నేనుమాంసమును తింటినని మీరు ను తినతగునా కష్టసుఖములందు సమతలేనిమీరు భ్రష్టులగుదురుగాక యని శపించెనట, తదుపరి, యీశిష్యులు పదుగురును గోసాయీలనుపేరుతో సంచారముచేసి శిష్యవర్గమును చేర్చుకొనిధనాఢ్యులై, వన, రణ. గిరి, పర్వత, సాగర, భారతి, పురి, సరస్వతి, తీర్థ, ఆశ్రమ, అనుపదిపేరులతో ఆశ్రమములను స్వీకరించి అక్బరుపాదుషాయిచ్చిన మాన్యము లనుభవించుచు, సుఖజీవనులైయుండి, తర్వాత పాలించిన మహమ్మదీయ ప్రభువుల మతద్వేషములకు గురియై అడవులపాలై యీస్టిండియాకంపెనీ రాజ్యము చేయునప్పటికి మరలచేరుకొనిరట యీత్రివేణీపరిసరమున. యిరువు రాంధ్రపురోహితులిపుడు జగన్నాథశాస్త్రి. సూరయ్యశాస్త్రిగార్లు. మనదేశ యాత్రీకుల కాశ్రయమిచ్చుచున్నారు. యీత్రినదీసంగమ స్థలము చూచుటకు రమణీయముగ నుండును. ముఖ్యముగ గంగానది సుమారు 1 మైలు వెడల్పుకలదయి. పడవలపై నిర్మింపబడిన వారధిగలదై. జలప్రవాహము వేగముకలదిగనుండును యమున చాల లోతుకలదిగను. తనబిడ్డలవలె మెలగుచుండు పెక్కు మొసళ్లుగలదిగను చూపరులకు భయమిచ్చును ఇక్కడహిందూముసల్మానుల భేదముకనిపట్టుట చాలకష్టము వారికి వీరికి నడవడి చాల సమీపించియుండును. అందరును హిందుస్థాని భాషనే వాడుదురు. పంచగౌడ బ్రాహ్మణస్త్రీలు కంచుకములు ధరింపకపోయినను. మేల్ముసుగులేక బయట అడుగుపెట్టరు యీస్త్రీలారుమూరల పొడవునాల్గుమూరల వెడల్పుగల తెల్లని వస్త్రములనుగాని చెంగావిపంచలనుగాని కట్టుకొందురు. ఇక్కడి స్త్రీలెక్కువ భాగము చాల అందముగలవారుగ నుండినను తక్కువమూరల చీరలును మురికిబట్టలను కట్టుటవలన వారిఅందము చాలవరకు తగ్గినను. పురుషులకంటెను స్త్రీలు ముందుగ ప్రాతఃస్నానముసేయుదురు. శివపూజాధురంధరలును గలరు. దక్షిణదేశపు స్త్రీలవలె యుత్తర దేశపు స్త్రీలు వస్త్రాభరణ పిశాచములకు లోబడియుండు నటులు కనుపించదు. దక్షిణదేశ స్త్రీపురుషులు భోగప్రియులనియు ఉత్తర హిందూస్థాన స్త్రీపురుషులు భోజన. భక్తిప్రియులనియు చెప్పనొప్పును. తనువస్త్రాదుల

శుద్ధత్వమున యిక్కడివారు శ్రద్ధవహింపకపోయినను పాత్రముల మాత్రము తెల్లగను శుద్ధముగను తోమియుంచు కొందురు. దాక్షిణాత్యుల వస్త్రములును ఔత్తరాహుల పాత్రలును శుభ్రములు, దక్షిణవాసుల పాత్రలును ఉత్తరవాసుల గుడ్డలును. అశుభ్రములు, యిక్కడదృష్టి. స్పర్శ దోషములులేక. తక్కువజాతివారు బ్రాహ్మణుల వంటగదుల లోనికి ధారాళముగ వత్తురు తైల ఘృతపక్వములైన మిఠాయిలును శూద్రుల దుకాణములందు బ్రాహ్మణులు తీసితిందురు. ఇక్కడి రైలుస్టేషనునుండి. ఢిల్లికి ని, కలకత్తా, బొంబాయి అయోధ్యలకు పోవుయినుపదారులు గలవు. చాలపెద్దస్టేషను.

4 నైమిశారణ్యము (నయినటాల్.)

అలహాబాదుకు సమీపమున జబ్బలుప్పూరు రైలుమార్గముగ యీ నైమిశమునకు రావలెను. జబ్బలుపూరునకు 224 మైళ్లదూరమునకు కలకత్తాకు 504 మైళ్లదూరమునను, యీక్షేత్రము కలదు పర్వతముపై కట్టబడినదీ నగరము. ఇాదైదు పర్వతములకు మధ్య నొక్క సరోవరమున్నది యీపర్వత పంచక ప్రకృతి గంభీర రమణీయతలను వర్ణింప నలవికాదు. అనేక పాఠశాలలును. దేవళములును చికిత్సాలయమునుగలవు యిందుండు జలపాతములు చూడవేడుకయైనది. కొండల క్రింది భాగమందుండు సరోవరమున గంధక జలమధికముగనుండుట కతన చాలమందిదీర్ఘరోగు లారోగ్యముకొఱ కిక్కడి కేతెంతురు. యీనైమిశారణ్యము పుణ్యక్షేత్రము మహర్షుల కావాసము. అనిపురాణప్రసిద్ధి కావున యాత్రికులు అధికముగ వత్తురు. యాత్రార్థులకు వాసయోగ్యముగ. బిహారీలాల్ కుంబీలాల్ గారి ధర్మసత్రమున్నది. యెక్కాలు. టాంగాలు. అను. ఒకటిరెండుగుఱ్ఱముల బాడ్లున్నవి. పర్వతముపైకి పోవుటకు బాడ్లువలయును. బాడుగ అధికము.

5 వింధ్యవాసిని.

ప్రయాగనుండి కాశీకివచ్చు రైలుమార్గమున నుండు క్షేత్రము. శ్రీ కృష్ణునిచే నిర్మితమై కంచునిచేతికిచిక్కక యోగమాయ యిక్కడ వాసముచేయుచున్నది. వింధ్యపర్వతముపై యీక్షేత్రమున్నది. పర్వత సమీపవర్తినియై గంగ ప్రవహించుచుండును. ఉదయము రైలులోవచ్చి యిక్కడదిగి దేవీదర్శనముచేసికొని మధ్యాహ్నముబండికి కాశీకిపోవచ్చును.

# కాశీక్షేత్ర నామములు.

6 కాశీ. (వారణాసి.)

ఈ కాశీక్షేత్రమునకు వారాణసియనియును, వారణాసియనియును, హూణులచే బెనారిస్ అనియును ఇట్లు వ్యవహారనామములును, పర్యాయనామములును పెక్కులుగలవు.

## కాశీక్షేత్రమానము.

కాశీక్షేత్రము బార్హస్పత్యమానము ననుసరించినది గనుక చాంద్రసౌరమాన వ్యవహారము ననుసరించి చెన్నపట్టములో వాడఁబడుచుండు సంవత్సరమునకంటె పన్నెండు సంవత్సరములు ముందు అచ్చోట వాడఁబడుచున్నది.

## కాశీక్షేత్ర సంకల్పము.

ఈదేశమున సంకల్పము చెప్పునట్లుగా మొదటినుండి "భరతఖండే" అనుపలుకు చెప్పిన తర్వాత "ఆర్యావర్తైకదేశే, అవిముక్తవారాణాసీక్షేత్రే, అసవరణయోర్మధ్యే, మహాశ్మశానే. గౌరీముఖే, త్రికంటకవిరాజితే, భాగీరథ్యాః పశ్చిమేతీరే, బౌద్ధావతారే, విక్రమశకే...సంవత్సరే" అనువలుకుజెప్పి, తక్కినది మన దేశములోవలెనే చెప్పుచున్నారు.

## కాశీనగరస్థితి.

ఈకాశీపట్టణము చూచుటకు అత్యద్భుతమై, మిగులపనితనముగల మిద్దెలుమేడలుగలిగిన ఇండ్లతోఁ గూడి అనేక ధనవంతులకు వాసస్థానమై మిగుల విలువగల పీతాంబరములు ఇత్తడిపనులు మొదలగువానికి ప్రసిద్ధి పొందుచున్నది.

## కాశీక్షేత్రమహిమ.

ఏనియందు పరమాత్మస్వరూపమైన తేజస్సు తేజరిల్లుచున్నదో దానికి (కాశి) యనినామము. అనఁగా సృష్టికిముందు నిర్గుణబ్రహ్మము తేజరిల్లుచుండు కాలమున బ్రహ్మకును, విష్ణువునకును, అహంపూర్వమహంపూర్వమనెడు (నేనుముందు నేనుముందనెడు) వివాదము సంభవించి, ఆజ్యోతిరూపమునుజూచి యిర్వురును శాంతినొందిరి.

వరణా, అసి, అనెడు రెండునదులకునడుమ నుండుటంబట్టి వారణాసి యని పేరుగలిగినది.

శివుఁడు అనాదిగా ఈక్షేత్రమును విడిచిపెట్టుటకు ఇష్టములేనివా

డై లింగాకారమున మఱుఁగియుండుటవలన దీనికి (అవిముక్తక్షేత్రమని) పేరువచ్చినది.

జ్యోతిర్లింగము ఇచ్చట పంచక్రోశాత్మికముగా నుండుట చేతను, ఆదియందు జ్యోతిభూతమునకు వాసయోగ్యమై, బ్రహ్మాదులిచ్చట తపస్సుచేసి సకలసిద్ధులనుబొంది వారివారిచే స్థాపింపఁ బడిన లింగములు వెలయుటచేతను, అగస్త్యాది మహర్షులు విశ్వేశ్వరుని భజించినందు చేతను (ఆనంద) వనమనే పేరు కల్గినది.

దేవదానవు లాదిగాఁగల వారలకు వలయు సుఖసంపదలొసంగు స్థలమగుటంబట్టి (ఆనందపురియనే) నామము కలిగినది.

పూర్వాదిదిక్కులయం దనేకరుద్రమూర్తులు వసించుట చేతను, కాశియందలి ప్రాణులెల్లరు రుద్రమూర్తులై యుండుటంబట్టియు (రుద్రావాసమని) పేరువచ్చినది.

బ్రహ్మాండము మొదలుగాఁగల కార్యప్రపంచములు లీనమగు క్షేత్రమగుటంజేసి మహాశ్మశానమనఁబడెను.

మహాప్రళయములయందు జ్యోతిభూతమున కిది నివాసయోగ్యమై త్రిగుణాత్మికమైన మూఁడుముండ్లవలెనుండు ఆయుధముచే నీభూమిని యెత్తబడెను, గాన (త్రికంటక విజితము) అని పేరొందినది.

కాంచి మొదలగు శక్తిపీఠములలో నీకాశియే ప్రథమపీఠ మగుటంబట్టి (గౌరీముఖము) అను పేరుకలిగినది.

ఇట్లని కాశీఖండము మొదలగు క్షేత్రమాహాత్మ్య గ్రంథముల యందు చెప్పంబడియున్నది.

మఱియు అవిముక్తక్షేత్రమైనందువలన గంగాదేవి విశ్వేశ్వరుని యొక్క అనుగ్రహమును సంపాదించి అసివరణల మధ్యయందు ప్రవేశించి ఆక్షేత్రమునందుండు ప్రాణులకెల్ల నుపద్రవము లేకను, పాపమునురోగమును లేకను చేసెదనని ప్రమాణముచేసి ప్రవేశించినట్లు ఈస్థలమాహాత్మ్యము నందు చెప్పియున్నది. కాశి యను రెండక్షరములను సంస్మరించినవాఁడుయ మబాధలేక శివపదమునొందునని పద్మపురాణమునందు చెప్పఁబడియున్నది.

కాశికాశియని రెండుమాఱులు చెప్పునట్టివాఁడు పరిశుద్ధుఁడగుచున్నాఁడనియును, కాశి యని జపించువాఁడు పరమయోగి యగుననియును స్కాందపురాణమున చెప్పఁబడియున్నది.

కాశీ క్షేత్రమును దర్శించినవారును, పఠించువారును, ప్రపంచము

నందుండు సకల క్షేత్రములను దర్శించి, సకల క్షేత్రమహిమలను వినిన యెంతఫలమో, అంతఫలమునకు పాత్రులగుదురని బ్రహ్మాండపురాణము నందు చెప్పఁబడియున్నది.

ఈస్థలములను దర్శించినవారు బ్రహ్మ హత్యాది పాతకములవలన విడువఁబడి శివసాయుజ్య మొందుదురని లింగపురాణమునందు చెప్పఁబడి యున్నది.

తీ ర్థ ము లు

బ్రహ్మదేవునిచే సృజింపఁబడిన సమస్త తీర్థములకన్న పవిత్రక్షేత్ర మైన ప్రయాగతీర్థము విశేషమైనది. ప్రయాగకన్నను కాశీయందలి తీర్థములు శ్రేష్ఠములైనవి. అందు మణికర్ణిక, ప్రయాగలోని త్రివేణీ సంగమము, జ్ఞానవాపి, గంగ, అనునివి మిగుల శ్రేష్ఠములైనవి.

ప ం చ న దీ.

ఇందు ధూతపాప, కిరణ, గంగ, యమున, సరస్వతి, ఇవి చేరినది పంచనది యనఁబడును.

వేదశిరుఁడనుఋషియొక్క కుమార్తె తపస్సుచేసి సకలనదుల యొక్క పాపములను పోఁగొట్టినందుచే (ధూతపాపయని) పేరువచ్చినది. దానిని యముఁడు గాంధర్వ వివాహంబున కిచ్ఛయింపఁగా నది తనతండ్రి యనుమతిలేక సమ్మతింపననినందుచేత,నీవుశిలారూపమైపోదువుగాకయనియముఁడు శపింపఁగా, అది యముని జలరూపముగా పోదువుగాక యని శపించి, తనతండ్రికి జరిగినవర్తమానంబంతయు విన్నవింప; వేదశిరుఁడు తనకుమార్తెను చంద్రకాంతశిలయై ఆనదితోఁకలిసి ప్రవహించుచుండుమన, నాధూతపాప ఆలాగేచేసెను. సూర్యునితపస్సుచే కలిగినస్వేదము,కిరణ అనునదియై దానితోఁకలిసెను. తర్వాత గంగా యమునా సరస్వతులును అందుచేరెను.

మ ణి క ర్ణి క.

విష్ణువు తనచక్రముచేత తీర్థమునుకల్పించి తపస్సు చేయుచుండఁగా శివుఁడు పార్వతితోఁగూడి విష్ణువునొద్దకురాఁగా పార్వతియొక్క కర్ణికామణి (చెవికమ్మ) ఆచక్రతీర్థములో పడిపోయెను. అంత శివుఁడు వెదకఁగా, విష్ణువు భావసురదివ్యమైన శివుని పరిహాసింపనెంచి కనఁబడకచేసెను. అప్పుడు శివునిమానసమును, పార్వతీదేవి మణికర్ణికయును ఆచక్రతీర్థమును ఆకర్షించిన దగుటవలన. ఆతీర్థమునకు మణికర్ణికయని పేరు కల్గినది. ఈతీర్థము అన్నితీర్థములకంటెను విశేషమైనది. ఈ మణికర్ణిక విష్ణువుయొక్క చక్రము

వలన గలిగినందువలన (చక్రతీర్థమనియును) భగవంతుని స్వేదము కలిసినందువలన సూర్యతీర్థమనియును. బ్రహ్మతీర్థమనియును ప్రసిద్ధినొందెను.

చ క్ర తీ ర్థ ము.

చక్రతీర్థము మణికర్ణికాఘట్టమునకు సమీపమున చిన్నగుండముగానున్నది.

జ్ఞా న వా పి.

శ్రీ విశ్వేశ్వరునిసన్నిధికి సమీపమున జ్ఞానవాపి యనేతీర్థమున్నది. ఈతీర్థమునకు (జ్ఞానోదయమనియును), (శివతీర్థమనియును) పేరుకలదు.

గం గ.

సత్యలోకమునందుండి దిలీపమహారాజు కొమారుండైన భగీరథుని నిమిత్తము మహావిష్ణువుయొక్క పాదాంగుష్ఠమునుండి భూమికివచ్చినంత, దానిని శివుండు శిరస్సున వహించినందుచే సకలనదులకంటెను శ్రేష్ఠమైనది అది శివవాసమైన కాశియొక్క పూర్వభాగమునందు ఉత్తరవాహినిగా ప్రవహించెను; మరల విశ్వేశ్వరుని యనుగ్రహమువలన పరిశుద్ధతనుబొంది కాశికావల పూర్వవాహినియైనది. ఇట్లని సనత్కుమార సంహితయందు చెప్పంబడియున్నది.

య ము న.

సూర్యుని భార్యయైన ఛాయాదేవి గర్భవతిగానున్నప్పుడు సూర్యుండు ఆమెసంగమము నభిలషింపగా, నాదేవి గర్భకాలమున సంయోగము విధికాదనినంత సూర్యుండు మోహావేశపరుండై ఆమెచెంతకు రాంగా, నాతని తేజోవేగమునకు గర్భము విచ్ఛిన్నమై, కొంత పిండముగాను, కొంత ఉదకముగాను స్రావమైనంత దానింగని, ఛాయాదేవియు సూర్యుండును విస్మయమానసులైరి. అప్పుడు విష్ణువును రుద్రమూర్తియును ప్రసన్నులై విష్ణువు తనశక్తిని ఆయుదకములో ఆవహింపజేసి (యమునానది) యనే నామముతో ప్రవహించు నట్లనుగ్రహించెను.

రుద్రుండు తనశక్తిని ఆపిండమునందుంచి అందువలనం బుట్టినట్టి వానికి యమధర్మరాజని పేరుబెట్టి దక్షిణదిక్కును పాలించునట్లు వరం బొసంగెను.

ఆ యమునయనే నది స్త్రీరూపముతో నిక్కడికివచ్చినంత మాధవమూర్తి దానింగని మోహించి భార్యగా వరించెను.

ఇట్లుండఁగా భగీరథుండు గంగను భూలోకమునకు తీసికొనివచ్చు

చూడఁగా, యమున గంగయొక్క మహామనోజ్ఞంగి గంగదగ్గఱకుఁబోయి నేనును నీతోఁ కలిసి ప్రవహించుటకు సమ్మతినొందియున్నాను గాన, నాకొ రిక నెఱవేర్చుమనఁగా, గంగ యమునను జూచి యిట్లనియె. నీపేరు మహాప్ర సిద్ధిగానుండుటచే. నేను నీతోఁ గూడినచో నాపేరు భూలోకమున లేకపోవునే యనినంత, యమున గంగా సహవాసాపేక్షితురాలై పేరుమాత్రము నీది గాను, ప్రవాహస్వరూపము మాత్రము నాదిగానుండఁదగినదని వరమిచ్చె ను. అది మొదలుగా పేరుమాత్రము గంగానదియనియును. స్వరూపము మాత్రము నేటివఱకు నైల్యవర్ణముగను ఉన్నది.

సరస్వతి.

బ్రహ్మదేవుఁడు దశాశ్వమేధములు చేసిన పిదప యాగంబులకంటె ప్రకృష్టంబైన ప్రయాగను, (అనుష్టుప్పును) స్తుతిచేయుటకు ప్రారంభించి ముగించుటకు శక్తుఁడు గాకపోయెను. అప్పుడు సరస్వతీదేవి నేను పూర్తిచే సెదనని వచించి స్తుతించుటకు ప్రారంభించెనుగాని, ఆమెచేతను తుదముట్టక లజ్జాక్రాంతురాలాయెను. ఇట్టిసమయమున బడబుడను రాక్షసుఁడు అతిశ్రు త్తుగలవాఁడై లోకమును హింసించుచుండఁగా, హరిహరులు బ్రహ్మదేవు నికడకు వచ్చి బడబునిబాధను పోఁగొట్టుటకు ఆలోచించుచుండిరి. అంతస రస్వతీదేవి యేఁబాగుననైనను ప్రయాగను స్తుతించుటకు చేతకాకపోయిన కారణమునుబట్టి లజ్జితురాలై బ్రహ్మముఖమును చూడకయె తప్పించుకొ నుట కిదియె యుపాయమని తలంచి నేను భూలోకమునకుఁబోయి ఆబడ బుని సంహరించి వచ్చెదనని ప్రతిజ్ఞచేసి, వాని యానతిమీఁద వీణాగానము చేయుచు, భూలోకమున బడబునియొద్దకు వచ్చినంత, ఆరాక్షసుఁడు ఆమె సుందరాకారమునుజూచి మోహించి కొంతసేపు మోహముచే లోకము నకు హింసచేయనివాఁడై ఆమెనుజూచి, నేను నిన్ను వివాహము చేసికొనఁ గోరియున్నాననఁగా సరస్వతి యిట్లనియె. నీవు క్షుద్బాధతోనున్నాఁడవు గ నుక నీయాఁకలిని తీర్చికొని వచ్చితివేని, తర్వాత ఆ విషయమునుగూర్చి మాటలాడవచ్చుననఁగా, ఆఁకలి నివృత్తికి యుపాయమును నీవే చెప్పవల యుననఁగా. ఆరాక్షసుని సరస్వతి తనవెంటరమ్మని సముద్రము మధ్య తె చ్చి యీనీళ్ళను త్రాగితివేని నీక్షుత్తు నివారణమగునని చెప్పెను. బడబు డుఅగ్నిస్వరూపముతో ఆనీటిని నేటివఱకును పానముచేయుచున్నాఁడు. అం తసరస్వతి తనచేనుతింపనలవిగాని ప్రయాగను దర్శించి పోవలయునని యెం చిరాఁగా, గంగా యమునలు సరస్వతిని స్తుతించి, నీవుమాతో కలిసియుం

డవలసినదని వేడినంత, సరస్వతి యిట్లనియె. నేను ప్రయాగను స్తుతించి పూర్తిచేసెదనని వాఖ్యర్తకు చెప్పిపూర్తిచేయకపోతిని; గాన నేను మీతో కలిసి ప్రకాశముగా ప్రకాశించినయెడల బ్రహ్మానన్ను జూచి ప్రయాగస్తుతి పరిసమాప్తి చేయకపోతివేయని యడుగును. అప్పుడు నేనుతలవంచుకొన వలసివచ్చును. గాన నేను మీతో గుప్తగామినిగా ప్రవహించెదనని చెప్పి, ఆప్రకారమె వారితో కలిసి ప్రవహించుచున్నది. ముక్తికాంతయనే స్త్రీకి గంగా యమునా సరస్వతులు మువ్వురును మూడుపాయలుగల జడగా నయినందున త్రివేణియని పేరుకల్గెను. ప్రయాగలోనుండు అక్షయపటము త్రివేణియనే జడకు కుచ్చుగా ప్రకాశించుచున్నది. గంగా యమునలు పాపములను కత్తరించుటకు కత్తెరగానున్నను ఆకత్తెరను బిగించే చీలలేనందున సరస్వతి చీలయైనది. ఇట్టికత్తెర జనులపాపములను కత్తరించుటకు వాడియైన ఆయుధముగా నున్నది. శ్లోక.

త్రివేణీ సంగమము.

గంగాయమునా సరస్వతులు అను నీమూడునదులు కూడినందున నీపేరుకల్గెను. దీనిని కామ్యతీర్థమనియుం జెప్పుదురు. (ఇదిప్రయాగలో నున్నది).

విమలోదక తీర్థము.

ఇది కాశికి ఉత్తరపార్శ్వంబునం దున్నయది. ఇదియొక బావి వలెనున్నది.

బిం దు తీ ర్థ ము.

అగ్నిబిందుడను ముని పంచనదంబునందు మాధవునిఁ గూర్చి వివిధంబులుగ స్తోత్రంబులు చేసిన కారణంబున యాతీర్థంబునకుం బిందుతీర్థమని పేరుకల్గెను.

ఇంకనుగొన్ని తీర్థములు నామమాత్రావశిష్టముగను, మఱిగొన్ని సరియైన పేర్లతో లేకను నున్నది. గాన వానిపేళ్లు మాత్రము వివరింపబడుచున్నది.

పాదోదకతీర్థము, క్షీరాబ్ధితీర్థము, లక్ష్మీతీర్థము, గరుడతీర్థము, నారదతీర్థము, అంబరీషతీర్థము, దత్తాత్రేయతీర్థము, భృగుతీర్థము, ప్రహ్లాదతీర్థము, వామనతీర్థము, నరనారాయణతీర్థము, విదారణనారసింహతీర్థము, గోపీగోవిందతీర్థము, విశేషతీర్థము, శంఖమాధవతీర్థము, హయగ్రీవతీర్థము, విష్ణుతీర్థము, బహుబలనారసింహతీర్థము, అనంతవామనతీర్థము, నిర్వా

ణిమాధవతీర్థము, వామనతీర్థము, ఇంద్రాద్యష్టతీర్థములు, హరిశ్చంద్రతీర్థము, పితామహతీర్థము, పాశుపతతీర్థము, రుద్రావాసతీర్థము, విశ్వతీర్థము, మోక్షతీర్థము, (తారకతీర్థము,) స్కందతీర్థము, భవానీశంకరతీర్థము, దుండి (ఢుంఠి) తీర్థము, బ్రహ్మతీర్థము, నందితీర్థము, శైలతీర్థము, నాభితీర్థము, బ్రహ్మనాదతీర్థము, మార్కండేయతీర్థము, ఖరతీర్థము, వసిష్ఠతీర్థము. నర్మదాతీర్థము, సంధ్యాతీర్థము, గంగాకేశవతీర్థము, యోగినీతీర్థము, అరుంధతీతీర్థము, అగస్త్యతీర్థము, ఇవి మొదలుగాఁగల శైవవైష్ణవతీర్థములు పెక్కులుగలవు.

పంచనదీ మహిమ.

పంచనదీతీర్థంబున స్నానంబు జేసినవారు భౌతికశరీరమును త్యజింపఁ బడినవారలై దివ్యశరీరధారులై ముక్తినొందుదురు.

మణికర్ణికా మహిమ.

ఇది సమస్తతీర్థంబులకన్న నెక్కుడగుటంబట్టి యిందు మునుఁగులిడు వారు సకల పాపదూరులై సకలాభీష్టసిద్ధులం బడయుదురు. దీనియందు కార్తికమాసంబునందు స్నానంబుసేసినవారు విశుద్ధ దేహులగుదురు.

చక్రతీర్థ మహిమ.

ఇందు కాశికిపోయినట్టి ప్రతివారును మొదట స్నానము జేయవలసినది. పాపములెల్లను పరిహారమగును.

జ్ఞానవాపి మహిమ.

ఈతీర్థమును ఈశానరుద్రులు కల్పించినందున విశ్వేశ్వరుఁడు వారికి ప్రసన్నుండై ఈవాపి (బావి) యందు స్నానముచేయువారికి జ్ఞానము నొసంగెదనని వరమిచ్చిన కారణముచే నిందు మునుఁగువారికి జ్ఞానసంపాదనంబు కలుగును.

గంగానది మహిమ.

కలియుగమునందు ప్రవహించు సమస్తనదులకన్నను ఈగంగానదియే శ్రేష్ఠమైనదగుటంబట్టి యిందు స్నానంబు చేసినవారు తమ సంతతి వారితోఁ కూడ పరమపావనులై దురితదూరు లగుదురు.

మరియు కృతయుగమున సకలతీర్థములును పవిత్రములైనవి యనియును, త్రేతాయుగమునందు పుష్కరము విశేషమైనదనియును, ద్వాపరయుగమునందు కురుక్షేత్రము శ్రేష్ఠమైనదనియును, కలియుగమునందు గంగానదియే యుత్కృష్టమైనదనియును జెప్పఁబడియున్నది.

## యమునానదీ మహిమ.

ఈతీర్థమములో స్నానంబుచేసినవారికి సమస్తపాపములును పరిహారమగునని విష్ణుమూర్తియాజ్ఞగలదు. కనుక ఇందు మునింగినవారికిపాపంబులు పరిహారంబు లగును. కార్తీకశుద్ధవిదియనాఁడు యమునాస్నానము ముఖ్యము. ఆదినము యమధర్మరాజు తన తోఁబుట్టువును చూచునిమిత్తమై నచ్చి యిక్కడ నాటిదినమున స్నానముచేయువారి వంశస్థులకందఱికిని యమబాధలేక చేసెదనని వరమిచ్చి యుండుటచే ఆదినమున స్నానము చేయుట విశేషము.

## సరస్వతీమహిమ.

ఈతీర్థమునందు మృతులగువారు పుణ్యవంతులగుదురు.

## త్రివేణీమహిమ.

ఇందు స్నానంబుచేసినవారు సకల పాపవర్జితులై ముక్తినిఁబొందుదురు. మఱియు ధైర్యముతో ప్రాణదానము నిచ్చుటచేయువారు వారికోరిక ప్రకారము భూమియందుఁబుట్టి సకలసుఖములను అనుభవించి, యీక్షేత్రమునందే మరణముజెంది సాయుజ్యము నొందుదురు. ఈతీర్థమున మునుంగువారియొక్క కోరికలన్నియు నీడేరునుగాన, దీనిని కామ్యతీర్థమనియుం జెప్పుదురు.

## విమలోదక తీర్థమహిమ.

ఈతీర్థంబునందు స్నానంబుజేసి పితృదేవతలకు తర్పణంబు జేసిన యెడల అనేకకోట్లపాపంబులు పరిహారంబై పితృదేవతలు తృప్తినొంది తరతరముల వారిని తరింపఁజేయుదురు.

## బిందుతీర్థ మహిమ.

ఇందు గ్రుంకలిడినవారికి మాధవమూర్తి వారివారి యభీష్టంబుల నిచ్చును ఇంతియగాకపాపోదకతీర్థము మొదలుగాఁగల తీర్థములయందు గ్రుంకులిడువారికి ఆయాతీరములం దధివసించియుండు విష్ణ్వాభిధేయమూర్తులును, శివాభిధేయమూర్తులును కోరిన ఫలములు నొసంగుదురు.

## ఘట్టములు.

ఈఘట్టములన్నియు కాశి గంగానదిగట్టున నొక్కొక కారణమును బట్టి యొక్కొకరి పేర ఒక్కొక స్థలమునం దొక్కొక ఘట్టము ఏర్పడి యున్నది. అయినను ఆయాఘట్టములకు మహిమలు వేఱువేఱుగానుండును.

వరణాఘట్టము. రాజఘట్టము, త్రిలోచనఘట్టము, దుర్గాఘట్టము,

దశాశ్వమేధఘట్టము, కేదారఘట్టము, హనుమద్ఘట్టము, అసిఘట్టము, పంచగంగా (పంచనది) ఘట్టము, మణికర్ణికా ఘట్టము. భైరవ ఘట్టము, ఇవి మొదలగు ఘట్టము లనేకము లుండుటయే కాక యిక్కాలమునందనేకులచే వారివారి నామములతో కట్టఁబడిన ఘట్టములును కొన్నియున్నవి.

వరణాఘట్ట మహిమ.

ఈఘట్టమున వరణానది గంగతో నైక్యమైనదగుటచే నిది ప్రశస్తమైనది. ఇందు గ్రుంకులిడిన పాతకంబులు దొలంగును.

అసిఘట్టమహిమ.

ఇక్కడ అసినది గంగతోసంగమముగాన నిది శ్రేష్ఠమైనది. ఇందు మునుంగువారు పుణ్యాత్ములగుదురు.

కేదారఘట్ట మహిమ.

ఈఘట్టమునందు కేదారేశ్వరుని సన్నిధియున్నది. ఇచ్చటస్నానంబుచేసి ఆదేవుని యర్చించిన వారికి సకలాభీష్టములు గలుగును. పూర్వంబున వసిష్ఠుండను విప్రుండు కేదారేశ్వరుని సేవించి ముక్తుండాయెను.

దశాశ్వమేధ ఘట్టమహిమ.

ఈఘట్టమునందు బ్రహ్మదేవుఁడు దశాశ్వమేధములుచేసి తనయిష్టమును నెఱవేర్చికొన్నాఁడు. ఇచ్చటమునింగిన వారికి యెక్కువ ఫలము గలుగును.

పంచగంగా ఘట్టము.

ఇందు పంచపాండవులు తపస్సుచేసి తమకోరికలను బడసిరి. ఇక్కడ కార్తికమాసమున కృత్తికానక్షత్రము దర్శనము కాకమునుపే లక్షల కొలది జనులుచేరి స్నానముచేసెదరు. కార్తీకపౌర్ణమి స్నానము విశేషము. పున్నమకుముందు అయిదుదినములు మొదలు (ఏకాదశి మొదలు) పున్నమవరకు పంచరత్న దినములని పేరు.

ఈప్రకారముగానే అక్కడక్కడనుండు ఘట్టములలో ఆయాఘట్టముతో సంబంధించిన పేరుతో గూడిన దేవుఁడో దేవియో ప్రకాశించుచు వారివారి కోరికలు సిద్ధింపఁ జేయుచున్నారు.

కాశీక్షేత్రమునందలి దేవతలు.

శ్లో. విశ్వేశం మాధవం ఢుంఢిం దండపాణించ భైరవమ్,
వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికామ్.

అని చెప్పఁబడియున్నది. అనఁగా విశ్వేశ్వరస్వామి, మాధవస్వామి, డుంఠివిఘ్నేశ్వరుఁడు, దండపాణీశ్వరుఁడు, భైరవమూర్తి గుహ అనెడు బిలము, గంగ, భవానీదేవి, మణికర్ణిక, అను నివి వే ముఖ్యములు.

ఇంతేగాక, అగస్త్యాది మహరుషులచేతను, ఇంద్రాది దేవతల చేతను, సూర్యాదినవగ్రహములచేతను, పూజింపఁబడిన శివవిష్ణుమూర్తులు వారివారిపేర్లతో లెక్కకుమిక్కుటమై విగ్రహములుగను, లింగములు గను, కొన్ని గుళ్లయందును, కొన్ని అక్కడక్కడ తీర్థఘట్టములయందును ప్రకాశించుచున్నవి.

ఇందు ప్రస్తుతమున ముఖ్యముగా నందఱకుం దెలియుచుండు కొన్ని దేవతల నామములను వ్రాయుచున్నాము.

శ్రీవిశ్వనాథుఁడు, శ్రీడుంఠి (డుండి) వినాయకుఁడు, శ్రీదండపాణీశ్వరుఁడు, శ్రీఅన్నపూర్ణ, (శ్రీవిసాలాక్షి), శ్రీకాలభైరవమూర్తి. శ్రీబిందుమాధవ మూర్తియును, ఓంకారేశ్వర, తారకేశ్వర, త్రిలోచనేశ్వర, మాలతీశ్వర, అంతికేశ్వర, విమలేశ్వర, మహాదేవ, పితామహేశ్వర, చండేశ్వర, నీలకంఠేశ్వర, విజయేశ్వర, శ్రీకంఠేశ్వర, కపర్దీశ్వర, చతుర్వేదేశ్వర, సహస్రాక్షేశ్వర, ఈశానేశ్వర, దీప్తేశ్వర, అమరేశ్వరాది లింగములును గలవు.

## విశ్వేశ్వరస్వామి మహిమ.

ఈ విశ్వేశ్వరలింగము అన్నిలింగములకంటె శ్రేష్ఠమైనది. బ్రహ్మాదిదేవతలను రక్షించునిమిత్తము స్వయంవ్యక్తమై ప్రభవించి మోక్షలక్ష్మీవాసస్థానమైన దివ్యవిమానమునందున్నది. ఈకాశిత్రిలోకములకంటె విశేషమైనది. ఈ విశ్వేశ్వరుని అందఱును పూజింపవచ్చును. పూజించువారి దురితంబులును నశించును. మోక్షములభించును. ఈస్వామినిదర్శించి అన్యక్షేత్రమున మృతిజెందినను ముక్తుండగును, విశ్వేశ్వరుని, మోక్షలక్ష్మికి వాసమైన విమానమును, కలశమును, దర్శించువారు మహాపాతకములనుండి విముక్తులగుదురు. విమానమునందుండు వృషభధ్వజమును దర్శించువాఁడు విశ్వేశ్వరుని ప్రసాదమున కతిథియగును. ఈ విమానమును పక్షులు ప్రదక్షిణముచేసినను ముక్తాత్మలగును. ముక్తిమంటపము, శృంగారమంటపము, ఐశ్వర్యమంటపము, జ్ఞానమంటపము, అని పురాణములయందు జెప్పఁబడిన మంటపములలో నిక్కాలమున ముక్తిమంటపము మాత్రము కనఁబడుచున్నది.

## శ్రీ బిందుమాధవస్వామి మహిమ.

ఈమాధవస్వామి కాశీవాసులను పరిపాలించును. కాశియందు మిక్కిలి మహిమగల యీస్వామిని దర్శించినవారికి కాశియందు నివసించుటకు హేతువును మోక్షసాధకమును కలుగజేయును.

## శ్రీ డుండి (డుంఠి) విఘ్నేశ్వరుని మహిమ.

ఈవిఘ్నేశ్వరుఁడు కాశియందలి సకల పాపంబులను విఘ్నంబులను పోఁగొట్టుచు సకలభోగములనొసంగుచున్నాఁడు. విశ్వేశ్వరునకు ప్రియపుత్త్రుఁడు. మధురమైన మోదకములను నైవేద్యముచేసి స్తుతించువారికి సకలమైన కోరికలు నెఱవేరును. విశ్వేశ్వర అన్నపూర్ణలయెడల భక్తికలవారు ఇతనియందును భక్తినుంచవలయును.

## శ్రీ దండపాణి మహిమ.

ఈదండపాణి గణములలోను దేవతలలోను శ్రేష్ఠుఁడు, కాశియందు గతించువారికి యమబాధరానీయక దండమును హస్తమందుంచికొనియున్నాఁడు. కాశీవాసులనురక్షించువాఁడు. విశ్వేశ్వరుడు బ్రహ్మోపదేశమును (తారక మంత్రమును) ఆత్మకోటులకు చేయఁగా నితఁడు దివ్యశరీరము (నొసంగును.)

## శ్రీకాలభైరవ మూర్తి మహిమ.

కాలభైరవుఁడు కాశిలో వసించువారి పాపములను పోఁగొట్టుచున్నాఁడు. స్తోత్రముచేయువారికి మోక్షకారణుఁడు. విశ్వేశ్వరునియందు భక్తిగలవారు ఈతనియందును భక్తినుంచవలయును.

## కాశి.

ఈవిషయమునుగూర్చి మున్ను చెప్పఁబడియున్నది. కొందఱుదుర్గాఘట్టముయొద్దనుండే కాశీ అనేదేవతను దర్శింపవలయు ననెదరు.

## గుహ.

ఈబిలము కాశీపట్టణమునకుదక్షిణభాగమందున్నది. దీనిని సేవించుట వలన పుణ్యము కల్గును.

## గంగ.

ఈగంగవిషయమై మున్ను చెప్పఁబడియున్నది. అయినను కాశీనగరమునకు పశ్చిమభాగమున గంగ అనెడు ఒకకొలను ఉన్నది. ఇదే శ్లోకములో చెప్పియుండు (గంగ) యని చెప్పుచున్నారు.

## శ్రీభవాని (అన్నపూర్ణ లేక విశాలాక్షి) మహిమ.

మోక్షమును అభిలషించినవారికి మోక్షమును, ధర్మమును గోరినవారికి ధర్మమును, అర్థమునుగోరినవారికి అర్థమును, గలుగఁజేయు అన్నపూర్ణాదేవి, కాశియందలి ప్రజలు సంపాదించిన ద్రవ్యమును పరిపాలనము చేయుచు, యోగక్షేమముల నభివృద్ధి జేయుచు, విశ్వేశ్వరుని భావన ప్రకారము మోక్షసంపదయను భిక్షము నొసంగుచున్నది.

## మ ణి క ర్ణి క.

దీనివిషయమై మున్ను చెప్పఁబడియుండుటవలన నిక్కడ చెప్పలేదు.

## నిత్య నైమిత్తికాదియాత్రా వివరణము.

### తి థి యా త్ర.

శుక్లపక్షతృతీయయందు నవగౌరీ దేవతలను, చతుర్థియందు ఏబదియారువినాయకులను, పంచమియందు సప్తఋషులను. శుక్లకృష్ణపక్షముల అష్టములయందు అష్టభైరవులను, అష్టమి చతుర్దశి ఈ రెండు తిథులయందు నవదుర్గలను, నవమియందు చండికను, ఏకాదశి ద్వాదశీ తిథులయందు విష్ణుమూర్తులను. పూర్ణిమయందు చంద్రపుష్కరిణీ తీరమందుండు చంద్రేశ్వరుని, అమావాస్యయందు కపిల ధారయందుండు వృషభ ధ్వజేశ్వరుని దర్శింపవలయును. ఈయాత్రయే తిథియాత్ర యనఁబడును.

### వా ర యా త్ర.

ఆదివారమునందు ద్వాదశాదిత్యులను, సోమవారమునందు జ్ఞానవాపియందు స్నానముచేసి విశ్వేశ్వరుని, శ్రావణమాస సోమవారమున కేదారేశ్వరుని, శుక్రవారమునందు శుక్రేశ్వరుని, శనివారమునందు శనైశ్చర లింగమును దర్శించుటయే వారయాత్ర యనఁబడును.

### న క్ష త్ర యా త్ర.

బుధవారము చతుర్దశి భరణీనక్షత్రమున యమతీర్థ స్నానమును యమలింగదర్శనమును; బుధవారము ద్వాదశీ శ్రవణ నక్షత్రమున సంగమ తీర్థస్నానమును సంగమేశ్వర దర్శనమును చేయుటయే నక్షత్రయాత్ర యనఁబడును.

### మా స యా త్ర.

చైత్రమాసమున కామకుండ స్నానమును కామేశ్వర దర్శనమును, వైశాఖమాసమున విమలతీర్థస్నానమును విమలేశ్వర దర్శనమును, జ్యేష్ఠమాసమున రుద్రావాసతీర్థస్నానమును రుద్రావాసేశ్వరదర్శనమును, ఆషా

ఢమాసమున లక్ష్మీ తీర్థస్నానమును శ్రీ లక్ష్మీ దర్శనమును, శ్రావణమాసమున కామాక్షీ తీర్థస్నానమును కామాక్షీ దర్శనమును, భాద్రపదమాసమున కపాలమోచనతీర్థస్నానమును కులస్తంభదర్శనమును, ఆశ్వయుజమాసమున మార్కండేయతీర్థస్నానమును మార్కండేయేశ్వర దర్శనమును, కార్తికమాసమున పంచగంగాస్నానమును బిందుమాధవదర్శనమును, మార్గశిరమాసమున పిశాచమోచన తీర్థస్నానమును కపర్దీశ్వర దర్శనమును, పుష్యమాసమున ధనదతీర్థస్నానమును ధనదేశ్వర దర్శనమును, మాఖమాసమున ప్రయాగతీర్థస్నానమును ప్రయాగేశ్వరదర్శనమును, ఫాల్గుణమాసమున గోకర్ణతీర్థస్నానమును గోకర్ణేశ్వర దర్శనమును, చేయుటయే మాసయాత్ర యనబడును.

ఋతు యాత్ర.

శంఖద్వారము సమీపమున ద్వారకాపురియును, బింధుమాధవుని సమీపమున కాశీపురియును, వరణసమీపమున మధురాపురియును, రామేశ్వరసమీపమున అయోధ్యాపురియును, కృత్తివాసేశ సమీపమున అవంతికాపురియును. అసిసంగమేశ్వర సమీపమున మాయాపురియును, కాశియందు ప్రకాశించుచున్నది పీసియందు వసంతాదిగ నొక్కొక ఋతువునం దొక్కొక చోటికిపోయి స్నానముచేసి అక్కడ నివసించియుండు దేవతల నారాధించుటయే ఋతుయాత్ర యనబడును.

పంచకోశ యాత్ర.

గంగాస్నానమును నిత్యయాత్రయనుచేసి కాశీవాసముచేయువారు జ్యోతిర్లింగమయమైన పంచక్రోశ పరిమాణముగల కాశిని దక్షిణాయన ఉత్తరాయన మధ్యకాలమునగాని సంవత్సరాంత్యమునందు గాని, ప్రదక్షిణము చేయుటయే పంచక్రోశ యాత్ర యనఁబడును.

ఈ కాశీక్షేత్రమును ప్రదక్షిణము చేయువారు త్రిలోకములను ప్రదక్షిణముచేసినంత ఫలమునుబొందుదురు. మఱియు కాశిలోఁజేసిన పాపంబులన్నియును పరిహారమగును.

పంచకోశయాత్రచేసి వచ్చుటకు అయిదుదినములు పట్టును. మొదటిదినమున మణికర్ణికలో స్నానముచేసి యథోచితముగా నిత్య యాత్రచేసికొని సంకల్పపురస్సరముగా ప్రయాణమై మొదటిదినము కర్దమేశ్వరమనే స్థలమందునిలిచి అక్కడకర్దమతీర్థములో స్నానముచేసి తీర్థశ్రాద్ధాదులు చేసి కర్దమేశ్వరుని అర్చించి, రెండవదినము భీమచండి అనేస్థలముచేరి అక్క

డను ముందుదినమువలెనే గడపి, మూఁడోదినము రామేశ్వరముచేరి అక్కడనుండు వరణయందు తీర్థవిధిచేసి, రామేశ్వరార్చనచేసి, నాలుగవదినము కపిలధారయను స్థలముచేరి అచ్చటను ముందుదినమువలె చేసి, అయిదవ దినము మణికర్ణి చేరి అక్కడను మొదటిదినమువలె గడపి స్వస్థలము చేర వలయును. ఈయాత్ర ౨౫ కోశములదూరము గలదిగానున్నది. ప్రతి మజిలీయందును సమస్తసామానులును వసించుటకు ధర్మశాలలునుగలవు, ఈప్రయాణమును అసి మొదలుగా ఆరంభము చేయవలసినదనియు, కాశీ యాత్రచేయువారు వారమునకొకనాఁడును, మాసమునకొకసారియు నుప వాసమునుచేసి దుర్గాగుడియొద్దనుండు ఒకదేవికి కొన్నిగవ్వలు వేయువల యుననియును, అట్లు వేయనివారు యాత్రాఫలమును ఆమె హరించునని యును వదంతి యున్నది.

తత్కాలస్థితి.

ఈకాశీనగరము నేపాళదేశముతోఁ జేరిన భాగములకు దక్షిణము గను, బుందేల్‌ఖండ్ రాజ్యమునకు ఉత్తరముగను, సుమారు పదిమైళ్లు విశాలముగల అందమైనపట్టణము. ఈనగరమునకు ఉత్తరమున వరణయను చిన్న యేఱును, దక్షిణమున అసియను చిన్నయేఱును కాలువలవలె పాఱి గంగలో కలియుచున్నది. అసినిమాత్రము పిల్లకాలువయనియే చెప్ప వచ్చును. ఈ అసికిని, వరుణకును నడుమ గంగానది ధనురాకారముగ ప్రవ హించుచున్నది. ఈ గంగకు పశ్చిమతీరమునందు ౧౦౦ అడుగుల పొడవున కాశీనగరమందున్నది. అసివరణలమధ్యయందు కేదారఘట్టము మొదలు రాజఘట్టమువఱకును నాగపూరు, సింధియా, హోల్కార్, నేపాల్, మొదలగు మహారాజులును. అహల్యాబాయి మొదలగు రాజమహిషీ లును, లక్షోపలక్షల ధనమును అలక్ష్యముగానెంచి వ్రయముచేసి గంగా స్నానమునకు వసతిమైన ఘట్టములను, శివప్రతిష్ఠలను, జనులు వసించుట కు విశాలమైనయిండ్లను, మరియు తెల్లఱాళ్లచే అలంకారమైన పనితోఁ గూడిన బ్రహ్మాండమైన కట్టడములను కట్టియున్నారు. ఈ కట్టడములలో శ్రీధరమునిషి, అహల్యాబాయి, మణిగొండలు గోసాయీలు కట్టియుండు కట్టడములు ఆశ్చర్యకరమైనవిగానున్నవి. యాత్రార్థులు రైలుబండి నిలుచు స్థళమునువిడిచి కాశీనగరములోపల ప్రవేశించినచోఁ గంగయొడ్డున మూఁ డుమైళ్ళ దూరమువఱకు కట్టబడియుండు స్నానఘట్టముల యొక్కయు, మఠమండపముల యొక్కయు, గుళ్లుగోపురముల యొక్కయు, విద్యాశాలల

యొక్కయు, వేడుకను చూడవచ్చును. గంగలో మెట్లు చాలదూరము కట్ట బడియున్నది. వ్యాధిగ్రస్తులు సహా ఘట్టములయందు పరుండి యిక్కడనే ప్రాణముపోయిన చాలునని యెంచియున్నారు. అనేకులు తమవారినివిడచి యిక్కడికి వచ్చియున్నారు. గంగోత్పత్తిమొదలు ౧౫౦౦ మైళ్లు సంగమము వరకు ఆఱుసంవత్సరములకు లోపల ఆర్యజనులు పోవలయునని చెప్పుచున్నారు. ఇచ్చటనుండి యాత్రార్థులు తీర్థముతీసుకొని పోయెదరు. ఇక్కడ మృతియైనవారికి మోక్షముకలదను సిద్ధాంతమువలన ఇక్కడనే మృతిజెందుటకై కొందఱు వచ్చియున్నారు. యతులు త్రిరాత్రమే యొకస్థలమున వసియింపవలసినదని శాస్త్రమున్నను, విశ్వేశ్వర స్మృతిప్రకారము కాశికి వచ్చినయతులు తర్వాత పోగూడదనే నిబంధనచేత పంచద్రావిడులలోను పంచగౌడులలోను జేరిన వేయిమంది యతులు ఇక్కడనేయున్నారు. మఱియు శవదహనమైన తర్వాత ఆభస్మమును గంగలోకలిపెదరు. మహారాజులును, ధనవంతులును, దూరమున మృతులైనవారి దహనమైన భస్మమును తెచ్చి గంగలో కలిపెదరు.

పడవలెక్కువారు దశాశ్వమేధఘట్టమునగాని, రాజఘట్టమునగాని యెక్కవలయును. ముఖ్యముగా రాజఘట్టమున నెక్కుటమంచిది ఎందుచే ననగా, గంగనుఎదిరించి పడవనడుచుటయేగాక వేడుకలు చాలాచూడవచ్చును. రాజఘట్టము రైల్వేస్టేషనుకు సమీపమునందున్నది. నడిచిపోవుటకంటె పడవలోపోవుటయే మంచిది. ఇక్కడనుండి బండ్లుపోదు. నడిచిపోయిననుపోవచ్చును. అసి మొదలు వరణవఱకును నడుమ వేలకొలది బ్రాహ్మణులు ఆయాఘట్టములయందు ఉన్నతమైన ఆసనములయందుకూర్చుండియును, వింతయైన గొడుగులయొక్క నీడయందు నివసించుచును. ఉపచారద్రవ్యములైన గంధము పుష్పము విభూతి గోపీచందనము శ్రీచూర్ణము మొదలగువానినియుంచుకొనియును న్నారు. వీరుకాక, గంగాపుత్రులు, ఘాటియాలు, తాసీలనెడుపంచద్రావిడులు, పంచగౌడులు మొదలగుయాచకులు పది పదునైదువేలమంది యున్నారు. ఈ ఘట్టములలో నెక్కడజూచినను వేలకొలది జనులు స్నానముచేయువారును, సంకల్పము చేయువారును, స్వామిదర్శనార్థము మెట్లపై పోవుచుండువారును, దిగివచ్చుచుండువారును, అగునట్టి జనులను చూచినప్పుడు కలుగు ఆనందమును వ్రాయ నలవికాదు. ఇట్లుపోగా అయోధ్య రోహిల్ ఖండ్ రైల్వే వారధియున్నది. ఇది ౧౨౦౦ గజముల నిడివిగలిగి మిగుల అందముగానున్నది. ఇక్కడనుండిపోయిన,

## త్రిలోచన ఘట్టము.

ఈఘట్టము యొద్ద రెండుమసీదుస్తూపీలున్నవి. దీని నెక్కుటకు లోహలనే మెట్లుకట్టియున్నది. మఱియు కాలభైరవస్వామి సన్నిధియు, దండపాణి సన్నిధియునున్నది. ఇక్కడనుండు గంగలో స్నానముచేయుట విశేషము. ఈఘట్టమున ఢిల్లీవ్యాపారులు వసించెదరు. దీనికితర్వాత కొంతదూరము పోయినయెడల,

## గో ఘట్టము.

ఈఘట్టమున కీపేరు కలిగినందుకు కారణ మేమనగా, ఆవు ఆకారముగా నొక శిలయున్నది. మఱియు అక్కడ ఆవులు ఎద్దులు వచ్చి నీళ్లు త్రాగుచున్నవి. ఇక్కడనుండిపోయినచో,

## మహాదేవ ఘట్టము.

ఇక్కడ మహాదేవస్వామి సన్నిధి యున్నది ఇచ్చోట వింతలేవియు లేదు. ఇచ్చటనుండి కొంచెము దూరము పోయినచో,

## దుర్గా ఘట్టము.

ఈఘట్టమునందు కాళీఅనే దేవిసన్నిధి యున్నది. దుర్గాఘట్టమువద్ద ఆరేడు అంతస్థులుగల మిద్దెయిండ్లు కట్టఁబడి యున్నవి. మహాజనులనేకు సాహుకారులున్నారు. వీరు గోసాయీలైనప్పటికిని ధనమువలన సాహుకారులైనారు.

ఇక్కడ గంగయొడ్డున ఇండ్లు ముందుకు కట్టఁబడుచుండుటచేత గంగయొక్క వైశాల్యము తగ్గి లోతు అగుటకు ప్రారంభించినది. దుర్గాఘట్టము మొదలు చౌకివఱకును విశాలమైన బాట లేదు. అంతయు సందులు గొందులుగానేయున్నవి. వీధులు వెడల్పు లేకయున్నను ఇండ్లుమాత్రము అయిదారు అంతస్థులకు తక్కువలేక కట్టఁబడియున్నవి. వీనిలో యెనిమిది వేలయిండ్లు బ్రాహ్మణులకుసొంతము. తక్కినవి జనగణితీప్రకారము రెండు లక్షలజనులకు సొంతమైయున్నది. అందు హిందువులు మూఁడుపాళ్లును, తురకలు ఒకపాలును, క్రీస్తువులు 3౦౦ జనులు నున్నారు.

ప్రస్తుతమున ఈకాశియందు వేయున్ని నన్నూటయెనుబది (౧౪౮౦) గుళ్లును, కొన్ని ధర్మశాలలును ఉన్నవి. వీనిలో చాలాగుళ్లు మంటపములు మొదలగునవి దక్షిణదేశమునందలి వానివలె అందమును గొప్పదియును కాదు. అయినను వైదిక విషయముగాలేక కేవలము లౌకిక విషయముగా వినోదము నిమిత్తము యాత్రచేయువారు చూడతగిన కొన్నిగుళ్లను కట్టడ

ములను గూర్చి దిగువ నుదహరింపఁబడును.

యాత్రచేయువారు ధనముగలవారైయుండు పక్షమున కాశీనగరమున మిక్కుటముగానుండు రెండుగుఱ్ఱములు గట్టిన బగ్గియనెడు బండినిగాని, లేక ఎక్కాఅనెడు ఒంటిగుఱ్ఱముగట్టిన బండినిగాని, అద్దెకు పెట్టుకొనవలయును. ఈ యెక్కాబండ్లు దక్షిణదేశస్థులకు వసతిగా నుండదు. బగ్గిపెట్టుకొనుట ఉత్తమము. ఇందు రెండుతరగతులుగలవు; మొదటితరగతి బగ్గికి ఘంటయొకటికి పదిఅణాలును, రెండవతరగతి బగ్గికి ఘంటయొకటికి ఆఱణాలును బాడుగ యేర్పడియున్నది. తర్వాత బండిని అద్దె పుచ్చుకొన్న ఘంటమొదలు మొదటి తరగతిబండికి అయిదుఅణాలును, రెండవ తరగతిబండికి మూఁడణాలును బాడుగయియ్యవలయును. ఈ మొదటితరగతి బాడుగబండిలో కూర్చుండి రాజ బజారు మార్గముగా కాశీ నగరములోపల ప్రవేశించుట ఉత్తమము. అట్లు ప్రవేశించుయాత్రార్థులకు మొదట కనబడునట్టి కట్టడము,

ప్రాతటంకసాల.

ఇది యిప్పుడు కాశి మహారాజుయొక్క వశమందున్నది. ఇది యిన్నూట యెనుబదియారు (౨౮౬) అడుగుల పొడవును, తొంబదిరెండు (౯౨) అడుగుల వెడల్పునుగల కట్టడము. ఇప్పుడు దీనిలో నాణెములు చేయుటలేదు. అయితే ౧౮౫౭-వ సంవత్సరమునందు జరిగిన యుద్ధకాలమునందు కాశీలోనున్న యింగ్లీషువారు దీనిలోఁ జొచ్చియుండిన కారణము చేత దీనిని ఆజ్ఞాపక చిహ్నముగా నుంచుకొనియున్నారు. దీనిలోని పెద్ద అరలో హెన్రి కార్రి తకర్ కమీషనరువారియొక్క గొప్ప పటమొకటి యుంచియున్నారు. వీరు స్వదేశీయులకు చాల మేలు చేసిన కారణమువలన స్వదేశీయులు వారిని నేటివఱకుఁ గొనియాడుచున్నారు. రాజ బజారులో టంకసాలకు ఉత్తరమున,

నందేశ్వరకోటి.

అనెడు కట్టడమున్నది. ఇది అంతగా పనితరముగలది కాదు. అయినను ౧౭౯౯-వ సంవత్సరమునందు జడ్జిగానుండిన మెస్టర్ డేవిస్ అనువారు, వజీర్, ఆలీసేనలను ఈటెతో పొడిచిన స్థలము. ఇదియు మహారాజా వంశమందేయున్నది. యిచ్చటనుండి పోయినచో,

విక్టోరియాకాలేజి (శ్రీమహారాజ్ఞీ కళాశాల.)

కనఁబడుచున్నది. కాశీపట్టణములోపల మిగులగంభీరముగాఁ గనబ

మనట్టిది యిదియే. ఇది ఆంగ్లేయ శిల్పిశాస్త్రప్రకారము ౧౮౪౭-వ సంవత్సరము నవంబరు నెల మొదటి తేది పునాది వేయబడి ౧౮౫౨-వ సంవత్సరమున కట్టి నెఱవేరినది. దీనికి ౧,౨౭౦౦ రూపాయలు వ్రయమైనది. ఈ మొత్తములో ఎక్కువభాగము దొరతనమువారివల్లను, కొంతభాగము చందాల మూలకము వలనను సేకరించబడినది. ఈశృంగారమైన కట్టడము చునారుఱాళ్ళతో కట్టఁబడియున్నది. ఈకట్టడముయొక్క శిల్పిశాస్త్రియైన (ఇంజనీయరు) మేజర్ కిట్టో, ఆర్ - ఇ - అనువారు కట్టడముపైన విచిత్ర వినోదముగా వంపుఅద్దమును బిగించునప్పుడు అది నారిపై పడినందున ఆగాయము వలన మృతినొందిరి. కట్టడముయొక్క మధ్యహాలు పొడుగు ౭౫ అడుగులు. కట్టడముపై మిద్దెమీఁదుగా పోయిచూచినయెడల కాశీ నగరముయొక్క వినోదము అత్యద్భుతముగా కనఁబడును. కట్టడముయొక్క మధ్య మంటపము ౯౭ అడుగుల నిడివియు, ౩౦ అడుగుల వెడల్పును, ఇరుప్రక్కలమంటపము, ౪౦ అడుగులనిడివియు, ౨౦ అడుగుల వెడల్పును. గలదిగానున్నది. ఈకట్టడము హిందూదేశమునందు ప్రసిద్ధిగా నెంచబడిన వానిలోనొకటి. కలాశాలలోపల రాజేంద్రనారాయణసిల్ అనువారియొక్కయు, ఈకలాశాలయొక్క ప్రధాన పండితుఁడైయున్న డాక్టర్ బాలంటైన్, మెస్టర్ డంకిన్, మేజర్ కిట్టో అగు వీరలయొక్కయు భావచిత్రపటములు (పోటోలు) పెట్టఁబడియున్నవి. ఈకలాశాలయందు ఆగమవేదపురాణేతిహాసాది గ్రంథములను చదువునట్టివారి యుపయోగార్థముంచియున్నారు. సంస్కృతము, పార్సి, అరబ్బి మొదలగుభాషలను బోధించుచున్నారుదీనికి సమీపమునందుండు ఒక చిన్న కొలనిలో మొసళ్ళను పెంచుచున్నారు. కలాశాలయొక్క ఉత్తరభాగమునందు బ్రహ్మాండమైన యొకఱాతి స్తంభము నాటబడియున్నది. ఇదిగాం౧౮౫౩-వ సంవత్సరమున ఖాజీపూరిలోకనిపెట్టబడి ౧౮౫౪-వ సంవత్సరము మేనెల ఉత్తరసర్కారుల లెప్టనెంటు గవర్నరుగారైన హానరెబుల్ జేమ్సు థామస్ అనువారిచే నాటబడినది. ఇది పూర్వము అశోకమహారాజుకాలమునందు చేయఁబడి వారియొక్క అంతఃపురమునం దుంచఁబడినదని చెప్పుచున్నారు, ఈమార్గమునందే,

ప్రిన్స్ ఆఫ్ వేల్సు హాస్పిటల్.

కనబడుచున్నది. ఇది ౧౮౭౬-౭౭-వ సంవత్సరమున విక్టోర్యాచక్రవర్తిగారి జ్యేష్ఠకుమారుఁడైన ప్రిన్స్ ఆఫ్ వేల్సు గారి కాశీక్షేత్రమును దర్శించినప్పుడు వారిచే పునాది వేయబడి లార్డు రిప్పన్ ప్రభువుగారి వలన

గృహప్రవేశము గావింపబడినట్టి వైద్యశాల. దీనికయిన ధనమంతయు స్వదేశీయ ప్రభువులవలననే యియ్యఁబడినది. ఈప్రిన్సె ఆఫ్ వేల్సు గారి నర్సువైద్యశాలకు సమీపమునందు కనఁబడునది,

టవుర్ హాల్ (నగరమంటపము.)

౧౮౭౦ సంవత్సరము జనవరినెలలో ఈనగరమును దర్శించుటకు వచ్చిన శ్రీమహారాణిగారి ద్వితీయకుమారుఁడైన డ్యూక్ ఆఫ్ ఎడిన్‌బర్గు అనువారి విజయసూచక చిహ్నముగా విజయనగరము మహారాజా గారి వలన కట్టబడినది. ఇది ౧౧౭ అడుగులనిడివియు, ౩౭ అడుగుల వెడల్పును, గలది. మధ్యహాలుయొక్క వైశాల్యము ౭౩ అడుగులు. మధ్యయందలి ముఖ్యమైన వాకిళ్ళ కిరుప్రక్కల రెండు పెద్ద అరలున్నవి. ఈ అరలలో నొక దానియందు హానరెరి మేజస్ట్రేటుకచ్చేరి యుంచబడియున్నది. ఇచ్చటనుండి త్రాముకు బండినిదిగి చౌకిఅను అంగడిపేధిమార్గముగా రావలయును. ఇంతవఱకే కాశీనగరముయొక్క వెలుపలి భాగము. ఇఁక కాశీనగరముయొక్క లోపలిభాగమునందు ప్రవేశింపవలయు ననినయెడ బండ్లుపోవుటకు బాట దొరకదు. చాలాభాగము సందులు గొందులుగా నుండుటచే నడచిపోవుటయే యుత్తమము. అట్లు నడచిపోవునప్పుడు మొదటకనఁబడునది.

ఔరంగజీబు కట్టిన మొదటి మసీదు.

ఇది విశ్వేశ్వరుని ఆలయమునకు ముందుభాగమునందు ఔరంగజీబు అను మహమ్మదీయచక్రవర్తిచేకట్టబడినది. ఇది హిందువుల దేవాలయములకు సమీపమునందుండుటచే హిందువులకునుమహమ్మదీయులకును అప్పుడప్పుడు జగడమున కాస్పదము కలిగియున్నది. ఇది కట్టునప్పుడు హిందూ దేవతా బింబముల నంతయుదెచ్చి మెట్లుగా వేయుడని ఆజ్ఞచేసినట్టును, జ్యోతిస్వరూపియైన విశ్వేశ్వరుఁడు జ్ఞానవాపిలో దుమికి నుఱిగినట్లును వదంతి కల్గియున్నది. హిందువుల మనస్తాపమువలన మసీదుకు పోవుటకు ముందుభాగమున మార్గములేకున్నది. ఇచ్చట నుండి పోవునప్పుడు ఆపుర వాసులగు పండాలనెడు బ్రాహ్మణులలో నొక్కనిపిలుచుకొని పోయినచో అచ్చటిదేవాలయముల నెల్లను చూచుటకు వీలుగానుండును. లేక ఇతరులగు ఆదేశపువారిని పిలుచుకొనియైనను పోవచ్చును. అయినను, పండాలు మాత్రము మనమిచ్చిన ద్రవ్యమును సంతోషమున తీసికొనెదరు. ఈమసీదుకు ౧౦-౧౨ గజముల దూరములో ౬౺ అడుగుల పొడవుగల నంది విగ్రహము కనబడుచున్నది. ఈ నందివిగ్రహమునకు సమీపమున,

## జ్ఞా న వా పి.

యున్నది. ఈతీర్థమునందు మహమ్మదీయుల కలహ కాలమునందు విశ్వనాథుఁడు అంతర్ధ్యాత మైనట్లు ఎంచియున్నారు. ఇది సుమారు ౧౦-౧౫ అడుగుల చుట్టుకొలతగలిగి మిక్కిలి పనితరముగా చిత్రింపఁబడి యున్నది. ఈతీర్థములో పూజాదిద్రవ్యములువేసి నీళ్ళను చెడుపుదురని యెంచి అక్కడనుండు బ్రాహ్మణులు దుప్పటితో మఱిగించి యుంచి యున్నారు. అట్లుండియు పూజాదిద్రవ్యములను వేయుచునేయున్నారు. ఈతీర్థమును యాత్రార్థులు పరమపవిత్రమైనదని యెంచి సేవ చేయుచున్నారు. ఒక ఉద్ధరణితీర్థమునకు లెక్కకుమిక్కుటమైన జనులుచేరి యొకరిపై నొకరుపడి తీసికొనెదరు. ఈతీర్థము నిచ్చువారు కోటీశ్వరులుగా నున్నారు. ఈబావిచుట్టు నలుబదికాళ్ల మంటపమును ౧౮౨౮ సంవత్సరమున శ్రీమత్ శ్రీదౌలతరావు సింధియా మహారాజుగారి పత్ని కట్టించెను. ఇందు భిక్షుకులు వేలకొలదిమంది వసించెదరు. దీనికి సమీపమున నేపాళదేశపు రాజుచే చేయించి యుంచఁబడిన ౭ అడుగుల నందివిగ్రహము ఒకటియున్నది. ఈనలుబదికాళ్ల మంటపమునుండి తూర్పుదిక్కు పోయినయెడల శ్రీవిశ్వేశ్వరునియొక్క వినోదవిచిత్ర శిల్పాలంకారములతోఁ గూడునట్టి తెల్లని స్ఫటికపు తాళ్ళచేగట్టఁబడిన,

## విశ్వేశ్వరుని స్వర్ణాలయము.

కనబడుచున్నది. ఈగుడిలో ప్రవేశించగనే గుడియొక్క అంతఃపురము కనబడుచున్నవి. దానికెదురుగా పలు విధములగు పుష్పములమ్మెడు అంగళ్లున్నవి. ఆయంగళ్లలో రోజా, *తురకచామంతి, బిల్వము, వీనిని కలిపి ఒకమూర నిడివిగలమాల కట్టి వెదురుతట్టలోనుంచి మూఁడు దమ్మిడీలకు(చెన్నపట్టణపు పైసాంకి) తట్టతో అమ్ముచున్నారు. ఈవిశ్వేశ్వరుని గుడికి నాలుగుప్రక్కలను గోపురములును చిన్నమంటపములు నున్నవి. మధ్య గొప్ప మంటపమున్నది. అందు రెండు తూర్పుదిక్కున అతిజాజ్వల్యమానముగ ప్రకాశించుచున్నవి. ఇది బంగారపు రేకులతోఁగట్టినది. ఇది యిప్పుడు ఇంగ్లాండు దేశమునందుండి ఋష్యాదేశములో వసించుచున్నా

* ఈతురకచామంతి పుష్పములను చెన్నపురిలోను దక్షిణదేశమునందును హిందువులు పూజకుపయోగించుటలేదు. ఇతర ప్రాంతములవారు దీనిని పూజకుపయోగించెదరు.

రని చెప్పఁబడు దిలీపసింగు మహారాజుగారి తండ్రియైన రంజిత్ సింగు మహారాజుగారిచే కట్టబడినది. ఇందూరు మహారాజుచే కట్టబడిన మహాదేవునిగుడియందు నేపాలదేశపురాజు చేయించియుంచిన పెద్దగంట యొకటియున్నది. ఈచోటనుండిపోతే సమీపమున పూజకువలయుసామగ్రులమ్మెడు అంగళ్లున్నవి. ఈఅంగళ్ళకు ఎడమప్రక్కన,

శనైశ్చరునిగుడి.

యున్నది. ఈశనైశ్చర విగ్రహముయొక్క శిరస్సుమాత్రము వెండితో చేయఁబడియున్నది. ఇచ్చటనుండిపోయిన,

అన్నపూర్ణాదేవి ఆలయము.

కట్టంబడియున్నది. ఈగుడికిపోయెడు మార్గమున నేలకొలదిఆవులు గుంపులుగాగూడి యుండుటవలన నెమ్మదిగా పోవలసియున్నది. ఈగుడి అందముగా గట్టబడియున్నది. దీనిని ౧౭౨౧ సంవత్సరమున పునాబాజీ రావుగారుకట్టినారు. ఈగుడిప్రాకారములోపల సూర్యనారాయణ, గణేశ, గౌరీశంకర, హనుమంత దేవాలయములు నాలుగున్నవి. అన్నపూర్ణ విగ్రహము సుమారు ౨-3 మూరలు పొడుగుండును. ఈవిగ్రహముపై అంతగా నగలులేవు. అనేకులు స్త్రీలు తామే పూజచేసి వారిశిరములను అమ్మవారి పాదములపైయుంచి నమస్కరించెదరు. ఈగుడికెదురుగా నుండు మంటపము మిగులపనితరముగానున్నది. ఈగుడికిసమీపమున సఖిభుజంగ అనేగుడియున్నది. యాత్రీకులు మరలివచ్చునపుడు మేముపోయి వచ్చెదమని ఇక్కడ చెప్పి రావలయునట. ఈఅన్నపూర్ణాదేవి సన్నిధినివిడిచి ప్రక్కననుండు కమాన్ వంపుగల సందులో ప్రవేశించిన అందమైన,

గణపతివిగ్రహము.

కనఁబడుచున్నది. ఈవిగ్రహమునకు కరచరణాదులు వెండితో కవచములుగా చేయఁబడియున్నవి. ముఖమునకు సిందూరవర్ణము పూసియున్నారు. ఇక్కడనుండి కుడిప్రక్కనమండు సందుదారిపోతే,

దశాశ్వమేధ ఘట్టము.

కనఁబడుచున్నది. (ఇచ్చట బ్రహ్మదేవుఁడు యాగము చేసినది మొదలగు విషయములను మున్ను చెప్పియున్నాము.) ఇక్కడనుండికొంత దూరముపోతే ౨౦-3౦ ఘట్టములు కనఁబడును. మఱికొంత దూరమున అందమైనగొప్పమేడలుగల యిండ్లున్నవి. అందు నాగపూరిమంత్రిచేతను ఉదయపూరు రాజుచేతను కట్టఁబడినది యందమైనదిగానున్నది. ఇక్కడ

శిల్పులు లింగములను చేయుచున్నారు. సూర్యచంద్ర గ్రహణ కాలము లందు లక్షలకొలది జనులువచ్చి స్నానముచేసెదరు. ఇట్టిచోట ఊరిలోని మురికినీళ్లకాలువను విడిచి పెట్టియున్నారు. ఇది విచారకరము. దీనివిడిచి కొంతదూరము మెట్లపైనెక్కి సందుదోవపోతే పెద్దబాటకు పోవచ్చును. ఇచ్చటనుండిచూచితే ఔరంగజేబు విశ్వేశ్వరునిగుడిని పడగొట్టిన భాగము కనబడుచున్నది. ఈమెట్లకుపైన,

కార్మికేయల్ లైబ్రెరి.

యనెడు వాచకశాలయున్నది. ఇది ౧౮౭౪ సంవత్సరమున కాశీ రాజుచే పునాదివేయబడి యీరాజుచేతను విజయనగరపు రాజుచేతను కట్టబడి అప్పటి గవర్నరు జనరల్‌గారైన కార్మికేయల్ దొరగారి పేర ప్రతిష్ఠచేయబడినది. ఇక్కడనుండు చిన్నదోవనంటిపోతే బంగారుసరిగెం చేయుపనితనమును, పీతాంబరము, శాల్వలు, దుప్పటాలు, మొదలగు వెలగల వస్త్రములు నేయుటనుచూడవచ్చును. మరల నెప్పటివలె దశాశ్వమేధ ఘట్టమునుండి పోతే,

రాజ ఘట్టము.

పోయి చేరవచ్చును. ఇక్కడ రాజా అమృతరావుచేత కట్టబడిన శృంగారపుకట్టడమును చూడవచ్చును. ఈఘట్టమున శిలయొకటియున్నది. దీనిని గంగాదేవి వానకాలమున తీసికొనిపోయి యెండకాలమున తెచ్చి పెట్టినదని చెప్పెదరు. దశాశ్వమేధ ఘట్టమునుండి యెడమ ప్రక్కపోతే,

మానమందిర నక్షత్రాలయము.

కనంబడుచున్నది. దీనిని అవశ్యముపోయి చూడవలయును. ఈనక్షత్రాలయము రాజపుటానాకు చేరిన అంబర్ నగరమునకు (జయపురమునకు) రాజుగానున్న మానసింగు మహారాజుచే కట్టంబడినది. ఈరాజుకు తర్వాత ఆపట్టమునువహించిన రాజా జయసింగు గారిని ౧౭౧౯-వ సంవత్సరము మొదలు ౧౭౪౮-వ సంవత్సరమువరకునుండిన పంచాంగములను సరిపటిచి యిప్పించ వలయునని మహమద్ షా అడిగినందున నీనక్షత్రాలయమును నిర్మించడమైనది. ఇందుండు గణితఖగోళ యంత్రములను, ఉపకరణములను, అధికజాగ్రత్తగా కాపాడు చున్నారు. ఈయంత్రములలో విద్యాయంత్రము ౧౧ గజములు ౯ అడుగులు ౧౪ అంగులములు నిడివియును; ౧ అడుగు ౧౪ అంగులము వెడల్పునుగలదిగానున్నది. ఈయంత్రమునకు ఈశాన్యమున సమ్రాట్ యంత్రము ఇటుకరాళ్లచే గట్టబడియు

న్నది. ఇది ౧౬ అడుగులపొడవును ౪ అడుగులు ౬ అంగుళముల వెడల్పును గలదిగానున్నది. దీనిపై భాగము ఉత్తరముగా నీడను కనిపెట్టుటకు సహాయముగానున్నది. ఈయంత్రమునకు తూర్పున మధ్యాహ్న రేఖా చక్రయంత్ర మున్నది. దీనికి సమీపమున యంత్ర సమ్రాట్ అను యంత్రమున్నది. దీనికి సమీపమున ఒకఅంగుళపు లావుగల ఇనుముచే జేయబడిన చక్రయంత్రమున్నది. దీనికి సమీపమున దినచారయంత్రమున్నది. ఈకట్టడపు క్రిందిభాగమునందుండు మందిరమున కందమూల పుష్పపదార్థములచే నిండింపబడిన తొట్టియొకటియున్నది. దీనిచే పలువిధవర్ణ భేదములు తెలియునట్లుచెప్పెదరు. ఇక్కడనుండిపోతే జయపూరు జయసింగుయొక్క,

వినోదశాల.

చూడవచ్చును. ఈవినోదశాల ఔరంగజేబు గోరీలకంటెను, దశాశ్వమేధఘట్టము కంటెను ఎత్తుగాకనబడుచున్నది. దశాశ్వమేధ ఘట్టము నుండిపోతే చూడతగినది,

కేదారఘట్టము.

ఇక్కడ బంగాళీలు అనేకులున్నారు. దీనికి కారణమేమనఁగా, ఒక కాలమునందొక కాశీబ్రాహ్మణ యోగీశ్వరుఁడు హిమవద్గిరియందుండు కేదారనాథుని సేవింపవలయునని అత్యంతాసక్తుఁడైయుండియు నడిచి పోవుటకు శక్తిలేకచింతించుచుండు నపుడు ఆకేదారనాథుడే సన్యాసివేషముతోవచ్చి ఆయోగియొక్క అన్నమును భుజించి వారుకోరినవరమిచ్చి యీస్థలమును దర్శించువారికి హిమాలయములోని కేదారనాథుని దర్శించువారికి గలుగుఫలమునిచ్చెదనని యనుగ్రహించెను. ఇప్పుడిక్కడగొప్ప శివాలయ మొకటియున్నది. ఇక్కడకంగాళీలనేడు దక్షిణదేశస్థులున్నారు. ఇక్కడికి సమీపముననే అసిఘట్టమున్నది. ఈశివాలయమునకు దిగువ,

గౌరీగుండము.

అను బావియున్నది. ఇందు స్నానము చేసిన అన్నివ్యాధులునివర్తియగును. అందునుశీతభేది తప్పకనివారణ మగుచున్నది. దీనికి సమీపమున పడమటి భాగమునందు,

మానస సరోవరము.

అనెడు తటాకమున్నది. దీనిచుట్టును ౬౦ చిన్న గుళ్ళున్నవి. దీనికి సమీపమున ౪౦ అడుగులపొడుపుగల జాతి స్తంభమున్నది. ఇదిదినమునకు ఒకయవప్రమాణము పెరుగుచున్నదట. ఇచ్చటనుండి దుర్గాగుండముగా

ర్గముగాపోతే చూడఁదగినస్థలము,

చౌకీ ఘాటు.

ఈచోట నాగపూజ విశేషముగా జరుగుచున్నది. ఈనాగపూజకు బత్తెపాలనం ప్రశస్తముగా ఆరాధనచేసెదరు. ఇచ్చట నాగసుహాయనెడు ఒకగుంటయున్నది. ఇది చెక్కబడిన రాళ్ళచే ఆశ్చర్యకరముగా కట్టఁబడియున్నది. ఈగుంటకు పడమటిపార్శ్వమున అత్యద్భుతముగా నాగప్రతిమ యుంచబడియున్నది. కేదారఘట్టము మార్గముగాపోతే,

నేపాల మహారాజా ఘట్టము.

కనబడుచున్నది. ఇక్కడకట్టబడియుండు గుడి మిగుల పనితరముగలది. దీనికిపైన బంగారుగుడియున్నది. దీనికిసమీపమున అసిఘట్టమున్నది. కేదారఘట్టమునుండిపోతే కనబడునది,

శ్మశాన ఘట్టము.

ఇది మొదలు హరిశ్చంద్ర ఘట్టమువఱకును లెక్కలేని పీనుగులను దహనము చేయుఘట్టములున్నవి. ఆప్రేతముల ఆకారముకొలఁది చితిపేర్చి సరిగాకాల్పక సగముముందుగాకాలనిచ్చి తర్వాతతక్కిన సగముదేహమును చితిపైనుంచి కాల్చెదరు. కొన్నిసమయములలో కాలికాలకమునుపు గంగలోవేసెదరు. గంగలోస్నానముచేయువారిపై మొండెములు నీళ్ళలోకొట్టుకొని పోవునపుడు పడుట విచారకరముగానున్నది. ఇట్లుకొన్నిఘట్టములు శ్మశానఘట్టములుగానే యున్నవి. ఇక్కడజంటజంట రాళ్ళను పూడ్చియున్నారు. ఇవి పూర్వకాలమున భర్తతో సహగమన మైనట్టివారినిసూచించుచిహ్నములుగానున్నవి. ఇక్కడనుండిపోగా సూర్యకులోత్పన్నుఁడును సత్యవాక్యపరిపాలకుఁడునైన హరిశ్చంద్రమహారాజువసించిన,

హరిశ్చంద్ర ఘట్టము,

కనఁబడుచున్నది. ఇక్కడ ఇప్పుడు శివాలయ మొకటిమాత్రమే యున్నది. దీనిలో లింగమున్నది. ఈఘట్టమునొద్ద ఊరిముఱికికాల్వనీళ్లు తెచ్చి విడిచిపెట్టియున్నారు ఇక్కడఅనేకసమాధులు గొప్పరాళ్ళచేకట్టబడియున్నవి. వీనిని పలకరాళ్ళచేమూయఁబడియున్నవి. ఇవి శక్తియనే పేరుతో సహగమనమైన పతివ్రతల సమాధులని చెప్పెదరు. ఇచ్చటికి సమీపమున కనబడునది.

మణికర్ణికా ఘట్టము

ఈఘట్టమునొద్ద ఒకచిన్న గుంటయున్నది. ఈగుంట చుట్టునుశ్రీ

పురుషులనేకులుస్నానముచేసి జపము చేయుచున్నారు. కాశిలోప్రవేశించు వారు మొదట స్నానముచేయునట్టి తీర్థమిదియే. (ఇదేచక్రతీర్థము) కావున లెక్కకు మిక్కుటమైన జనులు సదా యున్నారు. గ్రహణాది పుణ్యకాల ములయందు ఇక్కడ స్నానముచేయుటకు వచ్చునట్టి జనులసంఖ్య లెక్క పెట్టుటకు సాధ్యముకాదు. ఇక్కడ గంగా పుత్రులును ఘూర్జరులును (గుజరాతివారును) వాసముచేయుచున్నారు. ఇచ్చట తారకేశ్వరుని గుడి యున్నది. ఈతారకేశ్వర విగ్రహము జలమునందున్నది. దీనికిసమీపము నందుండే చక్రతీర్థము, లేక చక్రపుష్కరిణి అనెడు బావియొక్క క్రింది భాగమునందు ఏడుమెట్లు అంతరముగానున్నదని చెప్పుచున్నారు. ఇచ్చట నుండి పోయినయెడల,

చారణపాదుక,

కనంబడును. ఇది వృత్తమైన యొకవిధమైన బృందావనమువలె నున్నది. దీనికిపైభాగమునూర్బిల్ స్టోన్ అనెడుస్ఫటికపుఱాళ్ళచే మూయం బడి ఆఱాళ్ళపై రెండుపాదములు అమర్చంబడియున్నవి. ఇవి మహా విష్ణువుయొక్క పాదములని బ్రాహ్మణులు పూజచేయు చున్నారు. ఇవి కొంచెము ఇంచుమించుగా పార్శ్వనాథ్ కొండపైయుండు జినమునియొ క్క పాదములవలెనున్నవని చెప్పెదరు. ఇచ్చట గంగాజలముతోను తులసి మొదలగు పూజాద్రవ్యములతోను వేలకొలది జనులువచ్చి పూజచేయుచున్నారు. ఇక్కడనుండు అర్చకునకు తొమ్మిదిదమ్మిడీలు ఇయ్యవలయును. ఇక్కడనే..

పంచగంగాఘట్టము.

కనబడుచున్నది. ఇక్కడ బిందుమాధవస్వామి ఆలయమున్నది. (తక్కినవిషయములు మున్ను చెప్పబడెను.) ఈఘట్టముయొక్క ఉన్నత మైన మెట్లు ఎక్కిపోయినయెడల.

ఔరంగజేబు రెండవమసీదు.

కనంబడుచున్నది. ఇది పూర్వపు కృష్ణుని గుడినిపడగొట్టి కట్టినట్లు కొందఱుచెప్పెదరు. ఈమసీదు రెండుప్రక్కలలోని స్తంభములు ఆశ్చర్య కరముగా కట్టంబడియున్నవి. హిందూమతమునకు జన్మవిరోధియైన ఔరంగ జేబు పలువిధములైన ప్రయత్నములు చేసియు హిందువులు వానిమతమున కు లోబడనందున విశ్వేశ్వరునిగుడియొద్ద మసీదుకట్టినదిచాలక హిందువుల కు మహాపవిత్రమైన యీ పంచగంగా ఘట్టమునకు శ్రీకృష్ణుని గుడి కెదు

రుగా మరల నొకమసీదును కట్టినాఁడు. ఈమసీదు గంగానది నీటిమట్టము నుండి ౨౫౦ అడుగుల యెత్తుగలదిగా కట్టబడియున్నది. దీనికి భూమిలో చాలాలోతు పునాది వేయబడియున్నట్లు తోఁచుచున్నది.

ఇక్కడ నిలిచి చూచితే ముందు పార్శ్వమున ధనురాకారముగా మసీదుయొక్క మధ్యమందిరముయొక్క రెండుకడవలు తెలియుచున్నవి. ఈకడవలు గంగకుపోవుటకు అనుకూలముగానున్నవి. వీనికి ఉత్తరభాగమునందు మినార్‌స్థూపీలు కనఁబడుచున్నవి. ఇవి అపాయకరమైన స్థితిలో నున్నట్లుచెప్పెదరు. అట్లుకనఁబడుటలేదు. ఇవి కట్టి బహుదినములైనను గంగాప్రవాహమునకును వర్షమునకును తప్పియున్నవి. ఈకట్టడము పూర్తిగా బలమైన ఱాళ్ళచే కట్టఁబడి ఇనుపకమ్ములచే బిగింపఁబడియున్నది. మఱియు ౧౮౪౪-౪౫ సంవత్సరమున మరమ్మతు చేయబడినది. దీనిమెట్లు పొడుగుగా నున్నందున యెక్కుటకష్టము. గంగానదిమొదలు మినార్ స్థూపీలయొక్క క్రిందిభాగమువఱకు ౨౫౧ మెట్లున్నవి. అనఁగా గంగమొదలు మసీదు క్రిందిభాగమువఱకు ౧౨౦ మెట్లును, మసీదు క్రిందిభాగము మొదలు పైయంతస్థువరకు ౪౫ మెట్లును, పైఅంతస్థు మొదలు మినార్ స్థూపులవఱకు ౮౬ మెట్లును, ఉన్నవి. ఈస్థూపుల అడుగువ్యాసము ౮। అడుగువిస్తీర్ణమును, పైవసారా ౭౪ అడుగు వెడల్పును. మసీదువసారా మొదలు పైఅంతస్తు ౪౫ అడుగులును; పైయంతస్తుమొదలు మినార్ స్థూపులు ౭౭ అడుగులును మినార్‌స్థూపుల క్రిందివసారా మొదలు శిఖరము ౨౦ అడుగులును, మొత్తము ౧౪౭౪ అడుగుల పొడవుగలదిగా కట్టఁబడియున్నవి. ఈమసీదు మూఁడంతస్తులుగలది. దీనిపై యెక్కిచూచితే కాశీనగరముయొక్క వినోదము అత్యద్భుతముగా కనఁబడును. పంచగంగాఘట్టమునందు యాత్రికులు పడవనుదిగి ఎదురుగా కనబడు మెట్ల మార్గముగా యెక్కివచ్చితే పురాతనమైన,

అశ్వత్థవృక్షము.

కనఁబడుచున్నది. ఈవృక్షమును ప్రదక్షిణము చేయుటకు చుట్టు తగిన వసారాలు కట్టబడియున్నవి. అందు వేలకొలదిజనులు సహస్రనామ జపము సేయుచు ప్రదక్షిణము చేయుచున్నారు. ఈపంచగంగాఘట్టము నుండి పడవనెక్కిపోతే రామఘట్టమునకు పోవచ్చును. అక్కడ రామదేవుని గుడియున్నది. ఇంకయు ౩-౪ ఘట్టములున్నవి. అక్కడ నాగపూరు రాజుచేకట్టఁబడిన మహాలు చూడతగినదిగానున్నది. దానికిపర్యాత గ్వాలి

యరుదేశపురాజైన సింధియాగారిచేకట్టబడిన ఘట్టమున్నది. పంచగంగా ఘట్టము వద్దనుండు మసీదునకు సమీపమునందుగల ధనురాకారమైనసందు మార్గముగా ప్రవేశించితే.

### భైరవనాథ సన్నిధి.

యున్నది. ఇదే భైరవఘట్టము. ఇక్కడ భైరవనాథస్వామి అప్రాకృతస్వరూపముగా తమవంటి అప్రాకృత రూపమైన శునకము నధిష్ఠించి కాశీనగరమును ఏవిధమైన కొఱతలేక కాచుచున్నాఁడు. ఈసన్నిధిలో నొకకుక్కను పెంచుచున్నారు. ఇచ్చోటకుక్కలను పరిశుద్ధమైన జంతువులనితలంచెదరు. సర్కారువారు ఇచ్చటకుక్కలను చంపుటలేదు. గోసాయీలు లెక్కలేనికుక్కలను పోషించెదరు. ఇచ్చటఅర్చకులుకుడిచేత నెమలియీకలకట్టను యెడమచేతియందు తెంకాయచిప్పనుంచుకొని యాత్రాస్థులముఖమును ఆయీకలకట్టతో చరిమి చిప్పలో డబ్బు వేయుడని కోరెదరు. దీనివలన పీడాపరిహారమును, పిశాచాదిదుర్దేవతానివారణమునగునని చెప్పెదరు. ఇచ్చట గంగాతీర్థమును పుష్పములను, సారాయిని పెట్టి పూజించెదరు. ఈభైరవునిగుడియొద్ద గోపాలస్వామి సన్నిధి (గోపాలమందిరము) ఉన్నది. ఇది ఘనవంతుల వశమునందుండుటవలన బాగాయున్నది. ఇక్కడ బావియొక్కటియున్నది. దీనికిపైగవేసియుండే జాయిమధ్యలో నొకరంధ్రమున్నది. ఆరంధ్రము ద్వారా సూర్యరశ్మి మధ్యాహ్నమునసీటియందుపడుచున్నది. ఆసమయమును విశేషమనియెంచి తీర్థమును పుచ్చుకొనెదరు. ఈక్షేత్రమును ౧౮౨౫శివ-సంవత్సరమున పూనానగరపు రాజారాయనిచే జీర్ణోద్ధారణము చేయంబడినది. ఈఘట్టము మెట్లపై నెండిముఖముగల శీతలా దేవతయున్నది. ఆదేవత స్ఫోటకజాఢ్యమును నివర్తింపఁజేయుచున్నదని చెప్పెదరు. ఇక్కడికి సమీపముగానుండు టెలిగ్రాఫ్ ఆఫీసునకు సమీపమున బండియెక్కి నగరమంటపము (టవున్‌హాలు) మార్గముగాపోతే,

### రాజఘాట్ కోట.

కనబడుచున్నది. ఈకోటలో నిప్పుడు ఒక మహమ్మదీయ నబాబుయొక్క సమాధివినా వేరెద్దియు లేదు. ఇది కాశీరాజులయొక్క పురాతన కోట. ఈకోటను సంబంధించి యొకకథ చెప్పుచున్నారు. "పూర్వమునందుండిన కాశీరాజొకరు ప్రతిదినమును ఒక్కొక మహమ్మదీయుని తనయిష్టదైవమునకు బలియిచ్చుచున్నట్లును, షాజిమియా అను పీరునియొక్క

వంతుడువచ్చినప్పుడు వాఁడు తనను బలియిచ్చుటకుముందుగా ఆదైవముతో మాటలాడుటకు కోరునట్లును, అట్లు మాటలాడుటకు పొమ్మని చెప్పినప్పుడు ఆదైవము తాను నరబలికోరలేదని చెప్పినట్లును, అంతరాజు నాయిష్ట ప్రకారము చేయుచున్నానని చెప్పినట్లును పాజిమియా తనచేతనున్న కత్తితోనారాజునుచంపి కోటనుపట్టుకొన్నట్లును చెప్పుచున్నారు. ఆవీరునినిమిత్తము ప్రతిసంవత్సరమును ఉత్సవము (ఉరుసు) చేయుచున్నారట'' కొందరు ఇది కట్టుకథయని చెప్పెదరు. ఇప్పు డీకోట కాశీరాజు వశమందున్నది. మఱియు నీకోటయున్నస్థలమున పూర్వమున రాజబానార్ నగరున్నట్లుచెప్పెదరు. ఇందుకు దృష్టాంతముగా బౌద్ధులమఠమును బౌద్ధులస్తంభమున్నది. కనుక రాజబానార్ నగరున్నట్లును తోఁచుచున్నది. ఈకోటప్రక్కననుండు మార్గముగా వచ్చినయెడల నచ్చట,

లాత్ బహీరో.

అనెడు పేరుగల ఱాతిస్తంభమున్నది. దీనిని హిందువులు తమదనియు తురకలుతమదనియు చెప్పుటయేగాక ఔరంగజీబు కాలమున జేయబడినదనియుచెప్పెదరు. దీనికి సిందూరము పూయబడియున్నది. ఇప్పుడు హిందువులు దీనికి గంగాజలమును ప్రోక్షణముచేసి ప్రదక్షిణముచేసెదరు. ఇక్కడనుండి వచ్చినచో కనఁబడునది,

కపిలమోచనతటాకము.

ఈతటాకమున కాశీయాత్ర చేసినవారు ఇక్కడనుండి తమదేశమునకు బోవునపుడు కాశీక్షేత్రఫలము పూర్తిగాఁ గలుగవలయునని యెంచి స్నానముచేయుదురు. ఇక్కడనుండి రాజబజారు మార్గముగాపోతే,

సైద్ గంజ్ ఠాణా.

కనఁబడుచున్నది. ఇచ్చట ౧౭౮౧-వ సంవత్సరము అక్టోబరు నెల ౧౬-తేది ఖూనిచేయబడి చచ్చిన అనేక ఇంగ్లీషు వీరులయొక్క రూపములను జ్ఞాపకార్థమై గోడలలోఁ వ్రాయఁబడి యున్నవి. వీరు వారన్ హేస్టింగ్సుతో జేరినవారుగానుందురేమో. ఈస్థలముఅడివిగానున్నది దీనికిసమీపమున మాధవదాస్ తోటయున్నది. ఇచ్చటనే విజయరాలీతో వారన్ హేస్టింగ్సు సంధించిన స్థలము. దీనికిసమీపమున గాడిలియావీథి యున్నది. ఈవీథిలోఁ క్రీస్తుగుడి యున్నది. దీనికిసమీపమున,

శివాలయఘట్టము.

ఉన్నది. ఇచ్చట గోసాయీలు వేలకొలది జనులున్నారు. ఇచ్చట

నుండు కోటలో ౧౭౮౧-వ సంవత్సరము వారన్ హేస్టింగ్సు, సైద్ సింగును చెరసాలలో నుంచినట్లు వదంతి. ఈకోటయొక్క ఉత్తరపుగోడలో అయిదు గవాక్షములున్నవి. ఈగవాక్షముల మార్గమువలన సైద్ సింగుతప్పించుకొని పోయినట్లు చెప్పెదరు. అప్పుడు చంపఁబడినవారి సమాధులు చాలాకట్టఁబడియున్నవి. దీనికి సమీపమునందు,

తులసిఘట్టము.

కనఁబడుచున్నది. ఇది సాక్షాత్ వాల్మీకమహర్షియే తులసిదాసుగా అవతరించి హిందీభాషలో రామాయణమును చెప్పినస్థలము. మహాభక్తిశ్రేష్ఠుఁడైన తులసీదాసు ఇచ్చటనసించి రామాయణమును వ్రాసినందున దీనిని బరిశుద్ధస్థలమని చెప్పెదరు ఈరామాయణము ఈదేశీయులచే పారాయణయోగ్యమై మిగుల గౌరవింపఁబడుచున్నది. ఈమహాత్ముని యొక్క ఆశ్రమము అసినదీతీరమున కట్టఁబడియున్నది. ఇప్పుడిది జీర్ణస్థితిలోనున్నది, దీనికి సమీపమున.

అసిఘట్టము

కట్టబడియున్నది. ఇది అసియు గంగయు సంగమమగుస్థలము. ఇది హిందువులకు మహాముఖ్యస్థలము. ఇచ్చట అసి ౪౦ అడుగుల విశాలము గలదిగానున్నది. జ్యేష్ఠాషాఢ మాసములయందు విశేషముగా జనులుఇచ్చటికివచ్చి స్నానముచేసెదరు. ఇచ్చట నుండియే యాత్రార్థులు గంగానదికి ఆవలిగట్టుననుండే.

రామనగరము, (వ్యాసకాశి)

అనుస్థలమునకు పోవలయును. ఇక్కడనొకకోటకలదు. ఇదిసయ్యాదు సింగుమహారాజుగారిచే ప్రారంభింపఁబడి ప్రస్తుతమునం దచ్చోట వసించు కాశీరాజుచే పూర్తిచేయబడి అందమైయున్నది. ఈకోట గంగానదీతీరమునకుపైగా ౬౦ అడుగులపొడవు గలిగిరమ్యముగాకనఁబడుచున్నది. నదీజలమువలన కోటగోడలకు చలనము కలుగకుండుటకై ఎనిమిదిచోట్లయినుపపట్టీలు బలముగా ఏటవాలుగావేసి బిగింపబడియున్నది. ఈకోట ఎడమ ప్రక్కన పులులు మొదలగుజంతువులను బోనులలోవేసి ఉంచియున్నారు. కోటకు మధ్యమార్గమునందుండు ఆస్థానమంటపమున అనేకములైనఅద్భుత విచిత్రవస్తువులను చూడవచ్చును. దీనికిప్రక్కననుండు అరలోపల ప్రవేశించిచూచితే నగరముయొక్క అందము కనఁబడును. ఇచ్చట వర్తకము మెండుగా జరుగుచున్నది. ఇచ్చట నొక పెద్దవీథి యున్నది. కోటకెదురు

గానుండు కడపకు సమీపమున పెద్ద గుంటయున్నది. దాని చెంత అంద మైనతోటయు, దుర్గాదేవి గుడియు నున్నది. ఈగుడి ౯౨ అడుగుల పొడవుగలిగినది. ఈగుడియు సయ్యదుసింగుచే కట్టుటకు ప్రారంభించి యిప్పటి కాశీరాజుచేతనే పరిపూర్తికావింపబడినది. యాత్రార్థులు పట్టణములోపలఁ బ్రవేశించితే,

## దుర్గా గుండము.

కనఁబడును. ఇది కాశీకి రెండుమైళ్ళదూరములోనున్నది. ఇచ్చట గొఱ్ఱెల బఱ్ఱెలబలులు మెండు. ఈగుడి కెదురుగా నవబత్ ఖానాయు న్నది. ఇచ్చట దినమొకటికి మూఁడువేళలు పూజనిమిత్తమై గంటకొట్టె దరు. ఇచ్చటి గుడియొద్ద పురాతనమైన చింతచెట్టులోను ఇతరవృక్షముల లోను వేలకొలది కోఁతులున్నవి. ఈ కోఁతులు శ్రీరాములసైన్యముతో సంబంధించినవని యెంచియున్నారు. చింతచెట్టుకు సమీపమున పంద్రెండు కాళ్ళమంటపమున్నది. ఇచ్చట పెద్దఘంటలు రెండున్నవి. ఇందొకటి మిర్జాపూరు కలెక్టరుగారిచేత బహుమానముగా పంపఁబడినదట. ఈ దు ర్గాక్షేత్రము నటూర్ మహారాణిగారు ౧౦౦ సంవత్సరములకు ముందు కట్టినది. దీనికి సమీపమున,

## బెలాపురము.

ఉన్నది. ఇచ్చట విజయనగరము మహారాజుగారిబంగాళాయున్నవి. దీని కెదురుగా రథమొకటియున్నది. దీనిని దాటివచ్చిన జనానారియన్సు కాలేజియున్నది. ఇది చర్చుమిషనుతోచేరినది. దీనినిచూచుకొని చిత్రాలి ను మార్గముగావచ్చితే క్రీస్తుపుల గ్రామమున్నది. అచ్చట చర్చుమిషను తోచేరిన బోధనాభ్యాసన పాఠశాలయును (నార్మల్ స్కూలును), అనా థల పాఠశాలయును, ౧౮౭౭-వ సంవత్సరమున కట్టఁబడిన ౮౩ అడు గులనిడివియు ౭౦ అడుగుల విశాలమునుగల క్రీస్తుగుడియునున్నది. ప్రస్తు తమున కాశీపట్టణములోని బాప్టిస్టుమిషనుతో జేరిన ఇండ్లును పాఠశాల లును మాధవదాసు తోటలోనే కట్టఁబడియున్నవి. ఇచ్చట సంస్కృతభా షను నేర్పించుచున్నారు. చతార్ బజారు వీథిలో బాప్టిస్టుగుడికట్టబడియు న్నది. మఱియు చర్చుమిషనుతో జేరిన స్త్రీల నార్మల్ స్కూలు నున్నది. అచ్చట జనానా బోధకులున్నారు. లండన్ మిషనుతో జేరిన గొప్పకలాశా లయును చిన్నపాఠశాలయును జడ్జికోర్టువీధిలో కట్టఁబడియున్నవి. ఈలండన్ మిషన్ తరగతి క్రీస్తుపులకు స్త్రీల పాఠశాలయున్నది. దీనికి జనానాబో

ధకులున్నారు. ఇంతేగాక వెస్లియన్ మిషనువారునుక్రీస్తుమతమును బోధించుచున్నారు. ఇట్లు పలుతరగతుల మిషనువారు వారిమతమును బోధించుచువచ్చినను హిందువులు క్రీస్తుమతమున గలియుట కష్టసాధ్యముగా నున్నది. ఇంతేగాక విజయనగరము మహారాజావారి హిందూబాలికాపాఠశాల చూచుటకు అందముగనున్నది. ౧౭౯౧ సంవత్సరమునందు కట్టిన సంస్కృతపాఠశాలలో గవర్మెంటుతో చేర్చిరి. ఈపాఠశాల తోటలో విచిత్రమైన స్తంభ మొకటియున్నది. అది 3౧౪ పొడవుగలది. ఇందు ౪వ శతాబ్దములో వ్రాయంబడిన గుప్తశాసనమును చూడవచ్చును. ఇంకా అనేక స్తంభములు సారనాథ్ లోను తక్కిన ప్రదేశములలోను నుండి తెచ్చి నాటబడియున్నవి. ఈ కాశీనగరము ఒకప్పుడు బుద్ధమతస్థాపనకు ముఖ్యపట్టణముగానుండెను. ఆమతస్థులయొక్క జ్ఞాపకచిహ్నములను చూడనపేక్షించువారు బార్నాఅనువాళ్ళచే కట్టఁబడిన వారధిమీదుగా పోయినచో సారనాథ్ అనుస్థలము పోయిచేరవచ్చును. అచ్చట చాలాసర్కారు కట్టడములు కట్టఁబడియున్నవి. ఆమార్గముగాపోతే ఎగ్జిక్యూటివ్ యింజనీరు ఇంటికెదురుగా కట్టబడిన సూర్యగడియారము కనబడుచున్నది. ఇది ౧౭౮౪-వ సంవత్సరమున గవర్నరు జనరలుగా నుండిన వారన్ హేస్టింగ్సుగారి యుత్తరవుచొప్పున కట్టఁబడినట్లు వ్రాయఁబడి యున్నది. ఈగడియారము పైభాగమున ఇంగ్లాండుతో జేరిన గ్రీన్‌విచ్ నక్షత్ర సిద్ధాంత నియమనము స్థాపింపఁబడియున్నది. దీనినిచూచుకొని పోయినచో కాశికి 3 మైళ్లుదూరమును, లేక రస్తామార్గముగా ౫ మైళ్ళదూరమును గల,

సారనాథ్

అను స్థలమునకు పోవచ్చును. ఇచ్చటనుండు బుద్ధులయొక్క చైత్యములు అనేకశతాబ్దములుగా దేశదేశములలో కొనియాడ బడుచుండుటే గాక, ఇప్పటికిని అతిశయమొందునట్లుగా కనఁబడుచున్నవి. ఈకట్టడముల యతిశయమును చీనాదేశయాత్రార్థులైన ఫాహియన్ అనువారును, హ్యూయాన్ తజాంగ్ అనువారును విస్తారముగాపొగడియున్నారు. ఇది ౬వ శతాబ్దమున కట్టబడినట్లు కన్నింగ్ హాందొరగారు చెప్పెదరు. ౧౧ వ శతాబ్దమున కట్టబడినట్లు ఫర్గ్యూసన్ అనువారు చెప్పుచున్నారు. ఎవరెట్లుచెప్పినను ఇది పురాతనమైనదనుటకు సంశయములేదు. ఇందు చౌఖండి అను గోపురమును ధామక్ అనుగోపురమును ముఖ్యమైనది. వీనిలో చౌఖండిఅనునది ౧౦౪ అడుగుల పొడవుగలిగి అందముగా ఇటుకరాళ్ళతోఁ గట్టబడి కమాన్

వంపుతో గూడియున్నది. దీనిని హుమాయూన్ అనుతురుష్క చక్రవర్తి దర్శించినప్పుడు జ్ఞాపక చిహ్నముగా గట్టబడినట్లు చెప్పెదరు. దీనిలో ౩౦౦ అడుగుల పొడవుగల పురాతనమైన బౌద్ధునిగుడి పాతాళమునుండి కట్టఁబడినట్లు చెప్పెదరు అది కనఁబడలేదు. ధామక్ అను గోపురమునొద్ద పూర్వమున బుద్ధుఁడు వేదాంత ప్రసంగమును న్యాయ ప్రమాణమును చేసిన స్థలమనియును దీనినిఅశోకమహారాజు కట్టినట్లును చెప్పెదరు. ఇది ౯౩అడుగులవ్యాసమును ౧౦౦ అడుగులపొడవునుగల వంపైన కట్టడము. దీనిక్రింది భాగము భూమిపైనుండి ౪౩ అడుగుల పొడవు చునారు రాళ్ళచే కట్టఁబడి అతివినోదముగా కనఁబడుచున్నది. దీనికి అపాయముకలుగక ఇనుప పట్టలువేసి బిగింపఁ బడియున్నది. కట్టడపు క్రింది భాగమున ౮ చోట్లలో అరుగులు వేయఁబడియున్నది. ఒకదానికొకటికి నడుమ౧౫అడుగుల విశాలమున్నది. అరుగుయొక్క విశాలము ౨౧౪ అడుగుల వెడల్పు కలదు. ఈ ౮ అడుగులను ఆశ్రమములుగా కనఁబడుచున్నది. దీనిచుట్టును ౧౫ అడుగుల విస్తీర్ణముగల విచిత్ర శిల్పాలంకారములతో గూడిన చిన్న చిన్న కట్టడములు కట్టబడియున్నవి. ఇప్పుడు చాలాశిథిలముగా నున్నవి. ఇందు చేసియుండు పనితరమును చూచి తీరవలయునుగాని వ్రాయ నలవి కాదు. దీనిచుట్టు మట్టిదిబ్బలున్నవి. గోపురముపై పచ్చికమొలిచి జీర్ణస్థితిలోనున్నది. అనేకగుహాలును కట్టబడియున్నవి. ఇచ్చట అనేక బుద్ధమత తాపసులున్నట్లు వదంతియున్నది. బుద్ధునియొక్క నాలుగుస్థలములలో నిదియొకటియని చెప్పెదరు. ఆనాలుగును ఏవేవియనగా, బుద్ధుఁడుపుట్టిన భూయిల అనుస్థలమును, వారుతపస్సుచేసిన గయ అనెడు స్థలమును, వారు మృతినొందిన కాశియనెడు స్థలమును, వారు వేదాంత ప్రసంగముచేసిన ఈసారనాథ్ అనుస్థలమును, వారికి ముఖ్యములైనవి. ఈధామక్ లోపల విశాలముగా స్థలములేదు. గాలివచ్చుటకు చిన్నకిటికి యొకటిమాత్రమున్నది. ఈకట్టడమునంతయు రాళ్ళచేనిండింపఁబడియున్నది. భూమికి ౧౫ అడుగుల యెత్తున దారివంకరగా బోవుచున్నది. దానిలోపలవంగియేపోవలసినది. లోపల యిసుకగానున్నది. ఈకట్టడముయొక్క తూర్పునను పడమరను గుహాలు చాలాదూరము పోవుచున్నవి. పడమటి గుహాకడప ౧౮౮౪ వ-సంవత్సరమున మూసివేయబడెను. తూర్పుగుహాలలో దివటీలు వేసికొనియే పోవలయును. విషజంతువులు చాలాయున్నవి. ఇప్పటివారు దీనిని మహాపరిశుద్ధ స్థలముగానెంచి ఉత్తరభాగమున బంగారు పూత

వ్రాసియున్నారు. ఈకట్టడమునకు పడమర మూడుగుంటలున్నవి. అందొక దానిలో బుద్ధుడు తనవస్త్రములను, ఒకదానిలో పాత్రలను, ఒకదానిలో స్నానమును చేసినట్లుచెప్పుచున్నారు. దీనికి సమీపమునజైనగుడియున్నది. ఇందు నల్లస్ఫటికశాలచే చేయఁబడిన పెద్దజైన విగ్రహమున్నది. ఇదిగాక విగ్రహము వెలసి యున్నది. ఈ దేవునికి బ్రాహ్మణుడా పూజచేయు చున్నాడు. ఇక్కడ బౌద్ధులుజైనులు బ్రాహ్మణులు విరోధములేక కలిసి మెలసియున్నారు. దీనికి ౧/౪ మైలుదూరమున ధామెక్ మాదిరిగా కట్ట బడినట్టి దిగజిత్ సింగ్ మంటపమనేపేరుగల మంటప మొకటి యున్నది. ధామెక్ గోపురమునకు పడమర శిథిలమైన వైద్యశాల యొకటియున్నది. దీనితర్వాత బౌద్ధులవిహార మంటపములు చాలాయున్నవి. క్రీస్తుపుట్టిన పదియవ శతాబ్దమునందు మతవిషయకముగా గొప్పకలహముజరిగినపుడు హిందువులు ఇచ్చటనుండు ఆశ్రమములను చాలాపాడుచేసినట్లు తెలియ వచ్చుచున్నది. ౧౮౩౫-౩౬ సంవత్సరములలో జనరల్ కన్నింగ్ హామ్ అనువారు ఇక్కడత్రవ్వి చూడగా అనేకగుహలును, చిన్న చిన్న గుళ్లును, తప సులువసించుమఠములును, మిక్కిలివిచిత్రముగా పనిచేయఁబడిన రాళ్లును కనఁబడెను, దీనినిబట్టిచూడగా సుమారు రెండువేలేండ్లకుముందు ఇచ్చట గొప్పపట్టణముగానున్నట్లు తెలియవచ్చెను. ఈసారనాథ్ సమీపముననిట్ట నిలువు కొండపై ౧౫-వ శతాబ్దమున కట్టబడిన యెనిమిదిప్రక్కలు గల గోరియొకటియున్నది. దీనిపైనెక్కిచూచినచో కాశీనగరము మిగుల రమణీ యముగాఁ గనబడును.

## కాశీనగర ఐతిహాసిక విషయము.

ఇది భూలోకములో మిగుల బ్రసిద్ధిగాంచిన పట్టణములన్నిటిలోను శ్రేష్ఠమైనది. మరియుఆదిపట్టణమనియు జెప్పవచ్చును. బుద్ధమతమునకు ఈ కాశిపేరుపొందినది. ౫౫-శతాబ్దములకుముందు బుద్ధమతస్థులుశిరోముండనసన్యా సమును ఇచ్చటనేయుండి గావించిరి. ఇతరద్వీపములకును ఇచ్చటనేయుం డిపోయిరి. ఈపట్టణము మతమునకు ప్రధానస్థలమని యెంచియే బుద్ధుడు ఇక్కడనుండి మతధర్మమును బోధించిరని చెప్పెదరు. సాలోమోను అను యూధరాజు నెమలిని, తోకలేనికోతిని, ఇక్కడనుండియే జెరుసలాంస్థలము నకు తీసికొనిపోయినట్లు చెప్పుచున్నారు. దేశచరిత్ర తెలిసినవారికి ఈకాశీ నగరముగోమలస్ అనువాడు రోమకరాజ్యమునకుపునాదివేయుటకు ౫౦౦ సంవత్సరములకు ముందే అనఁగా క్రీస్తుపుట్టుటకు ౧,౫౦౦ సంవత్సరము

లకు ముందుండియే ప్రసిద్ధమైన పట్టణముగానున్నట్లు తెలియవచ్చును. క్రీస్తుపుకు ౬౦౦ ఏండ్లకుముం దవతరించిన బౌద్ధులచరిత్రను చూచినవారికిని యీనగరము అనేకశతాబ్దములకు ముందుగనే శ్రేష్ఠమైనపట్టణముగానున్నట్లు తెలియును. బుద్ధుఁడు అనేక నగరములకుపోయి ప్రసంగములు చేసియు తృప్తిలేక ఉచ్ఛస్థితిలోనుండు కాశీనగరమున నెలకొని మతము నుద్ధరించవలయునని యెంచి వారికాలమున కాశీదేశమును పరిపాలించుచుండిన మహామతియనురాజు చెంతకుబోయి తనమతవిషయమును వారికిబోధించి వారిని తనమతములోఁ జేర్చుకొని తక్కినవారినిని అనేకులను తనమతములో కలుపుకొనియెను. చీనాదేశపు యాత్రికులును ఇచ్చటికివచ్చియే బౌద్ధమతమును నేర్చుకొనిపోయి చీనా బర్మా జపాన్ మొదలగు దేశములవారిని బౌద్ధమతము ననుసరించునట్లు చేసిరి. ఇట్లు పదునొకండు శతాబ్దములవఱకు మహోన్నతదశలోనుండెను. అప్పుడు బౌద్ధమతమున మిగుల పట్టుదలగల అశోకమహారాజు బ్రాహ్మణులను తనమతములోఁ చేరవలసినదిగా నిర్బంధింపఁగా అనేకులు కనోజసంస్థానమునకు పారిపోయి తగినసహాయమును సంపాదించుకొని బౌద్ధులపై కలహించిరి. తుదకు బ్రాహ్మణులేజయించిరి. ఇట్లుబౌద్ధులకును హిందువులకును మతవిషయకమైన కలహములు జరుగుచు ఐకమత్యము లేక పోయినందుననే అన్యదేశీయులైన మహమ్మదీయులు దండెత్తివచ్చుటకు ప్రారంభించిరి.

## తురుష్కుల అకృత్యము.

క్రీస్తుపుట్టిన ౧౧౯౩ వ-సంవత్సరమున మహమ్మదుగోరి దండెత్తి డిల్లీ (హస్తినాపురము) లో మహమ్మదు రాజ్యమునుస్థాపించి, తర్వాత కాశీపట్టణములో ప్రవేశించి కొల్లగొట్టి గొప్పగొప్ప కట్టడములను గుళ్లను పాడుచేసి కాపులను పలువిధములుగా హింసించినాడు. క్రీస్తుపుట్టిన ౧౬౭౬ వ-సంవత్సరమున ఔరంగజీబు కాశీనగరముపై దండెత్తి కొల్లగొట్టి తపసులను బైరాగులనుచంపి కాపులను హింసించి పురాతనగుళ్లను పడగొట్టించి మసీదులుకట్టినాఁడు. మరల భరించనిపన్నులనువేసి నిర్బాధించగా ప్రజలు గుంపులుగూడి తమనిర్వాహమును తెలియచేసికొనుదమని యెంచి ఔరంగజీబు నొద్దకుపోగా ఆదుష్టాత్ముఁడు ఏనుఁగులనువిడిచి త్రొక్కించి చంపినాఁడు. ఈచండాలునివలన ఈ కాశిదేశస్థులు పడినపాట్లు చెప్పతరముకాదు.

## రాజ్యస్థాపనము.

క్రీస్తుపుట్టిన ౧౭౭౨ వ-సంవత్సరమున అయోధ్యాపురికి రాజుగానున్న నబాబ్ వజీరలి అనువారు రోహిల్ వారిని జయించ ప్రయత్నపడినప్పుడు కాశీనగరమును కొల్లబెట్టినాఁడు. క్రీస్తుపుట్టిన ౧౭౭౫ వ-సంవత్సరమున కాశియందు రాజుగా నున్న సయ్యాద్ సింగ్ అనువారికి ఆంగ్లేయులు సహాయము చేసినందులకై సంవత్సరమునకు ౧౨ లక్షల రూపాయలు పుచ్చుకొనుచుండిరి. క్రీస్తుపుట్టిన ౧౭౮౦ వ-సంవత్సరమున ఇంగ్లీషువారు హైదరాలియును, ప్రాన్సువారును, తాసీలును, మహారాష్ట్రులు మొదలగు వారితో జగడముజేసిన ఖర్చులనిమిత్తము ౫౦ లక్షల రూపాయలు అడిగిరి. కాశీరాజు లేదనిచెప్పినంత శివాలయఘాటు సమీపమున నుండు కోటలోనున్న రాజునుముట్టడించగా, ఆరాజు కాపుల సహాయమువలన ౨౦౦౦౦ సేనలతో చునార్ కోటలోపోయినిలిచి, తర్వాత గ్వాలియర్ కోటకుపోయి వసించుచుండిరి. ఈజగడమున వారన్ హేస్టింగ్సుకు ఏవిధమైన లాభమును లేదు. ఆమీద మహిమనారాయణ అనువారు రాజుగానియమింపఁబడి ౧౭౯౫ వ-సంవత్సరమున వారు మృతినొందిపోగా వారికుమారులు పట్టమునకువచ్చిరి. వారును ౧౮౦౫ వ-సంవత్సరమున గతించిరి. వారికుమారుడైన మహారాజా ఈశ్వరప్రసాద నారాయణ, జి-సి-యస్-ఐ-అనువారు ప్రస్తుతమున రాజ్యమును పాలించుచున్నారు.

## వ్యాపార విషయము.

కాశీనగరమువ్యాపారమునందును ప్రసిద్ధిగాంచినస్థలముగా నున్నది. మిగుల వెలగల పీతాంబరములు, శాల్వాలు, కీన్ కాపులు, ఖండ్వాలు, దుప్పటాలు, రుమాళ్లు, మొదలగు పట్టువస్త్రములు బంగారుసరిగెతోను వెండిసరిగెతోను నేయుచున్నారు. ఇవిచాలా మట్టుకు మదనపురము నెడుచోటమహమ్మదీయులచే నేయబడివచ్చుచున్నవి. ఈపనితరమును చూచితీరవలయునుగాని వ్రాసితీరదు. పిత్తళితోను రాగితోనుగుళ్ళవలెను గోపురములవలెను మంటపములవలెను ఇంకను ననేకవిధములుగా చేయుటయేకాక మహారాజులు వాడుకొనునట్టి పడకటింటి సామానులు, అంతఃపుర సామానులు, నగరుసామానులు, సభకుకావలసిన సామానులు, వంట సామానులు ఆటలాడుసామానులు. బింబములు, ఇవి మొదలగుసామానులు హిందువులకు తగినట్లును మహమ్మదీయులకు తగినట్లునుచేయుచున్నారు. ఈపనియొక్క అద్భుతము చెప్పనలవికాదు. బంగారు వెండితోనుకూడా చాలాసామా

నులు చిత్రవిచిత్రములుగ చేయుచున్నారు. ప్రమాణితోడను అనేకసామాను లును ఆటలాడు సామానులును మిగుల పనితరముగ చేయుచున్నారు.

సామానుల ఎగుమతి.

పైకనినసామానులును, పీతాంబరము మొదలగు పట్టుదినుసులును, ఇక్కడ విశేషముగా ఫలించు గోధుమలును,సిలిమందును, సహః అమెరికా యిరోపా మొదలగువిదేశములకు బంపుచున్నారు.

విగ్రహములు.

మఱియు పంచలోహములతో మిగుల పనితరముగల శివుడు విష్ణు మొదలగు పూజా విగ్రహములుచేసి అమ్ముచున్నారు. వేపమ్రానితోను విగ్ర హములు చేసెదరు ఇవి గుళ్ళతప్ప ఇండ్లలోపెట్టి పూజించుటలేదు. మఱియు ౧౦-౧౨ తులముల నూని రెగల బంగారు వెండి విగ్రహములును చేసి అమ్మెదరు, శీతలాదేవి విగ్రహము మాత్రము వెండితోనే చేసెదరు. రసలింగములును చేసి అమ్మెదరు. గండకీనదిలోని సాలగ్రామములను. శోణ భద్రములోని వినాయకమూర్తులను, నర్మదలోని బాణలింగములను అమ్మె దరు. ఇవన్నియు పూజించుటకు శ్రేష్ఠములైనవి. సాలాగ్రామముమాత్రము కల్పితముకూడా యున్నది. తీయువారు జాగ్రత్తగాచూచి తీయవలయును. నేపాళదేశముతోఁ జేరిన మోరంగి అనుస్థలమునుండి రుద్రాక్షములు తెచ్చి అమ్ముచున్నారు. ఈరుద్రాక్షములు ఏకముఖ, ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ, పంచముఖ, షణ్ముఖ, గౌరీశంకర అను ఇత్యాదినామములు కలిగియుండుటచే వారువారు కావలసినదానిని తీసికొనెదరు.

ఆహార పదార్థములు.

ఆహారమునకు వలయు బియ్యము, గోధుమలు, గోధుమపిండి ఇంక ను కొన్నిధాన్యములును, పాలు, పెరుగు, వెన్న, నేయి, ఇవియును అమ్మె దరు. ఇక్కడ రుద్రాక్షపండును మామిడివరుగును చింతపండుకు బదులుగా కొందఱు వాడెదరు. సైంధలవణమును ఉప్పునకుబదులుగా వాడెదరు. వం కాయలు, ముల్లంగి, గోసు, నూల్కోల్, కాలీఫ్లవర్, పచ్చిబటాణీలు, అల్లము మొదలగుకాయగూరలను అమ్మెదరు. ఇక్కడిజామపండు బెంకాయ ప్రమాణమున్నది. దీనిని అమృతఫలమని చెప్పెదరు. ఆపండును రెమ్మతో విరిచి తెచ్చి పైసాకు రెండు మూడు ఇచ్చెదరు. చాలా ఫలించినపుడు పదెనిమిదియు నిచ్చెదరట. కిచ్చిలి, మణిలాకిచ్చిలి, రేగుపండ్లు, నిడిపి రేగు పండ్లు, అరటిపండ్లు, మొదలగు అనేకఫలములును తెచ్చి అమ్ముచున్నారు.

### ఇతర సామానులు.

ఇచ్చట చలి అధికముగనుక అన్నిజాతులవారికిని గుడాక్ కావలసి యుండుటచే గుడాక్ సామానులును, గంజా పొగాకు దినుసులును అమ్మెడు బజారుమాత్ర మొకటియున్నది. దక్షిణదేశమునవలె ముక్కుపొడి ఇచ్చట చేయుటలేదు. ఇచ్చట పొగాకును చూర్ణముచేసి వాసనద్రవ్యములుచేర్చి ఉలాస్ అనే పేరుతో పైసాకు రెండుపలము లిచ్చెదరు. ఇది మిక్కిలి వేంద్రముగలదిగా నుండుటవలన దీనిని ముక్కులో వేసినమొదల కపాలము వఱకు వ్యాపించుచున్నది. ఈ ఉలాస్‌పొడి యమ్మెడువీథిలోనే,

### సుగంధ ద్రవ్యములు.

అత్తరు పునుగు జవ్వాజి పన్నీరుమొదలగు సుగంధ ద్రవ్యములను అమ్మెదరు, ఇక్కడ మల్లెలు మొల్లలు మొదలగు పలువిధములగు పుష్పము లుండినను జాజిపువ్వులుమాత్రము విశేషము.

### భక్ష్య పదార్థములు.

ఇక్కడ సకలవిధములైన భక్ష్యపదార్థములు దొరకును. ఉద్దు లడ్డున్ను, తెంకాయ తురిమినపూవుతో బర్ఫిని యీదేశమున చేసెదరు. నీళ్ళును ఉప్పును కలియని మిఠాయివర్గమును బ్రాహ్మణులందఱును తీసి భక్షించెదరు.

### వాద్యయంత్రములు.

తంబుర, సారంగి, ఏకనాదము, ఢోలక్, ఢక్కీ, మొదలగువాద్యములను, తాంబూలపట్టీలను ఈవీధిలో అమ్మెదరు. ఇక్కడ తాంబూలపట్టికి బీడియనిచెప్పెదరు. ఈబీడిలో మూండు పండుతమలపాకులను శుద్ధముగాతుడిచి గులాబి మొదలగు అత్తరులను చరిమి దానిలో కొంచెము సున్నమును, కొంచెము కాచుదుమ్మును, పోకముక్కలు రెండును ఏలంకాయ లవంగము మొదలగునవియును పెట్టియున్నారు. ఇట్టి పట్టియొకటికి వెల రెండకాలు. మరియు ఒకఅణాకు యెనిమిది బీడీలు మొదలు రెండు రూపాయలకు ౧ బీడివరకును అమ్మబడుచున్నవి. ఇచ్చట తమ్మలపాకులు రెండుసంవత్సరముల కాలమువరకుకూడా పదిలముచేసి యుంచెదరు.

### వారవనితలు.

ఈతాంబూలపు అంగళ్ళపై మిద్దెలలో కాశ్మీరము, ఢిల్లీ, కనోజా, మహారాష్ట్రము, గుజరాతి, బంగాళి, దక్షిణము మొదలగుదేశపు వార

స్త్రీలు దేవలోకపుగణికలవలె సోపాలపై గూర్చుండి పాటలుపాడుచు, వాద్యములను వాయించుచు, ఉక్కాలనుపట్టుచు, సంగీతము పాడుచు, బాటసారుల మనస్సును భేదించుచున్నారు.

### నాణెములు.

ఇచ్చట వెండి రాగినాణెములతోపాటు గవ్వలనుకూడా నాణెములుగా వాడుచున్నారు.

### జన బాహుళ్యము.

ఈ కాశీక్షేత్రమున బంగాళీదేశస్థులును కాపురము కుదుర్చుకొనియున్నారు. వీరు వసించుచోటికి బంగాళీటోలా యనిపేరు. మహాసత్యకీర్తి యని ప్రసిద్ధిగాంచిన హరిశ్చంద్రుడు చంద్రమతిని అమ్మినబజారులో క్రమముగా వర్తకము జరుగుననెడు తలంపుతో మహారాష్ట్ర దేశస్థులందఱు అచ్చటవసించెదరు. ఈదేశపు స్మార్తబ్రాహ్మణులు హనుమంతఘాటుదగ్గర వసించుచున్నారు. అనేక యిండ్లు ఏడంతస్థులు గలిగియున్నవి. పగటిపూటకూడా దీపసహాయము కావలసినట్లు కట్టబడిన యిండ్లు చాలాయున్నవి. పాయఖానాలను బావులవలె కట్టియున్నందున కంపెత్తియున్నది. దీనిని శుభ్రపఱచుటకు సర్కారువారు చాలాప్రయత్నములు చేయుచున్నారు.

### బాధలు.

ఇచ్చట మూడువిధములైన బాధలుగలవు.

1 రాండ్. అనగా, వితంతువులు, ఈ కాశీక్షేత్రము పవిత్రమైనస్థలమైనందున వితంతువులు, ఇచ్చటగంగాస్నానముచేయుచు విశ్వేశ్వరునిమాధవమూర్తిని సేవించుచు కాలముగడుపుచున్న యెడల మఱుజన్మమునకైనను దీర్ఘసుమంగల్యత్వము ప్రాప్తించుననియెంచి గ్వాలియర్, ఢిల్లీ, కాశ్మీరము, గుజరాత్, పూనా, మొదలగు దేశములలోనుండి బాలవితంతువులు కొందఱు మనస్ఫూర్తిగా మాతృపితలచే బంపబడినవారును, మఱికొందఱు ఎవరికిచెప్పక చేతనున్న సొమ్మును ఇంటిలోనున్న సొమ్మును తెచ్చుకొనినవారును, తల్లి దండ్రికి అన్నదమ్ములు బావమరుదులు అత్తమామలు వీరితో పోట్లాడివచ్చిన వారుననగు వారనేకులును గలరు. వీరిని పండాలనెడు గంగాపుత్త్రులు బుజ్జగించి తల్లి దండ్రి భర్త మొదలగువారికి శ్రాద్ధములు పెట్టించి వారిచేతనున్న డబ్బంతయులాగుకొని దుర్నడతలలోపలబడునట్లుజేసి, తుదకు తమయింటి బానిసెలనుగాచేసెదరు. మఱికొందరగు అవ్యభిచారవృత్తిలోనే మునిగిపోయెదరు. చాలాయిండ్లలో పండాలగు...రు.

క్క భార్యలు గోషాలుగనుక ఈవ్యభిచార వితంతువులే వారింట పని చేసెదరు. ఈకాశీక్షేత్రము మహాపరిశుద్ధస్థలముగాన వ్యభిచారమును దోషముగా భావింపరాదని చెప్పెదరు.

11 సాండ్.—అనఁగా వృషభములు.

ఇచ్చట వృషోత్సర్జనము చేసి వృషభములను విశేషముగా విడిచిపెట్టియున్నారు. ఈవృషభములు యాత్రార్థుల చేతియందుండు పత్త్రిపుష్ప ఫలాదులను పెఱికితినుటయేగాక అవి రేగినప్పుడు కొందరనుకూడా కలుగజేయుచున్నవి.

111 ఛడీలు.—అనఁగా మెట్లు.

ఏఘట్టమునకుపోయినను పలుఅంతస్థులుగల నేలకొలది మెట్లెక్కవలయును. అవి నడిచినడిచి నున్నగానున్నందువలన కొంచెముతప్పినచో కాలుజారిపడి కాలుచేతులువిరిగి బాధపడుట సంభవించుచున్నది. ఈకొఱతలు మూడింటిని వారివారి సామర్థ్యముకొలది తప్పించుకొనవచ్చును.

భక్తివిశేషము.

ఈ కాశీపట్టణములోని సకల జాతులవారును గంగాస్నానము చేసి వారివారి మతచిహ్నములను ధరించి యొకచేత గంగాతీర్థముతోను మఱియొకచేత పత్త్రిపుష్ప ఫలాదులతోను వచ్చుచు దారిలోకనఁబడు లింగములకును విష్ణ్వాది విగ్రహములకును గంగాజలముతో అభిషేకము చేసి పత్త్రిపుష్ప ఫలాదులిడి భయభక్తులతో సేవించుచున్నారు.

అన్న సత్రములు.

అన్న సత్రములు అరువదింటికి పైగానున్నవి. ఇక్కడ అన్నదరిద్రమనెడు మాటయేలేదు. అన్నపూర్ణిసత్రములో అందఱికిని అన్నములభించుచున్నది.

సమారాధన.

ఇక్కడ సంతర్పణ చేయుటకు ద్రవ్యము కొంచెమిచ్చినను పంచభక్ష్య పరమాన్నములను కాయగూరలను శ్రద్ధగాచేసి, భుజింపవచ్చినవారికిని చేసినవారికిని సంతోషమును కలుగజేసెదరు. సుమంగలిపూజ చేయవలసి కోరినచో ఎప్పవేయిమందిముత్తైదువలైనను వత్తురు. ఇక్కడసంతర్పణలో బ్రాహ్మణ [illegible] బంతిగను బ్రాహ్మణస్త్రీలొకబంతిగను కూర్చుండి భోజనము చేయుచున్నారు. ఈదేశములో దృష్టి దోషములేదు. దృష్టి దోషము లేక [illegible] ను కచ్చారసోయి, పక్కారసోయి అనే పాకనియమ

మును పాటించుచున్నారు. ఈనియమములను విచారించక ఒకరితోనొకరు కలిసి భుజింపరు.

## దేశాచారములు.

ఇక్కడ అన్నిజాతుల స్త్రీ పురుషులును స్నానము చేయక పూజ చేయక యుండుటలేదు. గోపాలకులయెడ బ్రాహ్మణులు గంగాజలమును తీసిస్నానపానమున కుపయోగించెదరు. పంచగౌడస్త్రీలు అవికెనుతొడుగుటలేదు. ప్రతిస్త్రీలును అవికెను తొడుగుటలేదు. ప్రతిస్త్రీలును నిండు ముసుకు వేసికొనెదరు. స్త్రీపురుషులును స్నానము దైవపూజలేక భుజింపరు. స్త్రీలందఱు ఉదయాత్పూర్వము గంగలో స్నానముచేసి తమ యిండ్లకు పోయినమీద పురుషులుస్నానము చేయుటకు గంగకుబోవుచున్నారు, దక్షిణదేశస్థులు వస్త్రములను శుభ్రముగాఉతికికొన్నట్లు ఇచ్చటివారువంటపాత్రములను శుభ్రముగా తోముకొనుచున్నారు. ఈదేశీయుల వస్త్రనైల్యమును, దక్షిణదేశీయుల పాత్రనైల్యముచు సమముగానున్నది. కాశిలో ఎనిమిదిమంది చేరితే తొమ్మిది ప్రొయ్యిలనెడు సామెతమేరకు దేహసంబంధులయినను, వారువారు ప్రత్యేక ప్రత్యేకముగా కొంచెము స్థలముచు అలికి అందు వంటచేసికొనెదరు. ఒకరుఅలికియుంచిన స్థలమును మఱియొకరు తొట్టినచో మైలయై పోవుచున్నది.

## దేశము, భాష.

ఇది హిందూస్థానిదేశము, ఇక్కడ వాడుక

ఈభాష నాలుగువిధములుగా నున్నవి.

## జాతులు.

ఇచ్చట బ్రాహ్మణులను బ్రాహ్మణ్ అనియు, క్షత్రియులను రస పుత్రులనియు, వైశ్యులను బనయాలనియు, శూద్రులనియు, పంచములను బేగారీలనియును చెప్పుచున్నారు. కాశీదేశవాసులు సాధారణముగా కృతజ్ఞులును ఉత్తములును స్నేహశీలురునైయున్నారు, ఆయూరిలోని దుర్మార్గులను గూర్చి "కాశీకేలోగ్ బహుత్ సర్వనాశ లగాయగలేదేఫాన్సీ" అని చెప్పెదరు. కొందఱీ బ్రాహ్మణులు మాత్రము వ్యవసాయము చేసెదరు. గౌడ బ్రాహ్మణులు వైదికవృత్తులును ప్రయాగవాళీలు తప్ప గాడబ్రాహ్మణులు వైదికవృత్తిని ప్రత్యేకముగా అవలంబించి యుండలేదు. యాచకులు ఇచ్చిన దానిని పుచ్చుకొనెదరు.

## గౌడులు.

గౌడులనే పేరు కలిగినందులకు గారణ మేమనఁగా, గంగా యమునలమధ్య వసించెడు వీరు కర్మయందు శ్రద్ధను పాటింపక పోయినందున ద్రావిడులు వీరిని గౌణులని చెప్పుచు వచ్చిరి. ఆపేరే గౌడులని మారినది.

గౌడులకును ద్రావిడులకును భోజన ప్రతిభోజనములు లేవు. నమస్కార ప్రతినమస్కారములు మాత్రము కలవు.

## గోసాయిాలు.

గౌడులలో గోసాయిాలనెడు సన్న్యాసులు పది తెగలుగా నున్నారు. వారివారి పేర్లు కడపట, వనా, రణా, గిరి, పర్వత, సాగరా, భారతీ, పురీ, సరస్వతీ, తీర్థ, ఆశ్రమ, అనియుంచుకొనియున్నారు. ఈసన్న్యాసులందఱును ధనవంతులై సాహుకార్లనబడుచున్నారు. వర్తకముకూడా చేయుచున్నారు. వీరికి శిష్యులును పెక్కండ్రున్నారు. శిష్యులను పరిగ్రహించునప్పుడు హోమము మొదలగు ఆగమములు జరిపించెదరు. ఆశిష్యుఁడు గురువు యొక్క ధనఋణాదులకు బాధ్యుఁడునుఅగుచున్నాఁడు. వీరింతకుముందు బ్రాహ్మణేతరులనుకూడా శిష్యులనుగా జేర్చుకొనుచుండిరి. ఇప్పుడు ఆవాడుక నిలిచిపోయినది. వీరికి నమస్కారము చేసినచో నారాయణస్మరణ అని చెప్పెదరు. ఇట్లు వీరు గోసాయిాలైనందున కొకకథ జెప్పెదరు. పూర్వము శంకరాచార్యులవారీ దేశమునకువచ్చినప్పుడు కొందఱు మడశి మాంసముతో భోజనము పెట్టగా వారు స్వీకరించి రనియును, గౌడ్యశిష్యులు మేమేల మానవలసినదని చెప్పి వారును భుజించి రనియును, పిమ్మట శంకరాచార్యులవారు సీసమును కరిగించుచుండు కంసాలిని జూచి దానిని తమచేతిలో పోయవలసినదనగా కంసాలియు అప్రకారముపోయగా శంకరులవారు త్రాగిరనియును అప్పుడున్న యాపదిమంది గౌడశిష్య సన్న్యాసులను జూచి మీరును త్రాగుడనగా, వారు భయపడిరనియును, అంత శంకరులవారు మీరు బుద్ధిస్థైర్యములేక అహంకార స్వభావమును బొందినవారు గాన మీరు భ్రష్టులై పోవలయునని శపించినారనియును జెప్పెదరు.

## గంగాపుత్రులు.

ఈగంగాపుత్రులజన్మము కొన్ని పురాణములలో నీచముగా జెప్పబడియున్నది. గంగాపుత్త్రులు చెప్పునదేమనగా. భీష్మాచార్యులకు పూర్వము గంగన్న కొడుకులను తనలోనైక్యము చేసికొనియుండగా, తర్వాత

భీష్మాచార్యులతండ్రిని గంగ వదలిన మీఁదట పూర్వము తనలో నైక్యము చేసికొనియున్న పుత్త్రులను మరల భూమిపై నుద్ధరించినట్లును, తాము వారి వంశస్థులమనియును జెప్పుచున్నారు. వీరిప్పుడు కన్యాకుబులతో సంబంధము చేయుచున్నారు.

గంగా తీరమునందు ఏదానమును గంగాపుత్త్రులుతప్ప మరియొకరి కీయఁగూడదు.

## తాణీలు, ఘాటియాలు.

తాణీబ్రాహ్మణులును ఘాటియాలును వచ్చినవారికి తీర్థ పురోహిత ములు ఇండ్లలో జరిపించి యిచ్చినదానిని తీసుకొనవలసినవారేగాని బాహా టముగా గంగాతీరమునందు తీసికొనఁగూడదు.

## బైరాగులు.

బైరాగులను నొక తెగవారు తెలగల నామముధరించి సంచరిం చెదరు. వీరికి గురువులు దక్షిణదేశీయ వైష్ణవమఠాధిపతులు.

## మధ్వలు.

ఇచ్చట మధ్వులున్నారుగాని వారు గోపీచందనమును మాత్రము విశేషముగా ధరించి యున్నారు. దక్షిణ దేశీయులవలె అంగార రేఖను ధరించి యుండువారు కనఁబడుటయరుదు.

## ఘూర్జరులు.

ఇక్కడ ఘూర్జరబ్రాహ్మణులు అథర్వణ వేదమును అధ్యయనము చేసియున్నారు. ఆస్వరము ఋగ్వేదస్వరమునకు సమీపముగాను ఉద్ధృత ముగాను నున్నది. దక్షిణదేశీయులవలె ఇచ్చటివారికి వేదపఠనము నెండు గాలేదు. శాస్త్రపఠనముమాత్రము మెండు, బంగాళీబ్రాహ్మణులు అనేకు లు పండితులుగానున్నారు. ఘూర్జరులలో ఖేడావారనియును,నాగరీలనియు ను విభజనగలిగియున్నారు. వీరొకరియింటిలో నొకరు భోజనముచేయరు.

## బంగాళీలు.

వీరు ఉత్కలదేశపు గౌడులు. వీరికి మత్స్యభక్షణముకలదు. అనగా ఉత్కల దేశములో మత్స్యభక్షణమును, ద్రావిడదేశములో మాతుల క న్యావివాహమును, మాగధదేశములో మద్యపానమును, మిధిలాదేశములో దేవరేణ సుతోత్పత్తియును నిషిద్ధముకాదని శాస్త్రమున్నది. ఉత్కల గౌడులలో నొక యన్యాయము జరుగుచున్నది. పూర్వమొకప్పుడు వారి జాతిలో కొంతవిపత్తు సంభవించినప్పుడు అందుకొందఱు వ్యవస్థతోనున్న

ట్టును, అట్లువ్యవస్థకల కులముతో సంబంధముచేసిన తమకులముతో పవిత్ర మగుననియు నెంచి కులీనునకు కన్యకమీఁద కన్యకలనుగా ఇరువదిముప్పదు గురనిచ్చి వివాహము చేసెదరు. అట్లు ఇచ్చినకన్యక వరునకు నూఱాఱు లిచ్చినచో దానితో మాట్లాడుటయు ఇయ్యకపోయినచో దానిముఖము కూడా చూడకపోవుటయు సంప్రదాయమై యున్నందువలన ఆస్త్రీలలోచ పలబుద్ధి కలవారువ్యవస్థతప్పి పూర్వముకంటె నడుచుచున్నారని చెప్పెదరు.

స్తోమాలు, తడలు.

ఇక్కడ సమస్త బ్రాహ్మణులను స్తోమాలనియును. తడలనియును, ద్వివిధ సంఘములుగా నున్నారు. ఒక్కొక సంఘమునకు నొక్కొక యధిపతిని యేర్పరుచుకొని జాలంభట్ల స్తోమమనియు, రాజేంద్ర బాబుతడ యనియు చెప్పబడుచున్నవి. వీరు కొంతకాలము ఒకసంఘముతో మఱి యొక సంఘమువారు మైత్రిగను కొంతకాలము విరోధముగను నున్నారు.

అర్చకులు.

ఈకాశిలోని దేవాలయము లన్నిఁటిలోను అర్చకులు పంచగౌడు లతో జేరినవారు. కాలభైరవుని అర్చకులు మాత్రము కాన్హోపడా లనెడు జాతివారు. వీరు చెవిమధ్య రంధ్రముగలిగి స్ఫటికపు ఉంగరమును తగిలించుకొని యున్నారు.

కాలస్థితి.

శీతలకాలములో విశేషముచలిబాధయుండు లాగున, ఉష్ణకాలము నందును ఎండవేడిమి విశేషముగానున్నది. ఇక్కడ కార్తీకమాసమున అహస్సు ౨౬ ఘడియలుగానున్నది. ఆవాసి రాత్రిఘడియలు వృద్ధిగానున్నది.

గంగ కావిడి.

గంగాజలమును వారివారి దేశములకు గొనిపోవుటకు పట్టువారున్ను, కావడికట్టేవారును, దశాశ్వమేధ ఘట్టములోనే పట్టవలసినది.

వృద్ధమణికర్ణిక.

కేదారఘట్టమును వృద్ధమణికర్ణికయని యొక పురాణమున చెప్పబడియున్నదట. కావున కొందఱు చక్రతీర్థము నొద్దనుండు మణికర్ణికలో స్నానముచేయుట మిగుల దుర్లభమనియెంచి యిచ్చటస్నానము చేసెదరు.

భూసారము.

ఈభూమియొక్క సారవంతమువిశేషమైనది. హిందూదేశములోని సకలవిధములైన ఫలవృక్షములును ఇచ్చటగలవు. అవి అన్ని దేశముల

యందుండు వానికంటె గొప్పవియును మనోజ్ఞమును మాధుర్యమును గల విగానున్నవి. ముఖ్యముగా చెఱుకు, నీలి, గోధుమలు, మొదలగునవి అన్ని దేశములకంటె నెక్కువగా ఫలించుచున్నవి. మొత్తముమీద గంగానదీ ప్రవాహపు పండుగల భూములన్నియు ఫలవంతమయినవని తెలియదగ్గది.

ఇట్లు అన్ని విధముల యందును ప్రసిద్ధిగలిగిన కాశీక్షేత్రమును దర్శించినట్టి మానవజన్మమే జన్మమని పెద్దలు చెప్పుచున్నారు.



# గయాక్షేత్రము.

గయామాహాత్మ్యము వాయుపురాణమందును గారుడమందును విశదముగ చెప్పబడియున్నది:—గయాసురుడు తపముచే. యీశానవిష్ణు కమలాసనులను మెప్పించి తానుపవిత్రుడైనట్లు వరముకోరి పొందిసంతుష్టుడయ్యెను. బ్రహ్మయాగముచే యదలించి పవిత్రుడగు గయుని కడకువచ్చి నీశిరమును గుండముగ చేసి యజ్ఞము చేయదలంచితినన గయుడువల్లెయని పరుండెను బ్రహ్మయాగము చేయ మొదలుపెట్టె గయునిశీర్షము కదులుచుండెను. యెన్ని విధములుప్రయత్నించియు వానిశిరఃకంపనమును నిలుపనేరరైరి. అపుడుమరీచి మహర్షిపత్నిధర్మియనునది భర్తృశాపమున శిలయైయుండ ఆశిలను యమునిచే తెప్పించిబ్రహ్మ గయుని శిరము పెట్టించెనుగాని తలకదలుచునేయుండెను. అపుడు హవిర్భాగముగొనవచ్చిన గదాధరుడైన విష్ణువుతనపాదమును ఆశిలపైనుంచగ తలకదలకుండెను యజ్ఞముపూర్తియయ్యెను ఈహెూమగుండమున శ్రాద్ధముచేయువారి నూటయొక్కగోత్రమువారు స్వర్గమందుండుట కనుగ్రహించి పితృరూపియై గదాధరుడిక్కడయుండవలెనని గయుడు కాంక్షింప గదాధరుడు వాని కోర్కెలు తీరునటులు వరమొసగెను.

ఈపురమును పరిసరప్రదేశములనుచేర్చి పూర్వమున మగధదేశమని పాడుదురు. కీకటమనియు పల్కుదురు.

ఈక్షేత్రమున ప్రథమమున ఫల్గునీనదియందు స్నానమాచరించి సమీపముననుండు విష్ణుపాదమున శ్రాద్ధపిండాదులొసర్పవలెను, గుండమును ఖోలిపల్లముగను. ఆపల్లమున పాదచిహ్నములును గలవు అన్నిజాతులవారును యీవిష్ణుపాదమును తాకి పిండములు పెట్టవచ్చును. యిక్కడ

ను పశువులరచ్చ అధికము. శ్రాద్ధద్రవ్యములుచేత నున్నపుడే యవి పెరుకుకొనితినిపోవును.

విష్ణుపాదములకు చుట్టునుండు తొట్టికి తంజావూరురాజుగారు వెండితగుడు వేయించిరి. యీదేవాలయాంతర్భాగము 8 అడుగుల నిడుపును 100 అడుగులయెత్తును గల్గి స్వర్ణపతాక యుక్తము చిత్రశిల్పాకరమునై అహల్యాబాయివలన నిర్మింపబడినది గర్భగృహమునకు వెలుపల చక్కని మండపములో అష్టపాదములు గలవు యీమండప దేవాలయములన్నియు అహల్యాబాయిగారి ప్రతిష్ఠలే. ప్రథమ దివసమున విష్ణుపాదశ్రాద్ధము.

2 దినము. ఫల్గునీనదీశ్రాద్ధము. పిండములు నదిలో వేయవలెను.

3 దినము. గయకు సుమారైదారు మైళ్లదూరముననుండు ప్రేతపర్వతముపయి శ్రాద్ధముచేయవలెను. కొండక్రిందికి పోవువరకుబండ్లుకలవు. అటుపైకొండనెక్కవలెను. నేపాలమహారాజుగారు యీకొండకు 350 పడిగట్లుకట్టించియున్నారు. ఈకొండపైమండపమును అందు రామలింగస్వామియు. రెండుచింతచెట్లునుకలదు. నీళ్లుదొరకదు. యీకొండనుండిచూచిన గయాపట్టణమంతయు చూచుటకు రమణీయముగ గనుపట్టును. పూర్వపు చంపకారణ్యమిదియే యైనందున యిక్కడ మయూరములును. మరిపెక్కుసుందరములైన పక్షులును స్వేచ్ఛగసంచరించుచు చూపరుల కానందముగల్గించును, మరియొకమండపమున స్వర్ణరేఖయున్నది. యిదిబంగారువలెనుండు ఒకవిధముగురాయియని తోచుచున్నది. యిక్కడప్రేతగయావళులనువారుగలరు. మనముశ్రాద్ధముపెట్టినపిదప, యీగయావళులు భంభం అనిచేయి తిరుగవేసి నోటితాళము వేయుచుమీప్రేతలు స్వర్గముచేరినారని సుఫలమిత్తురు. వీరిభార్యలు బూబీలవలెబయటికిరారు, అన్యదేశములనుండి వచ్చినవితంతువులచే గృహకృత్యములను చేయించుకొందురు. విశేషించి యీవితంతువులు చాలవరకు వ్యభిచారిణులనియే చెప్పవలయును, యీగయావళులభార్యలు కేవలము భోగములకుమాత్రమేయున్నారు.

4 దినము. ప్రేతపర్వతమునకు పోవుదారిలో రామపర్వతమను చిన్నమలకలదు. యిక్కడ నాల్గుచోట్ల పిండములు పెట్టవలెను. ప్రతిపిండమునకు కారుణ్యమని ధర్మపిండములు నలువదిచేయవలెను. గయావళీలిక్కడ కూడ వాక్తాళము వేసికొందురు, అష్టగయాశ్రాద్ధములు పెట్టనివారిని యిక్కడ చాల తొందరచేయుదురు.

5 దినము. సాయంబుగంజికి సమీపమున తీర్థపుటొడ్డున తద్దినముచే

సి సమీపస్థ సూర్యసన్నిధిని దర్శించి గదాధరుని యెదుట పిండముపెట్టి అభిషేకార్చనలు సలిపి కొంచెముదూరముననుండు పితామహేశ్వరుని దర్శించి ప్రేతగయావళులకు పాదపూజా కానుకలర్పించుకొని ఫల్గునీనదికి వచ్చి పిండదానము సేయవలెను.

6 దినము. గయకు సుమారు 7-8 మైళ్లదూరముననుండు ధర్మారణ్యమను బుద్ధ గయలో నాలుమార్లు పిండములు పెట్టవలెను.

7 దినము. ధర్మారణ్యమునకు సమీపమునగల బ్రహ్మ సరస్సునకు వెళ్లి పిండములుపెట్టి కాకబలి, హేమబలి, స్వర్ణబలి, యను బలిత్రయమొనరించి అటనుండు ప్రాచీన చూతవృక్షమునకు ప్రదక్షిణ మొనర్పవలెను.

8 దినము. విష్ణుపాద సన్నిధినిగల అష్టాదశపాదములో వేర్వేరుగ పదునెనిమిది పిండములుపెట్టి నందిదీపమను నెయ్యిదీపముపెట్టి అన్ని లోకములందుండు పితరులువచ్చి సుఫలమీయవలెనని ప్రార్థింపవలెను.

9 దినము. ఫల్గునీనది శ్రాద్ధమువలెనే విష్ణుపాదమెదుట అన్న పిండములుపెట్టి విష్ణుపాదమున ఆపిండములును సమర్పణచేయవలెను. పశువులాపిండములను తినిపోవును గోదాన మాకాలమున చేయవలెను.

10 దినము. వటవృక్షముక్రింద శ్రాద్ధమొనర్పవలెను. యీ వటవిటపి కొన్ని వేల సంవత్సరముల నాటిదని చూచుటతోడనే తెలియును వృక్షమూలము శుష్కమై యూడలే చిగిర్చియున్నది. ప్రధానవృక్షమునందును స్పృశింపకుండునటులు యినుపకమ్మీలు చుట్టునాటి తాళము వేయుచున్నారు. పిండములు పెట్టినతర్వాత గయావళీలు చేతికి పూలమాల చుట్టి నీయాస్తిలో సగమిమ్మనియు పెద్ద మొత్తములిమ్మనియు పీడించి కర్తను వేధించి డబ్బులాగుదురు. గుమావళీ లుదయముననే స్నానభోజనము లొనరించుకొని తాంబూల చర్వణముతో గుఱ్ఱమెక్కి యీ యక్షయవటమునుజేరి. పోకుదుస్తులు పదిలపరచి పట్టుపంచ కట్టుకొని మంచములో గూర్చుండి యుందురు. కావున శ్రాద్ధముపెట్టువారి ఆకలిదప్పు లెరుగరు. యీ క్షేత్రపురోహితులు యాత్రికులకడ 1-4-0 తీసియిచ్చి సుఫలమునిప్పింతురు. పూర్వము బ్రహ్మయజ్ఞము చేయునపు డాహ్వానించిన ఋత్విక్కుల బ్రహ్మలవంశమున బుట్టినవారట యీ గయావళీలు యాత్రికులకు వీరిచర్యలు అసహ్యమును గలుగచేయును.

11 దినము. అష్టతీర్థములుగల రామగయయందు శ్రాద్ధములొనర్పవలెను. ఇది అష్టగయలకు సంబంధించినదికాదు. అన్నితీర్థములందును పిండ

ములు పెట్టుడని ధనాశచే గయావళులు పీడింతురు. తుదకీ రామగయ యందైనను పెట్టకతప్పదు. యిక్కడనే రామసాగరమని తీర్థముకలదు.

12 దినము. న్యూనపరిపూర్ణ విష్ణుపాద శ్రాద్ధమను పేరుతో లక్ష తులసీదళములచే విష్ణుపాదము నర్చించి పిండములు పెట్టవలెను. పంచ ద్రావిడులు. శుద్ధశ్రాద్ధమును పూర్తిగనెరవేర్తురు. యీ గయావళీలనుని మంత్రించినయెడల బూడ్సులు చొక్కాలు తాంబూలరాగములతో విజ యముచేయుదురు. బ్రాహ్మణార్థమునకు కట్నములుకలవు.

13 దినము. ఉదయము ఫల్గునీనదీ సావిత్రీహ్రాదయములందు స్నాన మాచరించి సమీపాలయమున గాయత్రీజపముచేసి. యిదివర కకాలసం ధ్యావందన సంధ్యావందన రహితాదులకు ప్రాయశ్చిత్త మొనర్చుకొని మధ్యాహ్నము బ్రహ్మయోనియను పర్వతముపైకిపోయి యోనిరూపముగ నుండుద్వారమున దూరి (జన్మరాహిత్యమునకు) రావలెను. సుమారు రెండుమైళ్ల దూరముననుండు ధర్మారణ్యముననుండు సరస్వతీనదిలో స్నా నముచేసి గాయత్రీధ్యానము చేయవలెను. ధనాకర్షణకొరకై మరియెన్ని యేని శ్రాద్ధములు చేయమని బాధింతురు. ఈ గయానగర మొకజిల్లాయై మధ్య పరగణాలో చాల లాభము వచ్చునదై యున్నది. యిపుడు గయా వళీలుండునది యిలహాబాదని చెప్పుదురు. వీథులన్నియు యిరుకు సందు లుగ నుండి ఆరోగ్యశాఖాపాలనాధికారులకు సైతము గుండెలదర వేయు నంతటి దుర్గంధముగనుండును. బహువిధతైలములతో తయారుచేయు మి ఠాయిల పూరీల దుకాణముల దుర్గంధముతో గాంజాభాంగుల దుర్వాస నలుచేరి మెదడును పాడుచేయును. యీగయావళీలలో లక్షాధికారులును కోటీశ్వరులును గలరు వీరిమేడలు రెండుమూడంతస్తులుగల్గి వీరు కట్టుబట్ట లు శుద్ధములైనను తక్కిన వారిబట్టలు మురికిగనే యుండును. యీ యిల హాబాదొక కోటనుబోలి సింహద్వారములతో నుండుటచే చాల ప్రాచీన మని చెప్పవలెను. సాహేబు గంజియనుపేట నూతన నిర్మాణము. కావున వీథులు విశాలములుగను మందిరములు శుభ్రముగను మిఠాయి దుకాణ ములలో దుర్గంధతైల పక్వపదార్థములు తక్కువగను నుండిన నగరనిర్మా ణము చాల సుందరముగ నుండును. యీ సాహేబు గంజలో పెద్దపెద్ద యుద్యోగములును ధనమునుగల తెల్లవారుకలరు. యీగయకు దక్షిణ ము 8 మైళ్లదూరమున బుద్ధగయయను బౌద్ధక్షేత్రముకలదు. యిట బుద్ధ మహర్షి తపమొనర్చిన బోధివృక్షమంతయు యెండియుండుటవలన దాని

కొమ్మలను యినుపతీగలతో కట్టియున్నారు. యీక్షేత్రమున పెద్దశిఖర మతి చిత్ర శిల్పనైపుణ్యమును జూపునదియై యున్నది. యీ దేవాలయావరణ మంతట నెక్కడజూచినను. ప్రాచీన భారత శిల్ప నైపుణి గన్పడుచునే యుండును. మహిమాన్వితమైన శిల్ప మిప్పటికాలమున నశించిపోయినందు లకు కన్నీరు విడువని భారతీయు డుండడు. యిక్కడ నొక చిన్న బజారును కొన్నియిండ్లు నుండుటయుగాక బుద్ధమహంతు మహదీయకుడు. యీ శ్రాద్ధగయకు సంవత్సరమునకు 9 లక్షలరూప్యముల రాబడికలదు. యీమ హంతు తమ మతతత్వములనేగాక యితరానేకమత రహస్యములను దెలిసి కొనిన పండిత శిఖామణి యీమహంతు పోషణలో బీదలకు సాధులకు జాతిమత భేదములేక వేయు అన్నదాన ధర్మశాలయు. కళాశాలయు. వైద్యాశాలయు పశుపోషణశాలయుగలదు. యివిగాక గుఱ్ఱములు యేనుగులు లొట్టిపిటలును గలవు. రాజ్యాంగమును బోలి డంకా నగారా వాద్యములును గలవు. అందరితోడను యీమహంతు శాంతముతో మాటాడు చుండును గయకువచ్చు యాత్రీకులు ముందుగ పురోహితుల (పండాలు)ను ఆశ్రయింపవలెను సకల సౌకర్యములను యొడగూర్తురు యీపురోహితులు యాత్రీకులకై కొన్నియిండ్లను కట్టించియున్నారు. ఆయిండ్లలో మునిసిపాలిటీవారు లైసన్సు లిచ్చినయిండ్లలో బసచేయవలెను. యిక్కడ గూడ వేశ్యలును వ్యభిచారిణులు నధికము.

## అయోధ్య.

శ్రీమదనంత కల్యాణగుణ లీలామూర్తియై రావణ కుంభకర్ణాదిక్రూరాసుర బల నిర్మూలనచణుడై పవిత్రభారత నారీశిరోరత్నమునకు నాయకుడై, వాల్మీకిమహర్షి చే స్వీయచరిత్రమును వ్రాయించిన శ్రీరామ చంద్ర పరబ్రహ్మమూర్తి యవతరించి పరిపాలించిన అయోధ్యానగరమిదియే, సాకేతమని దీనికి నామాంతరము కలదు. సుమారొక్కమైలు వెడల్పు గలిగిన సరయూనది యీనగరమును మాత్రమేగాక భారతదేశయాత్రీకుల నందరిని పవిత్రమతులనుగ జేయుచున్నది. విశేషముగ మంచుగడ్డలుకరిగి వచ్చిన నీరగుట దక్షిణదేశీయులు తాకుటతోడనే లక్ష తేళ్లు కుట్టినట్టులుగ నుండును. యీనదియొడ్డున నుండుదేవళమున సీతారామలక్ష్మణ విగ్రహములు స్వర్ణమయములైయున్నవి. దక్షిణదేశమువలె దేవళములకును గృహములకును వేరువేరుగురుతులులేవు. దేవళములును యిండ్లమోస్తరుగనే యుండుటనుబట్టి వేలకొలది దేవాలయములున్న వనక తప్పదు. ఆ యూరి

వారి నడిగిన అయిదువేలకుపైగ గుళ్లున్నవని చెప్పెదరు. రామజన్మస్థానము. ఆట్లాడినచోటు, వంగినచోటు పరుండి నిద్రించినచోటు. భుజించినచోటు. సీతాకల్యాణమండపము, పట్టాభిషేకమండపము, కొలువు కూటము. యిత్యాదులెన్నియో గలవు. యేకాదశినాడు మాత్ర మెట్టి కట్నమును పుచ్చుకొనకనే నదియొడ్డున నుండు స్వర్ణవిగ్రహాత్రయ దర్శనము చేయ వచ్చును నగరమధ్యమున నొకచిన్నకొండపై పెద్ద హనుమ ద్విగ్రహము గల దివ్యాలయమున్నది. సంవత్సరమున కేబదివేలరూపాయ లీయాలయ మునకు వ్యయమగునట నిత్యమైదువందల సాధులకన్నము వేయుచున్నారు హనుమంతరాయాలయ సమీపమున క్రింద బ్రహ్మాండమై దివ్యమైన అయోధ్యరాజుగారి మందిరమున్నది. అంతఃపురమునకుగాక తక్కినచోట్ల న్నియు యాత్రికులు పోయిచూడవచ్చును. యిప్పటిరాజుమైనరు లక్నోలో చదువుకొనుచున్నాడట కొన్నివీథులను దాటిపోయిన మనదేశపు నాటు కోటసెట్ల ధర్మసత్రమున్నది యిక్కడి దుకాణములలో చింతపండుండదు కాని తక్కిన సరకులన్నియు నయమైన వెలలకు దొరుకుచున్నది ఔరంగ జీబుకట్టించిన పెద్దమసీదొకటి పాడుపడియున్నది. ఈపెద్దపట్టణమునకు చాలినంత జనసంఖ్యయున్నటుల కనుపడదు. చైత్రమాసమున జరుగు శ్రీరామోత్సవ దినములలో నిక్కడికి సుమారు అయిదారులక్షల యాత్రీ కులు వత్తురట అపుడింత పెద్దపట్టణమునగూడ తావుచాలక చెట్లక్రిందవ సింతురట శ్రీరామపాలనాకాలమున కాశియానగరమునకు స్మశానముగ నుండెనందురు. యిక్కడి ప్రజలు చాలవరకు సద్ధర్మపరాయణులై భక్తులై జేసీతారాం శబ్దములను దినమును పల్కుచుందురు. రామరాజ్య ప్రభావ ముకాబోలును, సరయూనదిలో తాబేళ్ల తొందరయు దేవళములలో కోతులతొందరయు నగరములో వ్యభిచారిణుల తొందరయు సహింపశక్య ముకాదు. దివ్యక్షేత్రములలో యీవ్యభిచారిణులుండుట దేశదౌర్భాగ్య మెకారణమనవలెను సరయూనది కావలిగట్టున హిమాలయపర్వత పంక్తి దృష్టుల నాకర్షించుచుండును. అయోధ్యకు రైలుస్టేషనుకలదు. ఫైజా బాదులోను దిగి గుఱ్ఱపుబండ్లపై వత్తురు, లక్నోయిక్కడికి 46 మైళ్లు.

కేదారఘట్టము (ఫైజాబాదు.)

అయోధ్య కత్యంత సామీప్యమునగల నగరమీ ఫైజాబాదు, దీని నిర్మాణము చాల సుందరముగనుండి యీయూరు విడిచివచ్చుటకే మనసు రాకుండును. అయోధ్యపరగణా ప్రధాన పట్టణమిదియై యుండినపుడు

చాల వైభవయుక్తమై యుండునుగాని యిపుడు ప్రధానకార్యాలయము లను లక్నోకుమార్చియున్నారు. యిక్కడ సుజాదౌలాయొక్కయు వాని బేగంయొక్కయు సమాధులోక నందవనమున స్ఫటికశిలలచే నిర్మింపబడి యున్నది అయోధ్యవలెగాక యీపట్నపు వీధులు విశాలములై యున్నవి యిక్కడికి సమీపమున ప్రవహించు సరయూనది రెండుమైళ్ల వెడల్పు గల్గియుండును. యిక్కడ కేదారఘట్టమున్నది యీఘట్టమున అనుదిన మును వేలకొలది భక్తులు గ్రుంకులిడుదురు. అయోధ్యాఫైజాబాదులందు మంచుకాలమున దక్షిణదేశీయులు యాత్రవచ్చి రేని మంచుతో పోరాడి యోడి. శరీరము దుర్బలముగ గాని థారపోసికొనిగాని పోవలసిన వారే ఉత్తరహిందూస్తానమున యింతటి సుందరనగరము లేదనివాడుక. యిక్కడికి అలహాబాదునుండియు మొగల్సరాయినుండియు యినుపదారులు గలవు పెద్దరైలుస్టేషను లక్నోకు 80 మైళ్లదూరము.

## లక్ష్మణపురి. (లక్నో.)

శ్రీరామానుజుడగు లక్ష్మణునిచే కట్టింపబడిన పట్టణమందురు కుమద నదియొడ్డున సుమారుపదిమైళ్ల విస్తీర్ణము నిర్మింపబడిన మేడలుగల నగరశ్రేష్ఠము. భూలోకనందనోద్యానమని పొగడ్తగన్నది ఇపుడు భూలోకనాటక శాలయనియు బిరుదునిచ్చియున్నారు యెక్కడచూచిన రెండుమూడునాలుగైదారంతస్తుల మేడలే సుందరమందిరములే, చూడ చూడ ఆనంద దాయకములే ఈనగరపుచుట్టు కొలత ముప్పదియారు మైళ్లుకలది.

(ఈపురమున చూడవలసిన వింతలు.)

(1) డిల్ కుషా అంతఃపురము— ఇది క్రీ - శ. 1800 సం- మున. సదత్ ఆలీఖాన్ నబాబు కట్టించిన శృంగారమైన. బ్రహ్మాండమైన కట్టడము.

(2) లామార్టిన్ కలాశాల. 1793 సం- మున కేవలము సిపాయియైయుండి యిక్కడనే పరమ పదించిన ఫ్రాన్సుదేశీయునిచే కట్టింపంబడినది.

(3) లింగుఫీల్డుమార్కెట్టు. దేవేంద్రుడు వసింపతగినటులుండు శృంగార నందనవనము.

(4) సికిందరాభాగు. గవర్నమెంటు విచారణలోనుండు పుష్పవనము.

(5) బెయిలీగార్డు. స్థానికాధికారి వసించు శృంగారమందిరారామము.

(6) కోట. ప్రాచీనమైనందున యిడిసిపడియున్నది.

(7) మచ్చిభవనము. 1784 సం- మున. కఱవులో కోటిరూప్యములు వ్య

యముచేసి కట్టిన బ్రహ్మాండమును అతిశయమునైన కట్టడము. యీకట్టడములో దేశీయ శిల్పకలానైపుణ్యమును దెలుపు హిమాంబరా. యను మందిరముకలదు. యీ గోడవెడల్పు 16 అంగులు గలిగి యింతపెద్ద కట్టడమున నొక్క మానికొయ్య మచ్చునకైన యుండలేదు. యింత విస్తీర్ణమును అద్భుతమును గల నిర్మాణమును యేభారతీయుడైన కనులారగాంచెనా. భారతదేశమపుడుండిన సౌభాగ్యదశకును యిపుడుండు దౌర్భాగ్యదశకును. క్షణకాలమైన దుఃఖింపకయుండడు అవశ్యమీమహామందిరము చూడవలెనని దేశీయులను కోరెద ఇపుడీ మందిరమున మహమ్మదీయ గురువుగారి రజత సింహాసనమును అటులె యుంచియున్నది.

(8) హుసేన్ బాగు. ఇది చాలభాగము స్ఫటిక శిలానిర్మితము. కావున చాలసుందరమైనది. గులాబుల స్తర్ల వృక్షశాఖలవలె నుండును కావున దీనికి దీపప్రకాశ సుందర మందిరమందురు ఇక్కడ యిస్లాం గురువుల వెండి సింహపీఠమును నవాబుగారి రత్న కిరీటమునున్నది. యిరువురు శ్వేతముఖుల సమాధులునుగలవు.

(9) లాల్ బరడారి. అను ప్రదర్శనశాలకలదు నానాదేశవస్తువు లిందుచూడ తగినవికలవు యివిగాక చట్టర్మ్యాంజిల్. కానింగు కాలేజి. కెయిజర్ భాగు హసాదు భాగు. చీనాభాగు. యినుపవారధి. (ఐరన్ బ్రిడ్జి) నక్షత్రశాల యివియన్నియు చూడతగినవి. సర్వవిధముల యీనగరరాజము భారత దేశపుర గరిష్ఠమనదగియున్నది. సుమారు 30 లక్షలజనులు వసించుచున్నారన యిక్కడలక్ష్మి తాండవమాడుచున్నదని వేరుగ చెప్పనక్కర లేదు.

నింసారము. (నైమిశము.)

ఈనింసారమే నిజమైన నైమిశారణ్యమని చెప్పెదరు, యిది కుమదానదికి సమీపమందున్న పురాతన పట్టణము. నదియొడ్డున యిసుకదిబ్బమీద అర్ధమైలు చదురముగల యిటుక రాళ్ల కోటయొకటి కలదు. దీనికి సమీపమున విష్ణుసాగరమను సుందర తటాకమున గ్రుంకి యాత్రీకులు విష్ణుపూజచేయుదురు. అయోధ్య రోహిల్కండురైలులో మహారాక్ పూరు వకు 45 మైళ్ల దూరమున కలదీయాశ్రమము.

హరిద్వారము.

మోక్షదాయకములగు సప్తపురములలో నొక్కటియగుమాయాయని యీ హరిద్వారమును చెప్పుదురు. యిది చాల ప్రాచీననగరమగుట శైవులు హరద్వార మనియు, వైష్ణవులు హరిద్వారమనియు చెప్పి తగవు

లాడుచుండుటయేగాక క్రీ.శ. 7-వ శతాబ్దమున నిటకరుదెంచిన హుయర్ణ్ స్యాంగను చీనాదేశీయు డిది కపిలస్థానమును బౌద్ధక్షేత్రమనియు వ్రాసి యున్నాడు ఇక్కడనే గంగానది హిమాలయమునుండి వచ్చునది. శుకుడు జన్మించిన నీలధార. పరీక్షితుని తపోభూమి. దక్షప్రజాపతియజ్ఞభూమి. మహావిష్ణు శయనము, మొదలగు ఘట్టములుగలవు. ప్రతిసంవత్సర వైశాఖమాసమున జరుగు కుంభమేళమను బ్రహ్మోత్సవమునకు లక్షలకొలది యాత్రికులు వత్తురు. కుంభ మీన మేష మాసములందు జరుగు ఉత్సవాదులకు చాలమంది వత్తురు. ఈ హరిద్వారమునకు 15 మైళ్ల దూరములో హిమాలయమున హృషీకేశమను దివ్యభూమికలదు. యీ హిమాచల పరిసరములం దీనాటికిని మహర్షులు తపముచేయుచున్నారు ఆర్యసమాజమువారి గురుకులమను విద్యాలయ మీ హరిద్వారమున గలదు. చాల పెద్దపట్టనము రైలుస్టేషనుకు రెండుమైళ్ల దూరమందుండును. శహార్ణపూరుకు 49 మైళ్లున్నది.

## హిమాలయ పర్వతము.

ఇది భరతఖండమందు మాత్రమేగాక భూలోకమందు నైత మింత పెద్ద పర్వతము కానరాదు. ఇది సింధునదికి పశ్చిమముగ తిరిగియు. తూర్పున బ్రహ్మపుత్రానది వరకు తిరిగియు దాదాపు పదునైదువందల మైళ్లదూరమును రెండువందలమైళ్ల వెడల్పును గలిగి సర్వౌషధులును భయంకర సింహ శరబ శార్దూలాది మృగములును. అనేకోన్నత శిఖరములును. ఎవరెస్టను అత్యున్నత శిఖర రాజమును గల్గి వెలయు హిమవత్పర్వతము. అపారమేఘముల సారమును దాటిపోనీక యిటువైపే వర్షింపజేసి సారవంతములగు వృక్షములను ధాన్యములను పండించి పోషించు పరమ పితయైటిబెట్టునందలి మంచును చలిని యీప్రాంతమునకు రానీక రక్షించురాజై కామాద్యరివర్గమును నిర్జించి పవన పర్ణాంబు భక్షులై తపము సల్పు మహామహుల కాశ్రమభూమియై. ప్రకృతిని వర్ణించు కవులకు లక్ష్యలక్షణమాత్రమై యుండు హిమాలయ శైలమును దర్శించి యానందింపని మానవుని జీవితము వృధయేయగును మంచు మల యీ భరతఖండమందుండుట వలనను. మంచుకొండలో గంగసింధు బ్రహ్మపుత్రానదులుద్భవించుట వలనను. భరతభూమి పవిత్రమును. ఐశ్వర్యవంతమును కీర్తివంతమును అయినది.

## గంగోత్తరి.

ఇదిగార్వాల్ మండలములో గంగయుత్పత్తియగు చోటునకు. 8

10 మైళ్లదూరమున నీటిమట్టమునకు 15 అడుగులకుపైన భాగీరథినది కుత్తరపుగట్టున నుండు చిన్నగుడి. దీని సమీపమున గంగ ఉత్పత్తియగును. చాలమంది గోముఖమునుండి గంగవచ్చెననుకొందురు కాని గోముకాకారముగ నుండు మంచుగడ్డనుండి ప్రభాకరుని కిరణములకుకరిగి జలముగప్రవహించును. అతి సూక్ష్మముగ పరికించినచో యీమంచుగడ్డ గోముఖముగ గాక ప్రణవాకారముగగానవచ్చును. యాత్రీకులకు వసితులేమాత్రమును లేదు గాన చాలమంది యాత్రికు లిక్కడకురారు. వచ్చినచో నెంతయో చిత్తశాంతిగలుగును. ప్రకృతి చూచుటకతిశయ రమణీయముగ నుండును.

### కేదారనాథము.

గంగోత్తరికి సమీపముననే యీ క్షేత్రము కలదు. పర్వతముపై సుమారు 30 సంవత్సరములనాడునిర్మింపబడినశివస్థలము ప్రాచీనాలయము భూకంపములవలన శిథిలమైయున్నది. దీనిచుట్టును నాల్గుదేవళములున్నవి. దీనికి పంచకేదారమనియు పేరు దీనికి సమీపమున మహాబందు అను పర్వతశిఖరమున పంచపాండవులు తపమొనర్చి మోక్షమును పొందిరని చెప్పుదురు. ఈ కేదారనాథుని దేవళమునకు మళయాళీ లర్చకులుగ నున్నారు. సుమారు సంవత్సరమునకు. 6000 రూపాయి లక్కడ వ్యయమగుచున్నది. ఈ కేదేరనాథముననే శ్రీమదాది శంకరులు సమాధియైనట్లు కొన్ని చారిత్రక గ్రంథములు వాకొనుచున్నవి.

### బదరికాశ్రమము.

గార్వాల్ జిల్లాలో. శ్రీనగరమునుండి మానాబేగుకుపోవు దారిలోపైబేగునకు 25 మైళ్లదూరమున దక్షిణముగను శ్రీనగరమునకు 55 మైళ్లుదూర మీశాన్యముననను, హిమాచలమున 4 మైళ్లు నిడుపును 1 మైలు వుడల్పును గల పల్లపుచదరనేలలో. విష్ణుగంగయనునది కుత్తరమున బదరీనాథుని దేవళమున్నది. ప్రాచీనకట్టడమే కారణముననో (భూకంపమైయుండును) కిలమైపోగా నూతనపద్ధతిని అరటిపూవుమోస్తరుగ నిర్మితమై పైకప్పు బంగరుమలామా చేసిన యిత్తడి తగుడైయున్నది. యీ విష్ణువునకు బదరీనాథుడనియు నారాయణుడనియు నామములుకలవు. గంగాగర్భమందుండిన యీ మూర్తిని ఆదిశంకరులు ప్రతిష్ఠించిరని ప్రజలు వాకొనుచున్నారు సమీపముననే ఆనందవల్లియను దేవీమందిరమున్నది. ఈ దేవళమునకు కొంతదూరమున తపోగుండమను 30 అడుగుల తటాకమున్నది. యిందలి నీరు గంధకవాసన గలిగి చాలవేడియై పొగలు సెగలు రేగు

చుండును. యీగుంటకు పైమూతకలదు యీ యుష్ణతీర్థమున కనతిదూర మున నారదగుండమను సెలయేటి నీటిగుంటకలదు. యీనీరు భూమిని బ్రద్దలుగచీల్చి వెలికి ఉరుకును. తపోగుండములోని నీర మెంతవేడికలదో నారదగుండోదక మంతచల్లదనముకలది. శీతోష్ణగుండములలోని జలమును కలిపి యే యాత్రీకులు స్నానముచేయుదురు. అర్చకులు ద్రావిడులు. యీ కోనెల పూజ కుపయోగించు పాత్రములన్నియు స్వర్ణరజతమయములే. మునుపొకపుడు తమకు చాలినంత రాబడిలేనందున గార్వాల్ దేశపు రాజు లీబదరీనాధుని సొత్తును తినుచు. తమ 226 గ్రామములును యీదేవునికాడుమానముపెట్టిరి. యిపుడాగ్రామములలో సంవత్సరాదాయము సుమారు మూడువేలరూపాయలు వచ్చుచున్నదట సాధరణకాలముల జనులెక్కుడుగ యిటకురారుగాని 12 సంవత్సరముల కొకతూరి జరుగు కుంభమేళమునకు సుమా రేబదివేల యాత్రీకులు వత్తురట ఆశ్వీజ కార్తీకమాసముల మొదలు విస్తారముగ మంచువ్యాపించుటచే నిక్కడ మూడుమాసము లర్చనాదులు జరుపక పూజారులు సైతము దూరదేశములకు వెళ్లుదురట అపుడు వెలగల దేవాలయ సామగ్రుల నొక్కచోట పాతిపెట్టుదురట దేవాలయమంతయు మంచుగడ్డలచే నావరింపబడునపుడు గుడిగురుతులే తెలియదట. దేవాలయాగ్రమునకుండు గడియారమా స్పుటముగ తెలియువర కెవ్వరు నిటకు రారు. దక్షిణదేశవాసులీ బదరికాశ్రమ దర్శనమే తుదియాత్రాస్థానముగ భావించుచుండినను. ఉత్తర హిందుస్తానీయులు మాత్రము కైలాసము. మానససరోవరములను దర్శింపనిదే యాత్రపూర్ణము కాదందురు. కాని ఆరెండుక్షేత్రములు కూడ నిందు సంగ్రహముగ వివరింప బడును.

## కైలాసము.

ఇక్కడికి విశేషముగ బైరాగులు సాధువులు వచ్చుచుండినను వారికి చాలినంతవిద్యయు ప్రపంచజ్ఞానమును లేఖనా సామగ్రియు అలభ్యములైనందున యీ కైలాసమున కరుగుమార్గమును తెలుపలేదు. కాని, క్రీ-శ. 1867 సం- మున నైన్‌సింగు, 1872 సం- పండితసింగు. 18 సం- కృష్ణసింగు. అను విద్యాధికులు యిక్కడకు వచ్చి చూచులుకనిపెట్టి యిక్కడి వింతలు విశేషములు వ్రాసియున్నారు 1907-8. సం- ములలో స్వీడన్ దేశీయుడగు. డాక్టరు హిడిన్ గారు సిమ్లానుండి వచ్చి కైలాసమానస సరస్సులను జూచియున్నాడు 1 సెల్కిక్కుంబా 2 పెట్లాన్‌సార్కుబో 3 ఋషి

సంగమ 4 బోగగ్నా మాజిఫియాంగ్. 5 సునిడిస్గో 6 పెంటాంగు 7 దెరి నాండిలో 8 బాంగ్రాచుడిసో 9 కావ్నాకాంగు 10 కర్లా. 11 లాంలం గులా. 12 భూమ్యాంగ్రఫి 13 మోఞలాంకొజ్జా 14 లడంగలా. 15 గోవా సిక్కింగు, 16 సాక్ వెలా 17 షాకంగుటికా 18 పోంగారా 19 నగరో సంగు 20 కార్కోరా, మొదలగు దారులలో పోవువారు కైలాసమును గాంతురు ఈ కైలాసము హిమాచలమునో నుత్తరభాగమున మానస సరోవరమునకు నైఋుంతిభాగమున యెత్తైన పీఠభూమియగు మిట్టలో సముద్రమట్టమునకు 20_226 అడుగులకు పైన ఆరుశిఖరములతో శుద్ధ శ్వేత స్ఫటికపర్వతమును బోలి ప్రకాశించును యీషట్ఛిఖరముల మధ్య శిఖరమాకాశమును భేదించునంతటి యెత్తుగలది మంచుగడ్డలు తక్కువగ నుండు సమయమున బలవత్తరములైన దుర్భిణీయంత్ర సాహాయ్యమున లెక్కపెట్టగా మధ్యశిఖరము 8 వేల అడుగులు మొదలు 10 వేల అడుగుల ఘనమును. 18599 అడుగుల యెత్తును. 28 మైళ్లు చుట్టుకొలతయని తేలినది. యీ యున్నతశిఖరమును గర్భించుటకు పెక్కులు చుట్టుదారులు గలదు. కోటలుగను గోపురములుగను, రమ్యహర్మ్యములుగను. చూడ నొప్పి నైసర్గిక నిర్మాణముతో నుండు నీదివ్యక్షేత్ర మెంత పవిత్రమని భావించినను తనివితీరదు, ఈ హిమాలయము వైదిక మతమువారికేగాక జైనబౌద్ధమతమువారికి కూడ పూజనీయమై యున్నది. బౌద్ధసన్యాసులు. ఆశ్రమములబోలిస్వాభావికముగనే సృష్టిలో నేర్పడినస్థలములందు తపము లొనర్చుకొనుచు. ఓం మణిపాద్మణి హుం. అనుమంత్రరాజమును పఠించుచు అక్కడి బుద్ధవిగ్రహమును పూజించుచుందురు. అనేకబౌద్ధాశ్రమములలో న్యాండిగోంబా దేవసభ యీరెండును ప్రఖ్యాతములై మొదటిది భూతాన దేశములో చేరియున్నది. పర్వతముపైకిపోనుపోను పెక్కుబౌద్ధమఠములును ఆశ్రమములును విచిత్ర నైసర్గిక నిర్మాణ మందిరారామములును గలవు. వీని నన్నింటిని దాటిపోయిన హిందూమతము వారికి పూజనీయమైన పెద్ద దేవళమున్నటులు చెప్పుదురు. ఈ స్థానమున నొక పెద్దమంచుగడ్డ ప్రభాకరుని కిరణజాలములచే నతిప్రభాభాసమానమై శుద్ధ స్ఫటిక రూపమును బోలి చూపరులకు సంతసమును విభ్రమమును గొల్పుచుండును, నల్లరాళ్లతో నిండియుండినను. సూర్యోదయ కాలమున స్వర్ణమయ రూపముగను. కొన్ని సమయములం దగ్నివలెను. మధ్యాహ్న సమయములందు కన్నులు పొడుచునంత తేజోవంతముగను. సాయంకాలములందు చెంగలువలపోల్కిని,

జ్యోత్స్నని శీథములందు శుద్ధరజత మయముగను గనంబడి వివిధాద్భుతద్యుతులతో విరాజిల్లు నీస్థలమును జూచి నంతమాత్రమున భక్తశిరోమణులుపులకాంకిత దేహులై' హరహరమహాదేవశంభో' యను నుచ్చైర్నినాదములతో. పల్కుచుండుటను వినువారి యుల్లములు పల్లవింప అట్టి కైలాసమునుదర్శించినంత యానందమును పొందుదురుకదా. హిమానీప్రపూరితమై నానావిధవిచిత్ర ప్రకృతిరమణీయకమై భారతదేశమాత కలంకారప్రాయమైన యీ విశ్వేశ్వరావాసమును జూచి. జర్మనీ జపాను ప్రాన్సు అమెరికా మొదలగు ఖండాంతరములవారు. ఆశ్చర్యవంతులై హిమాచలమును పొగడుచున్నారు.

## మానస సరోవరము.

ఇది కైలాసమునకు యీశాన్యభాగమునను మెమోనానియను కొండకు నైఋతిదిక్కునను మరి యిరుప్రక్కల స్ఫటికశిలలబోలిన పర్వతపంక్తి చేతను చుట్టబడి మధ్యమానస కాసారమున్నది యీ సరోవరము చుట్టుకొలత సుమారు 15 మైళ్లు గల తటాకము. 138 మొదలు. 268 అడుగుల లోతుగల్గియుండును ఈజలము శుభ్ర స్ఫటికముపోలి తెల్లగను పంచదార తెరగున తియ్యగను. ఉండి. ఒకతూరి పానముచేసినవారు యీ సరస్సును వదలిపోవుటకే తృప్తిపడరు. యీ సరోవరముచుట్టును దిక్పాలకాస్థానములను తిరస్కరించు బౌద్ధ భిక్షుకాశ్రమములు కలవు. హిందువులును బౌద్ధులును అన్యోన్యద్వేషములను మాని. యీశ్వరోపాసనము చేయుదురు. వ్రాయుటకును వచించుటకును సాధ్యముకాని యీ మానస కాసారమున త్రిమూర్తులును దేవతలును సర్వధా నివసింతురను భావముతో, ఆత్మోజ్జీవనార్థమై సాధువులు తపోధనులు సన్యాసులు. మునులు మొదలగువారు. ఆత్మారామమార్గముగ యీకాసారమున కరుదెంచి అమృతమయమైన యీ జలమును త్రావి యీశ్వరసృష్టి వైచిత్య్రములం దిలకించుచు నిశ్చలమనస్కులై తపము సేయుచుందురు. ప్రాతర్మధ్యాహ్న సాయాహ్న నిశీథలందు మారుదలలు గల్గు రంగులుగల పర్వతములును ధానిప్రతిబింబముల నాకర్షించి యట్టి విచిత్రములచే చెలువొందు యీ మానసకాసార రహస్యమును తెలుప నెవడోపును ఋతుకాలముల ననుసరించి మార్పులొందు ప్రసిద్ధ పర్వతరాజములందుండు చెట్లు తీగలు ఆకులు కాయలు పండ్లు పూలు మొదలగువాటిని జూచి మొంతటిమూఢజ్ఞానవునికైన హృదయ పరివర్తనము గల్గి వైరాగ్యమూని తపమొనర్చి

జన్మసాఫల్య మొందించు కొనకుందువా? భారతదేశముపై నపారదయ యుంచి హిమాలయ పర్వతరాజమును. అమృతమును ధిక్కరింతుపుచ్చాం బుపూరితమగు మానస సరోవర నామక విశాలతటాకమును సృష్టించిఅన న్యదుర్లభములై భరతఖండమున కమూల్యములుగ ప్రసాదించిన పరమే శ్వరున కనేక సహస్రవందనములు.

కాన్పూరు.

ఇది విశాలమైనపట్టణము. ఇందనేకములు. నేతమిల్లులు. నూలు తీయు యంత్రములు. కంబళ్లునేయు యంత్రములు. తోలు పదునుచేయు కర్మాగారము. మరియు పెక్కుయంత్రాలయములుకలవు స్వదేశీయులుం డుచోట్లుచాల యిరుకుగను విదేశీయు లధికమగుచు స్థలములు విశాలము గనుండును. కంటోన్మెంటు. అనుసైనికాలయముకలదు. మనఖండమందుం డు పెద్దపట్టణములలో కాన్పూరునాల్గవది బొంబాయికిని అలహాబాదున కు మధ్యనున్నది కాని కలకత్తాకే సమీపయినుపదారికలదు. ప్రయాగ నారాయణమను గొప్ప దేవాలయమున్నది.

ఆగ్రా.

ఈ అతిశయాలంకార నగరము యమునానది కుత్తరమున కలదు యమున యిక్కడ అర్థమైలువెడల్పుకలిగి వంతెనపై రైలు రాకపోకలు కలగియున్నవి. వంతెనపై రైలుపోవుటకును మనుష్యులుపోవుటకును వీలు కలదు. చాలవరకు వీథులన్నియువిశాలముగను. మేడలు యేడంతుస్తులుగల విగను యుండి చూడ సొంపుగనుండును భూలోకమునగల 7 అతిశయము లలోనొక్కటియగు టాజిమహలిక్కడనున్నది. సర్వమత సమవర్తియై ధర్మ రాజనదగు అక్బరుపాదుషావారి సమాధియుకలదు. ప్రస్తుతకాలపు ప్రతి నాగరికుడు నీ నగరరాజమును చూడదగువిశేషము లందుకలవు.

దర్శనీయస్థలములు.

1 అక్బరుసమాధి. పట్నమునకు 7 మైళ్లదూరమున సికిందరు అను గ్రామసమీపమున పాతికమైలు చదరములో నిర్మితము. 300 అడుగులు చదరమును 100-అడుగులయెత్తును రథముపోయి వచ్చునంత పెద్దవాకిలియు గల యీ బ్రహ్మాండకట్టడములోని రాళ్లు చంద్రకాంతపురాళ్లై యున్నది. అక్బరు సమాధి స్ఫటికశిలచే కట్టియున్నది. ఆకట్టడమతివిచిత్ర వినో దముగ నుండును. రాజు కుటుంబుల సమాధులును చుట్టుప్రక్కలకలవు. సమాధి మొగసాలలో నీ మహిమప్రకాశించును గాక యను అర్థముగల

వాక్యమురుదుభాషలో వ్రాయబడియున్నది అనేక సమాధులడగిన యీ బ్రహ్మాండ ఆవరణము నానావిధవర్ణస్ఫ్యుతులచే నిండి చూపరులకు హాశ్చర్యమును గలుగజేయును. అక్బరు పాలనమున హిందూమహమ్మదీయులకు సమాన గౌరవము లొసంగినది తలంచిన మేను పులకరించి. అగ్బరునకై చింతింపనివారుండరు.

2 ఆగ్రాకోట. పదునారవ శతాబ్దాంతమున అగ్బరు పాదుషా కట్టించిన కోట. చుట్టుకొలత ఒకమైలును 40 అడుగుల మెత్తును గలది ఈ కోటలో షాజహాన్ అంతఃపురమును ముత్యాల మసీదును సుందరములైనవి.

3 షాజహాన్ అంతఃపురము. చిన్నదిగను యిరుప్రక్కల స్ఫటికశిలల గోడలు కలవియు. క్రింది భూభాగము నల్లని తెల్లని పటికపురాళ్లతో కప్పబడినది. గోడల భాగములలో బంగారు మలామాతీగలు పూగుత్తులు చిత్రించుటయుగాక షాజహాన్ బేగంయుండు సాలంకృతమైన చిన్నగది కలదు సమీపమున ఉపవనముకలదు. యీ రెంటిని జూచిన వారిట్టి చిత్రనిర్మాణమెంతైన కలదాయని సందేహింపక మానరు. షాజహాన్ చక్రవర్తి కూర్చుండు చోటుండెనని కొందరు చెప్పెదరు ఆ స్థానము కమానులుతీర్చిచాల సుందరముగ నుండును ఇపుడాచోట ప్రభుత్వమువారు నల్లమందు గిడ్డంగిని జేసి యున్నారు. ఆగ్రాజిల్లా ఖజానా యిక్కడనేకలదు.

4 ముత్యాల మసీదు. తూర్పు పడమర 240 అడుగులును. ఉత్తర దక్షిణములు190అడుగులును గలిగి నిండు పటికపురాళ్లతో ఆశ్చర్యకరముగ కట్టబడియున్నది. తలవాకిటి కిరుప్రక్కల రెండు తటాకములుకలవు. సింహద్వారము దాటి లోనికేగిన పెద్ద పెద్ద స్ఫటిక శిలాస్తంభములతో మోచాకుసుమాకృతిని గోపురములును స్వర్ణ శిఖరములును గల మందిరములు చూచుటకు మనోవికాసమును గలిగించును.

5 తాజిమహాల్. యమునానది యుత్తరపుటొడ్డున నీయాశ్చర్యకరమైన మహాలు దేవేంద్రుని కొలువుకూటమువలె కట్టబడినది యీమహాలు వెలుపలి గోడల వెడల్పు 10-15 అడుగులుగల్గి మొత్తమునకు తూర్పు పడమర 964 అడుగులును. దక్షిణోత్తరములు 329 అడుగులును విస్తీర్ణము కలదు గోపరము లోపలిభాగమున పటికపు రాళ్ల నాల్గు మూలలును బంగరుమలాతీగల మూడుశిఖరములును గల్గిన గోపురములు కలవు. నాల్గు ప్రక్కలనుండు మసీదులలో నొక్కటిమాత్ర మిపుడుపయోగము గలిగి

యున్నది. యీ నాల్గు మసీదుల మధ్య నాయకరత్నమనఁగిన టాజ్ మహాలున్నది. దీనికి సమీపమున పెద్ద స్ఫటికశిలా ప్రాకారాలయు.పలువిధముల పుష్పములు స్వర్ణగజత మీాన తటాకమును అచ్చేరువు గొల్పుచుండును. దీని కెదుట 400 అడుగుల చదరమును 60 అడుగుల యెత్తును గలస్ఫటిక మండమును వినోదముగనుండును. యీ చదరంగమునకు నాల్గుమూలల 100 అడుగుల యెత్తున మినార్ అను పెద్దగోపురములు కలవు యీగోపురములకు సోపానములు కలవు. పై కేగిచూచిన ఆగ్రానగరంపు సొంపును యమునానది పెంపును దర్శింపవచ్చును. ఈనాల్గు మినర్యాలకును చాలినంత తావిచ్చి సమీపమున 70 అడుగులచుట్టు కొలతయు 260 అడుగుల ఉన్నతమును గలదియు రెండుబంగారు మలామాపూసిన శిఖరము లొకటిపైనొకటియుంచి దానిపై అర్ధచంద్రా కృతిగ మలామాపూసిన శిఖరముగలదియు. శిల్పశాస్త్ర వనితయే హాసవదనయై వహ్వాయనుచున్న నిర్మలస్ఫటికములచే అడుకులు తెలియకుండ పెద్ద పటికపు కొండపైనానా విధకుసుమలతలు జెక్కబడి విశ్వకర్మయే వచ్చినిర్మించెనో యనునటులనుండును మహాలుపై భాగము. క్రిందిభాగము అష్టకోణములుగను కోణమొక్కటికి 24 చదరపు అడుగులు నిడుపుగల్గి స్ఫటికగ్రావములతోనేయున్నది. దీనిలో షాజహాన్ పాదుషాయొక్కయు. భువనమోహిని బిరుదాంకితయగు మంతాజియొక్కయు. సమాధులుగలవు. ఒక్కొక్క సమాధి యొక్కొక్క రాయితోనే కట్టియున్నది. యీ సమాధుల రాళ్లమీాద తీగలవలెను పూలగుత్తులవలెను. వివిధచిత్రములుగ చెక్కి స్థూలదృష్టిగలవారికి సామాన్యముగ గాక నైపుణ్యముగల తీగలు గుత్తులుగనే కనపడినను. సూక్ష్మదృష్టితో చూచిన మహమ్మదీయ వేదమగు ఖురాన్‌లోని ప్రభావయుక్తమంత్రములే యీ తీగెలని తెలియగలదు యిటులు నిర్మించిన శిల్పులసామర్థ్యమును గాని యీమహాలు వైభవమునుగాని వ్రాయుటకీగ్రంథముచాలదు. షాజహాన్ చక్రవర్తి 1648 సంవత్సరమున. తన భార్య కోర్కె ననుసరించి. 22 సంవత్సరముల కాలము 20 లక్షలజనులతో. 20 లక్షల సవరులను వెచ్చించి నిర్మించెను. తుర్కీ ఆఫ్గనిస్థాన్ మొదలగు దేశముల నుండి 800 నక్షాలు. (ప్లాన్) తెప్పించి యేదియు తృప్తిగాక భారతదేశపు శిల్పులచేతనే ప్లానులు వేయించి యీదేశపు శిల్పులచేతనే కట్టింపబడిన యీమందిర సౌందర్యమును రాలనతికవిధములును తొలిచిన విధములును. పగుళ్లును లేక అత్యద్భుతముగ భారతదేశపు ప్రాచీన శిల్పనై

పుణ్యము దశదిశలను వ్యాపింపజేసి హిందూదేశ మితరులు నుడువునట్టుల నాగరిక దేశముగాక ఆచార్యస్థానమును అన్నివిధముల కధిష్ఠించి యున్నదని పించిక్కీర్తినిదెప్పించి కీర్తిశేషుడైన షాజహాన్ చక్రవర్తిని. పొగడుటకును యీమహాలునిర్మాణవిధమును. సౌందర్యమును తెలుపుటకును వివరముగ వ్రాయుటకును. నాలేఖినికిని. నాకునుశక్తిచాల్దనుటయేగాక సమర్థులకు సైతమసాధ్యమేయని నుడువుచు ప్రాచీన శిల్పమున కానందాశ్రువులు విడుచుచున్నాను. ఆగ్రా కీశాన్యమున రామాభాగను తోటకలదు. పూర్వమున యీ యుపవన మున్నతస్థితియం దుండినను యిపుడు చెడియున్నది యీ భాగులో నానావిధ చిత్రాలంకార యుక్తమందిరమున్నది. యిక్కడి నుండి యమునానదిలో స్నానముచేయుటకు భూభాగములో గుప్తద్వారముగల దారికలదు. కోటకు సమీపమున ముస్లీం యిద్మద్దౌలాయను సుందర నిర్మాణముకలదు దీనిని షాజహాన్ మంత్రి కట్టించెనందురు కాని దీని కొంతభాగమిపుడు శిలమైయున్నది. ఆగ్రాకు20మైళ్లలో పట్టిపూరుశిక్కారి యను గ్రామము అగ్బరున కతిప్రేమ పాత్రమైనదగుట నతిశయాలంకార యుక్తమైన మసీదును సమీపస్థ పర్వతముమీద తనదేవరులు ముగ్గురకును వివిధాలంకార విరాజమాన హార్మ్యత్రయమును నిర్మించెను. క్రింద నుండు మసీదు దక్షిణద్వారమునుండి యీయున్నతమైనమసీదును జూచితిమేని యింత చక్కనిమసీదు హిందూదేశమున మరెక్కడనైనకలదా యని సందేహమును పుట్టించును. యిటనుండు పంచమహాల్ అను ఐదంతస్తుల మేడను. దాచుకొనినవారిని కనిపట్టెడు రహస్యాంతఃపురమును జూచిన భరతమాత. శిల్పభూషణముల నలంకరించుకొని విదేశమాతలను హేళనము చేయుచున్నట్లుండును. యివిగాక మరిచిల్లరకట్టడము లనేకములు చూడవలసినవి కలవు. వీటినన్నింటిని ప్రభుత్వమువారు బాగుచేయించి చూచువారికడ నెట్టిసుంకములను గొనకనే యథేచ్ఛగ వదలివేయుచున్నారు.

ఇపుడు పాలకులచే కట్టింపబడి చూడతగినవి కొన్నికలవు. మెడ్కాఫ్ స్మారకచిహ్నము, ఆగ్రాకలాశాల. గవర్నరుమందిరము ఆగ్రాబ్యాంకు, ఆగ్రా చర్చి,అనాధ శరణాలయము. మొదలైనవి.ఇక్కడపెద్ద రైలుస్టేషనుకలదు. గ్రేటిండియా, పెనిన్సులా, యీస్టిండియా, బొంబే, బరోడా, సెంట్రలు యిండియా, ఆగ్రా, ఢిల్లి కార్డురైలుమార్గము లక్కడకూడును. ఆగ్రావింతలనుచూడ గోరువారు. ఆగ్రాఫోర్టుస్టేషనులో దిగవలెను. బొంబాయికి

839 మైళ్లును అలహాబాదునకు 279 మైళ్లును. చెన్నపురికి 447 మైళ్లును దూరము.

గ్వాలియర్.

ఆగ్రాకు 65 మైళ్లదూరమున గల స్వదేశసంస్థానము. కొండపై కోటకలదు, కోటిరూపాయలకు పైగా యీమహారాష్ట్ర సంస్థానమునకు రాబడికలదు, హిందూదేవళములును. వన్నెకెక్కిన శిల్పముగల జైనదేవళములును చాలకలవు. 100 అడుగుల నిడుపును 57 అడుగుల యెత్తును గల రాతిలో తొలిచిన పెక్కుగుహాలుకలవు. యీ గుహయొక్క దానిలో 30 అడుగులయెత్తుగల నేమినాధుడను జైనవిగ్రహమున్నది, యిది, క్రీ-శ. 1441-74-సం. లో నిర్మించినది, మరియు పెక్కుజైనుల శాసనములు కలవు సమీపమున జయపూరు బయసింగుకట్టించిన మానమందిరమున్నది.

భరతపూరు.

ఆగ్రాకు 33 మైళ్లదూరములో యీ స్వదేశసంస్థానమున్నది ఈరాజువైష్ణవుడు, సంస్థానమునకు, సుమారు 35 లక్షల రూపాయల రాబడియున్నది. చుట్టుప్రక్కల అడవులు. మిక్కిలిగ నుండును, యీపట్టణ విస్తీర్ణము 8 మైళ్లును చుట్టును మట్టిగోడలతో రక్షింపబడియున్నది.

ఆల్వారు.

ఇది భరతపూరున కుత్తరముననుండు రాజపుత్రుల స్వదేశసామంత రాజ్యము. యిక్కడ 1000 అడుగుల యెత్తుగలకొండపై ఖిలమైయుండు గిరిదుర్గముకలదు. యీ కొండనెక్కిచూచిన ప్రకృతి గంభీరముగనుండును. కొండక్రింద మహారాజమందిరములున్నవి. యీవిపులాంతఃపురము చూచుటకు సుందరముగనుండును. యీ నగరమున శ్రీమహారాజా భక్తవార్ సింగుగారి సమాధికలదు. యిది అనేకగోపురకలశములతో విరాజిల్లుచున్నది. యీసంస్థానమునకు సంవత్సరవరుమానము సుమారు 32 లక్షల రూప్యములు యిటచూడతగినది. శ్రీరాజాభక్తవార్ సింగుగారి శృంగార సమాధి.

మధురా నగరము. (మట్రా.)

బృందావనము.

ఈ మధురానగర ముగ్రసేనుడును వానికొడుకు కంసుడును పాలించినదనియు దేవకీవసుదేవుల అపారసంతోష కరమైన కల్యాణమును దుర్భర దుఃఖ కారాగృహావాసము నీమధురయందే యనియు. విశ్వాంభరుడు. మానవుడై దేవకీగర్భమున జన్మించి వ్రేపల్లెలో పెరిగి పూతనాశకటావత్స

శేనుకా సురాద్యసుర సంఘములం దెగటార్చి యక్రూరునివెంట మథురా పురమునకరిగి కంసప్రాణాపహారకు డగుటయు భాగవత విష్ణుపురాణముల మూలమున ప్రసిద్ధమే. ఆమథురయే యీమథుర యిందుండు ప్రజలు చాలవరకు సాధుపులును భక్తులునై యున్నారు. యీక్షేత్రము మనహిం దువులకేగాక జైనబౌద్ధ మహమ్మదీయులకుగూడ పవిత్రక్షేత్రమైయున్నది.

అనేక దేవాలయము లన్యమతస్థుల కోపానలమునకు ధ్వంసమైపోగా మిగిలిన దేవళము లిపుడు నిత్యపూజాదులు నుత్సవములును సక్రమముగ జరుగుచున్నవి. యీ మధురలో కంసపాలనము. కారాగృహము. కృష్ణ జన్మము. యిత్యాదిస్తలములు పెక్కులుకలవు కొన్ని దేవళముల వివరము లీక్రింద వివరింపబడును.

## కేశవ దేవాలయము.

ఈ దేవళము 653 అడుగుల నిడుపును 104 అడుగుల వెడల్పును గల్గి ఆరుక్రోశముల కావలనుండియే దర్శనము చేయగల బ్రహ్మాండమైన కట్టడము. దీనిమధ్య 172 అడుగుల నిడుపును 86 అడుగుల వెడల్పును గల మహాడీకలదు. యీ మహాడీమీద 60 అడుగుల విస్తీర్ణముగ మసీదును కట్టించిదేవళమును కొట్టించెనట ఔరంగజీబు. యీదేవళగర్భాగారమున నీలస్ఫటికములతో సీతారామ లక్ష్మణుల విగ్రములు చెక్కించిరట, యిపు డీగుడియు మసీదును శిలములైయుండినను హృదయాకర్షములై యున్నవి మహమ్మదీయులు దేవళమును చెరుపవచ్చుచున్నారని తెలిసి, మీవారు దేశాధిపతి. యిక్కడనుండిన కేశవ, నవనీతనాధ, మధురానాధ, ద్వార కనాధ, బాలకృష్ణ, విఠలనాధ విగ్రహములను బృందావన మందుండిన మోహననాధ విగ్రహమును. గోకులమందలి గోకులనాధ విగ్రహమును తీసికొనిపోయి యుదయపురమునకు 22 మైళ్లదూరమున బంచి. అనుగ్రా మమున దాచియుంచెనట, తర్వాత జయపురపురాజు, గోకులనాధ, మోహననాధ విగ్రహములను మహమ్మదీయుల యల్లరి అణగినతర్వాత మరల మధురలోస్థాపించెనట, కేశవాలయమిపుడు, కంసునికోటకు సమీ పమున నూతనముగ నిర్మింపబడి యున్నది. కేశవాలయమిపుడు పట్టణ మునకు దూరముగనున్నందున విశేషోత్సవదినములందుగాక, సామాన్యముగ యెక్కువజనులు పోవుటలేదు, ఈదేవాలయ వ్యయమునకు, సం. మునకు 1200 రూపాయల రాబడిగల. ఉందు, చిట్టా, అనురెండు గ్రామములు దేవళమునకై విడువబడియున్నది.

పోత్రగుండము.

కేశవస్వామిసన్నిధికి సమీపమున గల పెద్ద తటాకము. దేవకీదేవి పురిటి గుడ్డలిందుదుకబడినదట 1850 సంవత్సరమున గ్వాలియర్ మహారాజుగారీ గుంటను పునరుద్ధరించి పడిగట్లు కట్టించిరట యిపుడు తటాకమున జలమంతగ లేదు.

కృష్ణజన్మస్థానము. (కారాగృహము.)

ఇది పెద్ద చీకటిగది యిక్కడనే దేవకి కృష్ణమూర్తిని ప్రసవించెనట ఇపుడిక్కడ బాలకృష్ణ విగ్రహ మునిచి పూజించుచుండినను ఖిలమై చాల భాగము భూమిపాలై యున్నది.

మల్లపురము.

కారాగృహమునకు సమీపమున గల చిన్న పల్లియ యిది. ప్రఖ్యాతి నందిన చాణూరముష్టికులను మల్లు లీగ్రామమందుండి కంసునియాజ్ఞ ననుసరించి మధురాపురమును రక్షించుచుండిరి.

డుల్ కాట్.

ఇది మల్లాపుర సమీపపుగ్రామము. ఇక్కడ బలభద్రగుండమను తెప్పగుంటయు. బుద్ధీశ్వరాలయమునుమరికొన్ని బౌద్ధక్షేత్రములును కలవు. కొన్ని చిన్న దేవళములును గలవు. యీగుడిదరిని పాజీభాగను శృంగార నందవనములో హైందవ శిల్పా లంకారము ప్రత్యక్షమగునటులు మసీదు కలదు. దీనిని చూచుకొని ఢిల్లీకిపోవు రస్తాకు వచ్చిన అక్కడ కుబ్జకూప ముకలదు. యీబావికడ కృష్ణుడు కుబ్జతో సరసమాడెనట. అటనుండి బృందావనమునకుంజనుదారిలో కొన్ని ఖిలములైనమహమ్మదీయుల సమాధులును సుందర ధర్మశాలయు కలదు. యీదారి దరిని లక్ష్మీచందు అను కోటీశ్వరుడు కట్టించిన వంతెనకలదు. యీ వంతెన కెడమతట్టు.

మహా దేవాలయము.

1850 సంవత్సరమున నిర్మింపబడిన పెద్ద గుడియున్నది. దీనిముందు భాగము చూచుట కసహ్యముగనుండును యీగుడికి సమీపమున గోపాలదేవళమును పూవులతోటయు చూచుటకు సుందరముగనుండును యీ కోవెలకు సమీపమున కైలాసమను చిన్న తిప్పకలదు. దీనిక్రింది భాగమున బ్రహ్మాండ భయంకరస్వరూపియైన గోకర్ణుడను రాక్షసుని ప్రతిమ కలదు. యీ విగ్రహము నల్లరాతితో చేయబడి చాలపురాతనమైనది. దీని సమీపమున గౌతముని సమాధికలదు. కైలాసమునకు ప్రక్క వికృతవిగ్రములు

కలవు. వీటి ప్రక్కన సరస్వతీగుండమను గుంట. 125 అడుగుల విస్తీర్ణము కలది చోటాలాల్. మనిలాల్ అను ధర్మాత్ముడు త్రవ్వించెను. దీనికి సమీపమున మహాదేవాలయమున్నది. కైలాసగిరి సమీప క్రిందిభాగమునమాయాదేవియను శక్తిగుడికలదు. చైత్ర వైశాఖ మాసములందు జాతరలు జరుగుచున్నవి. మరియెన్నియేని బౌద్ధ హిందూ దేవళములు విగ్రహములు కలవు. యిక్కడ ప్రవహించు యమునానదికి 24 ఘట్టములున్నవి. గొప్ప రాజవీధులుచు శ్రీమంతుల 7-8. అంతస్తుల మేడలును. భరతపుర జయపుర ప్రభృతిరాజ శిఖామణుల విశాల రాజభవనములును సుందరారామములును. బౌద్ధ దేవాలయములును మఠములును మహమ్మదీయుల మసీదులును. హైందవ సుందర దైవమందిరములును వల్లభాచార్యశిష్యపరంపరాపీఠములును ప్రజల యపారదైవభక్తియు దయాదాక్షిణ్యాది సద్గుణ సంపత్తియు. భీకర బృహన్మకర కమఠమత్స్యాది జలచరకల్లోలిత గభీరకాళిందీస్రవంతియు వ్రాయుటకు నలవికాని మహాత్మ్య సౌందర్య సంయుతములై యలరారుచున్నది చూచి తీరవలసినదే.

## మహా వనము.

మధురకు 5-6. మైళ్ల దూరమునుండు గ్రామము చాలభాగము పులులు సంచరించు అరణ్యముకలదు. పూర్వమున కొన్ని కోవెలలుండి, అవురంగజేబువలన నాశమై పోయినది. కొన్ని దేవళములు భూమట్టముచేసి దానిపై మసీదులు కట్టింపబడియున్నది. యిపుడుండునది బ్రహ్మాండమైన మధురానాధుని దేవాలయముకలదు యిదియు చాల ప్రాచీనమైనదియె ఈ మహావనమున క్షత్రియవారు రాణాగారు కట్టించిన పాతకోట యొకటి కలదు. దీనిప్రక్క శ్యామలాలాగారుకట్టించిన పాతగుడికలదు, కంసునికత్తికెరగాని మాయాశక్తిని యశోద యిక్కడ ప్రసవించెనందురు ఇక్కడ చిన్నయుయ్యేలతో బాలకృష్ణమూర్తి విగ్రహమును పరుండబెట్టి యిరుప్రక్కల నందయశోదలను బొమ్మలనుంచి తొట్లనూచుచుండు భావముగ నుంచి యున్నారు. ఇక్కడ బాలింతలు బిడ్డనుకనిన ఆరవరోజు శ్రీకృష్ణుని పాదములచెంత బిడ్డను పరుండబెట్టి మ్రొక్కుంతురు. యీ గుడికి సమీపమున గొల్లనందుని అంతఃపురము 80 స్తంభముల మండపముకలదు. ఔరంగజేబీమందిరపు రాళ్లతో ప్రక్కకు 26 స్తంభములుగ 9 వరుసలతో మసీదు కట్టియున్నాడు ఈ సమీపములందు త్రవ్వగ వందలకొలది బుద్ధ విగ్రహములు దొరకినవి. ఇక్కడ ప్రవహించు యమునానది మొద్దున

బ్రహ్మాండావరణములో రాసక్రీడోత్సవమును ప్రతి ఆదివారమునందును జరుగబడుచున్నది. యిక్కడికిని రామనరేట్. అను చోటికిని దాపున నొక వనమును గోపీఘట్టమను చిన్న గుంటయు కలదు. యీ మహావనములో రామలీలా అనువుత్సవమును అద్భుతముగ జరుపుచున్నారు. శ్రీకృష్ణమూర్తి బాల్యమున యీవనమున గోపులతో గోపకులతో విహరించిన పవిత్ర భూమి యిక్కడ 1800 గురు మహమ్మదీయులును చేరి 6500 మంది వాసము చేయుచున్నారు.

## గోకులము.

మహావనమునకు సమీపమునగల గ్రామము. యిక్కడ. గోకులనాథ విఠలనాథ, మదనమోహనుల దేవాలయములు చూచుటకు చాల సుందరములై యున్నవి. ఇందువిఠనాథాలాయము. యమునానదియొడ్డున యొకకోటవలెనుండి యిపుడుక్షీణదశకు వచ్చుచున్నది యిక్కడ యశోద యుట్లమీదపెట్టియుంచిన పాలు పెరుగు నేయి వీనిని దొంగిలి తిని తానెరుగనటులు కృష్ణుడు నటించినచోటు. ఈ దేవళము లోని అర్చకులు కృష్ణుని పాదధూళి యని మృత్తికనిత్తురు. యీ దేవళములుగాక పదునైదవ శతాబ్దమున కట్టిన. ద్వారకనాథాలయమును. నవనీతనాథాలయమును అవశ్యముచూడతగినవి. ద్వారకనాథాలయవార్షికాదాయము 5000 వేల రూపాయలును. నవనీత ప్రియాలయవార్షికాదాయము 10000 వేలు రూపాయలును జ్ఞానచ్యాయమనుగుడికి వార్షికాదాయము 10650 రూపాయలును. శ్రీ చంద్రరామాలయ వార్షికాదాయము 4050 రూపాయలును. సెలవులగుచున్నవి. ఈ గోకులమున శ్రీ కృష్ణజయంత్యుత్సవ మతిగంభీరముగనుండును. కార్తీకమాసములో తృణావర్తమని తిరునాళ్లుజరుగును. యమునానది యొడ్డునకేగి నలుప్రక్కలు తిలకించిన ప్రకృతి రమణీయముగనుండి యొడలుపులకరించును. యీ శృంగారము ప్రత్యక్షశుభవనీయమేగాని వ్రాయుటకు ఆంధ్ర భాషచాలదు ఇక్కడ 4 వేల ప్రజలుండి యొకజనపదముగ గాన్పించినను చాలమంది పాలు పెరుగు నెయ్యి వీటిని మధురానగరమునవిక్రయించి బ్రదుకుచున్నారు. ఇక్కడిస్త్రీలు చాలసుందరులేమైననుస్నానముచేయుటకు యమునానదికిజను నపుడు చీరరవికలూడ్చి పెట్టినిర్వాణముగ నదికిపోవుదురు. యెదుట పురుషులగపడినను వారికిలజ్జలేదు. వారుసర్వకాలములందును. ముఖ్యముగ స్నానమునకు పోవునపుడును జలకమాడి వచ్చు నపుడును కృష్ణకృష్ణేతిగీతములను. మధుర విస్ఫుట స్వరముతో ముకుళీకృత నేత్రకరా

రవిందలై. హృదయపూర్వకమైన భక్త్యావేశమున గానము చేయుచున్నపుడు చూచిన పురుషునిహృదయము. తుచ్ఛమైన కాముకవృత్తిని మనస్సునదలపోయునా? దిగంబరలై యొక్కొకపుడు యిటు లానందమయసాగరమున నోలలాడుచుండిరి. యీకృత్యము నీచమని ప్రభుత్వమువారు నిర్బంధించి స్నానములు సేయువేళ కట్టుబట్టలతోనుండవలెననినను చాలమంది యిల్లాంధ్రామాటలకు పెడచెవినిచ్చుచున్నారు ఇక్కడి స్త్రీపురుషులెల్లరును కృష్ణనామ పారాయణ పరాయణులును సాధువులునై యున్నారు. అతీతసౌందర్యవతులైన యీ దివ్యక్షేత్రవాసినులకు నిష్కళంక మానస మొసంగిన శ్రీ కృష్ణపరమాత్మని లీలలేమనవలెను. ఈమధురా గోకులము బృందావనములకు వచ్చు యాత్రార్థులు విశేషము బొంబాయివారును మహారాష్ట్రులునైయున్నారు వీరెల్లరు వల్లభాచార్య మతమువారు కావున కృష్ణలీలాక్షేత్రములను మిక్కిలి ఆశాభక్తులతో సేవింతురు. వల్లభాచార్యసీతము లిక్కడకలవు.

బలదేవము.

ఇది మహావనమునకు 6 మైళ్లదూరముననున్నది. క్షీరసాగరమను గుంటయు దేవళమును కలదు యీ దేవళము పనితనముకలది కాకపోయినను పెద్దదిగనున్నది. బలదేవుని విహారభూమియగుట నిక్కడి కెక్కుడుగ యాత్రికులు వత్తురు యీక్షేత్రము సంవత్సరమునకు30వేలరూపాయలురాబడి. 3 వందల పండా (పూజారులు) కుటుంబము లీధనమును పంచుకొనుచుండినను పండాలు. యాత్రీకురాంధ్ర మెడలోని పూసపుట్ర కత్తిరింతురని వాడుకకలదు 3 వేల జనసంఖ్యగల గ్రామము. ప్రకృతి రమణీయముగ నుండును.

బృందావనము.

మధురానగరమునకు సుమారు 6 మైళ్లదూరమున యమునానదికుత్తరపు గట్టునగల దివ్యక్షేత్రము. భరతఖండములలోనెల్ల వైష్ణవులకిది వైకుంఠమువంటిది, మధురనుండి యిక్కడికి దారి లలితము కావునయాత్రికులు ప్రత్యహమును వేలులక్షల సంఖ్యగవచ్చుచుందురు. బృందావనపదమన్వర్థమగు నటులీక్షేత్రముగ తులసిచెట్లు విశేషముగ, అడవిసిబోలియుండును. మహామ్మదీయుల తాకుసకోర్చి వారిని తనమెల్లలోనికి రాకుండచేసిన దీక్షేత్రమొకటియే, ఇపుడీ మునిసిపలుపట్టణమున 22 వేల జనులుకలరు. మునిసిపల్ యెల్లలోపల వెయ్యిదేవళములును వెలుపల 30 ది

కంటెయెక్కువగను కలదు. యీక్షేత్రమున గల జనసంఖ్యలో సగము వంతు వైష్ణవబ్రాహ్మణులు. తక్కినవంతు సాధువులు గోసాయీలును. గలరు. ఇక్కడి వైష్ణవులలో. రామానుజ. రాధావల్లభ, వల్లభాచార్య నింబార్క చైతన్య, మతములవారుండి తమతమ మతసాంప్రదాయముల ననుసరించి దేవాలయముల పూజలు జరుపుచున్నారు. మొదరో సంస్థానాధిపతులును. శ్రీమంతులును. యీక్షేత్రమును సర్వవిధముల రక్షించుచున్నారు. అక్బరువంటి చక్రవర్తి యీదివ్యభూమికేతెంచి దర్శించి ఆనందించెనని చరిత్రము చెప్పుచుండ పెరవారిమాట లెక్కయేమి పూర్వపురాజులు కట్టించిన 50 సత్రములు యాత్రార్థుల కుపయుక్తముగ నున్నది. యిట్టి క్షేత్రరాజమును తురకలు లోబరచుకొని యమినాబాదు. అను నామకరణమును చేయ దలంచి సాధ్యము కాకపోయిన దని చరిత్రములు చెప్పుచున్నవి. ఈ క్షేత్రమున ప్రాచీన దేవళములు 4 మాత్రమే కనబడుచున్నవి తక్కినవి చాల ఖిలముగ కొన్నియు నామావశేషముగ కొన్నియు నిలిచి యున్నది.

## బృందాదేవి సన్నిధి.

యాత్రీకులు బృందావనమున ప్రవేశించుట కొడనే మొదట కనబడునది బృందాసన్నిధి. యిది రాసమండలమునకు సమీపమున నొక అతిశయారామ మధ్యమున దివ్యముగ. అక్బరు దృష్టి నాకర్షించు నట్టి దివ్యముగ నిర్మింపబడి యిపుడు గోసాయీల విచారణయందున్నది గోసాయీ భక్తులీగుడియం దధికము (గ) విశ్రమించియుందురు.

## గోవింద దేవసన్నిధి.

ఇది ప్రాచీన దేవమందిరచతుష్టయములో మొదటిది యీదేవళము సకల విధముల నున్నతి నందియుండు అంతమైనగుడి, దీని వెలుపల గోడలు గ్రీకు శిల్పము ప్రకారము అంతస్తుపై అంతస్తుగ కట్టబడి యెఱ్ఱ నల్లరాళ్ల తో 100 అడుగుల వెడల్పును దానికి తగిన నిడుపు. యెత్తుగల్గి గోపుర ద్వారము కమానులు వంచి హిందూ శిల్ప ప్రకారము నిర్మింపబడినది ఈ కట్టడములో మూడు గర్భగృహములు కలవు ఒక్కొక్కటి 40 అడుగుల వెడల్పును 20 అడుగుల నిడుపును గల విశాలమైన గదులుగ నుండును వీని కెదుట మండపము చెక్కడపు పనులు గలదియేకాక ఐదు అంతస్తుల మేడకలదిగను రెండుప్రక్కల యెక్కుటకును దిగుటకును సోపానములు కలదిగను దృఢముగను ఉన్నది. యీ గుడిలోపశ్చాద్భాగమున. సంస్కృ

తభాషలో శాసనముకలదు. 1590 సం. మున సనందనులను గురుపరంపర యుత్తరవు చొప్పున అక్బరుపాదుషా ప్రతినిధియగు. మానసింహ మహారాజాగారీ దేవళమును కట్టించిరని యీ శాసనసారాంశముగ నున్నది. తర్వాత ఖిలమైపోగా 1873 సం మున ప్రభుత్వమువారు. 132851 రూపాయలిచ్చి సంస్కరింపజేసిరి. గుడికిసమీప దక్షిణభాగమున షాజహాన్ చక్రవర్తి కాలమున రాణా. అమరసింగుగారి కొడుకగు. రాణాభీమసింగుగారి భార్య రాణీరంభావతి యను వితంతువొక పెద్దసుందరసత్రమును కట్టించి శిలాశాసనమును చెక్కించియున్నది. జయపూరు. అళ్వారు. సంస్థానములలో కొన్ని గ్రామములీగుడికి స్వంతము. దీనినుండి సం. మునకు 18 వేల రూపాయలు వచ్చుటగాక హుండీవలన 13 వేల రూపాయ లాదాయము వచ్చుచున్నది. మధ్యహిందూదేశమున యింతటి బలవత్తమమును సుందరమునైన కట్టడమేలేదని చెప్పవచ్చును.

మదనమోహన దేవళము.

ఈదేవళ ప్రాచీనములలో రెండవది. కాళింగమర్దన ఘట్టమునకు సమీపమునకలదు. యీ గుడి 57 అడుగుల నిడుపును 20 అడుగుల వెడల్పును గల్గి మూడుద్వారములు మాత్రము తెరువబడినదిగ నున్నది దీని గోపురమును స్థూపియు చూడ సుందరమైనది ఈగుడికి వార్షికాదాయము 10100 రూపాయలు ఇందు 8000 రూపాయలు ఉండి వలనను. 2100 రూపాయలు భూస్థితి వలనను లభించును. యీగుడిశిథిలమై పోగా 1875 సం మున మధురా నగర మండలాధికారి సంస్కరించెను. యీ మదనమోహనేశ్వరుని గూర్చి పలువిధములైన వింత కథలను జనులు వాకొనుచుందురు.

గోపీ నాథాలయము.

అక్బరు కాలమున నతనిసామంతుడును సైన్యాధిపతియు సామర్థ్యయుక్తుడును భక్తుడునైన రెయిన్ జీమహారాజుగారు కట్టించిన దీదేవళము. సర్వవిధముల మదనమోహన దేవళమును పోలి దేవాలయాంతర్భాగ ప్రవేశద్వారత్రయముగల్గి కమానులువంచి కట్టబడినది. కొంతకాలమునకు ఖిలమైన భాగమును మధురానగరపు కలెక్టరు. గ్రవుస్. దొరగారు ప్రభుత్వనిధినుండి ధనమును వెచ్చించి సంస్కరించెను. తర్వాత. 1821 సం. మున నందకుమార ఘోషు అనుధర్మాత్ముడు మదనమోహన కోవెలను సంస్కరించినపుడీదేవళమును గూడ శుద్ధముగ కట్టించెను. ఇపుడీ యా

లయమునకు కానుకల మూలమున సంవత్సరమునకు 3000 రూపాయలును భూస్థితి వలన 1200 రూపాయలును ఆదాయము కలదు.

జోకిల్ కిషణ్ దేవళము.

ఇది జహాంగీరు చక్రవర్తి కాలమున సౌపానఠాకూరు గారిచే కట్టింపబడినది 25 చదరపుటడుగులు గల్గి అనేక మండపములు గల దేవళము. ద్వారము కమానువలె నుండి దానిపై గోవర్ధన ధారిరూపమును దివ్యముగ చిత్రించి నిలిపియున్నది యీ గుడిలో పారావతములు మిక్కుటముగ నుండి అసహ్యస్థలముగ చేయుచుండెను. యిపుడు కొంతవరకు శుద్ధము చేయుచున్నారు.

రాధా వల్లభాలయము.

పైచెప్పబడిన నాలు పురాతన దేవళములు గాక రాధావల్లభ దేవళముగూడ చూచుటకు పురాతనముగనే యగపడుచున్నది. ఇదిపెద్దగుడి. గుడిలోపలి తాళ్వారము 34 అడుగుల వెడల్పును. కట్టడములోపలి హాలు 63 అడుగులు వెడల్పును గలిగి పైయంతస్తు కలదిగగూడ నున్నది యిది చాల భాగము శిథిలమై పోగా యిటీవల 50 వేలరూపాయలు సెలవు పెట్టి పునరుద్ధరించిరి. యీ గుడిని దూరముగ నుండి చూచిన మహమ్మదీయుల మసీదు పోల్కి కనబడును ఇవిగాక మధ్యకాలమున నాగభట్టాలయమును రాధా దామోదర దేవళమును నిర్మింపబడి రెండవదేవళము సుందరముగ నుండి. యీ రెండుగుళ్లును వంగదేశభక్తుల కాలవాలములై యున్నవి. యివిగాక ఒక్క శతాబ్దమునకు పైబడని కాలములో నిర్మించిన దేవళములు పెక్కులు కలవు. అందైదు కోవెలలు కొంతవరకున్న పదవుల నధిష్ఠించి యున్నవి.

(1) కృష్ణ చంద్రదేవళము:—ఇది 1840 సం. మున కోటీశ్వరుడగు కృష్ణచంద్రసింగు అను గంగీయునిచే నొక విశాలాలంకారారామమధ్యమున 160 అడుగుల వెడల్పును దానికి తగిన నిడుపును గల్గునటులు నిర్మించెను సమీపమున రాదాగుండము 20 వేల రూపాయలు వ్యయమొనర్చి బాగుచేయించినదే గాక యీ మహామహుడు పెక్కు ధర్మ సత్రములను బావులను గుంటలను కట్టించి దానికి వలయు మూలనిధినుంచెను. యీ దేవళమునకు 72 గ్రామములను మరికొన్ని జమీనులను సర్వాయినాములతో భోగ్యమొనరించెను. సరాసరి సం. మున కీ గ్రామములలో 4 లక్షల రూప్యములు రాబడికలను యీ కోటీశ్వరుడు తనభార్యలకు పుత్రస్వీకారము

చేసికొనుట కధికారమిచ్చి, 30 యేండ్లవయసుననే సన్యాసము స్వీకరించి ఆకులను నీటినిమాత్రమే త్రాగుచుండి పెక్కుధర్మాన్నశాలలు పాఠశాలలు నిర్మించెను. యితని స్వీకార పుత్రుండును మనుమఁడును తాతగారి ధర్మగుణములనే కలిగి యుండి వీరి నిర్మాణములను జాగ్రతగ రక్షించుచు తామనే కధర్మములను చేయుచుండిరి. యీ మహా మహుల చరిత్రమును స్థలవిస్తార భీతిచే వ్రాయలేదు.

(2) రంగనాథాలయము:—తిరుచినాపల్లి కడనుండు శ్రీరంగ క్షేత్రదేవళము పోల్కి ప్రథమప్రాకారము 773 అడుగుల నిడుపును 440 అడుగుల వెడల్పును గల్గిన శృంగార గంభీర నిర్మాణము. యిందుకైన వ్యయము 45 లక్షల రూప్యములు, బంగారు మలామాపూసిన ధ్వజస్తంభమునకైన సెలవు, 10 వేల రూపాయలు. మధుర. బృందావనము. ఆగ్రా, మొదలగు చోట్ల, 32 గ్రామములును వీనిరాబడి. 117000 రూపాయలు యీ మొత్తములో ప్రభుత్వమువారు స్వీకరించునది. 64000 రూపాయలు కానుకల వలన 2000 వడ్డి. బాడుగలవలన, 1,800 రూపాయలు సంవత్సరాదాయము. 20 లక్షలరూపాయల గుడిసొత్తుకలదు. యీ కోవెలలో 10 వేలరూప్యములు వెలగల గుళ్లోబులు బంగారు పూతగలవికలవు మరియు పెక్కు చిన్నదేవళములును. నందవనములును చూచుటకు రమ్యమైనవి కలవు. విస్తరభీతిచే వివరములు వ్రాయకుండినను, యీ దేవళమునకు సమీపమున స్ఫటికరాళ్ల దేవళ మొక్కటిపుడు 40 లక్షలు వ్యయము చేసి కట్టింపబడినది. యీ దేవళము లక్నో కోటీశ్వరులలో నొక్కడగు కుందన లాలుగారు కట్టించిరి. ఆయన కేవలము సన్యాసియై కైంకర్యములను చేయించుచు జీవదశతో నున్నాడని వ్రాయసంతసించెదను.

(2) రాధాగోపాలాలయము:— షాజహాన్‌పూరు కజాంజీగారగు లాల్ వ్రజకిషోరుగారు అంగడి వీధిలో 1873 సంవత్సరమున కట్టించిన శృంగార దేవాలయము. దీనిలోని యొక్కొక్క స్తంభములోను విశేష శిల్పముతో స్త్రీప్రతిమ చెక్కబడియున్నది. చూడరమ్యము.

(3) రాధాయింద్ర కృష్ణగుడి:—1871 సంవత్సరమున నొక బ్రాహ్మణ జమీందారిణి వలన కట్టింపబడినది. 70 అడుగుల విస్తీర్ణమును మూడు ద్వారములును గల యీరమ్య దైవ హర్మ్యమునకు వ్యయము. 3 లక్షలు.

(4) రాధా గోపాలదేవళము:— 1840 సంవత్సర ప్రాంతమున కట్టబడినది. యిటులీ దేశపు దేవళములను పోలి. అందముగను. శుభ్రము

గను ఉండి మధ్య 58 అడుగులు నిడుపును. 21 అడుగుల వెడల్పును గల విశాల ప్రదేశముతో చూచుటకు సుందరముగనుండును. ఇక్కడప్రతిరాయుజరుగు రాధాకృష్ణుల రథము దర్శనీయముగ నుండును.

ఈ బృందావనములోనివిగాక అనేకపురాతనాధు నింతగ దేవాలయములును ధర్మశాలలును విశాలారామములును కలవు. యెవ్వరియింట వాకిట, దొడ్డిలో, తోటలో, చూచినను కృష్ణసంబంధ విగ్రములకు పూజా భజనలు లేక యుండదు. యిందుపేర్కొనిన దేవళములుగాక యమునా నదీ పరిసరమున పెక్కుకోవెలలును గోపురములును. మండపములును ధర్మసత్రములును సామంత రాజ హర్మ్యములును. విశాలాలంకారోప వనములును చూడతగిన వాటిని వ్రాయుట కేరికిని సాధ్యముకాదు. యమునా నది సమీపమున గల కాళింగమడుగు కలదు. ఆమడుగులో యిప్పుడు భయంకరాతి దీర్ఘ విషమయ సర్పములు పెక్కులుకలవు. దీనిచెంతనే కదంబవృక్ష వనవాటిక కలదు. యిటయెప్పుడును విషగాలి తీవ్రముగ కొట్టుచుండును, యీగాలిసోకిన వ్యాధులురాక తప్పవు యిది కాళీయుని విషవాయు ప్రసారమని పల్కుదురు. యీబృందావనములో 22 వేల జన సంఖ్యయు కొన్నిస్థానిక ప్రభుత్వపాఠశాలలున్నను చాలమంది విద్యార్థి వయస్కులు యాత్రీకులనాశ్రయించియే జీవించుటవలన, విద్యావ్యాప్తి చాలతక్కువ ఇక్కడనుండు వారిలో చాలమంది జీవములను విడువనపేక్ష కలవారగుటకతన. వారికివ్యాధులు తటస్థించుటయు, తటస్థించినను ఔషధములు పుచ్చుకొనుటయు పూజ్యమే. కావున స్థానిక వైద్యాలయమునకు పనిలేదు. యిక్కడివారికి భాగవతముదక్క తక్కిన గ్రంథపఠన మరుదు.

## గోవర్ధనము.

ఇది మధురాపురికి 10 మైళ్ల దూరముననుండు పవిత్రక్షేత్రము సుమారు 50 అడుగుల గుట్టయే యిది దీనిపై కోవెలను 4-5 చిన్న గుంటలును కలవు. అనేకములైన ధర్మ సత్రములును కొన్ని దేవళములును గ్రామములో కలవు. చాలవరకీదేవళముల స్థితిగతులను భరతపురమహారాజులువిచారించి ధనసాహాయ్యము చేయుచున్నారు పురాణ కాలమునుండి చారిత్మాక మైనదిగను మాహాత్మ్యకమైనదిగను యీగోవర్ధనము వెలసియున్నది.

## ప్రసన్నా.

భరతపురమునకు మధురనుండి చను మార్గములో నుండు రాధాదేవి జన్మస్థానమిదియే యిది 2 వేల జనులు నివసించు గ్రామము. రాధా

మందిర మొకపెద్ద రాతిబండపై కట్టబడిన పెద్దగుడి. దీనిపరిసరములందు. రాధ కృష్ణుల తాతల చెలికత్తియల దేవళములు కలవు. మహారాజులనేకు లనెక్కుడు. ముఖ్యముగ భరతపురు మహారాజుగారిదెయొక్కయు రమ్య హర్మ్యములు కలవు. యిక్కడ కుంభ కార్తీక మాసములం దుత్సవములు జరుగును అపుడు స్త్రీపురుషుల జంటలు రాధాకృష్ణభజన లొనర్చి ఆడి పాడి ఆనందమయులై కామశాంతియుతులై విశ్రమింతురు. వ్యభిచారదోష మీచోటన స్మరంతి. చాలవరకు ప్రతియింటను కృష్ణకృష్ణేతిగేయముల గానము చేయుచుందురు. అందరును వల్లభార్యమతానుయయులు.

నందక వనము.

ప్రసన్నా క్షేత్రమున కారుమైళ్ల దూరమున నందక వనమును నందుని పల్లియ కలదు. యిపుడిది 3 వేల జనసంఖ్యగల గ్రామము, నందుని మందిరము చాలపెద్దదిగను మహారాజ నివాసమును పోలియుండును, యీగ్రామమును నందగమనమనియు వాడుదురు. కృష్ణసంబాధమైన దేవళములు పెక్కులు కలవు. గో. గోప. గోపీ పరివృతుడై శ్రీకృష్ణమూర్తి విహరించిన పెక్కుస్తలములు కలవు. కృష్ణుడు గోవులను నీరుత్రాగించు తటాకము 6 ఎకరముల విస్తీర్ణము.

ఢిల్లీ. (హస్తినాపురము.)

భరతఖండ సార్వభౌముల కనేకులకు కేంద్రస్థానమైన యీ ఢిల్లీ నగర రాజచరిత్ర మెరుగని భాంతీయుడుండడు. దుర్యోధన యుధిష్ఠిరుల పాలనాసమయమునందు ఢిల్లీహస్తినాపుర మనుపేరుతో సర్వధర్మములకు కేంద్రస్థానముగ నుండెను. మధ్యకాలమున మహమ్మదీయ పరిపోషణమున సకలసంప త్సమృద్ధి కరమై శిల్పాచార్యపీఠమై విలసిల్లెను. యీనాడాంగ్లేయుల పాలనమున, ముఖముగ శ్రీమజ్జార్జి రాజరాజేంద్రుడు సపత్నీకుడై స్వయముగ విచ్చేసి. యీమహానగర రాజమున సాంమ్రాజ్యాభిషేకము చేసికొనిన నాటనుండి మహావైభవమనుభవించుచున్నది యీ ఢిల్లీనగరములోని ప్రతివస్తువును నిర్మాణవిధమును హృదయాకర్షకముకమునై యుండును అందుకొన్ని ముఖ్యమైన వాటినిక్రింద సంగ్రహముగ వివరింపబడును.

యమునకుత్తరభాగమున సుమారు 8 మైళ్లు చుట్టుకొలతగలది యీ యనేకములగు కోటలు గోపురములు వీధులు. మందిరములు నెలసి. కాశ్మీ రము. లాహోర్. కాబూల్. బన్గాణా. అజ్మీర్. డాకే ఫరాణా. ఢిల్లీ నెగంబాద్. లాల్ కైలా మొదలగు 11 ద్వారములతో నొప్పుచున్నది.

ఆయాదేశపు రాయాబాద్వారముల పేర్లతోనుండు వీధులలో కాపురమున్నారు కాశ్మీరద్వారము చిన్నది. అంతఃపురద్వారమునుండి ఢిల్లీగేటునకు పోవు బాట విశాలమై చండీచౌకు. అను పేరుతో నున్నది. 50 అడుగుల వెడల్పు గల్గి యేడంతస్తుల మేడలతో పలుమకాణములతోనున్నది. దీనిప్రక్క నొక్క పఠానుడు కట్టించిన అంతఃపురము చూడచూడ సుందరమైయుండును దీనిప్రక్కన మోతీమసీదుకలదు. యిదియు కోటవలెనుండు పైఅంతఃపురమువలె చంద్రకాంత శిలానిర్మితమై సుందరమైయుండును రోషణఉద్దౌలా యను కట్టడమును షాజహాన్ చక్రవర్తి అంతఃపురముగ నొనర్చిన దీమసీదుకడనున్నది. అవశ్యము చూడతగినది. దీనికి సమీపమున జుమ్మామసీదు కలదు. భూమట్టమునకు 30 అడుగుల యెత్తున కట్టబడినది. 450 అడుగుల చుట్టుకొలతయు నల్లని యెఱ్ఱని రాళ్లతో కట్టబడి చూచుటకు గంభీరముగ నుండును యీ మసీదులోని కేగుటకు పడిగట్లుకలదు. అటులు పైకేగిన స్ఫటికపురాళ్ల పడికట్లు కల చిన్నగుంటకలదు. యీగుంటకు ప్రక్క నొకపే రాయినుండి త్రవ్విన బావిలోని నీరీగుంటకు పెట్టుచున్నారు దానిదాటి పైకేగ ప్రధానప్రార్థనాస్థలము 260 అడుగుల నిడుపును చుట్టుపట్ల కమానులు వంచినద్వారములును. ముందటిభాగము 900 చంద్రకాంత శిలలచే కప్పబడి యెక్కొరు ప్రార్థనచేసి కొనుటకు వీలగునటులు నిర్మింపబడి ఖురానుమంత్రములను తీగలపోల్కిని ఆ తెల్లని రాళ్లలో చెక్కియుండుట విచిత్రము. మసీదు కిరుప్రక్కల 140 అడుగుల తెల్లరాళ్ల గోపురములు కలవు యీగోపురలోపరిభాగమునుండి ఢిల్లీనగరమును తిలకించితిమేని నగరనిక్షేపమంతయు స్ఫుటముగ కనబడును. 10 లక్షల రూపాయలు వ్యయపెట్టి షాజహాన్ కట్టించిన మసీదిది. దీనిని దాటితిమేని. నల్లరాళ్లతో అరేబియా కర్ణాకశిల్పముల సమ్మేళనముతో అఫ్ఘనుసబాబులు కట్టించి కాలా (నల్లనీ) మసీదు చూడ సుందరముగ నుండును వీటినన్నిటిని చూచుచు కాశ్మీరము గేటుకు వచ్చితిమేని కర్నల్ స్కిన్నరుదొర లక్షరూపాయలు సెలవుచేసి కట్టించిన చర్చికనబడును. ఢిల్లీనగరమునుండి 9-10. మైళ్లదూరమున నుండు కుతుబ్ మినారువరకు మధ్యనెన్నియో బలమైన కట్టడములుండి క్షీణించుచుండుటను గంటిమేని యొకప్పుడీ ఢిల్లీ సుమారు. 25-30 మైళ్ల చదరముకలదని తోచును. ఢిల్లీ 100 గజములదూరమున కోట మధ్యభాగమున ఫిరోజిషాజయస్తంభము 37 అడుగుల పొడవును. 10 అడుగుల ఘనమును గలదానిని కననగును. యీ స్తంభము 2230 సం

వత్సరములకు పూర్వమశోక చక్రవర్తి స్థాపితమని యీ స్తంభ శాసనముల వలన తెలియుచున్నది. యీ స్తంభమునకు 2 మైళ్లదూరముహుమాయూన్ షాజహాన్ చక్రవర్తులయొక్కయు వారికుటుంబముయొక్కయు సమాధులు చూచుటకు గంభీరములుగ నుండును. ఢిల్లికి పడమట జయసింహ మహారాజుగారు కట్టించిన మానమందిరముకలదు ఢిల్లీకి 10 మైళ్ల దూరమున దక్షిణమున, కుతుబుమినార్ కలదు. యిది భూలోకమున మెత్తైన గోపుర స్తంభము 5 అంతస్తులును 30 అడుగుల వెడల్పుగల పైశిఖరముగల యీ యాశ్చర్య స్తంభము చుట్టును 100 మంది యుండవచ్చును. భూలోకమందుగల యేడువిచిత్రములలో నిదియొకటి దీనికి సమీపమున షాఆలంసార్వభౌముని సమాధియు. అల్లావుద్దీన్ కాలమున నిలిపిన 60 అడుగుల పొడవుగల యినుప జయ స్తంభమును కలదు. మరియు పెక్కుమసీదులును అంతఃపురములును ప్రభుత్వమందిరములును సుందరారామములును కలవు. వీనిలో పూర్వపు కట్టడములన్నియు స్ఫటికశిలామయములు యిక్కడిబజారువీధులలో, కాశ్మీర, బంగాళ, నేపాళ, మహారాష్ట్ర, దేశపువేశ్యలును వ్యభిచారిణులును. తమతమ సుందర శరీరములకు దగిన వస్త్రాభరణములను ధరించి మేడలపై హుక్కాపీల్చుచు విలాసముగ కూర్చుండియు వరులనాకర్షించుటయు యీతుచ్ఛస్త్రీలకు తార్పుకమీషన్ యేజంట్లును మగవారు వీధులలో తిరుగుచు యువకులను చెరుచుచుండుటయు మాత్రము చింతనీయము.

పంజాబురాష్ట్రము.

ఢిల్లీనగరము పంజాబురాష్ట్రములో చేరినదికాన పంజాబును గూర్చి కొంతప్రస్తావింపబడును. పంచ= ఐదు. అప్- జలము, నదులు కలదిగాన పంజాబయ్యెను, సింధు, జీలం, చీనాబ్, రావి, సతలజ్, (శతద్రు) అను పంచనదులివియే యగును.

(1) లాహోర్:— పంజాబు రాష్ట్రమునకు ప్రధాన నగరము. దశరథ రామునిపుత్రుడగు. లవుడు కట్టించిన దీనగరము. ఆవల. గాడరాజులు పాలనమందుండెను. తర్వాత. మహమ్మద్గజనీ పాలించెను తర్వాత. మొగలాయీలగు అక్బరు, జహాంగీరు, షాజహాన్, అవురంగజేబు మొదలగువారు పాలించి తదుపరి శిక్కులపాలనమందుండి ఆంగ్లేయులకు వశమయ్యెను. ఇపుడు. జనరలుపోస్టాఫీసు- ప్రధానన్యాయస్థానము, కళాశాలలు లారెన్సుహాలు విక్టోరియావిగ్రహము. చంచామాయను పెదఫిరంగి.

ఆనర్కాలి సమాధి. కొన్ని పార్కులు చూడతగినవి. ఢిల్లీకి 350 మైళ్లును. కల్కత్తాకు. 1213 మైళ్లును. బొంబాయికి 1300 మైళ్లును. చెన్నపురికి 1866 మైళ్లును దూరముకలదు.

(2) అమృతసరము:—ఇది లాహెూరుకు 20 మైళ్లదూరమున కలదు. శిక్కుమత చతుర్ధగురువు. రామదాసుగారు అక్బరువద్ద భూమిసంపాదించి 1586 సం మున నొకతటాకము నిర్మించి అమృత సరస్సని పేరుపెట్టి యొకనగరమును దేవళమును కట్టించెను 1762 సం. మున అహామ్మదు పాదండెత్తి దేవాలయమును పడకొట్టి 1802 సం. మున. రంజితసింగు రాజాగుడిని పునరుద్ధరించి పైకప్పును బంగరు మలామాతగుళ్ల చేయాయించెను గుడిలోని క్రిందిభాగము తాజ్ మహాలువలె శ్వేత స్ఫటికశిలలుపరచి వాటిపై. వెండి. బంగారు నవరత్నముల నలంకృతమొనర్చి స్వర్ణదేవాలయమున నర్ధమొనరించెను. యీదేవళములోని గర్భగృహములో శిక్కులు తమవేదముల నుంచి గురువామంత్రములను మేళతాళములతో గానము చేయుచుండ వేలకొలది గుంపులు గూడి శ్రవణానందముగ వినుచుందురు. యీఅకాలీలను శిక్కులెప్పుడును సాదుపోకీరీలు. ఆబాలవృద్ధ పర్యంతము స్త్రీపురుష వివక్షేత లేక కృపాణములను మతచిహ్నముగ ధరింతురు.

(3) కురుక్షేత్రము:—ఢిల్లికుత్తరమున 60 మైళ్లుదూరము యమునానది యొడ్డుననున్నది సుమారు 30 వేల జనసంఖ్యకలదు కౌరవ పాండవులును. సమరమొనర్చినదిచటనే. దీనికే పానిపట్టు అని మరియొక పేరు. దీని కిరువదిమైళ్లకావల స్థానేశ్వరము అనుకురుక్షేత్రభాగము కలదు.యీచోట పృథ్వీరాజు యుద్ధముచేసి మడిసెనందురు. సరస్వతీనదీతీరస్థము. యీనదిలో గ్రుంకులిడిన మోక్షముకలుగునని గ్రహణాది పర్వములందు హేరాళముగ యాత్రీకులువచ్చి స్నానమొనర్తురు.

(4) సిమ్లా:—హిమాచలపశ్చిమభాగము. చాలచల్లదనము గల్గి శ్వేత ప్రధానోద్యోగులును రాజు ప్రతినిధియు. వేసవిని యిక్కడ కాపురముందురు. ప్రకృతి మిక్కిలి రమణీయముగ నుండును.

(5) అంబాలా:—ఇక్కడ ప్రాచీనమైన దుర్గముకలదు. యీదుర్గమునకు 3-4 మైళ్లదూరమున నూతననగరము, విపులరాజవీథులతో నలంకారయుక్తముగనుండు మండలప్రధానపురము.

(6) రావల్పిండి అటాకులు:—లాహెూరునకు 175 దూరమునప్రభుత్వసైన్యముండు నదీరావలుపిండి నగరముననే, సుమారు 70 వేల జనసం

ఖ్యగల యిచ్చట, మోటుగుడ్డలు, చెప్పులు, సబ్బులు, దువ్వెనలుచేసి విక్ర యించుచున్నారు. యిక్కడికి 60 మైళ్లదూరమున అటాక్‌కోట అక్బరుచ క్రవర్తి కట్టించినది కొండపైకలదు 2 వేలజనులందు వసించుచున్నారు.

(7) పెషావర్:— లాహోరునకు 290 మైళ్లదూరమునను అటా క్కునకు 46 మైళ్లదూరమునను ఉండి ఆంగ్లేయపాలన కుత్తరమున ఆఫ్ఘను స్థానమునకువెల్లమైయుండుటకతన బలమైన యుద్ధదళమున్నది. యిందు 90 వేల జనులువసించుచుండుటయు. నానాలంకారములును బ్రిటిషునైకాధి కా రులును వసించు ఉనికిపట్టుగనున్నది కైబరుకనుమ గుండకాబూలు ఆఫ్ఘను స్థానముల రాదారికలదు. ఈ పంజాబుపరగణాలో యెక్కువసంఖ్య మహా మ్మదీయులైయున్నారు. సుందర హర్మ్యములును గోరీలును చూడతగినవి.

### కాశ్మీరము.

పంజాబురాష్ట్రమున కీశాన్యభాగమునగల స్వదేశసంస్థానము, యీ సంస్థానమునకు ప్రధాననగరము శ్రీనగరము 3 అంతస్థుల మొదలు 7 అం తస్థులవరకుండు మేడలుగల పెద్దపట్టణము. యిక్కడ చూడతగినవి యనేక ములుండినను శ్రేష్టములైనవి నిషాభాగు. షాలమారా అనునవియె నిషా భాగ్ (ఆనందవనము) షాలమారాకు 2 మైళ్లదూరమందుండును యిది జహాం గీరుభార్యయగు నూర్జహాను ప్రభ్వికి సోదరుడగు అసఫ్‌జావలన కట్టింపబడి 600 గజముల నిడుపును 360 గజముల వెడల్పును ముందు ప్రక్క 13 అడుగుల యెత్తునుగల రాతిగోడలు కలిగియున్నది యీ తోటలో వరుసలు తీర్చిన సరోవరములును 13 అడుగుల వెడల్పుగల కాలువలును 12 అడు గులు వెడల్పుగల బాటలును వివిధవిచిత్ర కుసుమగుళుచ్ఛ సందోహలతా మండపములునుండి కందమూలములు నిండియుండి మధ్యభాగమున 10 అంతస్థులమేడ శృంగారముగ కట్టబడియుండుట నేత్రానంద కరము.

షాలమార్:—(సుఖవనము) 600 గజముల నిడుపును. 210 గజ ముల వెడల్పును గల్గి నిషాభాగ్‌వలెనే శృంగార కుసుమసంపదనిండి యుండి 4 అంతస్థులమేడ అంతఃపురమై చూడసుందరముగ నుండును యిక్కడనే జహాంగీరు. నూర్జహానులు విహరించుచు కలహించిరట. యీ సంస్థాన ప్రభువగు సిక్కుమతస్థుడు బహుళసంస్కృత ప్రాచీనగ్రంథ భాం డాగారమును సరస్వతీ నికేతనమను దానిని రక్షించుచున్నాడు శ్రీమదా దిశంకరులిక్కడనే శారదాప్రసాదమును స్వీకరించెను. ఈ కాశ్మీరమును భూలోకారామమని నుడువుట సత్యము.

## నాగపురము.

మధ్య పరగణాలోని యొక విశేషనగరము కలకత్తాకు 100 మైళ్లను, బొంబాయికి 520 మైళ్లును, దూరముకలదు ఇక్కడ బుడిషియల్ కమీషనరు చీఫుకమీషనరుల ప్రధానస్థానమున్న ది యిక్కడి రోడ్లును గుంటలు బావులును గంభీరముగ నుండును. యిక్కడి కొండపై నొకకోట కలదు. వస్తు ప్రదర్శనశాల. గ్రంథాలయము 4 ఉద్యాన వనములు మహారాజవనము తులసీభాగ్ బాల్డిగారడి, శెల్లంగరి, హిస్లాప్ మారిస్‌కాలేజ బానుహాలు మొదలగునవి చూడతగినవి.

## నాసిక - పంచవటి.

దశకంఠరావణుండు లంకారాజ్యము పాలించుచుండినను వాని దేశపు లెల్ల దండకారణ్యములోని పంచవటి వరకుండి సరిహద్దులలో ఖర దూషణులను తనకు ప్రతినిధులుగ నుంచెనని యూహింపవచ్చును కైకేయి కోర్కె ననుసరించి రాముడనుజభార్యా సహితుడై యీపంచవటికడకు వచ్చినపుడు దండకాటవియందుండు రావణుసోదరి శూర్పణఖరాముని మోహింపగ దాని నాసికను లక్ష్మణుడు ఖడించినందువలన యీస్థలమున కాపేరు వచ్చినది.

పంచవటి:—ఇది చిన్నవూరు. ఇక్కడ భూమిలో దూరిన ఐదు పెద్దఊడలుగల వటవృక్షము క్రింద సీతాదేవినుంచి లక్ష్మణుని కావలియుంచిన చోటు. యీ చెట్టుక్రింద గుహావలెనుండు తొట్టిలో సీతాలక్ష్మణుల విగ్రహములుంచి పూజించుచున్నారు. గోదావరినది యిక్కడ ప్రవహించును. యీ నదియొడ్డున చక్కని పనితనమైన రామదేవళముకలదు. అర్చనాదులు జరుగుచున్నవి. ఇక్కడికి 4 మైళ్ల దూరమున తపోవనముకలదు. రెండు చిన్న మండపములును. స్ఫటికమయ రామచంద్ర మూర్తియు మరికొన్ని చిల్లర గుళ్లును. కొందరు తపము చేసి కొను మహర్షులును కలరు. యీ తపోవనమునకు సరియగు దారిలేనందున యాత్రికులకు కష్టము కలుగుచున్నది.

నాసికపట్టణము. బొంబాయిరాజధానిలోని అహమ్మదు నగరునకు చెందినది. వర్తకము. విద్య. రాజ్యాంగములం దున్నతస్థితియందుండి సమీప పర్వతపంక్తి రమణీయముగనున్నది. ఈనగరమునకు. 8 మైళ్ల కావల గోదావరినది జన్మించి. నాసికానగరమధ్యమున ప్రవహించి నగరవాసులను బాహ్యాంతర శుచిర్భూతులను గావించి ప్రాఙ్ముఖముగ ప్రవహించి బంగా

శాఘాతమున కలిసిపోవుచున్నది. నాసిక పట్టణమునకు బొంబాయి 115 మైళ్లు దూరమున నుండి యాత్రికుల నాకర్షించు నట్టిదిగ నున్నది.

బొంబాయి.

భరతవర్షమున ఢిల్లీ రాజ్యాంగ నిర్మాణమునకును. కలకత్తా స్వతంత్రవాంచకును. చెన్నపురి సేవకావృత్తికిని బొంబాయి వర్తకమునకును ప్రసిద్ధివహించినది. యీబొంబాయివంటి వర్తకపట్టణము మనఖండమున వేరొకటిలేదు. ఐరోపాఖండములో యెగుమతియైన సరకులు దిగుటయు తక్కిన రాష్ట్రముల కిక్కడినుండి సరకుల తీసికొనిపోయి విక్రయించుట యువాడుకమైయున్నది. దీనికింగారణ మీనగరము కడనుండు సముద్రము ముందుభాగము మిక్కిలి లోతుకలదై ఓడలునిలుచుండుటకు వీలుగనుండుటకు బట్టియే, యీనగరమున 16 లక్షల జనులు వసించుచున్నారు. వీరిలో హిందువులును మహమ్మదీయులును అధికసంఖ్యాకులు. పార్సీలును. క్రైస్తవులును స్వల్పసంఖ్యాకలవారు. యీనగరహర్మ్యములు. 3 అంతస్థులు మొదలు 10-12 అంతస్తులమేడలు కలవై అన్నింటి యందును జనులు క్రిక్కిరిసియుండు నటులును తోచును. కుగ్రామవాసుడును నాగరికులును యీ నగరరాజమును తిలకింతురేని వారు విభ్రమాశ్చర్యములకు లోనుగాక మానరు. అనేకము లీనగరమున చూడతగినవి కలవు వానిలో వినోదప్రదర్శనశాల, గ్రంథభాండాగారము, నగరమండపము. టంకశాల. సెంటుతామస్‌చర్చి, హార్బరు, టెలిగ్రాఫ్ఆఫీసు, హైకోర్టు పోస్టాఫీసు. గ్రాఫ్ఫర్డుమార్కెట్టు, ఎల్ఫిన్‌స్టన్ తోట, సాసూన్ యంత్రాగారము, గ్రాండుహాస్పిటల్, జెంసడ్జిజీజీభాయి వైద్యశాల, విక్టోరియారామము, ఆల్బర్టువినోదశాల, కొలాబామె మోరియల్ హాలు. మరియు పెక్కుకర్మాగారములును యంత్రశాలలును, చూడవలసినవి కలవు. యిక్కడి పెద్దరైలుస్టేషన్ 1500 అడుగుల విశాలమైనది. దీనిపైకలశములు 16 అడుగుల పొడవు. వీటిపై వ్యవసాయచిత్రములు కలవు. యీకట్టడములో స్ఫటిక శిలలు క్రిందపరచియున్నది. 30 లక్షల రూపాయ లీకట్టడమునకు సెలవైనది. బైకుల్లా పోరోబందరు రైలుస్టేషనులును చాలపెద్దవి, ఇవిగాక బ్యాంకులును హొటాళ్లును క్లబ్బులును కలవు. ముమ్మాదేవియను శక్తిగుడి చాలపెద్దదిగ కట్టబడియున్నది. బొంబాయినిగూర్చి అనేకములు వ్రాయవలసియున్నను ప్రత్యక్షదర్శనమే ముఖ్యమని హెచ్చరించుచు వివరములను వ్రాయుట మానడమైనది.

## సోమనాథపురము.

ఇది కత్తియవారుకు దక్షిణమున సముద్రపుటొడ్డున కలదు. దేవళ ముగాను. సముద్ర తీరములమధ్య యున్నది. విచిత్రాలంకారయుక్తమైనది. 1026 సం. మున గజినీమహమ్మదీదేవళమును ధ్వంసమొనర్చెను. ఆగురుతు లింకను మాయకుండ నున్నది.

## ద్వారక.

సప్తపురములలో నొక్కటి యిక్కడిగుడి 170 అడుగుల ఎత్తును 5 అంతస్తులును గలిగి చూడసుందరమై వేలకొలది యాత్రికుల నాకర్షించుచున్నది. ద్వారకకును జరీనా నగరమునకును 4 మైళ్ల దూరమున నుండి బెడి బందరునకు స్టీంబోటులో పోవుట సౌకర్యము జానోకర్ భావా నగరమునకు 200 మైళ్లు కలదు.

## కలకత్తా.

ఈ నగరరాజము పూర్వమునను ఇప్పుడును కూడ కళలకును స్వేచ్ఛావాదమునకును జన్మస్థానముగ విలశిల్లుచున్నది. 1910 సంవత్సరమునకు ముందు మనఖండమునకు ప్రధాననగరముగ నుండినది ఈ నగర వీధులు విశాలములై అయిదారుమైళ్ల పొడవుగలిగి 5-6 అంతస్థల మేడలతో ప్రకాశించుచున్నది ఈ నగరమంతయు చుట్టిచూచినగాని హృదయమునకు సంతుష్టికలుగదు కాని ఇందుకొన్ని స్థలములను మాత్రము వివరింపబడును నందనభాగ్, ఫోర్టువిలియముకోట, యస్ల్పనేడ్ మైదానము అందుండు టౌనుహాలు గవర్నమెంటుహౌస్, కష్టమ్‌హౌస్, నూతనటంకసాల, మెట్‌కాల్‌ఫీహాలు, అక్టరులోని స్మారకచిహ్నము, జేమ్స్‌ప్రిన్‌సిఫ్ జ్ఞాపకచిహ్నము మహారాజాపూరు మండపము పున్నయర్‌హాల్, ఏషియాటిక్ స్వొసయిటిహాల్, సెంటుపాల్‌స్ కథెడ్రాల్ స్కాంట్లాండుచర్చి, రైటర్స్ బిల్డింగ్ నటనశాల, బెంగాలు బేంకు, యూనియన్‌బేంకు, చేంబరాఫ్‌కమర్సింబిమప్‌కాలేజి, కెటల్‌ష్టన్‌హాల్, డర్బిషర్‌హాల్, టిప్‌సుల్తాను మండపము, క్రొత్తమార్కెట్టు మరి యనేకములయిన క్లబ్బులు హొటెల్లును ఉండుటయేకాక పరిశ్రామిక ప్రదర్శనశాలలును మింతుప్రదర్శన శాలలును చూడదగినవి స్ఫటకనిలాంకృత కాళికాలయములను, భీకరకాళీవిగ్రహముసు బదరీదాస్‌జైను దేవళమును మల్లిక్‌మహాలును హిందుశ్రీలమూడు వందల దేవాలయములును, మహమ్మదీయుల రెండువందల దేవాలయములును, చీనావారిదేవళములను మూడును క్రైస్తులచర్చులును, బ్రహ్మసమాజ

మందిరములును, కేశవచంద్ర సేనునిసమాధియు, రామకృష్ణ పరమహంస సమాధియు పెక్కుశృంగారోప వనములును, హుగ్లీనదిగభీరతను, పొగ యోడలరాకపోకలును 100 మైళ్ల కడనుండు డైమండుహార్బరును, దర్శని యులు కలకత్తా నగరమునుగూర్చి ఎక్కువవ్రాయుట అసాధ్యముగాన ప్రత్యక్షముగ దర్శించుటయే ముఖ్యమని దేశికులకు హెచ్చరికచేయబడు చున్నది కలకత్తాయందు హౌరాష్టేషను సమీపమున 2 ధర్మశాలలును, కలకత్తా నగరములోపల 12 ధర్మశాలలును పదునాలుగు బయస్కోపు ప్రదర్శనశాలలును 6 నాటకశాలలును, భోగపుస్త్రీల తొందరులనుకలదు.

## పూరీ జగన్నాధము.

కలకత్తాకును మదరాసునకును మధ్యఖుర్దారోడ్డునుండి పూరీకి రైలు శాఖకలదు. ఈ జగన్నాధము ప్రాక్సముద్రతీరమున ఎత్తైనగ్రామము ఇది ఉత్కల, (ఒరిస్సా) రాష్ట్రములో చేరినది ఈదేవళము 650 అడుగుల నిడుపును 640 అడుగులవెడల్పునుగలప్రాకారముగలిగి22 అడుగులఎత్తుగోడ లచే ఆవరింపబడిన పెద్దదేవళము ఇందనేక చిల్లర దేవళము లుండినను జగన్నాథాలయమే పెద్దది వీనిగోపురము 190 అడుగుల ఎత్తుగలిగి. వివిధచి త్రాలంకార శిల్పాలంకారములతో విలశిల్లుచున్నది. జగన్నాధ బలదేవ విగ్రహముల మధ్య సుభద్రాదేవినుంచి పూజించుచు న్నారు విగ్రహములు అలంకారముగనుండుటకు బదులు వికారముగ నుండుటయేగాగ సుభద్రా ప్రతిమను సోదర విగ్రహముల మధ్య ప్రతిష్టించి యుండుట చూడశాక్తే యుల స్థాపనవలె తోచుచున్నది ఆషాఢ శుక్ల విదియనాడు రథోత్సవప్రారం భమగును ప్రతిసంవత్సరము నూతనరథమును నిర్మింతురు మంగళవాడర్చ కుడును కుమ్మరివాడు స్వయంపాకియునై యున్నారు ఎంగలి దోషమును పాటింపరు యాత్రార్థులకు పండాల గృహములె వసతి గృహములుగ నున్నవి.

## భువనేశ్వరము.

ఇది కటకపురమునకు 20 మైళ్ల దూరముననున్నది ఈ త్రిభువనేశ్వ ర స్వామికి ప్రతిదినము 22 పూజలు జరుగుచున్నవి దేవాలయము చిత్రా లంకారములతోగూడి చాల గొప్పదిగనున్నది ఇక్కడబిందుసాగరమను తీ ర్థఘట్టములయందు వేలసంఖ్యగ కోవెలలుండినవట ఇప్పుడు సుమారు 5-6 వందల చిన్న గుళ్లుఉండవచ్చును దీనికి సమీపమునందుండు చిలుకసరస్సు కడ చైతన్యస్వామి శ్రీకృష్ణునిలో నైక్యమయ్యెనని వంగదేశీయులు చాల మంది వచ్చుచుందురు.

ఉత్తరహిందూస్థానములోని ప్రజలు చాలవరకు వైష్ణవ శాక్తేయ మతానుయాయులైయున్నారు ముఖ్యముగ బంగాళీలు శాక్తేయులుగను, వల్లభాచార్య మతప్రవిష్టులుగను కనుబడుచుందురు. ఉత్తరఖండవాసులు దయాధర్మదాక్షిణ్యాధిగుణములను సహజముగ కలవారైయుండినను కొంత వరకు మోటుతనముగ ప్రవర్తింతురు దాక్షిణాత్యులయుక్తి ప్రతియుక్తులును ఔత్తరాహుల నిష్కళంక భావములును మెచ్చుకొనదగినవి మరియు పెక్కుదేవళములును పెక్కుక్షేత్రములును వ్రాయక విడిచియుండుదానిని గూడ యాత్రికులు అచ్చటచ్చటసందర్శించి ఆనందమునుబడయుదురుగాక.

ఉత్తర హిందూస్థానము నందును పెక్కురు మహాత్ములును మతోద్ధారకులును జన్మించియుండిరి. ఇపు డుత్తరదేశమున వ్యాపించియుండు ప్రబలమతములను మాత్ర మిందు సంగ్రహముగ వ్రాయబడును.

## 1. నింబార్క మతము.

క్రీ. శ. 12 శతాబ్దమున భాస్కరాచార్యులను వారు మహావిద్వాంసులై యుండిరి. ఇతడొకనాడొక యతిని భిక్షస్వీకరింపవేడ, నాజటిలు డంగీకరించి కార్యాంతరమున సూర్యాస్తమయమువరకు రాలేదు. ఆచార్యు డంతవరకును నిరాహారియైయుండెను. సూర్యాస్తమయానంతరము సన్యాసులు భుజింపరు. కావున, భాస్కరాచార్యులు భాస్కరుని ప్రార్థింపగ సహస్కరుడు సంతసించి నింబ (వేప) వృక్షపుతోఁట్లలో భానుడు తనకిరణములతో గనుపట్టెను. ఆచార్యసన్యాసులుభుజించిరి. యీయాచార్యులొక మతమును స్థాపించెను. దానికి నింబార్కమతమని నామము. ఈ మతానుయాయులు గోపీ చందన దారులును. రాధాకృష్ణార్చకులును. భాగవతము నుత్కృష్టగ్రంథముగ భావించు వారునునై యున్నారు. ఇతడు వేదములకు భాష్యమొనర్చెననియు దాని నొరంగజీబు తగులబెట్టించెననియు వాడు కొందురు. సిద్ధాంత రత్నాంజనము, రత్నమాల, రత్నమంజిరి, సేతుకము, గిరివ్రజము, మొదలగు గ్రంథము లీ మతరహస్యములను దెలుపును.

మతసిద్ధాంతము:—పర మేశ్వరుడొక్కడే విగ్రహారాధనము కలదు. రాధాకృష్ణులే జీవాత్మ పరమాత్మలు. రాధాకృష్ణులు తుచ్ఛభోగములను ప్రధానముగ భావించువారని యెంచకూడదు. జీవాత్మను నాయికగాను పరమాత్మను నాయకునిగను ధ్యానింపనగును. ఈ మతమువారు గోకుల బృందావనములందుండు శాంతులును భక్తులునగు వైష్ణవులని చెప్పవలెను.

## 2. రాధావల్లభ మతము.

విక్రమశకము, 1460-సం. మున కావల నీ మతముత్పత్తియయ్యెను యీ మతస్థాపకునకు హరివంశుడని పేరు యితడు గృహస్థుడై సన్యసించి బృందావనము దారిని పోవుచుండ దారిలోనొక ముసలిబ్రాహ్మణుడిద్దరు పుత్రికలతో నెదురుగవచ్చి యీ నాకూతుండ్రను నీవు వివాహ మాడవలె నని స్వామియాజ్ఞ కావున తప్పరాదనిచెప్పి యా వృద్ధుడు తనకూతుండ్రను హరివంశునికి పెండ్లిచేసి రాధావల్లభ విగ్రహమిచ్చి తనదారిని పోయెను. హరివంశుడు భార్యలతో బృందావనమునకువచ్చి రాధావల్లభ దేవళ మును గట్టించి అందు దీ విగ్రహమునుంచి పూజసల్పుచుండెను. యితడు మొదట అద్వైతియై, తర్వాత నింబార్కమతావలంబియై పిదప తాను రాధావల్లభ మతాచార్యుడయ్యెను. ఇతడు మహాలోలుడై యనేక శిష్యు లను జేర్చుకొని కాముక వృత్తిదూష్యత్వముకాకుండ చేసి రాధా సుధా సిధి భక్తిమాల యనుగ్రంథములను రచించిరి. వీరిగీతములు శృంగార రస వర్ణనలతో నుండును. రాధావల్లభులవారి సమాది బృందావనముననున్నది వీరిశిష్యులలో ధృవదాసునుయితడు. జీవదశ వేదగానము. అను గ్రంథములను రచించిరి. యీమతము వారు బృందావనమున గలరు.

మతసిద్ధాంతము:—కృష్ణోపాసనము చేయుదురు. రాధాకృష్ణులు జీవాత్మా పరమాత్మలు. తులసిపూసల పేర్లుధరింతురు. ఏకాదశినాడు తాంబూలము నములుటకు దేవునియానతికలదని తమ్మలము సేయుదురు. భక్తులతో రతి కేళి పాపముకాదు.

## 3. హరిదాసు మతము.

మథురానగరమునకు సమీపమున గోలయను గ్రామమున విక్రమ శకము. 1440 సంవత్సర ప్రాంతమున హరిదాసు జన్మించి బాల్యము మొదలు విష్ణుభక్తి పరాయణుడై యుండి సాంగవేదవేదియై యమునాబృం దావనములకు మధ్య మానస సరోవరతీరమున తపమొనర్చి సిద్ధ సంక ల్పుడై, నందవనమునకు వచ్చు దారిలో తాతగారు శిష్యులైరి షేక్లేలో సి దయాళుదాసనువర్తకునికొక మహాత్మ్య బంగారమగురాయినియిచ్చి యుం డెను. దాని నావర్తకుడు పోగొట్టుకొని హరిదాసుగా కడ మొరలెట్ట యమునాసైకతమును దీసికొమ్మనెసియెనట. వర్తకుడటులొనర్ప నాయిసుక యంతయు తనకడనుండిన బంగారురాతి బోలియుండెనట మరియు పెక్కు వ భావములుగల వాడగుట వేలకొలది శిష్యులను సంపాదింపగల్గెను. ఈ

మతాచార్యులను మహంతులని బిరుదుకలరు. బృందావన ప్రాంతములందీ మతానుయాయులు కలరు. సాధారణ సిద్ధాంతము రసికపదము అను గ్రంధము లీసుతరహస్యమును దెలుపును.

మతసిద్ధాంతము:—మతము పరిశుద్ధమైనదిగ నుంచవలెను. తత్వ విచారమధికము. సంపూర్ణ విరాగియై శుద్ధసన్యాసియై మోక్షమార్గగాము కావలెను. కొంతమార్పులతో చైతన్యమతమును బోలియున్నది.

4 వల్లభాచార్యమతము.

ఈ వల్లభాచార్యులు. ఆకివీడునకు సమీపమున కారవాడ గ్రామమున (ఆంధ్రదేశము) నుండిన వెలనాటి వైదికశాఖకుం జెందినవాడు. తలిదండ్రులు కాశీనగరమందున్నపు డితడు జన్మించెను. కేవలము విష్ణువే యీయనగా జననమందెననియు బాల్యముననే బహువిధమాహాత్మ్యము లంజూపిరనియు చిన్నతనముననే అనేకమతములను ఖండించుచుండిరనియు చెప్పుదురు. పెండ్లియాడుటకు ముందే భూప్రదక్షిణముచేసి ద్వైతాద్వైత విశిష్టాద్వైతజైన బౌద్ధచార్వాకాదిమత ఖండనముచేసి యక్కడక్కడ తనపీఠములను నెలకొల్పెను, మరియొకతూరి దిగ్విజయము చేయుటకు బయలుదేరి వచ్చుచుండ కాశిలోని మధురమంగళుడను విప్రుడు తనకుమార్తెను సాలంకృత కన్యాదానముచేసెను. ఆమెవలన యిరువురు పుత్రులను బడసి, తర్వాత సన్యసించి తనమతమును వ్యాపింపజేసి విశ్రమనొందను, 1575 సంవత్సరమున పరమపదమునుజేరిరి. ఈతనిచరిత్ర మితిబహుళమైనను చాలసంగ్రహింపబడినది, యితని మతానుయాయులుత్తరహిందూస్థానమున నన్నిచోట్లను దక్షిణదేశమున కొన్నిచోట్లను కలరు.

మతసిద్ధాంతము:—పరమాత్మ, సత్తు, చిత్తు, ఆనందము, అను త్రివిధగుణములు కలవాడు వస్తువు, సత్తుయొక్కభాగము, ఆత్మచిత్తులోని భాగము, ఆత్మలనేకములు, పరమాత్మకృష్ణుడు, మాయయగు చిత్తు దేహాంతరగతమై అంధత్వమొసగినను, కృష్ణధ్యానానుగ్రహములవలన జ్ఞానము వికసించి గోలోకమున శ్రీకృష్ణసన్నిధికింజని ఆత్మనిత్యత్వమును పొందును అన్నింటికిని భక్తియేముఖ్యము, భక్తికలుగుటకు, శాంతము, దాస్యము, సఖ్యము, మాధుర్యము, యీనాల్గును కావలెను. శ్రీకృష్ణుడు త్రేతలయందెట్టిభావముంచెనో అటులే యుండవలెను సన్యాసము ఉపవాసము. అహంకార నిరసనము, జితేంద్రియత్వము మొదలగు కష్టముల నవసరములేక యోగ్యవస్తువులన్నియు అనుభవింప తగినవని యీమతస్థులు చెప్పుదురు.

ఆచార్యులు గోపకాంతా వేషములతో కృష్ణారాధన మొనర్తురు. గురుపాదోదకమును ఉచ్ఛిష్టమును మిక్కిలి పూజ్యములు, స్వాములు కోరినయువతులు అంతరంగ సేవకంగీకరింపవలెను. యీమతాచార్యులు గృహస్థధర్మమవలంబించినవారు, దేహధన, ప్రాణములను భగవదార్పణ మొనర్చించినవారు (గురువులు భగవానుని ప్రతినిధులట) బ్రహ్మ సంబంధమగు జీవాత్మైక్యమునొందుదురు. వల్లభాచార్యులవారు భాగవతమునకు సుబోధినీ టీకయు బ్రహ్మసూత్ర భాష్యమును, పూర్వ మీమాంసాభాష్యమును తత్వదీప నిబంధనము. యిత్యాదిగ్రంథములకు కర్తలు.

5 చైతన్యమతము.

వంగదేశస్థనవద్వీపమున క్రీ. శ. 1486 సం. మున. విష్ణువు చైతన్యుడుగజన్మించి, బాల్యావస్థయందు, శ్రీకృష్ణునివలె దుడుకుగలవాడుగనుండి తండ్రిచే ననుజ్ఞాతుండై చైతన్యుడు సంస్కృత మభ్యసింపదొడంగెను. అపుడు షడ్దర్శనములను జదివిన వాసుదేవ సార్వభౌముడను పండితునికడ సాంగవేదములభ్యసించి, వల్లభాచార్యుని కూతురగు లక్ష్మీదేవిని పెండ్లియాడి తదనంతర మొకసంస్కృతపాఠశాలను స్థాపించి స్వయముగ విద్యనేర్పుచుండినక తన పండిత తిలకమగుచైతన్యునికడ దేశదేశములనుండి మాణవకులువచ్చి చదువుకొనుచుండిరి. చైతన్యుడు ప్రసిద్ధపండితుడై దిగ్గజములవంటి పండితులను వాదముననోడించుచుండెనుగాని దైవభక్తిమాత్రము కుదురదయ్యెను. చైతన్యుడు న్యాయశాస్త్రమున కొకటీక రచించియుండెను. ఒకపండితుడు న్యాయదర్శన టీకనురచించి పండితాభిప్రాయమునకై చైతన్యునికింజూపించెను. చైతన్యుడు తనటీకను వచ్చినపండితునకుంజూపెను. పండితు డీటీకనుజూచి వగవగా చైతన్యుడు కారణమడిగెను. పండితేంద్రా, మీటిప్పణ సర్వవిధముల శ్లాఘాపాత్రయున్నది. కావున నారచననెవరును మెచ్చుకొనక పోవుదురనినుడువ చైతన్యుని యౌదార్యగుణము నాపండితుడు మెచ్చునటులు తనటీకను, చించిపత్రములను తగులపెట్టెను కొన్నిదినములకావల. తనభార్యగతింపగ చైతన్యుడు విష్ణుప్రియయను మరియొకభార్యనుస్వీకరించెను. చైతన్యుడొకప్పుడు గయాక్షేత్రమున పిండాది కర్మక్రియలొనర్చి ప్రయాగకువెళ్లి అక్కడయీశ్వర పురియనుమహాయోగినిదర్శించి, అతనికడ ననేకధర్మతత్వములను దెలిసికొని విరాగియై భగవద్ధ్యానమునం దేకాలమునుగడప నెంచియుండ నిత్యానందుడనువైష్ణవసన్యాసి చైతన్యునకు వైష్ణవధర్మోత్కృష్టత నుపదేశించెను. చైత

న్యుడు యాత్రనుముగించుకొని సురక్షితముగగృహముఃజేరి యానద్వృత్తాంతమును దల్లికిని మిత్రులకుని వినిపించెను ప్రతివాది భయంకరుడగు చైతన్యుడు వైష్ణవ మతావలంబియై నందులకు వైష్ణవులు సంతసమును తక్కిన వారు సంతాపమునుగల్గి యుండిరి. చైతన్యుడొక్కొకసమయమున భక్త్యావేశమున ఆనంద పరవశుడై చైతన్యవిహీనుడై పడియుండుటనుజూచి వాని తల్లి శచియు భార్య విష్ణుప్రియయు నిదియొకరోగముకాదలంచి దిగులొంది భిషగ్వర్యులచే చికిత్సతో నరించిరికాని నిష్ఫలమయ్యెను. చైతన్యుడు భగవంతునితో భాషింపుచున్నట్లును, ఆట్లాడుచున్నట్లును, తనకుధర్మ మీయకుండినటులును, పరిపరివిధములుగభావించి సంతోషాశ్చర్య చింతలకులోనై యన్యమెరుగక జ్ఞాపకము వచ్చినపుడంతయు మధురా బృందావనములకు పోయివచ్చుచుండును చైతన్యుడిరువది న్నాల్గవ సంవత్సరమున. ఒరిస్సా పర గణాయంతయు తిరిగి జగన్నాథమున వైష్ణవ ధర్మము లుపదేశింపుచు నలాజలాయను క్షేత్రమున కొన్నిరోజులుండి తనముప్పదవయేట మధురా బృందావనము శాంతిపూర్ కాశీరామేశ్వరాది దేశములన్నియుతిరిగి తన మతమును వ్యాపింపజేసి జాతిభేదములేక యెలవారును తనమతధర్మములనుష్ఠించునటులు చేసెను, యితని మతోపదేశములనువిని యిద్దరు మహమ్మదీయులు చైతన్య మతావలంబులై రూప సనందనులను. పేరులతో నుండి వీరి పరంపరవారే యిపుడు బృందావనమున ముఖ్యపీఠాధి పతులైయున్నారు చైతన్యునికి గౌరాంగుడను నామముకలదు.

మతసిద్ధాంతము:—దేవుడు. సృష్టికర్తయు, లయకర్తయు, సర్వనియామకుడును, దుష్ట శిక్షకుడును అని నిశ్చయమైన విశ్వాసము కలిగి యుండవలెను తుచ్ఛ భోగములందు ప్రీతియుంచక, యింద్రియ నిగ్రహుడై స్వార్థపరాయణుడుగాక. శ్రీ రాధాకృష్ణునిపై యనన్య ప్రీతియుంచవలెను భక్తి విశ్వాసములవలననే మోక్షమలవడును. మోక్షాపేక్షియైనవాడు కుటుంబ పరిత్యక్తుడు కానక్కరలేదు. సంసారమందుండియే ముక్తినిబడయవచ్చును. ఈ మతమువారు 108 తులసిపూసల పేరును ధరించి రెండుగీరలుగ తెల్లని గోపీని బొట్టు పెట్టుకుందురు. భగవద్గీతయు భాగవతమును యీమతస్థులకు పారాయణగ్రంథము చైతన్యమతమువారు. ఒరిస్సా కలకత్తా జగన్నాథ మధురా బృందావన ప్రాంతములం దధికసంఖ్యాకులుకలరు చాలవరకీ మతసిద్ధాంత మాధ్వమత సిద్ధాంతమును బోలియుండును. చైతన్యుడిట్టి తనమతమును విస్తరింపజేసి. తన 48వ యేట విష్ణైక్య మొందెను.

## 6. ఆర్యమతము.

ఈమతస్థాపకుడు. మూల శంకరుడను. పేరుగల దయానంద సరస్వతిస్వామి, క్రీ. శ. 1824 సంవత్సరమున గౌరవనీయులైన యుత్తరాది బ్రాహ్మణకుటుంబములో జన్మించెను కతియవారు సంస్థానములోచేరిన గ్రామ కాపురస్థుడు. యితని పూర్వీకులు న్యాయవాదియుద్యోగములో మిక్కిలి నేర్పరులై చాలధనమును గడించిరి. వీరితండ్రియు నదేయుద్యోగమునుండి సంస్థానాధిపతియను గ్రహమునకు పాత్రుడైయుండెను. దయానందుడు తన పదునాలుగేండ్ల ప్రాయమునకు యజుర్వేదమును మిగిలిన వేదములలో కొన్ని భాగములను. వ్యాకరణమును వైదిక కోశమును చదివియుండెను. శైవమతమున ప్రీతిగల యితనితండ్రి కుమారునకు శైవదీక్ష నిప్పించుటకు సంకల్పింప. విగ్రహారాధనమందు తృప్తిలేని దయానందుడు తండ్రికి తెలియకుండ పారిపోయెను. వానితండ్రి వెదకి తీసికొనివచ్చెనుగాని, సాంగముగ వేదములను ధర్శనములను తక్కిన శాస్త్రములను అధ్యయనముచేయుటకై కాశికి పోవలెనని నిశ్చయించి దయానందుడు తండ్రియనుమతిని కోరెను కాని అందులకు తండ్రి యంగీకరింపక పోవుటయేగాక, కుమారునకు కల్యాణము చేసినవానికి చదువు పిచ్చి తగ్గునని సుందరియైనపిల్లను మాట్లాడెను. నిశ్చితార్థము నాటిరాత్రి పదునెనిమిదేండ్ల వయసుగల దయానందుడు యెవ్వరికిని తెలుపక అర్ధరాత్రిని యిల్లువీడి పరుగెత్తిపోయి అనేకపండితులకడ చదువులోని మర్మమంతయు గ్రహించుచు వేదములను ఉపవేదములను దర్శనములను బాగుగ నేర్చుకొని సకలకలానిధియై నర్మదా నదీతీరవాసియగు పూర్ణానంద పరమహంస గారివలన, వేదాంత తత్వశాస్త్రములను చదివి బరోడాకుసమీపస్థమగు శంకరమతాధిపతులగు పరమానంద సరస్వతికడ సత్యజ్ఞానోపదేశముచు పొంది సన్యాసియై గురువువారివలన దయానంద సరస్వతియను పేరుచుబడసెను. ఆపైన చైతన్యాశ్రమమునకుజని పరమానంద సచ్చిదానందులను సన్యాసులవద్ద యోగమభ్యసించి తదుపరి అహమ్మదాబాదు, జ్వాలానందులకడను, ఆబూ పర్వతముపైనుండు శివానందులయొద్దను, తత్వరహస్యమును యోగాంగలక్షణములను గ్రహించి అనంతరము హరిద్వారమునకుంజని మరికొన్నిరహస్యవిద్యలను అక్కడ మహర్షులవలన పొంది చాందీ అరణ్యము కేదారము గౌరీఖండము, భీమఘోరా, అగస్త్యాశ్రమము, గుప్తకాశీ త్రిజోగీనారాయణము. మొదలగు దివ్యదేశములందుండు మహామునులను దర్శించి వారి యనుగ్రహమున

సామాన్య పండితులు సన్యాసులు మెరుగంజాలని తత్వరహస్యములను విద్యల ననేకములను గ్రహించెను. తర్వాత మధురకువచ్చి సర్వజ్ఞులును అంధులునగు స్వామి విరజానందులవద్ద తానుచదివిన దంతయు పునర్విమర్శ చేసి విరజానందస్వామికడ కొన్ని విషయములను తెలిసికొని తాను సర్వజ్ఞుడై తనజీవితమును దేశోద్ధరణమునకు వినియోగింపనిశ్చయించి తన ఆస్తి నంతయు విద్యాలయములకును అనాధ శరణాలయములకును వినియోగించిరి. నాలుగువేదములకును మనుస్మృతికిని మరికొన్నిగ్రంథములకును భాష్యములురచించిరి. పంజాబులో ఆర్యసమాజమును స్థాపించి అనేకులను శిష్యులుగస్వీకరించిరి. ఆధునికులలో మహారాజులును రాజాధి రాజులను శిష్యులుగ స్వీకరించిన దీసమాజమే, దేశభక్తుడగు లాలా లజపతిరాయిగారీ సమాజమునకుం జెందినవారే. దయానందుడు దేశమంతయుతిరిగి యుపన్యాసములొనర్చి అక్కడక్కడ పెక్కుసమాజములను స్థాపించిరి. దయానంద సరస్వతికడ యోగమభ్యసించుటకై అమెరికాదేశపు కర్నల్, ఆల్కాటును మేడంబ్లావట్స్కీ దొరసానియు వచ్చి ఆశ్రయించిరి. ఈ మహాత్ముని సంస్థాపనలలో లాహూరు. డి. ఎ. వి. కాలేజియు జలంధరు కన్యావిద్యాలయమును ప్రసిద్ధములు. యిట్టి మహామహుడు జోధపురిలో నొక్కని విషప్రయోగమువలన క్రీ. శ. 1883 సం. ము. సెప్టంబరు నెల 29 తేదిని గాయత్రీ ధ్యానముతో ముక్తినొందిరి.

మతసిద్ధాంతము:—ఈ మతము ద్వైతము ననుసరించియున్నది. జీవాత్మపరమాత్మలువేరు. బ్రాహ్మణాది చాతుర్వర్ణ్య వ్యవస్థలును మానవుల గుణకర్మ స్వభావముల ననుసరించియుండును. బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయము ననుసరించుట కన్నిజాతులవారికిని హక్కుకలదు. జాతిభేదవిగ్రహారాధన పశుహింసాదులు వేదసమ్మతములు కావు. అన్యమతములవారికి ప్రాయశ్చిత్తముచేసి స్వమతమున జేర్చుకొందురు స్వామివారి స్వకల్పితగ్రంథములలో సత్యార్థప్రకాశమును సంస్కారచంద్రికయు విశేషములు సత్యార్థప్రకాశమున అన్నిమతములయొక్కయు పురాణములను సనాతన గ్రంథముల యొక్కయు విమర్శలును స్వమతమండనమును గలదు వైదికకర్మల వశ్యానుష్ఠేయములందురు. సరస్వతిగా రొక్కనాడు కాశిలో నొక్కనియింటికి భిక్షుకరుగ వామాచారియగు నాగృహస్థు మాంసపక్వాన్నమును బెట్టెను, స్వామి ఆయన్నమును భుజింపక యిది చండాలాన్నమని విసర్జింప నాగృహాధిపతి తంత్రశాస్త్రోక్తమైనదాని నిర్లక్ష్యము చేసెద

వేమనియడుగ స్వామి ఆశాస్త్రమును ఖండించి "గోకరుణానిధి" యనుగ్రంథమును రచించెను. ఆర్యమతమువారు పంజాబురాష్ట్రమం దెక్కువమందియు అన్యపరగణాలయం దక్కడక్కడను నివసించుచున్నారు.

వీరశైవ మతము.

ఈమత సృష్టికర్త సదాశివుడు. సకలదేవతలును సకలచరాచరములును అతనిచేసృజింపబడినవి. ఈసృష్టి అధోసృష్టియనియును, బ్రహ్మసృష్టియనియును, రెండువిధములు. ఎట్లన సదాశివునకు పంచముఖములు గలవు. అవిసద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అనునవి నాలుగుదిశలందు మొదటి నాలుగుముఖములును. ఊర్ధ్వమందు ఈశాన ముఖమును ఉండును. సద్యోజాతముఖమున వీరశైవబ్రాహ్మణులును, వామదేవముఖమున వీరశైవక్షత్రియులును, అఘోరముఖమున వీరశైవ వైశ్యులును, తత్పురుషముఖమున వీరశైవశూద్రులునుపుట్టిరి. ఈశానముఖమున అంటరాని వారనిచెప్పబడు లింగాంగులుపుట్టిరి. పంచమ ముఖమునందు పుట్టినవారు నీచులనియును మిగత నాల్గుమతస్థులును అధోసృష్టితో జేరిన వారనియు తెలియవలెను. పంచముఖులైన లింగాంగులు శివునివలన పుట్టిన వారగుటచేత వీరశివకులస్థులనియు, నందీశ్వరగోత్రస్థులనియు, వీరాగమ సూత్రస్థులనియు నిరంజనగణేశ్వరప్రవర యను గ్రంథమందు చెప్పబడి యున్నది.

లింగాంగ (లింగాయత) మతసిద్ధాంతము:—జీవ పరమాత్మలు సతి పతిన్యాయమున మెలగుదురు. మహాలింగమే వీరశరీరమందు జీవుడై ప్రకాశించుటంబట్టి వీరుతమజీవునే పూజింపవలయును.

పైన చెప్పినవానికి ప్రమాణము:—

శ్లో॥ పతిర్లింగం సతీచాహం హృదయుక్త స్వయంవిభుః। అనియును,
లింగమధ్యే జగత్సర్వం త్రైలోక్యం సచరాచరం।
లింగబాహ్యం పరంనాస్తి తస్మై లింగాయే వైనమః॥

అనియును చెప్పబడియున్నది. శివుని పంచముఖులయందుండి పుట్టిన 28 ఆగమములలో అసురమోహాకములైనవి పదిపోగా మిగిలిన 18 యు అంగీకారములైనవి.

లింగాయతమతవిభాగములు:—వీరశైవము, సామాన్యశైవము, నిరాభారిశైవము, అని మూడువిధములు. ఈభేదములు క్రియాభేదములు, శ్రేష్ఠమైనది వీరశైవమతమే. "శివభక్తి విహీనశ్చ బ్రాహ్మణాశ్శ్వపచాధమాః"

శివభక్తి లేనివాడు బ్రాహ్మణుడైనను శ్వపచునితో సముడు. "శివభక్తస్సదాపూజ్య శ్శ్వపచో బ్రాహ్మణోత్తమః" శివభక్తిగలనీచుడైనను బ్రాహ్మణశ్రేష్ఠుడు పూజింపదగినవాడు. ధర్మసంరక్షణార్థము శివుని పంచముఖము లంపవతరించిన దేవతలే కలియుగమునందు రేణుకారాధ్య, మరుళారాధ్య, పండితారాధ్య, ఏకోరామారాధ్య విశ్వారాధ్య అనెడుపేర్లనుధరించి బ్రాహ్మణులు మొదలుకొని పంచముల పర్యంతము గల సకలజాతులవారికిని ముక్తిమార్గమును నుపదేశింతురు. ఇట్లని సుప్రభేదాగమమునందు చెప్పబడియున్నది. హైదరాబాదు ప్రాంతములందును కర్నూలు కడప మొదలగు పశ్చిమాంధ్ర మండలము లందును, మైసూరు కర్ణాటక దేశమందును యీ మతావలంబు లెక్కువగ కలరు. యీమతమువారికి లింగధారణమే ప్రధానమై యజ్ఞోపవీత మనావశ్యముగ నుండినను కొందరీ మత మవలంబించిన బ్రాహ్మణులు లింగమును జన్నిదమును కూడ ధరింతురు, వీరికే, ఆరాధ్యులనిపేరు, శైవమత తత్వమును బోధించు పురాణములు పెక్కులు కలవు.

## 8. శాక్తేయమతము.

దీనినే దేవీమతమనియుచెప్పుదురు యీమతప్రతిపాద్యదైవము దేవి, మతకర్త రుద్రుడు, యీమత సాంప్రదాయములు దక్షిణ మార్గమనియు వామ మార్గమనియు ద్వివిధములు, వామమార్గమువారు దేవి యుపాసనముసేయుచు, మత్స్యమాంస, మద్యముద్రామైథునములను పంచమకార కార్యములను పవిత్రములని చెప్పుదురు. దీనికుదాహరణము "మత్స్యం మాంసంచ మద్యంచ ముద్రా మైథునమేవచ, యేతే పంచమకారాస్స్యుర్మోక్షదాహియుగే యుగే" యిట్టి శ్లోకములకు పుట్టినయిల్లై, యిహపరములకు దూరమై నీతికివిరుద్ధమైనమతగ్రంథములలో రుద్రయామళ మొకటి. దీనికి తంత్రశాస్త్రమనియు పేరుకలదు, వేదవ్యాఖ్యాతలలో కొందరగు మహీధరాదు లీమతావలంబులనియు కావుననే యజ్ఞములందు జీవహత్యాపరముగ వ్యాఖ్యానొనరించిరనియు చెప్పుదురు. యీమతస్థులు, కల్లునకు-తీర్థమనియు, మాంసమునకు-శుద్ధమనియు, మద్యపాత్రమునకు-పద్మమనియు, తెల్లగడ్డకు-శుకులనియు, ఉల్లిగడ్డకు-వ్యాసులనియు, త్రాగుబోతులకు-దీక్షితులనియు, వేశ్యకుప్రయాగ వాసిని యనియు, చండాలస్త్రీని కాశీవాసిని యనియు, అత్యధిక వ్యభిచారిణిని యోగిని యనియు అవాచ్యదోషభూయిష్ఠను ఉత్తమ శక్తియనియు నామాంతరములను పేర్కొందురు. నీచు

రాలును భ్రష్టురాలునగు స్త్రీని దేవీభావమున పూజించి, దాని యుచ్ఛిష్ట మద్యమాంసాదులను ప్రసాదముగ సేవింతురు. దేవివాంతి చేసిన దతిపవిత్ర పానీయముగ భావింతురు. దక్షిణాచారమునకిట్టి నీతి విహీనములు లేవు, శైవ వైష్ణవ స్మార్తాది సకలమతముల వారియందును యీవామాచారులుగలరు. శైవులలో రుద్రుడు మతకర్తయైనటులు వైష్ణవులలో శ్రీరామానుజుల సోదరీంద్రుడు కూచి, మాచి, యనువారీ మతమును స్థాపించిరని వైష్ణవులు భ్రమించుచున్నారు. రామానుజస్వామికి తోబుట్టువులే లేరు, కల్లును సుజ్ఞానరసమనియు, మాంసమునకు మోక్షమనియు, పరనారీ సంపర్కము నకు శరణాగతియనియు పేర్లుగలవు. వీరును మద్యాదులను త్రావి పిశాచ ములట్లు చరింతురు. బ్రాహ్మణేతరులలో చీకటినుడి అను పేరుతో, స్త్రీలు దిగంబరలై వంటలు చేయుదురు. సన్యాసులు. పండితులు మొదలగువారీమత మున చాలమందియుండుట చింతాకరము, పెద్ద పెద్ద పట్టణములలో. కొన్ని రహస్య సంఘములును, అందనేక విద్యాధికులు సభ్యులుగ నుండు టయు నందరకును దెలిసినవే, ఆసంఘచర్య లీమతము ననుసరించి యుండి నను సందేహము బలముగనున్నది.

మతసిద్ధాంతము:—దేవియే సృష్టిస్థితిలయములకు మూలము, తక్కిన వన్నియు యితర మతములవలెనే యున్నవి. స్త్రీలు దేవీప్రతి బింబములుగాన నత్యంత పూజనీయలు. సౌందర్యముగల యువతులు అత్యంత పూజార్హులు వావివరుసలతో పనియుండదు. యీమతానుయాయులు కలకత్తారాజ్యములో నెక్కువగను తక్కినచోట్ల సామాన్యముగనుగలరు. వైష్ణవ వామమార్గులు చెన్నరాజధానియందంతటను నిండియున్నారు.

## 9. బౌద్ధమతము.

సుమారు రెండువేల యేనూరు సంవత్సరములకు పూర్వమున నుత్తర కోసలదేశమును పాలించు శుద్ధోదనుడను రాజేంద్రున కీబుద్ధుడు జన్మించెను, వీరిక్ష్వాకు సంతతివారు. జన్మపత్రిక వ్రాసిన జాతకులీబుద్ధుడు, సార్వభౌముడుగగాని. సంయమీంద్రుడుగగాని యగునని చెప్పిరట, బుద్ధుడు బాల్యమునుండియు నహింసా ధర్మపరాయణుడై జీవితము నతిపవిత్ర వంత ముగ జేసి కొనుచుండెను, సార్వభౌమునకుండ తగిన, శరీర సల్లక్షణములును దయాధర్మగుణములును, సన్యాసులకుండగిన, యమ నియమ, మొదలగు గుణములును, బుద్ధునికడ వాసము చేయుచుండెను, ఇతనికి సర్వార్థసిద్ధియని పేరుపెట్టినను సిద్ధార్థియనియే పిలుచుచుండిరి, సిద్ధార్థి తమాషాకారకైనను

పశుపక్షిమృగాదులను హింసించువాడుకాడు. బాల్యమునం దొకప్పుడు సిద్ధార్థుడు దేవదత్తుడను మిత్రునితో వనమున విహరించుసమయమందంచ పిందుబారులుగట్టి మిన్నుదారిని పోవుచుండ సిద్ధార్థి యా తెల్లపులుగులగ మినిగాంచి యానందించు సమయమున దేవదత్తుడు తనచేతనుండు వింటి బాణము సంధించి పక్షులపై ప్రయోగించెను, ఆయలు గొక్కవెల్ల పక్షి లిం దగిలిన నది విల విల తన్నుకొనుచు సర్వార్థసిద్ధి యెదుటబడెను, సిద్ధార్థుడా హంసగతినిగాంచి చింతించికొన యూపిరితో నుండునా ప్రాణికిచి కిత్సచేసి, తన జీవదయాపరతను వెల్లడించెను బాల్యముననే విద్యాబుద్ధులు వృద్ధియై కేవలము శాంతమూర్తియై శౌద్ధోదని వరలుచుండునపుడు పట్టణపరి సరములను జుట్టివచ్చుచుండెను, రైతు లెండవానలకుందడిసి శ్రమ పడుటయు, తానును దనవారును యెండ కన్నెరుగకుండ సుఖముగ నుండుటయు, చిన్నజంతువులను పెద్దజంతువు తినుచుండుటయు, చూచి, యది మొదలు భౌతిక విజృంభణా స్థిరత్వమును గూర్చి చింతించు చుండెను. దినములో చాలభాగము మౌనియై యుండెను తన కుమారు డుండు స్థితికి శుద్ధోదనుడు చింతించి కుమారు నెట్లైన యిహమార్గ ప్రవృత్తుని గావించుట ముఖ్యమని యూహించి త్రిలోకసుందరియు తన మేనకోడలునగుయశోధను భార్యగా జేసి, కోట్లకొలది ధనమును వెచ్చించి రమణీయమందిరా రామములను నిర్మించి సుందరవతులను వరవుడు కత్తెలుగ నియమించెను బుద్ధుడు కేవలము రక్తుడుకాకుండినను కొంతకాల మిహ సుఖము ననుభవించుచుండెను, యిప్పటికి బుద్ధుడు సంపూర్ణముగ విరాగమువొంది యుండలేదు.

ఇరువది సంవత్సరముల వయస్సు గలవాడైయుండునపు డొకనాటి సాయంసమయమున శుద్ధోదనుని ప్రేరణవలన సూతుడురథమునలంకరించి యశ్వంబులం బూన్చి సిద్ధార్థునిగని, యువరాజా! తామీనాడు మనపట్టణమునగల విశేషములను జూడవలయునని శ్రీ పెద్ద ప్రభువుగారు సలహానొసంగిరి. కావున దయచేయుడు అనెను.

ప్రజలనురక్షింప సమకట్టిన వానికిట్టికార్యమవసరమేయని భావించి యువరాజు రథమెక్కి సారథియగు సంతకుడు విశేషములను దెలుపుచుండ రాజమార్గములం దరుగుచుండెను. అందందుగల సుందరమందిరములును, చిగిర్చి పూచియున్న చెట్లు, పొదరిండ్లు గల శృంగారా రామములును, బజారులో వెలగల వస్తువులును, శ్రీమంతులను యాచించి డబ్బు

పుచ్చుకొను బిచ్చగాండ్రును, సుందరులైన స్త్రీపురుషులును, వికలాంగులై పనిపాటలుచేయుటకు వీలులేమి దరిద్రులై అన్నములేక మలమల మాడి శుష్కశరీరులైయుండు ప్రజలును, మోసముచేయువారును దొంగలించువారును, వీరిని దండించు వారును, అగు ప్రదర్శనము సిద్ధార్థుడు చూచుచుండెను, యిటులు కొంతదూరము సాగిపోగ మిక్కిలి చిక్కిన యొడలుగల వృద్ధుండొక్కడెదురయ్యెను, వానినిగని యువరాజు భ్రమగొని సారధితో యిట్టిమనుజుడుగూడ సృష్టింపంబడునా? యీసందియముం దెలుపుము, అనెను. సారధియిట్లుపల్కెను. "స్వామీ! ప్రతిమనుజుడును యీస్థితికి వచ్చువాడే" యువ. నేనును నాతండ్రియు తల్లియు నీవునుగూడనా ? సార. అవును దీనినేవృద్ధదశయందురు యిద్రిప్రాణు లనుభవించు దానిలో, నాలవది వదులకొన నసాధ్యమైనది. సారధిమాటలకు సిద్ధార్థుడు విస్మయుడయ్యెను ముఖముననొక్క కళతగ్గిపోయెను.

ఇటులు మరికొంత ధూరమరుగ నొకగ్రుడ్డిముసలివాడు దారితెలియక తారాడుచుండెను. వానిగతియేమని యువరాజు సంతకుని ప్రశ్నించెను, ఆవృద్ధునికంటెను వీడొక్క మెట్టెక్కువవాడు. యిదియు తప్పనిదే, యనెను. యువరాజు మొగమున సగముకళతగ్గెను. నగరమంతయు తిరిగి యింటికివచ్చు సమయమున పదుగురుకూడి దుఃఖించుచు నొక్కపీనుగును. కాటికి గొనిపోవుచుండిన దానింగని యువరాజు తనరధమును వారివెంటనే పోనిమ్మనెను. సంతకుండెంత చెప్పినను వినడయ్యెను. విధిలేకసారధి శవము వెంటనే తనరధమును స్మశానమునకు తీసుకొనిపోయెను.

బందుగులును మిత్రులు నుచితపై పీనుగునుంచి యగ్గిని దరిగొల్పి భస్మముచేసి యాబూడిదనునీటిలో గలపియేడ్చుచు నింటికరిగిరి. దీనినంతయు గనుచుండిన సిద్ధార్థుడు విషాదముతో సంతకునిట్లని ప్రశ్నించెను. సంతకా! తుదకిటులయ్యె నేమిచెపుమా యిదియేయవస్థ.

సం. మహాప్రభో! యిదియేమానవుని యంత్యము, యీగతియెల్లరకును గల్గునదియే. జీవుడీలోకముతో గల సంబంధ మీనాటితోవదలుకొనియెను. జీవుడుపోయిన పిదప నాదేహము శుష్కకాష్ఠసదృశము, నిరుపయోగము. కావుననే కాల్చి బూదిచేసిరి. యీవిధమైన పరిణామమును బొందని మనుజుడే లేడు బుద్ధుని కీమాటలు వినుసరికి హృదయప్రీతిపోయెను. సంతకుడు, రథమును రథిని యిల్లుచేర్చెను.

తానుగనిన వానినిగూర్చి యాలోచింప మొదలిడెనుగాని సిదాథు

నకు నిశ్చయము గలిగినది కాదు. అతనిహృదయ చక్షు లంధకారమునబడి యుండెను. జ్ఞానజ్యోతి తనకుంగలుగునను యిచ్ఛ లేదు. యిప్పటికి సిద్ధార్థునకొక పుత్రుడు పుట్టి పెరుగుచుండెను. ఆరాత్రియంతయు నిదురింపక తన జీవితమేవిధముగ గడుపవలెననుటను గూర్చి యాలోచించి, భార్యబిడ్డలు, తల్లితండ్రి మిత్రభృత్య పరివారములు తన్నుద్ధరింపజాలరని నిశ్చయించి, తానుసత్యమార్గమును దెలిసికొని ప్రజలకు సత్యతత్వమును బోధించి యుద్ధరింపవలెనని తీర్మానించుకొనియెను. అర్థరాత్రమున యింటినివదలి పెట్టెను. సుందరాంగియు పవిత్ర ప్రేమాస్వరూపమయియునగు యశోధర నొక్కపరి ముద్దుగొనిరానెంచెను. తన ముద్దులకొమరుడును భావిసార్వభౌముడునగు రాహులుని ప్రేమదీర లాలింప నెంచెను. కాని భార్యాపుత్రులు మేల్కొనినచోనిక తనసంకల్పము లన్నియు విఫలమగునని సిద్ధార్థుడు మనసును చిక్కబట్టి. రాజచిహ్నములన్నింటి నూడదీసివైచి. గృహమును రాజ్యమును, తల్లితండ్రి భార్యాపుత్రాది మహదైశ్వర్యములను తృణప్రాయములుగ భావించి పరిత్యజించి పలాయనుడయ్యెను. బింబిసారుని రాజధానిలోని రత్నగిరి పర్వత గుహాయందు తపముచేయుచు కందమూలఫలజలముల నాహారముగ స్వీకరించుచు. నొక్కపుడయాచితముగ లభించునన్నివలను దినియు, కాలమును గడపుచుండెను, ధ్యానావస్థయందే రోజులుదనుక గడపుచు స్మృతిగల్గినపుడు క్రూరమృగములు సాధుజంతువుల హింసించుటను జూచి దుఃఖించుచు. యోగులను సత్యతత్వమును దెలుపుడనివేడుచు. వారిచ్చు సమాధానము తృప్తికరము కాకుండుట వలన సిద్ధార్థుడు తీవ్ర తపమొనర్చుచుండెను. శీతాతపవాతబాధ లాతని నేమియు చలింపజేయలేదు.

ఒకనాడొక గొల్లడు మేకలమందలను దోలుకొని మిట్టమధ్యాహ్నమున సిద్ధార్థుడుండు మార్గమున బోవుచుండ నెండలో నాజంతువుల నేల కష్టపెట్టెదవని గొల్లని సర్వార్థసిద్ధి యడిగెను బింబిసారుడు యాగము సేయనుద్దేశించి యీజంతువుల దీసికొనిరమ్మనియె నని గొల్లవాడు ప్రత్యుత్తరమిచ్చెను. వృధగజంతువులు చావనుండుటకు వగచి, బుద్ధుడు, బింబిసారుని కడకేగి, జంతుహమానవలెననియు వేదార్థములతి క్లిష్టములనియు హింసాపరాయణులు వేదములకు విపరీతార్థమునుజేసి, నోరులేని జీవముల చంపుచుండువారిహపర దూరులనియు, హింసవలన మోక్షములభించినను అది, భోగ్యము కాదనియు మరిమరి బోధించి యజ్ఞమున పశువిశసనమ

ముఖుంగావించెను.

సిద్ధార్థుడు పెక్కు చోట్ల తపమాచరించి, తుదకు గయాలోని బోధి వృక్షము క్రింద తపముచేసి, బుద్ధుడయ్యెను, వారణాసి, మొదలగు. పుర ములందు దనసత్య తత్వమును బోధించి మతకర్త యయ్యెను, బుద్ధుని తల్లి తండ్రులును, భార్యయు, బుద్ధమత మవలంబించిరి. యశోధర యో గిని యయ్యెను.

కోసలదేశభావి సార్వభౌముడు, నీతి విశారదుడు. శస్త్రాస్త్ర ప్రయోగకుశలుడు అయిన సిద్ధార్థుడు యెండ గాలి వాన బాధలకు సహించి తపముచేసి సిద్ధార్థత్వము నిక్కముగపొంది, పసపు కావివస్త్రమునుధరించి బోడితలతో మృణ్మయపాత్రమును భిక్షాపాత్రముగ గ్రహించి యింటింటి కేగి పిడుచ డన్నమునుస్వీకరించి బోద్ధయైన సర్వార్థసిద్ధునకు వేలకొలది శిష్యులు, బలసి చుట్టుయుండి ఆతని యాదేశ, వాక్యముల కెదురుచూచు చుండిన దశ సార్వభౌమున కతీతమైనది కదా.

మతసిద్ధాంతము:—సర్వం క్షణికం క్షణికం, దుఃఖం దుఃఖం, స్వల క్షణం స్వలక్షణం, శూన్యం శూన్యం, అనిభావములు నాలుగు విధములై యుండును.

1 సర్వం క్షణికం క్షణికం, మేఘము, నుంచుగడ్డ యివి మారురూప ములను క్షణములో పొంది మరికొంతసేపటికి రూపము లేకుండ పోవును, యిది యుదాహరణము.

2 పర్వమును దుఃఖమయమగుట వలననే సంతోషమునకై ప్రయ త్నింతురుకాని అదియు క్షణికమే యగును.

3 సర్వం స్వలక్షణం స్వలక్షణం, ప్రజలెంత మార్పుచేసినను ఆయాగుణములును రూపములును, మారవు, తుదకు యథాగుణములనే కలిగియుండును.

4 సర్వం శూన్యం శూన్యం, సత్తు,అసత్తు, సదసత్తు, అనుభయము యీ నాలుగాని శూన్యమే తత్వము మరియు, కామము, బలీయవిరోధి దానినడంచుటకు జ్ఞానము సాధనము. యీ జ్ఞానసంపాదనమునకై క్రమ యుక్తములైన, భక్తి, భావము పలుకు, సిద్ధాంతము, ఆహారసంపాదనము యత్నము, ధ్యానము, అభ్యాసము, యివి ఆవశ్యకములు.

ఆచారములు, జీవహింసకూడదు, కల్లుమొదలైన మత్తుపదార్థ సేవనము కూడదు, చల్దితినరాదు, సుగంధములను గుసుమములను దరింప

రాదు, కుటుంబపోషణమును వీడరాదు, మోసము అసత్యము లేకుండా వ్యాపారము చేయవలెను, సన్యాసులను భిక్షుకులు జనపదములలోగాక విశేషముమండపము(మఠము)లందేనివసింపవలెను బుద్ధునితర్వాతివారునాల్గువిధములుగ నీమతాభిప్రాయములనుగైకొనిరి, మాధ్యమికులు, వైభాషికులు యోగాచారులు, సౌత్రాంతికులు. అని నాలుగు, భాగములు, మాధ్యమికులు సర్వశూన్యత్వవాదులును, యోగాచారులు బాహ్యశూన్యత్వవాదులును, సౌత్రాంతికులు బాహ్యానుమేయత్వవాదులును, వైభాషికులు బాహ్యార్థ ప్రత్యక్షత్వవాదులునై యున్నారు. యీమతము వారుత్తరమున యెక్కువగను చీనా, జపాన్, టిబెట్టు, సిలోన్ (లంక) దేశములం దందరునునై యున్నారు, ప్రాచీనశిల్పములందు బౌద్ధశిల్ప మతిరమ్యము.

## 10. జైన మతము.

ఈ మతము బుద్ధమతముతో సమమై కొంచెముముందుగ పుట్టి కొన్నిమార్పులతో నున్నది. యీ మతస్థాపకుడు మహావీరుడు, వీరిదేవుని పేరు, జినదేవుడు, వేదము, లోకము, కాలము, ప్రాణులు, కర్మము, యివి దేవునివలెనే శాశ్వతములు. 148 కర్మలునుదేవునంటవు. నాల్గుముఖములు గలవాడు దేవుడు. యితడు అశోకవృక్షముక్రింద మూడు ధర్మచక్రములను గల్గియున్నాడు. ఆద్యంత రహితుడును స్వయంకర్తాతయునై యున్నాడు. శివవిష్ణ్వాదులర్హ్వ దేవుని భక్తశ్రేష్ఠులని వారినిగౌరవించుచున్నారు. కొందరు జాతిభేదములనుపాటించి గణపతి పూజసేయుచున్నారు. క్రిందనరకలోకము లేడును. దానిపై వాయులోకములు పదియునుండి దానిపై యీమర్త్య లోకమున్నది. ఈమర్త్యభువనమునకుమీద జ్యోతిర్లోకమును, నియంతర లోకమును, దీనిపై పదునారు దేవలోకములును, యింతకుమీద దేవాధిపతులలోకము లెనుబదియొకటియు అంతకుపైన పరాత్పరవస్తువుండు నిర్వాణలోకమును గలదు. కాల మనిత్యమైనందున అదిశాశ్వతముగ జరుగు కొరకు వృద్ధిక్షయములపేర్లు ఉత్సర్పిణి అవసర్పిణియని అందురు, యిపుడవసర్పిణియను క్షీణకాలము, యీరెండును పూర్తియైన నొక్కయుగ మగును, వృద్ధికాలమున మనువురు పదునల్గు రుదయమైరి. కడపటివాని పేరునాభి. యితడురాజ్యమును జక్కగ పాలించినందున నితడేబ్రహ్మయట, వీనికాలము. వృషభతీర్థులును తర్వాత యిరువది మూవ్వురును పుట్టిరి. మొత్తము యిరువదినల్గురు అవతరించిరి వైదికులు చతుర్వింశత్యవతారములను భగవంతు డెత్తినటులుచెప్పుదురు. వీరితీర్థంకరులును. అట్టివారే, అవ

సర్పిణియనుయిప్పటి క్షీణకాలమున మరియిరువదినల్వురు తీర్థకరు లవతరించియున్నారట, యింకను, చతుర్వింశతి సంఖ్యావారవతరింపం బోయెదరు. యీతీర్థకరులు కేవలమవతార మూర్తులగుటవలన గురూపదేశ మవసరములేక. పంచమంగళములనుపొంది మోక్షమిచ్చు నధికారులై యున్నారు. వీరికివేదములు పదిరెండు. అందిప్పుడు కొన్నియదృశ్యాను, బ్రాహ్మణులవలెనే వేదము లధ్యయనీయములేకాని లేఖ్యములు కాగూడదందురు.

మతసిద్ధాంతము:—బౌద్ధులవలె సమస్తమును క్షణికములని యంగీకరింపరు, ఆత్మయు పదార్థములును ఆద్యంతములులేనివి, సృష్టికర్తలేడు, ఆత్మల కన్నింటికిని, వివేకముకలదు. సర్వకర్మ పరిత్యాగులు ఆత్మప్రపంచమును వదలిపోవును. భౌతికాపేక్షకులు పుట్టుచునే యుందురు. క్రమమైన బుద్ధిజ్ఞానము, ధర్మము చర్యకలవారికి జన్మరాహిత్యమగును, నింద్యకార్యములను మానుటధర్మము, కష్టసహిష్ణుతయే జ్ఞానము జ్ఞాన ధర్మములను గూర్చి జైనుడు చెప్పునది వినుటబుద్ధి, పదార్థము లున్నవనియు లేవనియు కూడ నొప్పుకొందురు. రూపవిచారణ చేసిన పదార్థమునకు స్థిరత్వము లేదు దృశ్యపదార్థముల పరమాణువులను విచారించినవానికి స్థిరత్వముకలదు. కుండ స్థిరపదార్థము కాదుకాని దానియుత్పత్తికి కారకములైన పరమాణువులు నిత్యములు.

జైనులలో శ్వేతాంబరులనియు దిగంబరులనియు రెండు తెగలుగలవు తల బోడిచేసికొని, భిక్షాన్నమున జీవించుచు నోర్పుతో యేకాంతముగ నుండగోరువారు స్త్రీలు, జ్ఞానాధికు రాంద్రముగను పాలించువారు శ్వేతాంబరులు, దిగంబరులు భిక్షాన్నము నిచ్చినవా రింటి వాకిటనే భుజింతురు. స్త్రీలు, దేవతలు. మృగములు పాపులు, వీరికి మోక్షములేదు అను సిద్ధాంతము కలవారు దేవుని దిగంబరునిగనుంతురు. ఉత్సర్పణి కాలమున నందరికిని మోక్షము సిద్ధించును తక్కిన విషయము లిరుశాఖల వారికిని సమము.

ఆచారములు, జీవములను బాధింపరు. అసత్యములు పలుకకుండుట అన్యద్రవ్యాపేక్ష లేకుండుట, అన్యకాంతల సంగమింపమి, మత్తువస్తులను వాడకుండుట, ఐహికములందు మితవాంఛనుంచుట, రాత్రిభోజన వర్జనము సన్యాసులహింసాధర్మము నెక్కువగ పాటింపవలెను వీరుత్రోవనడచునప్పుడు పాదములక్రింద చిన్నజంతువులు నలుగు నుభయముచే నెమలి యీకల వలన క్రిందనూడ్చుచు పోవుదురు. అత్తి, రావి, మఱ్ఱి, సార, పొల్ల, రేగు,

సినికాయలను, నీరుల్లి వెల్లుల్లి, ముల్లంగి, యింగువ, చేపలు మాంసము, సినిని భుజింపరు, ఈమతస్తులుత్తర హిందూస్థాన మందెక్కువగను, చెంగల్పట్టు జిల్లాయందలి కాంచీపురము, కడలూరు, రాజమహేంద్ర వరము, శ్రీరంగము, యీప్రాంతములందు కొందరును వసించుచున్నారు.

ప్రామాణ్యగ్రంథములు, మహాపురాణము, పదార్థసారము, త్రిలోకసారము, రత్నకరండము, ధర్మపరీక్ష, మేరుమందిరపురాణము, చింతామణి, నయచక్రము, నీలకేశవాదము, ధవళము, విజయధవళము, మహాధవళము, సుబోధిని, యిత్యాదులు. శ్వేతాంబర దిగంబర శాఖలు రెంటికిని యీగ్రంథములే ప్రమాణములు, వీరిలో అర్హతమతమొకటి కొన్నిమార్పులతో యుధిష్ఠిరశకము. 1445 సంవత్సరమున. అర్హ్వతుడను వానిచేస్థాపింపబడెను.

## 11 పారసీకమతము.

ఈమతమునకు జరథుస్త్ర మతమనిపేరు. జరథుస్త్ర, యనగా ఋషియనియర్థము, యీమతస్థాపన కాలనిర్ణయము పలువురు పండితులు పలువిధములుగ. నిశ్చయుము చేయుచున్నారు. వేదవేదాంగాది ఆర్యగ్రంథము లన్నింటిని జదివి జెంద్ అనుభాషలో తమసిద్ధాంతమును వ్యాప్తి నొందించెను యీభాషలో వేదమునకు అవేస్తాయనిపేరు. దీనియందు. ఆర్యవేదములందువలె నక్షత్రాదుల వర్ణనలు గలిగియున్నది, సామమువలె, గానముసేయుదురు. ఒకచోట అద్వైతమును మరొక్కచోట ద్వైతమును గలదు.

మతసిద్ధాంతము:—జరాన ఆహురాన్ అను దేవుడే సకలకార్య కర్త. అతడే లోకమును సృష్టించునపుడు అహరిమ (అంధకారము.) అను దేవతను సృజించి దీనినిజయించుటకు ఆర్మసడ్ (సూర్యుడు) ను పుట్టించెను యీదేవతను ప్రార్థించువారికి ముక్తిలభించును, చచ్చినవారు మూడు దినములకు స్వర్గముచేరుదురు. శవములను కాకులకు గద్దలకు వేయుట పుణ్యము, చాలవరకు, శ్రుతివాక్యములను వారిభాషకుమార్చిరి. దేవతలకు అగ్నిపురోహితుడును అరాధ్యుడునని మనవారు పల్కెదరు. వీరికిని ప్రథమారాధనీయ దైవముఅగ్నియే, పారసీకమతగురువులకు సాస్క్యంతో (అనగాఅగ్నిహోత్రులు) అనిచెప్పుదురు.

వీరిసృష్టి క్రమము వేరుగనుండును, యెటులనగా, ప్రథమమున దేవుడు క్రమముగ ఆకాశమును, భూమిని, కొండలను, సూర్యచంద్రాగ్ని నక్షత్రములనుసృజించెను. తర్వాత, పదిరెండు వేలసంవత్సరములకు కందమూలము

ల నుత్పత్తిచేసెను. పిమ్మట గేయోమార్ద్స అను ఆదిమనుజుడుత్పత్తికాగా వానిని జంపి పూడ్చిపెట్టిరి. దానినుండి యెద్దొకటి పుట్టి దాని కడుపులో నుండి పదియుంది పురుషులును, స్త్రీలు పదుగురును పుట్టిరి. వారికి మెజికి యామెజికినా అను ప్రథమమాతా పితలు పుట్టి మేకపాలుత్రాగి వారును వారికి పుట్టిన సయమాల్. విచికాల్ అనువారునుపాపులైరి. అందుచేతనే లోకులందరును పాపులైపోయిరి. తోకగల నక్షత్రము వలన ప్రపంచము లయమగును.

ఈమతమువా రన్యదేశమునందుండి యుత్తర హిందూస్థానమును వాసస్థానముగా జేసికొని, పెద్దవర్తకులై యున్నారు. బొంబయియందును తత్ప్రాంతములందును కోటీశ్వరులుకలరు. తాతాకంపెనివారు. పార్సీజాతికి చెందిన విపుల వణిక్శ్రేష్ఠులు. ప్రపంచమం దన్నిభాగములందును వీరికి వర్తకస్థానములు కలవు.

## 12 మహమ్మదీయ మతము.

ఈ మతస్థాపకుడైన మహమ్మదుగారు. క్రీ. శ. 576 సంవత్సర మున అబ్దుల్లాయను నాతనికి అమీనాయను స్త్రీయందుజన్మించిరి. బాల్యమునసే తలితండ్రులు గతించినందున పెద్దతండ్రియైన అబుతలీబురక్షణమందు పెరిగి పెద్దవాడై, తలీబుతో వర్తకముచేయుచు తనయిరువదియైదవయేట ఖుదైజాయను ధనవంతురాలి వ్యవహారమును జరుపుచుండెను. ఆమెనలుబదియేండ్ల వితంతువయ్యును యిరువదియైదేండ్ల మహమ్మదును ప్రేమించి పెండ్లియాడి యిద్దరుకొడుకులను. కూతుండ్రనిద్దరినిగ నెను. కొడుకులిరువురును కొలదికాలమునను గతింప, ఆలీ, సయ్యద్, అనుకుఱ్ఱవాండ్ర నిద్దరిని స్వీకారముచేసికొని నలుబదియవయేట మతవ్యవహారములపైకి మనసును ద్రిప్పెను. అపుడుబుహీరను సన్యాసియు భార్యకుబంధువైన వరకు అను పండితుడును. క్రైస్తవమత రహస్యములనుదెలిపి. చాలసహాయము చేయుచుండిరి. మతసత్యమెరుగుటకై మహమ్మదొంటరిగ పర్వతగుహాలం దేకాంతముగ నుండుచురాగా జిబ్రాయేల్ అనుదేవదూత తానుమతరహస్యములను దెలుపుటకు వచ్చితినని నుడివి మహమ్మదునకు కొరహస్యముల నెరిగించి దేవదూత యదృశ్యుడయ్యెను. అదిమొదలు. మహమ్మదొక నూతనమతమును స్థాపించి తన్మతరహస్యములను బోధించుచుండెను. చాల మంది మహమ్మదు మతమంగీకరించిరిగాని అతనిగోత్రీకులు మాత్రమంగీకరింపక మతకర్తను మృత్యువు వాతబడవేయ ప్రయత్నములను చేసిరికాని,

అబుతలీబుమాత్రము వేయికన్నులతో తన పెంపుడుకొడుకును రక్షించు చుండినందున శత్రువుల సంకల్పము లీడేరినవి కావు మహమ్మదున కేబది యవయేట వానిపెదతండ్రియు. తర్వాత ఖాడిజాయు మరణించిరి. మరల మహమ్మదు, సూదా, అనుకాంతను, అయేషాయను యువతిని పెండ్లాడి, తర్వాత నాల్గేండ్లకు హజ్జాయను కామినిని, పిదప నొక్క సంవత్సరమున ఓంశల్మాయను సుదతిని పరిణయమయ్యెను ఇంతటితో పోక, స్వీకారపుత్రుని భార్యను ఆవలమూడేండ్లకు సఫీయాయను సుందరాంగిని చేకొనియెను, వీరుగాక ఉంపుడుకత్తెలు నలుగురుకలరు, అబుతలీబు గతింపగనే, (ఖాఫరులు) శత్రువులు మరల రేగిరి. యిటులుండమహమ్మదు దేవలోకమునకు జనివచ్చితినని చెప్పి మరికొన్ని మతరహస్యములను ప్రచారముచేయుచుండ, శత్రువులాగ్రహమును బట్టజాలక మహమ్మదును మట్టుపెట్టుటకై యాతని యింటిని చుట్టవేసిరి. మహమ్మదిది తెలిసికొని స్వస్థానమగు మక్కానువదలి, మదీనాకు పారిపోయెను. పారిపోవుటకు, హిజరత్, అనిపేరు మహమ్మదుగారు పారిపోయినది మొదలీహిజరత్ శకముకలిగినది. దీనిప్రారంభము క్రీస్తుశకము. 622 సంవత్సరము జూన్ నెల. 15-తేది, మదీనాలో మహమ్మదునకు పెక్కురు శిష్యులగుటయేగాక మక్కాలోనిశిష్యులు గూడ చాల మంది గురుపుసమీపముచేరిరి యెక్కడికేగినను దాయాదులగు ఖొరైష్ గోత్రీకులపోరు జాస్తియగుచుండ మహమ్మదు. తనశిష్యులను యుద్ధవీరులుగగొంపోయి శత్రుంజయుడై పెద్దపెద్దపట్టణములపై దాడివెడలి జయించి కైవసమొనర్చుకొని మతవ్యాపన మొనర్చుచు దైవలోకమునుండి వచ్చిన నల్లరాతిని ముద్దుపెట్టుకొని అదివరకక్కడయర్చన లంగీకరించుచుండిన మున్నూటరువది విగ్రహములను నాశనమొనర్చి, క్రీ. శ. 332 సంవత్సరమున పరమపదించెను, ఒకయూధస్త్రీ విషమిడెనని వాడుకకలదు.

మహమ్మదు గతించినపిదప నతనియల్లుడు ఖలీఫాయయ్యెను మహమ్మదునకు ప్రియురాలయిన అయేషా తనతండ్రిని ఖలీఫా (గురువు)గ నొనర్చెను, గురువులు వేర్వేరైనను మతము మాత్రము త్వరలో, పారసీకము, అరేబియ, యీజిప్టు మొదలగు దేశములందు వ్యాప్తినొందెను.

మతసిద్ధాంతము:—ఈమతమున కిస్లాం (భక్తి) మతమని నామాంతరము కలదు వేదమగుఖొరాను. దేవదూతయగు జిబ్రాయెల్ వలన లభించినందువలన నిదియుత్కృష్టమైన గ్రంథమని (అలికితాబ్) చెప్పుదురు.

ఈ యిస్లామున రెండు ప్రధాన మార్గములు కలవు నమ్మదగిన

'యిమాం' అనునదియు. ఆచరణక్రమమైనదీక్ష, అనునదియును. ఈయిమాం ఆరువిధములు:— దేవుడొక్కండు (అల్లా) న్నాడు, దేవదూతలుగలరు వేద మున్నది, నబీపురుషులుగలరు, జీనరహితదేహము పునర్జీవియై, శిక్షరక్షణ ముల ననుభవించును, నజీబు (విధి) ప్రకారము చరింప వలెను.

అల్లా (రాబ్) దేవుడుతప్ప వేరొక్కడు లేడు. యిబిలీస్, అనుసైతాను(పిశాచము)న్నది, ప్రతిజీవికడనిరువురు దూతలుండి పుణ్యమొక్కండును పాపమొక్కడును దినచర్య వ్రాయుచుందురు వేదములు తౌరాత్,జబూర్, యింజిల్, ఖొరాన్, అనునవికలవు. నబీలు 224000 మందికలరు. ఆదాం. నోవా, అబ్రహాం,మోసే, యీసా, మహమ్మదు,అనువారుత్తములు.

పుణ్యలోకము లేడును నరకలోకము లేడును గలవు, సుకృతదుష్కృత ములు వ్రాసునతూచబడును లోకమంతయు నజీబు అనుక్రమచట్టమునను సరించి నడచుచున్నది యివియన్నియు 'నిమాం' పద్ధతులు.

'దీక్ష' పద్ధతులు:—ఒక్కొక్కడు స్నానమొనర్చి మక్కావైపుతి రిగిదినమునకైదుమార్లు నమాజుచేయవలెను, 99-పూసలుగలజపమాలను చేతనుంచుకొని మహమ్మదునామ విశేషములను 99 మార్లు జపించవలెను.

2 తనసర్వస్వములో నర్ధభాగము దైవమునకును మిగిలినది హృదయాపూర్వకముగ నుచిత కార్యములకును సెలవు సేయవలెను.

3 ఖొరానులభించినది రంజాన్ నెలకావున నామాసమంతయు పగలుమ్మి నీరైనమ్రింగక యుపవాసముండవలెను.

4 మహమ్మదీయుడు తన జీవితకాలమం దొకసారియైన మక్కాయాత్రపోయిరావలెను.

మత్తుపదార్థసేవనమును. దైవనమునకర్పింపని మాంసమును త్యాజ్యములు. మహమ్మదీయేతరునకు మోక్షము లేదు. పురాణములలోని స్వర్గనరకలోకములకన్న నెక్కువగయీమతమునగలదు మహమ్మదీయులలో 73 తెగలున్నవనియు పెద్దవి, షియ్యాలుసున్నలు అను రెండు తెగలుమాత్రమే, ఈమతవ్యాపకులకు మౌల్వీలనిపేరు.

మహమ్మదీయులు నల్గురుభార్యలకంటె నెక్కుడుగ పెండ్లియాడరాదుకాని మతస్థాపకుడయిన మహమ్మదుకుమాత్రమా నియమమక్కర లేదని దైవమనుగ్రహించినట్లు ఖొరాను, 33 సురలో, 37-38 అయతులందు లిఖింపబడియున్నది. తక్కిన ధర్మములన్నియు హిందూపద్ధతులను పోలియున్నవి. ఈమతమువారు భరతదేశమందన్ని చోటులను యేడుకోట్లమంది కలరు. ఆఫ్

ఘనిస్తాన్. తుర్కీ అరేబియా, మొదలగురాజ్యములు వీరివేయగును.

13 క్రీస్తుమతము.

క్రీస్తువేదమగుబైబిలులో ప్రపంచసృష్టి యేడురోజులకు సంపూర్ణమైనట్లు తెలుపబడియున్నది 1-దినమున ఆకాశము, 2-దినము గాలిమేఘము. 3-దినము భూమి సముద్రము ఉత్పత్తి పదార్థములను 4-దినము సూర్యచంద్ర నక్షత్రములును 5-దినము చరజలచరములును 6-దినము మృగ సరీసృపములను మనుష్యులను పుట్టించి దేవుడేడవదినమున విశ్రాంతిచెందెను. యీ దినముదైవమును ప్రార్థించుదినము మొదటపుట్టినమనుష్యుడు, ఆదాము ఆదాముయొక్క వామపార్శ్వములో మజ్జాస్థిని కొంచెము సంగ్రహించి దేవుడు హవ్వనుసృజించెను వీరిద్దరును సైతానుప్రేరణమున అభోజ్యానుభవమువలన పాపులైరి. తర్వాతవీరికి కాయీను యేబేలు అనువారుపుట్టిరి కాయీనుదుష్టుడైయేబేలుచే చచ్చెనుకాయీనుదేవునిధిక్కరించెను. దైవము కనికరించి సేతు అనుకొడుకును ఆదాము హవ్వలకిచ్చెను, సేతున కనేకులు పుత్రులుదయించిరి వారిలో 'నోవహు' అనువాడు యోగ్యుడు ఆదాము, హవ్వ, వీరికొడుకులు అందరును మరణించిరి అపుడుదేవుతోడను నిర్మించి నోవహును సమస్త జంతు పదార్థసంచయముల నోడయందుంచుకొనుమన నోవహును అతని భార్య యుముగ్గురు కొడుకులువారిభార్యలతో నోడనెక్కిరి అపుడు విడువకరాత్రింబగల్లు 40-రోజులు కుంభవర్షము కురిసి జలప్రళయమైనందున నావలోనివారుగాక తక్కినవంతయునశించెను తర్వాతనావలోని వస్తువులను లోకమునంతట నిండించి తనసంతానమువలన లోకము వృద్ధి యొనర్చెను యిప్పటికి ప్రపంచ సృష్టియైన ఆరువేల వత్సరములైనది యిది బైబిలు సృష్టిక్రమము క్రీస్తుమతమునకు మొదటిపురుషుడు అబ్రహాము యితని సంతతిలోని యోసేపు మరిదమ్మదంపతులకు క్రీస్తుజన్మించెను మరియకు పురుషసంపర్కము లేకనే పరిశుద్ధాత్మవలన బెత్లహేము దేశమున క్రీస్తు జనించెను యితనికి, యేసు, అనియుపేరుకలదు క్రీస్తునుసైతానుచాలబాధించెను మహమ్మదువలెనే క్రీస్తుకూడ ప్రజలను తన్నేపూజింప వలెననియు నిదిదేవుని యాజ్ఞయనియు వచించెను వీనిమాటలను యూధులు విశ్వసింపలేదు కాని చచ్చినవారిని బ్రతికించియు వృద్ధులను యువకులుగ నొనర్చియు వ్యాధులనడచియు మరియు ననేకాద్భుతములను జేసియు నమ్మింపజూచెను గాని వారునమ్మక క్రీస్తుభగవత్పుత్రుడుకాడని యతని ముప్పది నాలవయేట సిలువలో దూర్చి చంపిరి ప్రాణము పోవునపుడే సతి శాంతిముతోనుండి

మూడవదినమున సమాధినుండి లేవగానతని శిష్యులు మిక్కిలి భక్తికలవారైరి యూధులునుచాలమంది యేసును అనుసరించిరి.

మతసిద్ధాంతము:—ఈమతమువారందరును చచ్చినపిమ్మట న్యాయ విచారణ జరుగును, అంతవరకును పూడ్చబడిన చోటనే యుందురు. క్రీస్తు మతమున జేరగోరువారు. జ్ఞానస్నానము సేయవలెను. ప్రథమమున, గుంటలు బావులు. చెరువులు, నదులు. వీనియందు గ్రుంకులిడి శుభ్రవస్త్రములనుధరించిన జ్ఞానస్నానమనబడును. ఐరోపాఖండమును మంచుచలి యెక్కువగావున సంపూర్ణస్నానమునువదలి. తలమీద నీళ్లను చల్లుటతో జ్ఞానస్నానము ముగియుచున్నది. క్రీస్తుమతమున జేరనెంచువారు. ప్రథమమున జ్ఞానస్నానము చేయువలెను. దీనిని చేయించువారు పాదరీలు (ఆచార్యులు).

ఏసు, పరలోకమున కేగుటకు ముందు. అపోస్తలుల (శిష్యులు) గూడి రాత్రులందు జ్ఞానభోజనము చేయుచుండిరి. క్రీస్తువు గతించునపుడు. తనమాంసమును, రొట్టెగను (అప్పము) నెత్తురును రసముగను భుజింతురు గాక యని చెప్పిపోయెను, కావుననే యిపుడు. అప్పమునకు బదులు రొట్టెను. రసమునకు బదులు సారాయమును వాడుకొనుచున్నారు. పై రెండును క్రీస్తు మాంసరక్తము లగుటవలన పరిశుద్ధములైనవి. భుజించి ముక్తులగుదురు. రోగులును భక్షింతురు.

ఈమతములో రోమన్ కాథలిక్కులనియు. ప్రొటెస్టాంటులనియు యిరు భాగములవారు కలరు. పదునేడవ శతాబ్దమునవరకును యీరెండు తెగలును పోరాడుచునే యుండెను యీశాఖాద్వయములో పిల్లశాఖలు పెక్కులుకలవు. గ్రీకుసంఘము, రోమానుసంఘము, యూధరుసంఘము. మొరేవియన్ సంఘము. బాప్టిస్టుసంఘము, వెస్లియన్ సంఘము. ఒయిట్ ఫీల్డిస్టుసంఘము, కాల్వెనిస్టుసంఘము. అంటినోమియన్ సంఘము, ప్రెస్బిటేరియన్ సంఘము, యూనిటేరియన్ సంఘము. సొసినియన్ యూనిటేరియన్ సంఘము. లండన్ సంఘము. స్కాట్సుసంఘము. ఇంగ్లీష్ యెపిస్కోపిల్ సంఘము, క్వాకరుసంఘము. స్వీడన్ బర్గిన్ సంఘము.యీసంఘములన్నియుకొద్దిగను గొప్పగను భిన్నాభిప్రాయములు గలిగి యున్నవి. క్రైస్తవమతమిపుడు ప్రపంచమంతట నిండియున్నది. ఇవిగాక ఫ్రీమేసన్ సంఘమనునది యొకటి కలదు.

ఈసంఘము నోవా మనుమడైన మిత్రాన్సయింఅని వానివలన ప్రపంచము పుట్టినది మొదలు యీజిప్టున స్థాపింపబడి యింతవరకును జరు

గుచున్న దీనికొందరును మరియొక విధముగ కొందరును చెప్పుచున్నారు.

ఈసభ మొదట పోపుల వలన స్థాపింపబడినదయ్యు తర్వాత వారే దీనిం జెడగొట్ట యత్నించిరట, అది మొద లింగ్లండు చక్రవర్తియే యీసభ కధ్యక్షత వహించుచుండెను, వీరికి బైబిలుగాని మరియే గ్రంధములు గాని లేవు సర్వమును సోదరమయముగ నొనర్చి భూలోకమును స్వర్గతుల్యముగ చేయ ప్రయత్నించెదరట యీసంఘ నిబంధన లేవియు యితరులకు తెలియవు. పెద్ద పెద్ద పట్టణములందంతటను యీసంఘములు కలవు. ఆంగ్లేయులును హైందవులును యీసంఘమున గలరు. దీనిలో చేరనివారి కీసంఘసూత్రములును దెలుపరట, యిట్టి యపూర్వనియమములవలన, ఒడలు తెలియక తిని త్రాగి. వావివరుసలేక వ్యభిచారము చేయుటకై యేర్పరుపబడిన దీసంఘమని ప్రజలు వాడుకొనుచున్నారు, కాదేని రహస్యమెందులకని సంశయ ప్రశ్న లడుగుచున్నారు. ధనవంతులైన స్త్రీలు గూడ యీసంఘమున చేరుదురట. సంఘసూత్రములను భార్యకును. ప్రాణస్నేహితులకును. కూడ చెప్పరాదనియు, స్వప్నమునగూడ కలవరింపరాదనియు సంఘములోచేరు నూతన సభ్యులవద్ద ప్రమాణములను చేయింతురట, యీసంఘ సభ్యుల కొకరహస్యమైన గుర్తుకలదట దీని సభ్యుడెంత ఘోర పాతక మొనర్చినను. యితర సభ్యులు వానిని చిక్కుల బడనీయక తప్పించుటకై మానప్రాణములగూడ నొప్పగింతురట.

## 14 బ్రహ్మ సమాజము.

ఈ మతస్థాపకులు. రాజారామ మోహనరాయ బహదూరువారు క్రీ. శ. 1774 సం. బరధ్వాన్ జిల్లా రాధా నగరమున బ్రాహ్మణకుటుంబమున జన్మించిరి. చిన్నతనమున తండ్రిగతించెను చిన్నప్పటినుండియు మతగ్రంధములను జదువుచు పదునారు సంవత్సరములు దాటుసరికి, పార్సి, అరబ్బి, గ్రీక్, హిబ్రు, సంస్కృతము, యింగ్లీషు, మొదలగు భాషలభ్యసించి, పెక్కుమతగ్రంధములను జదివి. బ్రహ్మసమాజమును స్థాపించిన సం, క్రీ. శ, 1830 కలకత్తానగరము ప్రధానస్థానమయ్యెను, ఇతడు. జాతిభేదవిగ్రహారాధనములు వేదవిరోధములని బోధించి క్రైస్తవమత ఖండన గ్రంథములను వ్రాసి, రాజకీయములకై 1831 సం. యింగ్లండునకేగి, 1833 సం. తనఅరువదియవయేట నక్కడనే పరమపదించిరి.

వీరియనంతరము కోటీశ్వరుడైన మహర్షి దేవేంద్రనాథ ఠాగూరుగారును. (రవీంద్ర కవీంద్రునితండ్రి) బ్రహ్మానంద కేశవ చంద్రసేను రాజా

నారాయణ వసుగార్లును. యీమతమును సర్వవిధముల వృద్ధికిందెచ్చిరి. దేవేంద్రనాథునకును, కేశవచంద్రునకును అభిప్రాయభేదము గల్గి వేరైరి. ఠాగూరుగారాది బ్రహ్మ సమాజమునకును కేశవచంద్రుడును, భరతవర్ష బ్రహ్మ సమాజమునకును నాయకులైరికాని, యిరువురు నన్యోన్య మొకరి నొకరు భయభక్తులతో గౌరవించుచుండిరి.

మతసిద్ధాంతము:—బ్రహ్మమే సర్వకార్యకారణకర్త, సర్వాంతర్యామిని విగ్రహముగ నొనర్చియర్చించుట తగదు. జాతిభేదము వేదవిరోధము. స్త్రీపురుషులిరువురును సమానధర్మము గలవారు. స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతము. ఉపనయన, చంక్రాంకన, లింగధారణ తిలకధారణములు నిరుపయోగములు.

పైవారి యుపన్యాసములును, తత్వబోధినీ పత్రికలును. కేశవచంద్రకృత నవసంహితయు, యీమతతత్వమును దెలుపును, అన్నిమతగ్రంథములలోని సత్యములును వీరు అంగీకరింతురు, బ్రహ్మసామాజికులు, కలకత్తాయందెక్కువగను. ఆంధ్రదేశమున కొందరును. ద్రవిడకర్ణాటక మహారాష్ట్రాది దేశములందొక రిద్దరును కలరు.

ఆంధ్రభాషా సేవయొనర్చి శతాధికగ్రంథకర్తయై నెగడి కీర్తిశేషులైన, రావుబహదూరు. కందుకూరి. వీరేశలింగంపంతులుగారు దక్షిణ హిందూస్థాన బ్రహ్మసమాజాధ్యక్షులై యుండి కీర్తినిగడించిరి.

## 15 శిఖ్ (శిష్య) మతము.

ఈ మతస్థాపకుడు గురునానకుగారు. యితడు పంజాబులో జన్మించిన యిక్ష్వాకుసంతతి క్షత్రియుడు. కొంతకాలము తురకమతమవలంబించి అక్బరు పాదుషావలె నున్నతునందు నమ్మకములేక కొంతకాలమున కామతమున విశ్వాసము సన్నగిల్లెను. యితడు మక్కాకేగి విష్ణువిగ్రహము పునఃప్రతిష్ఠించెను. శాంతమతమవలంబించి కొందరి కాతత్వమును బోధించెను. వీరికిశిఖ్ మతమువారని పేరుకలదు. యితని యనంతరము వచ్చిన పదియవగురువగు. గురుగోవిందసింహుని కాలమున, ఔరంగజేబువలన మతబాధమిక్కుటమగుటవలన, ఆయుధములను ధరించి శాంతమును వీడి యుద్ధవీరులై మహమ్మదీయులతో పోరి తమ మత గౌరవమును కాపాడుకొనిరి. అదిమొదలు వీరుకృపాణములను మతచిహ్నములుగ స్త్రీ పురుష బాలబాలికలందరును ధరించుచున్నారు. వీరికే అకాలీలని మరియొకపేరు. మహమ్మదీయులువలె మతమున పట్టుదల నెక్కువగగల వారీశిక్కులు

నానకు. గురుగోవిందు సింగులు రచించిన గ్రంథములనే పూజింతురు భజన సేయుదురు. నమస్కరించునపుడు బావాగురూజీ, యందురు. జైనబౌద్ధుల వలె హింసాపరాఙ్ముఖులు, వీరి గురువులకు మహాంతులని పేరు. పంజాబునం దెక్కువగను తక్కినచోట్ల సామాన్యముగను అకాలీలువాసము లేర్పరచుకొని యున్నారు.

16 దివ్యజ్ఞాన సమాజము.

ఈ సంఘము న్యూయార్కులో 1875 సం. మున, నెలకొల్పబడెను, 1879 సం. మున, మేడంబ్లావట్స్కియు, కర్నల్ ఆల్కాటును హిందూదేశముచేరిరి. ప్రథమమున బొంబాయిలో తమ ప్రచారమును సాగించిరి కాని అక్కడి వారికి పట్టినదికాదు. అటనుండి మదరాసుచేరి అడయారులో ప్రధానపీఠము నెలకొల్పిరి. మేడంబ్లావట్స్కి యనునామె రుష్యాదేశపు స్త్రీ మగడు గతించిన వెనుక మూర్ఛవ్యాధి కలిగెను. ఆవిస్మృత సమయమున హిందూదేశపు ఋషులతో నాధ్యాత్మిక విషయిక సంభాషణ జరిగెనట అటుపైని బ్రహ్మవిద్యాభ్యాసమునకై 1885 సం. మున హిందూదేశమునకు వచ్చి హిమాలయప్రాంత ఋషులను దర్శించి వారియాజ్ఞగొని యీసమాజమును స్థాపించెను. యీ సమాజమున నేమతము వారైనను ప్రవేశకట్నము పదిరూపాయలిచ్చి చేరవచ్చును. ఆంతరిక సభ్యులకు కొన్ని గురుతులను సాంకేతిక పదములతో నేర్పుదురు. యీ సమాజమున జరుగు రహస్యములను గాని సంకేతములను గాని ప్రాణము పోయినను చెప్పరాదు. అని సత్యము చేయించుకొందురు. అన్ని మతగ్రంథములలోని ప్రమాణములను పాటింతురు. పెద్ద యుద్యోగీయులును ధనవంతులును యీ సమాజమున కలరు.

ఇపుడీ ఖండముననే వేలకొలది శాఖాసమాజములు స్థాపింప బడి యున్నవి. యీ సమాజ పోషణక్రింద కొన్ని పాఠశాలలును కళాశాలలును గలవు.

మతసిద్ధాంతము:—శాశ్వతమైన ఆత్మ మనుజుని యందున్నది. ప్రకృతి సంబంధమైన శరీరము నాశమగును.

2 ప్రపంచమంతయు బ్రహ్మయందుండి వికసించుట కతన భూమిలోని యేప్రాణికిని మనోవాక్కాయములచేతను, చెరుపు గల్గింపరాదు.

3 ప్రతిమనుష్యుని యందును ఆత్మతత్వము నెరింగించు జ్ఞానేంద్రియము దాగియున్నది దానిని వృద్ధినొందించి కొనుటకు ప్రతి జీవిత

ప్రయత్నింప వలెను.

4 ప్రపంచ వృత్తులందు వైరాగియై ఆత్మసంబంధమైన ప్రయత్నము లందు పాల్గొనిన అజ్ఞానము వృద్ధిపొందును.

5 ఆత్మవికాసము నొందుటకు ప్రయత్నించి సిద్ధిపొందిన వారు, బాహ్యేంద్రియముల ద్వారా స్థూలపదార్థములను గనుగొనునటులే నిరాకారశరీరమును దాని అద్భుతక్రియలను అంతరింద్రియ శక్తివలనచూతురు.

6 అట్టి మనుజుడు సామాన్య మానవాతీతములైన అద్భుత కృత్యము లొనర్ప శక్తికలవాడగును. అది యింద్రజాలముకాదు. మానవ మాత్రుల కీకార్యము లసాధ్యముగ నుండుట వలన మనమా విచిత్ర కర్మలను జేయ నేరకున్నారము.

ఇత్యాది విషయములను విచారించి యభ్యసించి మోక్షమందుటయే యీసమాజ స్థాపనోద్దేశము. ఐరోపాఖండమందుగూడ యీ మతము వ్యాపించియున్నది యిప్పటి సమాజాధ్యక్షురాలు. అనిబిసెంటమ్మగారు.

## 17 లౌకైక మతము.

ఈమతకర్తలైన శ్రీరామకృష్ణ పరమహంసగారు. 1833 సం. మున, కలకత్తా రాజధానిలోని కమార్ పుఖర్ గ్రామమున నుత్కృష్ట బ్రాహ్మణవంశమున జననమంది బాల్యమాదిగ భక్తులై విరాగులై యుండిరి. ఇతనికి చాలినంత విద్యలేకుండినను పండితోత్తములకు పాలుపోని ప్రశ్నల కుత్తర మిచ్చుచుండిరి. సర్వమత సమ్మతుడు. అన్నిమతములును సత్యములే యనువాడు. ఇతని కనేకులు శిష్యులుండినను వారిలో వివేకానంద స్వాములవారే ప్రియశిష్యులు వీరు ఆంగ్లభాషయందు బి. యె. పరీక్షనిచ్చి సన్యాసియై. అమెరికా యింగ్లండు మొదలగు పట్టణములలో హిందూమత ప్రచారముసల్పి చాలమందిని శిష్యులుగ స్వీకరించిరి. యిద్దరు ముగ్గు రమెరికావాసులు వీరివెంటనే యీదేశమునకువచ్చి యిక్కడనే తమ జీవితములను వెళ్లపుచ్చిరి. పాశ్చాత్య ఖండము లంతటను స్వామి వివేకానందుని గూర్చి యెరుగనివారు లేరు. అమెరికాదేశములోని చికాగో నగరమున సర్వమతసభ జరిగినపుడు వైదిక మతౌన్నత్యమునుగూర్చి యుపన్యసించెను. యితని వాగమృతమును గ్రోలుటకై యెందరో శ్వేతముఖులు తమ తమ గ్రామముల కాహ్వానించిరి. వివేకానందుని యుపదేశము వలన నమెరికాదేశమునందు మాత్రమే సుమా రెనుబది మఠములుగలిగి యద్వైతము నవలంబించినవారు కలరు.

ఈ మఠములకు తమ గురువుగారి పేరును పెట్టిరి. శ్రీరామకృష్ణ మఠ మని దానికి నామకరణము. సకల మతములవారును అన్యోన్యమైత్రి కలిగి యుండవలెనని చెప్పినను వీరు అద్వైతులే. ఖండాంతరములందు వైదిక మత విజయశంఖమును పూరించి పాశ్చాత్యులను విభ్రాంతులుగా నొనర్చి న శ్రీస్వామి వివేకానందులవారు. 1902 సం. జూలై నెల. 4 తేదిని హౌరా సమీప గ్రామమగు బెలూరునందు భౌతిక దేహమును విడిచిరి. రామకృష్ణ మందిరములు పెక్కు పట్టణములందు స్థాపింపబడియున్నవి అద్వైత ప్రచారము చేయుచున్నారు.

18 మనస్సాక్షిమతము.

నెల్లూరుజిల్లా శ్రీవేంకటగిరి సంస్థానాధి పతులగు శ్రీవెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్ర బహద్దరువారు క్రీ. శ 1886 సం॥ మున, నీ మతమును స్థాపించిరి. మనస్సాక్షియనఁగా అంతరాత్మకు సత్యమని తోఁచిన కార్యములను మాత్రమే చేయతగును. తక్కినవి యసత్యము లగుటచేత వానిని విశ్వసింపరాదు.

అద్వైత విశిష్టాద్వైత సంయోగమతమిది, భగవంతుడు, నిరాకారు డైనను వాసుదేవశబ్దము వలన సాకార మేర్పడుచున్నది.

మతప్రధాన సిద్ధాంత షట్కము:— 1. భగవంతుడున్నాడు.

2. నిర్గుణుడైన దేవుని ధ్యానింపవలెను సర్వవ్యాపకుడగు వానిని విగ్రహరూపముగ నొనర్చుటకు సాధ్యముకాదని భావము.

3. పరోపకార మవశ్యము చేయతగినది.

4. స్వధర్మము లవశ్యానుష్ఠేయములు.

5. ప్రాణముకంటె మాన మెక్కువ గనుక తద్రక్షణమునకై ప్రతి వాడును ప్రయత్నింపవలెను.

6. నాస్తికుడు కారాదు యెందులకనగా భగవంతుం డుండునేని నాస్తికుడు దండితుడగును. కావున ఆస్తికత్వమే శ్రేయము నొసంగునది.

ఈ మత విషయముల నెక్కువగ తెలియ గోరువారు శ్రీవారిచే రచింపబడిన, హిందూమతము, మనస్సాక్షి, నాస్తికధ్వాంతభాస్కరము, అనుగ్రంథములను జూడందగును.

ఈమతము నవలంబించినవా రధిక సంఖ్యాకులు కానరారు.

ఇందు కనుపరచిన మతములుగాక మన దేశమున, నొక్కొకయూరి కొక్కొకమతము వంతున చిల్లర మతములనేకములు కలవు. కొన్ని స్వల్పాభిను

స్థానముగను. కొన్ని నామ మాత్రావశేషముగను కలవు, కొంత యా చరణలోనున్న మతము లీక్రింద వివరింపబడును.

1. చార్వాకమతము. కర్తరాక్షసుడు, నాస్తికము.
2. విరోచనమతము, కర్తరాక్షసుడు. ,,
3. లోకాయితమతము. కర్తఅసురుడు. ,,
4. హిరణ్యగర్భమతము. ,,
5. వాచస్పతిమిశ్రమతము. కర్త వాచస్పతిమిశ్రుడు. మిశ్రమము.
6. మీమాంసకమతము. కర్త జైమిని. ఆస్తికుడు.
7. మాలకదాసుమతము. కర్త మాలకుదాసు. ,,
8. ధామక్మతము. కర్త ప్రాణనాడిస్కుడు. ,,
9. ఆనందమతము. కర్త రామానందపండితుడు. ,,
10. మీరాబాయిమతము. కర్తమీరాబాయి. ,,
11. కబీరుమతము. కర్త కబీరు. ,,
12. మహానుభావమతము. కర్త కృష్ణభట్టు. ,,
13. మాధ్యమికమతము. కర్త మాధ్యమికుడు. నాస్తికుడు.
14. యోగాచారమతము. కర్త యోగాచార్యుడు. ,,
15. సౌత్రాంతికమతము. కర్త సౌత్రాంతికుడు. ,,
16. వైభాషికమతము. కర్త వైభాషికుడు. ,,

13 మొదలు 16 వరకు గల మతములు బుద్ధ మతాంతర్భాగములు బుద్ధుని యనంతర మాతని శిష్యులకు భిన్నాభిప్రాయములు పుట్టి. ఒకరిని మించి యొకరు కేవలము నాస్తికాగ్రేసరులైపోయిరి.

పరమేశ్వరా! కారుణ్యమయా! పరమపితా! నీవునావలన వ్రాయించిన యీకాశీరామేశ్వరాది క్షేత్రప్రదర్శినిని లోకమున వెలయింపజేసి, జలస్థలమయమూర్తివై యాత్రార్థులగు నీభక్తుల యభీష్టములను నెరవేర్పవలెననియు యిందలి నాతప్పులను పుత్రవాత్సల్యమున క్షమించి నాకు జ్ఞానభిక్ష నొసంగవలెననియు. హృదయ పూర్వకముగ ధ్యానించుచున్నాను.

ఓం తత్సత్.

---

శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ప్రెస్, చాకలపేట, మద్రాసు.

# శుష్క—వేదాంత తమోభాస్కరము.

ఇది వేదాంతగ్రంథము వేదాంతులు అత్యావశ్యకముగా చూడదగినది ఇందు శుష్క—వేదాంతులను బహువిధముగా ఖండించియున్నది. ఇది 4 పాదములుగా భాగింపబడియున్నది. ప్రథమపాదమునందు సంసారము ముక్తిమార్గము. అహింస మధుమాంస వర్జితము, ద్వితీయపాదమునందు గురుశిష్యుల లక్షణములు. స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారము, జాతిభేదరహస్యము. తృతీయపాదమునందు రాజయోగలక్షణము, అచల భావము, అవధూతలక్షణము, సగుణనిర్గుణ ధ్యానవివరము, జీవన్ముక్తి లక్షణము, సాధుదర్శనపుణ్యము. చతుర్థపాదమునందు ముముక్షుకర్తవ్యము, మోక్షమునకు శాస్త్రజ్ఞానము మాత్రం చాలదనుట. జీవకారుణ్యము మొదలగునవి, ఇందలి 92 విషయములకు శ్లోక తాత్పర్యములతో వ్రాయబడియున్నది.అట్టబైండు. రూ. ౧-౪-౦

# గు రు గీ తా సా ర ము.

దీని గ్రంథకర్తలు ప్రాచీనులు, క. సుబ్రహ్మణ్య యోగీశ్వరులచే ఉపనిషత్తులు, స్మృతులు, పురాణములు, మొదలగు 52 వేదాంతగ్రంథములనుండి తీసిన ఉపనిషదుప మానములతో ఆంధ్రతాత్పర్య విశేషార్థములతో చాలా మృదువుగను బోధచేసుకొనుట కనువుగను, ఆంధ్రజనులకు అమూల్యమగు సాధనముగ నుండునటుల వ్రాయబడినది. గాన ముముక్షులందరు దీనిని గ్రహించి కర్మరహితులై జన్మరాహిత్య నిత్యసామ్రాజ్యంబుల పొందెదరని నమ్మెదము. రూ. 3-౦-౦

# అ న ం తో పా ని ష త్తు.

టీకా తాత్పర్య సహితము. ఇందు అవాఙ్మానసగోచర పరపూర్ణాచల పరబ్రహ్మస్థాపనమును, సచ్చిదానంద రహితమును, అచలగురు పారంపర్యానుగుణంబుగ బోధింపంబడు ద్వాదశ, షోడశ, పంచదశాక్షర పూరితంబగు మూలమంత్రంబులును, గలవు. కావున ముముక్షువులకు మిక్కిలి వుపయోగార్థముగానుండు మోక్ష గ్రంథము. ౦-౫-౦

# సీతా రామాంజనేయ సంవాదము.

## టీకా తాత్పర్య విశేషార్థ సహితము.

ఇందు 22 యోగాసనపటములును చక్రములును గలవు. ఇదివరకుగల ప్రతులన్నిటికన్న ఇది విశేషాంశములతో వివరముగా ముద్రించియున్నది. గ్లేజు కాకితములు కాలికోబైండు. 3-౮-౦ సాధారణప్రతి. ౨-౮-౦

## బ్రహ్మవిద్యా విలాసము.

ఆంధ్ర తాత్పర్యసహితము ఇది బ్రహ్మవిద్యాభ్యాసులకు మిక్కిలి వుపయోగార్థముగా ముద్రింపబడినది. ౧-౦-౦

శ్రీ వెంకటాచల మాహాత్మ్యము.— వచనకావ్యము ప్రతిపుటలో టీకగలదు. ౧-౦-౦

... గ్గొలగ రాయాసెట్టి, అండు సన్సు. ప్రాతచాకలిపేట, చెన్నపట్టణము.

సామవేదాంతర్గత - దేవలోపనిషత్తు.—టీకా తాత్పర్య సహితము. ౦-౩-౦
కృష్ణబోధామృత మను ద్వాదశరాజులకథలు. ౦-౧౨-౦
వేదాంత ప్రశ్నోత్తర ముక్తావళి.— అనెడి గురుశిష్యసంవాదము. ౦-౬-౦
రాజయోగసారము-ద్విపద కావ్యము. శుద్ధప్రతి. ౦-౬-౦
శ్రీవేమనార్యుని వాక్యార్థానుభవ శిరోమణి.— ఇందు 81 వాక్యములు వేమనగారు రచియించినవి సకల వేదాంతసారమంతయు సంపూర్ణముగా యుండునట్లు తాత్పర్యము వ్రాయఁబడియున్నవి. ౦-౮-౦
భక్తలీలామృతము.—ఇందు శివభక్తులయొక్క చరిత్రములంతయు కరతలామలకముగ దెలియునట్లు సులభముగా వచనశైలియందు వ్రాయంబడియున్నది. ౧-౦-౦
సూటశోధని.— వేదాంతగ్రంథము. ఇందు జీవునియొక్క లక్షణమంతయు చక్కగా దెలియునట్లు ప్రతిమలతో ముద్రింపఁబడినది. వచనకావ్యము. ౦-౮-౦
భల్లాణరాజచరిత్రము.— ఇది పరమభక్తుండైన భల్లాణరాజు పరమేశ్వరుని అనుగ్రహమును బడసిన దానియొక్క కారణముతోడ వచనముగా వ్రాయఁబడియున్నది. ౦-౪-౦
అవధూతగీత.—ఇది మూలమును దానికి సరియైన టీకయు తాత్పర్యమునుగల్గి అపరోక్ష జ్ఞానమునంతయు విస్తరముగా బోధించునట్టి గ్రంథమై తనరారుచున్నది ౧-౦-౦
సకలసువిచారసంగ్రహము.—ఇది రాజయోగాభ్యాసకుల కందఱికిని అత్యావశ్యకమైనది సులభముగా తెలియుటకొరకై తేటమాటలతో వచనముగా వ్రాయఁబడియున్నది ౦-౬-౦
ఆత్మతత్త్వ విచారణార్థచంద్రిక గురుబోధామృతము. ౦-౩-౦
ప్రశ్నదర్శిని అను ఆరూఢ ప్రశ్నశాస్త్రము తాత్పర్యసహితం. ౦-౬-౦
శుకబ్రహ్మకైవల్యం. ౦-౧౨-౦
వేమనపద్యములు.— ఇందు (1800 పద్యములుగలవు.) ౦-౧౨-౦
పరిపూర్ణ తత్త్వప్రకాశిక ౦-౫-౦
వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి. —ఇందు ౧౦౮ ఉపనిషత్తుల సారాంశ మంతయుగలదు. ౧-౦-౦
ప్రభులింగలీల పద్యకావ్యము. చక్కనిప్రతి క్రొత్తకూర్పు. ౦-౮-౦
శ్రీకాశీరామేశ్వరాది క్షేత్రప్రదర్శిని ఇందు దక్షిణపుప్రధాన క్షేత్రమగు ధనుష్కోటి రామేశ్వరము మొదలు హిమాలయమున కావలనుండు కాశ్మీరదేశముకడకు మధ్యనుండు ప్రసిద్ధ క్షేత్రములును, వాటి ఉత్సవాదివివరములును. ప్రసిద్ధనగరములును, అక్కడి వినోదములును, కొన్ని చరిత్రాంశములును గలవు. భారతదేశమును జుట్టి వచ్చువారికై సైతమీ గ్రంథ రాజము మూల్యమిత్రరత్నమనవలెను. ౧-౪-౦
మర్మత్రయ దీపిక. ఇందు జీవబ్రహ్మైక్య సంధానము, మాయాబ్రహ్మ విద్వరిష్టుల సంవాదము, జగద్భ్రాంతి నిరసనముగలదు పద్యకావ్యము. ౦-౬-౦

వేమనజ్ఞానమార్గ పద్యములు.—(౩౦౦౨) ఇందు నీతి, ఆచారము, ధర్మము, వేదాంతము, మొదలగు పలువిషయముల గురించి వేమనగారిచే రచియింపఁబడి మేలయిన దళసరికాగితముల యందు పెద్దఅక్షరములలోముద్రింపఁబడి యున్నది. ౨-౦-౦

వేమనయోగి విరచిత వేదాంత సిద్ధాంతము.— పద్యములును, తాత్పర్యమును కలది. ఇందు ౫౦౦ పద్యములు గలవు. వేదాంత తత్త్వమునంతయు విస్తరముగా దెలియజేయును. ౦-౧౪-౦

వేమనపద్య పదశబ్దార్థము. ౦-౪-౦

శేషధర్మము.— వచనము. ౦-౧౦-౦

ఆత్మబోధము శ్లో. తా. ౦-౪-౦

మతత్రయ హితహితబోధిని. ౦-౨-౦

రాజయోగసారము వచనము. ౦-౨-౦

భగవద్గీత వచనము. ౦-౫-౦

తత్త్వార్థముక్తాకలాపంవచనము. ౦-౨-౦

దశవింశతితత్త్వకందార్థములు. ౦-౧-౦

అమృతబిందోపనిషత్తు.శ్లో.తా. ౦-౨-౦

వేదాంతపంచదశిటీకాతాత్పర్యం౫-౦-౦

దృగ్దృశ్య వివేకము. తా. ౦-౧౦-౦

ధ్రువచరిత్రము. ౦-౨-౦

కబీరుదాసు చరిత్రము. ౦-౪-౦

సహజామనస్కానుభవబోధిని. ౦-౨-౦

సర్వోపదధ్వంసిని. ౦-౩-౦

వివేక సందర్భరత్నావళియును, జీవేశ్వర సంయోగ రహస్యము. ౧-౦-౦

శొండెల రామదాసుచరిత్రము. ౦-౪-౦

శ్రీపరిపూర్ణ బోధాచలకీర్తనలు - వచన కావ్యసహితము. ౦-౨-౦

శ్రీరామలింగేశ్వరశతకము. ౦-౨-౦

తారకామృతసారము. ౦-౪-౦

శ్రీ లక్ష్మీస్తోత్ర రత్నత్రయము. టీకా తాత్పర్య సహితము. ౦-౧౨-౦

గుప్తపురాణబోధిని. ౦-౫-౦

శ్రీవిద్యా విద్యాతీతబోధని. ౦-౩-౦

బ్రహ్మసూత్రములు, టీకా తా॥ ౨-౮-౦

ఆంధ్రనిఘంటుత్రయము ౦-౧౪-౦

శ్రీజ్ఞానవాశిష్ఠము.వచనకావ్యం ౫-౦-౦

హఠయోగ ప్రదీపిక ౧౪ యోగాసన పటములుగలవు. ౨-౮-౦

కేరళప్రశ్న. ౦-౧-౬

మిక్కిలి ప్రియమైన వస్తువేదో వాటిని గూర్చి లెక్చరు. ౦-౨-౦

పాతంజలయోగశాస్త్రము:— మూలసూత్రములు, తెనుఁగు తాత్పర్యవిశేషార్థములతో. ౧-౦-౦

శ్రీకాళికాంబికాస్తోత్రసంకీర్తనం.౦-౪-౦

కేదారేశ్వరనోముల వ్రత కథ. ౦-౦-౬

నాగభూషణ తత్వరహస్యములు ౦-౧-౦

కాళహస్తిమాహాత్మ్యం వచనం.౦-౪-౦

జీవతత్త్వప్రబోధకుసుమావళి.— తారక సాంఖ్య,అమనస్కభావములు ౩౬౪ పద్యములు. ౦-౩-౦

విశ్వకర్మప్రభావము. ౦-౨-౦

కాళీయమర్దనము, జంగంకథ. ౦-౨-౦

నారీశంకరోపాఖ్యానము. ౦-౨-౦

సిద్ధరామశతకము. ౦-౨-౦

ప్రజ్ఞాన బ్రహ్మబోధామృత తత్త్వ సంకీర్తనలు. ౦-౪-౦

మల్లమ్మదేవిచరిత్రముజంగంకథ.౦-౬-౦

త్రిపురసుందరి విలాసమును గురించి లెక్చరు. ౦-౩-౦

మహాకైవల్యామృతసారము. ౦-౩-౦

మోక్షకాంతచిద్విలాసము. ౦-౪-౦

సూక్ష్మమోక్షమార్గము. ౦-౫-౦

అనుభవానందదీపిక. ౦-౬-౦

శ్రీ మహాభారతము. తెనుగు వచనకావ్యము. ఇది మహాభారత విషయములందలి యొక విషయమునైనను వదలిపెట్టక సంపూర్ణముగ తెనుగున వచనకావ్యముగ రచియింపబడినది.

ఆదిపర్వము. ౧-౮-౦
సభాపర్వము. ౦-౬-౦
అరణ్యపర్వము. ౧-౧౨-౦
విరాటపర్వము. ౦-౧౨-౦
ఉద్యోగపర్వము. ౧-౦-౦
భీష్మపర్వము. ౧-౦-౦
ద్రోణపర్వము. ౧-౦-౦
కర్ణపర్వము. ౦-౧౨-౦
శల్యపర్వము. ౦-౧౦-౦
సౌప్తికపర్వము. ౦-౬-౦
స్త్రీపర్వము ౦-౮-౦
శాంతిపర్వము. ౧-౮-౦
అనుశాసనికపర్వము ౦-౧౨-౦
అశ్వమేధపర్వము. ౦-౧౦-౦
ఆశ్రమవాసపర్వము. ౦-౫-౦
మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు. ౦-౫-౦
డిటో దళసరికాగితములు 3 వాల్యుముల సెట్టు ౧ కి. ౨౧-౦-౦
వ్రతరత్నావళి అను ౨౮ వ్రతకల్పములు తెనుగు కథాసహితము. ౦-౭-౦
శెట్టిమతశాస్త్రము. తెనుగు తాత్పర్య సహితము. ౦-౧౨-౦
భ్రమభంజని. ౦-౨-౦
టీకా, అమరము ౦-౧౪-౦
డిటో గ్లేసు కాలికోబైండు ౧-౧౨-౦
యాజుషస్మార్తమంత్రపాఠము, సస్వరము. ద్వితీయభాగము ౧-౭-౦
అప్పకవీయం శుద్ధప్రతి గ్లేజు కాగితములు, కాలికోబైండు. ౧-౬-౦

సంస్కృత గ్రంథములు.

శ్రీసాయణాచార్యభాష్యము రుద్రము, నమకము చమకము, అను రెండు ప్రశ్నములును, స్వరయుక్తము రుద్రము భాష్యాంధ్ర వివరణమను పేర టీకతో ముద్రింపబడినది. ౧-౮-౦
భగవద్గీతలు శ్లోక తాత్పర్యము. ౧-౮-౦
లక్ష్మీస్తోత్రరత్నత్రయం శ్లో-తా. ౦-౧౨-౦
మణిత్రయి ౦-౬-౦
వేదాంతరత్నాకరము, శ్లోక. తా ౦-౬-౦
అరుణవ్రతములు. ౦-3-౦
కర్మవిపాకము. తాత్పర్యము. ౧-౦-౦
దత్తకమీమాంస దత్తకచంద్రిక ౦-౧౨-౦
దక్షిణామూర్తిస్తోత్రము. ౦-౮-౦
శ్రీస్తోత్రభాష్యము. ౧-౦-౦
పురాణోక్త కర్మప్రకాశిక ౧-౮-౦
పురాణోక్త అపరకర్మప్రకాశిక ౧-౮-౦
యాజుషశ్రౌత స్మార్తానుక్రమణిక నాలుగు భాగములుగలది. ౮-౦-౦
యాజుషాపస్తంబాపరప్రయోగానుక్రమణిక సస్వరం ధర్మశాస్త్రసహితం. ౨-౦-౦
నిర్ణయసింధువు ౨-౦-౦
కలభాషిణి. ౧-౦-౦
పురూరవశ్చక్రవర్తిజననాటకం. ౦-౨-౦
యాజుషస్మార్తమంత్రపాఠము, సస్వరము, ప్రథమభాగము. 3-౦-౦
శూద్రకమలాకరస్మృతి పూర్వ ప్రయోగము. ౧-౮-౦
యల్లాజీయము, తా॥ ౨-౦-౦
డిటో మూలము. ౧-౦-౦
శ్రీమద్రామానుజ చరిత్రము. ౧-౦-౦
రామకృష్ణ పరమహంస దేవగారి దివ్యజీవితవుపదేశ వాక్యములు. ౦-౧౦-౦
కాళిదాస కథామంజరి ద్వితీయభాగము ౦-౭-౦